



భారత జాతి రత్న

# డాక్టర్. బి.ఆర్.అంబేద్కర్

అమూల్యశ్రీ

ముద్రణ : అక్టోబరు 1992

మూల్యము : రు. 50/-

ప్రతులకు :

1. గ్రంథకర్త
కన్నావారితోట - గుంటూరు-4.

2. శ్రీ కొల్లా శ్రీ కృష్ణారావు
లక్ష్మీపురం - గుంటూరు-7.

రేఖా చిత్రాలు
ముఖచిత్రం
రూపకల్పన
చందు
హైదరాబాదు

ముఖచిత్రం కలర్ డిజైన్
ఈశ్వర్
విజయవాడ

ఫోటో కంపోజింగ్:
'అక్షరమాల' (డి.టి.పి.)
అరండల్ పేట, విజయవాడ-2.

ప్రింటింగ్ :
శ్రీ విజయలక్ష్మి ఆఫ్ సెట్ ప్రింటర్స్
అరండల్ పేట, విజయవాడ-2.

# మా మాట

ఇది బడుగువర్గాల అభ్యున్నతికి ఆశాజ్యోతి, దళితనాయక శిఖామణి, మహా మానవతావాది, మేధావి, భారతరాజ్యాంగ నిర్మాత 'భారతరత్న' డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ శతజయంత్యుత్సవ సంవత్సరం. ఆ మహా నాయకునికి యావద్భారత జాతి నివాళులర్పిస్తున్న ఈ శుభసందర్భంలో కవులు, రచయిత లెందరెందరో తమ తమ కవితా, రచనలతో నీరాజ నాలందిస్తున్నారు. ఈ సమయంలోనే విరచితమైన ఉత్తమ గ్రంథం 'భారతజాతిరత్న డా. బి.ఆర్. అంబేద్కర్'. ఈ గ్రంథకర్త ప్రసిద్ధకవి, విమర్శకులు 'అమూల్యశ్రీ' జె. అమ్మలయ్యగారు. దీన్ని ప్రకటిస్తున్నది తెలుగు వెలుగుల సాహితీ సాంస్కృతిక రంగ మూల్యాలను నిలబెట్టడానికి నడుంగట్టుకుని ఆవిర్భవించిన మా సాహితీమిత్రమండలి.

ఈ సందర్భంలో మా సాహితీ మిత్రమండలిని గూర్చి ఒకటి రెండు మాటలు చెప్పడం సమంజసమని భావిస్తున్నాము. ప్రాచీనాధునిక సాహిత్యంలోని వివిధ ప్రక్రియల ద్వారా ఇతోధిక సాహితీ సేవచేయుట మా సంస్థ ముఖ్య ధ్యేయం. సాహితీ సాంస్కృతిక సభలను నిర్వహించడమూ, తద్వారా మన సాహితీ సాంస్కృతిక వారసత్వాన్ని భావితరాల కందివ్వడమూ లక్ష్యంగా ఏర్పడినదే మా సాహితీ మిత్రమండలి. ఈ ఆశయంతోనే 'నవయుగకవి చక్రవర్తి' జాషువా జయంతి, 'అభినవతిక్కన' తుమ్మల సీతా-రామమూర్తి మొదలైన ప్రముఖ కవుల జయంత్యుత్సవ సభలు సముచిత రీతిని నిర్వహించి తన ప్రత్యేకతను ప్రకటించింది యీ సంస్థ. అయినా ఈ సాహితీ మిత్రమండలి ఇంకా శైశవావస్థలోనే ఉన్నమాట వాస్తవమే!

మా సంస్థ గౌరవాధ్యక్షులు శ్రీ 'అమూల్యశ్రీ' గారు. అధ్యక్ష ప్రధాన కార్యదర్శులుగా మేము, ఉపాధ్యక్షులు ప్రొఫెసర్ కె.ఐ. మధుసూదనరావు గారు, కార్య నిర్వహణ కార్యదర్శి శ్రీ కె. రవీంద్రగారు, కార్యదర్శి శ్రీ జె. నాగేశ్వరరావుగారు, సంయుక్త కార్యదర్శి శ్రీ కొల్లా శ్రీకృష్ణా

రావుగారు, కోశాధికారి శ్రీ సిహెచ్.ఎస్.వి. ప్రసాదుగారు మరికొందరు కార్యవర్గసభ్యులు.

ఈ మా సాహితీ మిత్రమండలి గౌరవాధ్యక్షులైన శ్రీ 'అమూల్యశ్రీ' గారు రచించిన ఈ గ్రంధాన్ని ప్రకటిస్తున్నామని తెలుపుటకు సంతోషిస్తున్నాము. ఇది మా సంస్థకు గర్వకారణం. అందుకు మా సాహితీ మిత్రమండలి గ్రంధకర్తగారిని అభినందిస్తూ ధన్యవాదాలు తెలియజేస్తుంది. ఈ గ్రంధప్రచురణ సాహితీ మిత్రమండలి తొలి ప్రయత్నం. ఆర్థికపరమైన వనరులు సమకూరితే ఇంకా అనేక విశిష్ట రచనలను భవిష్యత్తులో వెలుగులోకి దీసుకొని రావాలన్నది మా సంస్థ సంకల్పం.

'అమూల్య శ్రీ' గారు ప్రసిద్ధ కవులు మాత్రమేకాక ఉత్తమ విమర్శకులు. ఆయన ఇదివరకెన్నో రచనలు చేసి యున్నారు. అందులో "జాషువా కవితా వైభవం" రచన ప్రముఖ కవి పండితుల ప్రశంసలందుకొన్నది. ప్రస్తుతం భారత రాజ్యాంగ నిర్మాత, అణగారిన బడుగువర్గాల జీవితాలకు ప్రగతిపధాన, అభ్యుదయం ప్రసాదించడానికై ఆయన పడ్డ శ్రమను సూక్ష్మాతి సూక్ష్మంగా అంబేద్కర్ జీవితవిశేషాలను వివరిస్తూ అనేక దృక్కోణాలనుంచి పరిశీలించిన గ్రంథం ఇది.

ఇలాంటి ఉత్తమ గ్రంధాన్ని మా సాహితీ మిత్రమండలి తొలి కుసుమంగా ప్రకటించడానికి అనుమతించిన శ్రీ 'అమూల్యశ్రీ' గారిని మా సంస్థ మరోసారి అభినందిస్తుంది. వారింకా ఇలాంటి మంచి రచన లనేకం చేస్తారన్న ఆకాంక్షను మా యీ సంస్థ కున్నది.

బి. వేదయ్య
అధ్యక్షులు

ఆచార్య ఎస్. గంగప్ప
ప్రధాన కార్యదర్శి

**K.S.R. Murthy,** I.A.S
Secretary - Ministry of Welfare
Government of India, New Delhi - 1

New Delhi
22nd Sept, 92

I am indeed grateful to my dear friend, Amulyasri for having asked me to write my views about the latest book of his on Baba Saheb Dr. B.R. Ambedkar.

I had the good fortune to get the dedication of two of his books, namely, "Joshua Kavita Vaibhavam" and "Anasuya Murthy". The first one is a literary work of a very high order which had received the acclamation of very talented and outstanding poets in Telugu literature, like Dr. C. Narayana Reddy, the Gyanpeeth Awardee.

Many books have come on Baba Saheb in Telugu and this is a unique book. It is unique in one sense that Amulyasri has portrayed the life and mission of Baba Saheb in true spirit Baba Saheb who was born in an untouchable family, who suffered the worst of untouchability and yet with all his intellect and determination he could win the whole country to his side. A great fighter who had the courage to differd with Mahatma Gandhi and always won his point of view.

The very simple language in which Amulyasri had protrayed life of Baba Saheb is a great asset to the Telugu speaking people. I am sure all the youth and the adult literates would be able to find it easy to read and understand the philosophy of Baba Saheb in these pages Amulyasri has very rightly portrayed that Baba Saheb himself is a great organisation and also a great movement. Baba Saheb's erudition and scholarship have been beautifully brought out in these pages.

His fight against the caste system, untouchability which are destroying the great spirit of the Indian nation have been very beautifully portrayed. His broad mindedness, his conviction that he is first and foremost an Indian even though he was fighting for the rights of Scheduled Castes have been painted well in these pages His concern for humanity, Removal of untouchability, Castes and Poverty, for

equality, Social justice, individual liberty and freedom are something which have been brought out exceedingly well in these pages. Not many people understand Baba Saheb in clear terms. Ambedkar to my mind is one of the foremost Nation Builder of Modern India. A man who gave us a Constitution which inspite of several amendments, still preserves the Indian fabric so well. How he could anticipate several situations which Indian continent is going through today is something very admirable.

The Photographs add beautiful colour to the volume as they have described Baba Saheb's life illustratively. I do not know how I can congratulate my dear friend for having brought out this wonderfull volume.

I am equally very happy that he is dedicating his book to a good person who believes in and follows to the best of his ability, Ambedkar's Philosophy and ideals day in and day out. A person who has spent his childhood in poverty and untouchability and rising to the position of a Vice-Chancellor, my dear brother Dr. B. Swamy, Professor of Medicine and former Vice-Chancellor Nagarjuna University. And such a great man's life to be dedicated to an equally good person is noteworthy.

Ambedkar who has given freedom to untouchables, who has helped millions of people to come up and read and write in the schools, who has made it possible for the millions of employees to get jobs in the Government, public sector, etc., lives in these pages. Such a great man's life has so beautifully been portrayed in simple Telugu I am very happy and hope this would encourage Amulyasri to write many more volumes of this type. I wish him good health and all success.

(Sd.) **K.S.R. Murthy**

కె.ఎస్. ఆర్. మూర్తి ఐ.ఏ.ఎస్
కార్యదర్శి - సంక్షేమ మంత్రిత్వశాఖ
భారత ప్రభుత్వం - న్యూఢిల్లీ

న్యూఢిల్లీ
22-9-92

బాబాసాహెబ్ డా. బి.ఆర్. అంబేద్కర్‌పై తాను రాసిన గ్రంధానికి - అభిప్రాయం వ్రాయమని నన్ను కోరినందులకు, నాకు ఆప్తమిత్రుడైన - గ్రంధకర్త అమూల్యశ్రీ గారికి ముందుగా కృతజ్ఞతలు తెలుపుతున్నాను.

ఆయన రాసిన "జాషువాకవితా వైభవం" మరియు "అనసూయామూర్తి" అనే రెండు గ్రంధాలను అంకితం తీసుకొనే అదృష్టం నాకు కలిగింది. అందులో మొదటిది సాహితీపరంగా ఉన్నతశ్రేణికి చెందినది మాత్రమే కాదు జ్ఞానపీఠం అవార్డుగ్రహీత డా. సి. నారాయణరెడ్డి వంటి మహామేధావులు - ప్రఖ్యాత సాహితీ వేత్తల ప్రశంసల నందుకొన్న గ్రంధమున్నూ.

తెలుగులో బాబాసాహెబ్ మీద చాలా గ్రంధాలు వచ్చాయి. అందులో యిది అసదృశమైనది. కారణం అమూల్యశ్రీ బాబాసాహెబ్ జీవితాన్ని - ఆయన జీవిత లక్ష్యాన్ని వాస్తవిక దృష్టితో రూపుదిద్దిన గ్రంధంకనుక. అస్పృశ్య కుటుంబంలో జన్మించి అస్పృశ్యతా పదఘట్టనల క్రింద నలిగిపోయిన బాబాసాహెబ్ తన అద్వితీయ మేధాశక్తితో తన అచంచల దీక్షాదక్షతతో యావత్ భారతదేశాన్నే తనవైపునకు తిప్పుకొనగల్గాడు. మహాత్మాగాంధీతో విభేదించి - ధైర్యంగా ఆయన్ని యెదిరించగల్గిన పోరాట యోధుడుగా - ఎప్పుడూ తనదృక్పధాన్నే నెగ్గించుకొనగలిగాడు.

చాలా సరళమైన తెలుగుభాషలో బాబాసాహెబ్ జీవితాన్ని చిత్రీకరించాడు అమూల్యశ్రీ. అది తెలుగు వారల భాగ్యం! ముఖ్యంగా యువతరం - అక్షరజ్ఞానమున్న వయోజనులు యీ గ్రంధాన్ని సులభంగా చదివి బాబాసాహెబ్ జీవితాశయాన్ని గ్రహించగలరని నేనునమ్ముతా

న్నాను. బాబాసాహెబ్‌ను ఒక మహా ఉద్యమంగా ఒక మహా సంస్థగా అమూల్యశ్రీ యీ గ్రంథంలో చక్కగా అభివర్ణించాడు. బాబాసాహెబ్ వ్యక్తిత్వాన్ని యీ గ్రంథంలో గొప్పగా చిత్రీకరించాడు. భారతజాతీయతను చెడిపోకుండా తెలుపుతున్న - కులతత్వంపై అస్పృశ్యతపై ఆయన సాగించిన పోరాటాన్ని బహుచక్కగా చిత్రీకరించాడీ గ్రంథంలో. నిమ్నజాతీయుల హక్కులకొరకు పోరాటం సాగించినా ప్రప్రథమంగా భారతీయుడనే అన్న దృఢవిశ్వాసంగల బాబాసాహెబ్ విశాల హృదయాన్ని జాతీయతా భావాన్ని యీ గ్రంథ పుటలలో గ్రంథకర్త చక్కగా ఆవిష్కరించాడు. కుల నిర్మూలనకోసం అస్పృశ్యతా నిర్మూలనకోసం - దారిద్ర్య నిర్మూలన కోసం సాంఘిక న్యాయంకోసం వ్యక్తిస్వేచ్ఛకోసం స్వాతంత్ర్యంకోసం -సమతామానవతల కోసం ఆయన పట్టుదలతో చేసిన కృషి - యీ గ్రంథ పుటలలో అద్భుతంగా చిత్రీకరించాడు అమూల్యశ్రీ.

బాబాసాహెబ్‌ని చాలా మంది సరిగ్గా అర్థంచేసుకోలేరు. నవభారత నిర్మాతల్లో అంబేద్కర్ ఒక ప్రముఖ నాయకుడని నాఅభిప్రాయం. ఇప్పటికి ఎన్నోసవరణలు వచ్చినా - దేశ సమగ్రతను భారతజాతీయతను - చెక్కుచెదరకుండా వుంచగల్గిన రాజ్యాంగాన్ని ప్రసాదించాడాయన. భారత ఉపఖండంలో రాబోయే ఉపద్రవాల్ని - ఉత్పన్నంకానున్న బహువిధ పరిస్థితుల్ని ముందుగానే అంచనా వేయగల ఆయన దూరదృష్టి నిజంగా చాలా ప్రశంసా పాత్రమైన విషయం.

ఈ గ్రంథంలో చక్కగా పొందు పరచిన ఫొటోలు, రేఖా చిత్రాలు - గ్రంథానికి అందాన్నిచేకూర్చాయి. ఈ గ్రంథాన్నింత గొప్పగా, చక్కగా తీర్చిదిద్దిన నాప్రియమిత్రుని యెలా అభినందించాలో నాకు తోచడంలేదు. అంబేద్కర్ ఆశయాల్ని త్రికరణ శుద్ధిగా నమ్మి - వాటిని తన శక్తికొలది ఆచరణలో పెడుతున్న ఒక మంచి వ్యక్తికి యీ గ్రంథం అంకితం యివ్వడం నాకు అంతగానూ మహదానందాన్నిస్తున్నది. బాల్యంలో పేదరికంలో అస్పృ

శ్యతో మ్రుగ్గిపోయినా - వైద్య విద్యా ఆచార్యుని స్థాయికి నాగార్జున విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు వంటి ఉన్నత స్థానానికి యెదగగల్గినవాడు నా ప్రియ సోదరుడు డా. ఓ. స్వామి - అంతటి గొప్ప నాయకుని జీవిత చరిత్రను చిత్రించిన యింత మంచి పుస్తకాన్ని అంతటి మంచివ్యక్తికి అంకితం యివ్వడం యెంతేని ప్రశంసనీయం ఆనందదాయకం!

అస్పృశ్యులకు స్వేచ్ఛను (విముక్తి) సమకూర్చిపెట్టిన వాడు అంబేద్కర్ - కోట్లాది మందికి అక్షరజ్ఞానం కలిగించి - వృద్ధిలోనికి రావటానికి తోడుపడినాడు అంబేద్కర్. విద్యాధికులైన లక్షలాది మందికి ప్రభుత్వంలోను - ప్రభుత్వరంగ సంస్థలలోను వుద్యోగాలు కల్పించి జీవనోపాధి చూపెంచాడు అంబేద్కర్. ఆయా విషయాలన్నీ యీ గ్రంధంలో చక్కగా వివరించాడు గ్రంధకర్త. అంతటి మహా నాయకుని జీవితాన్ని యీ గ్రంధ పుటలలో జీవంపోసి ఎంతో చక్కగా చిత్రీకరించినందుకు నేనెంతగానో ఆనందిస్తున్నాను. ఇటువంటి ఉత్తమ రచనలు మరిన్ని అమూల్యశ్రీ చేయటానికిది ప్రోత్సాహమిస్తుందని ఆశిస్తున్నా. ఆయనకు ఆయురారోగ్యాలు శుభాలు చేకూరాలని ఆశిస్తున్నా.

(సం.) కె.ఎస్. ఆర్. మూర్తి

[N.B :- శ్రీ మూర్తిగారు ఆంగ్లంలో వ్రాసిన అభిప్రాయానికి తెలుగులో స్వేచ్ఛానువాదం - రచయిత]

జస్టిస్ డాక్టర్ కె. పున్నయ్య B A B L. LLD
హైకోర్టు జడ్జి (ఆం.ప్ర) (రిటైర్డు)

బంజారాహిల్స్,
హైదరాబాదు.

# అభినందన

నవభారతనిర్మాత ప్రముఖుల్లో డాక్టర్ అంబేద్కర్ మహాశయుడొకరు. సమాజాభ్యుదయానికి - దేశాభ్యుదయానికి మానవాభ్యుదయానికి - ఆయన మహత్తర త్యాగాలు చేసాడు. కనుకనే భారత జాతీయ చరిత్రలో విశిష్టస్థానాన్ని పొందగలిగాడు. భారతరత్నగా గుర్తింప బడ్డాడు.

స్వేచ్ఛ - సమానత - సౌభ్రాతృత్వాలను సాధించుటకై తన మేధా సంపత్తిని - తన శక్తియుక్తులను ధారపోసాడు డాక్టర్ అంబేద్కర్. సాంఘిక ఆర్థిక - రాజకీయ అసమానతలను నిర్మూలించుటకు ఆయన జీవితాంతము యెనలేని కృషిచేసాడు.

1917లో బరోడా సంస్థానంలో అమానుషముగా అవమానింపబడిన నాటినుండి 1947లో రాజ్యాంగ పరిషత్తులో ప్రవేశించేవరకు డాక్టర్ అంబేద్కర్ అస్పృశ్యతానిర్మూలనకు అస్పృశ్యుల పౌరహక్కులు సాధించుటకు - యెన్నో పోరాటాలు సత్యాగ్రహ ఉద్యమాలు నిర్వహించాడు. డాక్టర్ అంబేద్కర్ నడిపిన మహద్ చెరువు పోరాటము - నాసిక్‌లో కాలారామ్ దేవాలయ సత్యాగ్రహము చేపట్టిన తీరు యావత్ దేశప్రజల్ని ఆకర్షించింది. అయితే ఒక్క వీరసావర్కర్ తప్ప - జాతీయ నాయకులైన గాంధీజీగాని - సర్దార్ వల్లభాయిపటేల్‌గాని - పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగాని - మరి యే యితర కాంగ్రెస్ నాయకులుగాని అంబేద్కర్‌ని ఆయన వుద్యమాలను బలపరచలేదు సరికదా కనీసము సానుభూతినైనా ప్రకటించలేదు. అది దురదృష్టకరమైన విషయము!

దక్షిణాఫ్రికాలో శ్వేతజాతీయుల జాత్యహంకారానికి గురియై - అనేక బాధలు - అవమానాలు తాను తన తోటి భారతీయసోదరులతోపాటు

స్వయముగా అనుభవించి అక్కడే జాత్యహంకారాన్ని నిరసించి సత్యాగ్రహ ఉద్యమాన్ని నడిపిన ఆనాటి గాంధీజీ భారతదేశములో అస్పృశ్యులకు జరుగుతున్న అన్యాయాల్ని నిరసించి - అటువంటి ఉద్యమాన్ని అంబేద్కర్ నడుపుతూవుంటే - సానుభూతిఅయినా ప్రకటించని యీనాటి గాంధీజీ - ఒక్కరేనా అనే సందేహం రాకమానదు. దక్షిణాఫ్రికా అనుభవాలదృష్ట్యా - గాంధీజీయే అసలు అస్పృశ్యతానిర్మూలనకు సత్యాగ్రహ ఉద్యమముచేపట్టి యుండాల్సింది! పోనీ కనీసం ఆవుద్యమానికి నాయకుడైన అంబేద్కర్ వెన్నుతట్టి అభినందించి - ప్రోత్సహించి వుంటే ఎంతబాగుండేది! ప్రోత్సహించకపోగా- అంబేద్కర్ ఉద్యమాన్ని వ్యతిరేకించటము ఎంతదారుణము!

చట్టసభల్లో నిమ్నజాతీయులకు ప్రాతినిధ్యముతోపాటు - విద్యా ఉద్యోగ అవకాశాలు కల్పించి, రాజ్యపాలనలో పాలనాయంత్రాంగంలో భాగస్వామ్యము కల్పించవలసిందిగా లండన్‌లో జరిగిన రౌండుటేబుల్స్ సమావేశాల్లో అంబేద్కర్ బ్రిటిష్ ప్రభుత్వానికి ఒకప్రక్క విజ్ఞప్తి చేస్తుంటే యింకో ప్రక్క - గాందీజీ - స్వరాజ్యం వచ్చిన తర్వాత హరిజనుల వ్యవహారము మేమే పరిష్కరించుకొంటామనడము విడ్డూరముగా వుంది! శిక్కులకు - మహమ్మదీయులకు ప్రత్యేక ప్రాతినిధ్యము కల్పించటానికి అంగీకరించిన గాంధీజీ నిమ్నజాతీయుల ప్రత్యేక హక్కుల్ని నిరాకరించడము డాక్టర్ అంబేద్కర్‌కే కాదు యావత్ భారత నిమ్నజాతీయుల కందరికీ ఆశ్చర్యంతోపాటు కోపాన్ని గూడా కలిగించింది.

రౌండ్‌టేబుల్ సమావేశాలు - డాక్టర్ అంబేద్కర్‌లోని ప్రజ్ఞాపాటవాల్ని బయట ప్రపంచానికి తెలియటానికి నిమ్నజాతీయుల హక్కుల సాధన విషయములో ఆయన చేస్తున్న కృషిని అందరికీ తెలియటానికి మంచి అవకాశము కలిగించినవి. మొదటి రౌండుటేబుల్ సమావేశాల్లో భారతదేశస్వాతంత్ర్యము గూర్చి అంబేద్కర్ దేశభక్తి ప్రపూరితుడై మాట్లాడుతూ "మీరిచ్చుట మేము పుచ్చుకొనుట అనే రోజులు పోయాయి. దేశస్వాతంత్ర్యాన్ని పొందేహక్కు సాధించుకొనే శక్తి సామర్థ్యాలు భారతి

యులకున్నవంటూ" స్వతంత్రభారత దేశములోనే మా నిమ్నజాతీయుల న్యాయమైన హక్కు మేము సాధించుకొనగలమన్న నమ్మకము మాకుందని గూడా అంబేద్కర్ నిర్ద్వంద్వముగా ప్రకటించియున్నాడు.

కమ్యూనల్ అవార్డును వ్యతిరేకిస్తూ గాంధీజీ ఆమరణ దీక్షబూనినప్పుడు ఆయనకు ప్రాణాపాయ స్థితియేర్పడినది. జాతీయ నాయకుల అభ్యర్థనమేరకు గాంధీజీ ప్రాణాలు కాపాడటానికి డాక్టర్ అంబేద్కర్ ప్రత్యేక నియోజకవర్గాల ప్రతిపాదన వదలుకొని "సంయుక్త"నియోజక వర్గాలకు అంగీకరిస్తూ పూనా ఒడంబడిక మీద సంతకంచేసి - మహోన్నత మానవతామూర్తిగా చరిత్రలో వినుతికెక్కాడు.

డాక్టర్ అంబేద్కర్ నిమ్నజాతుల విముక్తికై ఒంటరిగా ఎన్నో పోరాటాలు సాగించాడు. అందుకే ఆయన నిమ్నజాతీయుల విముక్తి ప్రదాతగా కీర్తింప బడుతున్నాడు. కనుకనే అంబేద్కర్ జీవిత చరిత్ర అంటే నిమ్న జాతీయుల విముక్తిపోరాట చరిత్రగా ప్రసిద్ధికెక్కింది.

డాక్టర్ అంబేద్కర్ మేధాసంపత్తి - న్యాయ రాజ్యాంగశాస్త్రాలలో ఆయనకున్న పాండిత్యము జాతీయనాయకులైన గాంధీజీ-నెహ్రూ-పటేల్-రాజాజీ గుర్తించి ఆయన పట్ల తమ దృక్పథం మార్చుకొని ఆయన సేవల్ని రాజ్యాంగరచనలో ఉపయోగించుకోవాలని అనుకున్నారు. రాజ్యాంగ రచనా సంఘ అధ్యక్షునిగా ఆయన్ని ఎన్నుకొన్నారు. నెహ్రూ ఆయన్ని తన క్యాబినెట్‌లో న్యాయశాఖా మంత్రిగా తీసుకున్నాడు. జాతీయ నాయకులు తన యోగ్యతలు గుర్తించి తనను గౌరవించినందుకు వారికి డాక్టర్ అంబేద్కర్ కృతజ్ఞతలు తెలియజేసాడు.

రాజ్యాంగ నిర్మాణములో డాక్టర్ అంబేద్కర్ ప్రతిభాపూర్వకమైన పాత్రను నిర్వహించాడు. రాజ్యాంగ ముసాయిదా బిల్లులో వివిధ అనుచ్ఛేదాలపై 3749 సవరణలు వచ్చాయి. వాటిలో 2473 సవరణలను చర్చకు అనుమతించాడు. సవరణలను అంగీకరించినప్పుడుగాని - తిరస్కరించినప్పు

డుగాని - డాక్టర్ అంబేద్కరు వెలిబుచ్చిన అభిప్రాయాలు గాని - ఆయన యిచ్చిన వివరణాత్మక సమాధానాలు గాని రాజ్యాంగ పరిషత్తులోని మేధావులైన సభ్యులు సర్వశ్రీ హెచ్.వి. కామత్ - కె.యం. మున్షీ - సర్ - అల్లాడికృష్ణస్వామిఅయ్యర్ - మహావీర్ త్యాగి - ప్రొఫెసర్ యన్.జి. రంగా - కె. సంతానం - టి.టి. కృష్ణమాచారి - డాక్టర్ పంజాబ్ రావుదేశ్ ముఖ్ - పండిట్ హృదయనాధ్ కుంజ్రూ - దుర్గా బాయి మొదలగు ప్రముఖుల హర్షామోదాలు పొందాయి. ముసాయిదా బిల్లు పరిషత్తులో ప్రతిపాదిస్తూ ఆయన చేసిన ప్రసంగము మేధావుల ప్రశంసలనందుకొన్నది. ముసాయిదా బిల్లు "మూడవపఠనం" ముగిసిన తర్వాత ఆయన చేసిన హెచ్చరిక గమనించ తగ్గది - "ఆర్థికముగా - సాంఘికముగా గూడా సమానత్వము - స్వాతంత్ర్యము సాధించి - యితర దేశాలతో మనదేశం సమానస్థాయి సాధిస్తేనే తప్ప - యిప్పుడు మనము తెచ్చుకొన్న యీ రాజకీయ స్వాతంత్ర్యము శాశ్వతముగా నిలవదు" అని అంటూ హెచ్చరించాడు.

1949 నవంబరు 26వ తేదిన రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడైన డాక్టర్ రాజేంద్రప్రసాద్ ముగింపు సమావేశంలో మాట్లాడుతూ డాక్టర్ అంబేద్కర్ ప్రతిభా విశేషాలను రాజ్యాంగ నిర్మాణములో ఆయన చూపిన సామర్థ్యాన్ని కొనియాడాడు - "తన ప్రతిభావ్యుత్పత్తులచేత రాజ్యాంగ రచనా కమిటీ అధ్యక్షపదవికి న్యాయముచేకూర్చుటయేకాక ఆపదవికే యెనలేని వన్నెతెచ్చారు డాక్టర్ అంబేద్కర్. రాజ్యాంగకమిటీ అధ్యక్షునిగా అంబేద్కర్‌ని ఎన్నుకొనుట వలన మనము మంచి నిర్ణయము చేసామని" డాక్టర్ రాజేంద్రప్రసాద్ డాక్టరంబేద్కర్‌ని ప్రశంసించాడు.

తర్వాత స్త్రీలకు పురుషులతో సమానహక్కులు - స్వేచ్ఛ - గౌరవము కల్పిస్తూ - డాక్టర్ అంబేద్కర్ హిందూకోడ్ బిల్లు తయారుచేసి పార్లమెంటులో ప్రతిపాదించినప్పుడు - కాంగ్రెస్ నాయకులే దానిని విమర్శించడము పట్ల అంబేద్కర్ ఆశ్చర్యం - ఆవేదనను వ్యక్తంచేసాడు. జాతీయ

నాయకుల సంకుచిత ధోరణికి - అనాయకులకు ధైర్యంగా నచ్చచెప్పలేకపోయిన ప్రధాని నెహ్రూ అశక్తతకు విసుగెత్తి - ఆవేదనతో తమ మంత్రి పదవికే రాజీనామా యిచ్చాడు డాక్టర్ అంబేద్కర్. తనకు సిద్ధాంతాలు ముఖ్యముగాని అధికారము పదవులు కావని అంబేద్కర్ ఋజువుచేసాడు.

రాజ్యాంగము అమలులోనికి వచ్చినా ఏవో కొన్ని సంక్షేమ కార్యక్రమాలుతప్ప అస్పృశ్యతనిర్మూలనకు హిందూ సమాజములో పాతుకుపోయిన కులనిర్మూలనకు గట్టి కృషి జరగనందుకు డాక్టర్ అంబేద్కర్ ఆవేదన చెందాడు. వయస్సుతోపాటు ఆరోగ్యము రోజు రోజుకు క్షీణిస్తూ వుండడంవల్ల - "హిందూవుడిగా పుట్టినా హిందూవుడిగా చావనని" తానుచేసిన ప్రతిజ్ఞ ప్రకారము సతీసమేతముగా బౌద్ధ ధర్మదీక్ష తీసుకున్నాడు డాక్టర్ అంబేద్కర్. తనతోపాటు లక్షలాది మంది అనుచరులచేత గూడా బౌద్ధ ధర్మ దీక్షచేయించాడాయన. ఈవిధముగా భారతదేశ చరిత్రలో ఆయన ఒక ప్రవక్తస్థానాన్ని అలంకరించాడు. ఈ విధముగా బాబాసాహెబ్ డాక్టర్ అంబేద్కర్ జీవితము అప్రతిమానముగా సహస్రకిరణశోభితముగా ముగిసినది!

ఈనేపథ్యములో అమూల్య శ్రీ - శ్రీ అమ్మలయ్య వ్రాసిన "భారత జాతిరత్న - డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్" గ్రంథము సమగ్రముగా వుందని చెప్పుటకు సంతోషిస్తున్నాను. డాక్టర్ అంబేద్కర్ నడిపిన వివిధ పోరాటాలు - ఉద్యమఘట్టాలు - రాజ్యాంగ నిర్మాణము - బౌద్ధ మతస్వీకారము యిలా అన్ని అంశాలు ఎంతో విపులముగా - చక్కగా విశ్లేషణతో - సరళమైన భాషలో - ప్రతివిషయాన్ని వివరించాడీ గ్రంథంలో అమూల్యశ్రీ.

డాక్టర్ అంబేద్కర్ జీవిత చరిత్రను ఇంగ్లీషులో ధనంజయకీర్ ప్రతిభావంతముగా - సహృదయతతో వ్రాసాడు. అంతటి ప్రతిభావంతముగా తన అభిప్రాయాలు జోడించి తెలుగులో డాక్టర్ అంబేద్కర్ జీవిత చరిత్రను డాక్టర్ విజయ భారతి వ్రాసి యున్నది. ఈ రెండింటికీ-యే

అంశము తీసుకున్నా తీసిపోని విధముగా - సమగ్రముగా - సరళముగా యీ గ్రంధకర్త యీ గ్రంధాన్ని రచించాడన్నది చదివిన వారికి విదితము కాగ లదు. పైగా కొన్ని సన్నివేశాల్ని చిత్రీకరించడం మాత్రం వాటిల్లో కన్న యిందులోనే మిన్నగా వుంది! సమయసందర్భాన్ని బట్టి కొన్ని సంఘటల్ని - సన్నివేశాల్ని తనదైన ప్రత్యేకబాణీలో - చిత్రీకరించడంలో గ్రంధకర్త మహోదిట్ట. డాక్టర్ అంబేద్కర్ మీద - యీ మధ్య కాలంలో తెలుగులో యింకా చాలా రచనలు వచ్చాయనుకొండి. అవేవీ సమగ్రంగా లేవు.

కధావస్తువు పాతదే అయినా రామాయణము గురించి ఎంతోమంది వ్రాసియుండినా - కవిసమ్రాట్టు విశ్వనాధసత్యనారాయణ రామాయణకల్ప వృక్షము పేరుతో మరలా రామాయణాన్ని కావ్యముగా మలిచి "జ్ఞానపీఠ" అవార్డు పొందియుండలేదా! గ్రంథకర్త ప్రతిభావంతుడైయుండిన భావఔ న్నత్యం గల్గియుండిన - రచనా కౌశలం విశిష్టవ్యక్తిత్వము కలిగియుండిన - ఏగ్రంధమైనా విశిష్టతను సంతరించుకొంటుంది! ఈ లక్షణాలన్నీ పుష్క లముగా యీ గ్రంధకర్తలో ఉన్నాయి. గ్రంధకర్త ఆర్థిక - రాజకీయ శాస్త్రాలలో యం.ఏ.డిగ్రీ పొందియున్న మేధావి! అంతేకాదు డాక్టర్ అంబే ద్కర్ జీవితాన్ని - ఆయన రచనల్ని ఆయన దృక్పథాన్ని బాగా అధ్యయనం చేస్తున్న జిజ్ఞాసి. పైగా సుప్రసిద్ధ సాహితీవేత్త, మధురకవి. అనేక గ్రంధాలు యిదివరకే వ్రాసియున్నాడు. "జాషువా కవితావైభవం" అనే ప్రామా ణిక పరిశీలనా గ్రంధము వ్రాసి డాక్టర్ సి. నారాయణ రెడ్డి - డాక్టర్ తూమాటి దొణప్ప - డాక్టర్ కొత్తపల్లి వీరభద్రరావు - డాక్టర్ యశోదా రెడ్డి వంటి ఉన్నతశ్రేణి ఆచార్యవర్యుల - సాహితీవేత్తల ప్రశంసల నందు కొని యున్నాడీ గ్రంధకర్త. డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి కవితా సౌరభాలు అనే సమీక్షా గ్రంధం వ్రాసి ప్రముఖులమన్ననలను పొందియున్నాడు. ఇటీ వలనే సీనియర్ ఐ.ఏ.యస్. అధికారి శ్రీ కె.ఎస్.ఆర్. మూర్తిగారి - దివంగత సతీమణి ఒక సామాన్యగృహిణి అయిన శ్రీమతి అనసూయా మూర్తి జీవిత చరిత్రను అసామాన్యమైన విధముగా వ్రాసి - పండితులు

విజ్ఞానవేత్తలు - తత్వవేత్తల ప్రశంసలను విశేషముగా పొందిన గొప్పరచ యిత యీ గ్రంధకర్త. అనుభవజ్ఞుడు - మేధావి అయిన యీ గ్రంధకర్త - యీ గ్రందాన్ని గూడా ఎంతో ప్రతిభావంతముగా తీర్చిదిద్దాడనడములో యెట్టి సందేహము లేదు.

ఈ రచయిత వ్రాసిన ప్రతి గ్రంథము ఒక విశిష్టప్రణాళికతో కొన సాగుతుంది. తనదైన ఒకప్రత్యేక శైలిలో - సాహిత్య పరిమళాలతో గుభాళిస్తుంది ప్రతిరచన. ఈ గ్రంథకర్త చేసే విషయవిశ్లేషణ శాస్త్రీ యముగా ఒక ప్రత్యేకతను సంతరించుకొంటుంది. ఈ గ్రంథం గూడా - వివిధ శీర్షికలతో - విషయ సమగ్రతతో - విశాల దృక్పథముతో - భావ ఔన్నత్యముతో అలరారుచున్నది. డాక్టర్ అంబేద్కర్ జీవితము కులరక్కసి ముష్టి ఘాతాలతో అమానుషమైన అవమానాల పరంపరలతో నిండియున్నది. అందుకే కాబోలు గ్రంథకర్త - తనగ్రంథంలో "ఉపోద్ఘాత ముగా" కులవ్యవస్థ - అస్పృశ్యతల యొక్క వికృత స్వరూపముల గూర్చి మౌలికమైన చర్చచేసాడు మొదటి అధ్యాయములో. వాస్తవానికి ఆ నేప ధ్యంలో పరిశీలించినప్పుడే - అంబేద్కర్ పొందిన బాధలు - అవమానాలు పూర్తిగా అవగతమవుతాయి. అటులనే కులవ్యవస్థ - అస్పృశ్యతల నిర్మూ లనకు - నిమ్నజాతీయుల ఉద్ధరణకు ఆయన నిర్వహించిన సత్యాగ్రహాలు నడిపించిన ఉద్యమాలు దళితజన ఉద్ధరణకు మూలస్తంభాలుగా పరిగణింప బడినట్లు గ్రంధకర్త చిత్రించాడీ గ్రంథంలో.

బాల్యంనుండి బరోడా వరకు డాక్టర్ అంబేద్కర్ జీవితము పేద రికముతో - బాధలతో - అవమానాలతో - అడ్డంకులతో పెనవేసుకొని పోయినా - మనోనిబ్బరముతో - గుండెధైర్యముతో - ఆత్మవిశ్వాసముతో దీక్షాదక్షతతో - స్వయంకృషితో - యీబాధల్ని అడ్డంకుల్ని అధిగమించి - విద్యాసక్తి కలవాడై - ఉన్నత విద్యలనభ్యసించి - మహామేధావిగా - బహుముఖప్రజ్ఞాశాలిగా రూపుదిద్దుకొన్నాడు అంబేద్కర్. ఈ విషయాలన్నీ హృదయాన్ని ఆకట్టుకొనేటట్లుగా మనస్సుకు హత్తుకొనేట్లుగా గ్రంథకర్త

వివరించియున్నాడు. అంబేద్కర్ బాల్యములో పొందిన అంటరానితనము చేదు అనుభవాలు - మహద్‌పోరాట ఘట్టము - బరోడా సంస్థానములో ఆయన అవమానాలతో నిండిన మనోవేదన - రచయిత చక్కగా హృద యాన్ని కదిలించేవిధంగా రచించాడు. రాజ్యాంగ రచనాసమయములో అంబేద్కర్ ప్రదర్శించిన జాతీయతాభావము మానవతాదృక్పథము ప్రజా స్వామ్య దృక్పథం గ్రంధకర్త యెంతో చక్కగా వివరించాడు.

గాంధీజీ - అంబేద్కర్‌లు ఇరువురు దేశములో అగ్రశ్రేణి మహానా యకులు. కాంగ్రెస్ తరుపున స్వాతంత్ర్యపోరాటానికి తిరుగులేని నాయకు డుగాంధీజీ. నిమ్నజాతులతరుపున వాళ్ళ హక్కులకై పోరాటం సాగిస్తున్న యెదురులేని నాయకుడు అంబేద్కర్. నిష్పాక్షిక దృష్టితో - సంయమనముతో - హుందాతనముతో సహృదయతతో యిద్దరి మహానాయకుల దృక్పథాల్ని ఆశయాల్ని విశ్లేషించి సద్విమర్శచేసి యిద్దరికీ న్యాయము చేకూర్చచా డనిపిస్తుంది గ్రంధకర్త! మేరు పర్వతాలవంటి యిద్దరు మహానాయకుల వ్యక్తిత్వాల్ని బేరీజు వేసి సద్విమర్శచేసేందుకు ఎంతోప్రజ్ఞ కావాలి. ఉపజ్ఞ వుండాలి. గుండె ధైర్యమూ ఉండాలి. నిశిత పరిశీలనా దృష్టి వుండాలి. నిష్పాక్షిక దృష్టి వుండాలి. ఈ గుణగణాలన్నీ కోకొల్లలుగా పొందియుండిన గ్రంధకర్త చేసిన యీ రచన అమూల్య రచనగా నిలుస్తుందనడములో యెట్టి సందేహములేదు.

డాక్టర్ అంబేద్కర్ పోరాట కార్యక్రమానికి - ఆశయ సాధనకు - పరీక్షగా నిలిచినది మహాత్మాగాంధీ చేపట్టిన ఆమరణ ప్రాయోపవేశదీక్ష! గాంధీజీ ప్రాణ రక్షణ! నిమ్నజాతీయుల భవిష్యత్తు - యీ రెండిటి మధ్యనలిగిపోయిన అంబేద్కర్‌కది అగ్నిపరీక్షా సమయం! గాంధీజీ ప్రాణాల్ని కాపాడటానికి అంబేద్కర్ సంయుక్త నియోజక వర్గాలకు ఆమోదం తెలిపి తాను మానవతావాదిగా ఋజువు పరుచుకున్నాడు. ఈవిషయాన్ని గ్రంధ కర్త ఎంతో చక్కగా వర్ణించాడు. అంబేద్కర్ మహోన్నత వ్యక్తిత్వాన్ని ఎంతో హుందాగా - "మూర్తి" కట్టేలా అభివర్ణించాడు.

ఈ గ్రంథాన్ని పరిశీలిస్తే - విద్యార్థిలోకాన్ని - నేటి యువతరాన్ని దృష్టిలో పెట్టుకొని - యీ రచయిత యీ గ్రంథం వ్రాసాడనిపిస్తుంది! అంబేద్కర్ - ఆశయాలు - ఆయన సాధించిందేమిటి - అంబేద్కర్ జీవితం నుండి మనం తెలుసుకొనవలసిందేమిటి - యీ అంశాలు పరిశీలిస్తే అది స్పష్టమౌతుంది. చివరలో - అంబేద్కర్ రచనల గురించి అంబేద్కర్ సూక్తులు - అంబేద్కర్ జీవిత ముఖ్య ఘట్టాలు (బయోడేటా) యీ గ్రంథములో పొందుపరచడము ముదావహము - విద్యార్థులకు - యువతరానికి యిది యెంతో ఉపయోగపడగలదు! సరళమైన భాషలో వ్రాయడము వలన - కొద్దిగా చదువుకొన్న వారందరూ అంబేద్కర్ జీవిత విశేషాల్ని తెలుసుకుంటానికి వీలుకల్గుతుంది.

బహుముఖప్రజ్ఞాశాలి - బహుశాస్త్ర కోవిదుడు - రాజ్యాంగ నిపుణుడు - రాజ్యాంగనిర్మాత - మహామేధావి - సాంఘిక విప్లవ సారధి - సాంఘికన్యాయం - సుస్థిర ప్రజాస్వామ్య పాలన కోరిన ఆదర్శ ప్రజాస్వామ్యవాది డాక్టర్ అంబేద్కర్. సమానత్వం - సోదరత్వం విలసితమైన బౌద్ధాన్ని స్వీకరించిన డాక్టర్ అంబేద్కర్ సంపూర్ణ జీవిత చరిత్రను ప్రతి భావంతంగా వ్రాసినందుకు గ్రంథకర్తను హార్దికంగా అభినందిస్తున్నాను. కాలేజీ విద్యార్థులకు - యువతరానికే కాదు - మేధావులకు - అధ్యాపకులకు - జర్నలిస్టులకు సహితము యీ గ్రంథము ఉపయోగకరముగా వుంటుందని నా ప్రగాఢ విశ్వాసము. ఈ గ్రంథము గూర్చి యీ నాలుగు మాటలు వ్రాసే అవకాశము కల్పించినందులకు గ్రంథకర్తకు కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

(సం.) కొత్తపల్లి పున్నయ్య

# స్వవిషయం

డాక్టర్ అంబేద్కర్‌ని గురించి యీనాడు తెలియని వారు లేరు. ఆయన బ్రతికుండగా ఆయన గురించి మంచికన్న దుష్ ప్రచారం ఎక్కువ జరిగింది. అందుకు ముఖ్యకారణం ఆయన గాంధీజీతో - కాంగ్రెస్ వారితో తీవ్రంగా విభేదించడం - హిందూ శాస్త్రాల్ని బ్రాహ్మణాధిక్యతను గూడా తీవ్రంగా విమర్శించడం! ఆయన రాజ్యాంగ రచనా సంఘం అధ్యక్షుడైన తర్వాత ఆయన గొప్పతనం కొంతవరకు అందరికీ తెలిసింది. కులమత వర్గరహిత సమసమాజ స్థాపన కొరకు - పార్లమెంటరీ ప్రజాస్వామ్య విధానబద్ధ సుస్థిర పరిపాలనా వ్యవస్థ కొరకు డా. అంబేద్కర్ పడ్డ "తపన" అందరికీ అర్ధమైనది. ఆయనలోని మానవతాదృక్పధం - జాతీయతా భావం - లోకం గుర్తించింది. కనుకనే ఆయన మరణానంతరం ఆయనకు గుర్తింపు - ప్రచారం అధికమైనవి - కనుకనే ఆయన శతజయంతి ఉత్సవాలు దేశంలో ఘనాతి ఘనంగా జరిగాయి! జరుగుతున్నాయి. కేవలం నిమ్నజాతీయుల నాయకుడిగా - నిమ్నజాతుల ఉద్ధారకుడిగా "పేరు" (ముద్ర) బడ్డ డా. అంబేద్కర్ - స్త్రీజన హితైషిగా - కార్మికలోక బాంధవుడిగా ప్రజాస్వామ్య వాదిగా మానవతావాదిగా దేశమేకాదు యావత్ ప్రపంచమే గుర్తించింది. ఆయన్ని ఆరాధిస్తున్నది! అంబేద్కర్ నవభారత రాజ్యాంగ నిర్మాతమాత్రమే కాదు. ఆయన ప్రముఖ నవభారత నిర్మాతలలో ఒకరై (One of the Leaders of Builders of Modern India) చరిత్రపుటల్లో సుస్థిరస్థానాన్ని సంపాదించుకున్నాడు కనుకనే భారత ప్రభుత్వం 'భారతరత్న' గౌరవంతో ఆయన్ని మరణానంతరం గౌరవించింది! ఈ కారణాలవల్ల ఈ గ్రంధానికి "భారతజాతిరత్న" డా. బి.ఆర్. అంబేద్కర్ అని పేరుపెట్టడంలో నాముఖ్య ఉద్దేశం!

డా. అంబేద్కర్ శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఆయనపై వివిధ బాషల్లో ఎన్నో రచనలు వెలువడ్డాయి. తెలుగులో గూడా చాలా వచ్చాయి. "అంబేద్కర్ ఉత్సవాల సందర్భంగా మరి మీరేమి రాసారు"

అని మిత్రులు - శ్రేయోభిలాషులు కొందరు నన్ను అడగడం జరిగింది. "ఏదో పద్యమో - గేయమో - వ్యాసమో వ్రాసానని" చెబితే - "ఓస్ - యింతేనా మీ కాంట్రిబ్యూషన్ (Contribution) మీరింకేమైన పెద్దరచన చేయాలిగాని" అని మిత్రులన్నారు! అందుకు నేను బాధపడ్డాను. సిగ్గుపడ్డాను గూడా.

అంబేద్కర్ జీవితం పిల్లలకు ఉపయోగపడేవిధంగా రాయాలని నాకు చాలాకాలంగా మనస్సులోవుంది. మొదట చిన్న పిల్లలకోసమనే మొదలుపెట్టాను. అయితే - కులవ్యవస్థ - అస్పృశ్యతలపై అంబేద్కర్ వెలిబుచ్చిన భావాల్ని, పడ్డ బాధల్ని చిన్నారి పిల్లలు అర్ధంచేసుకోవడం కష్టమనిపించింది. ఆయన భావాల ఆవేదనా "తీవ్రతను" చెప్పకపోతే అంబేద్కర్‌కు 'అన్యాయం' చేసిన వారమవుతామని నాకుతోచింది! కనుక కేవలం చిన్న పిల్లలకోసం చేస్తామనుకొన్న రచనను అలా ఆపివేసాను. ఆ ప్రయత్నం విడిగా చేపట్టడం జరుగుతుంది.

ఈనాడు విద్యార్థుల్లో "విద్యాసక్తి" సన్నగిల్లుతోంది. యువతరంలో శీలానికి క్రమశిక్షణకు విలువలేకుండాపోతోంది. అంబేద్కర్ "విద్య"కు అధికప్రాధాన్యతనిచ్చాడు. శీలానికి - క్రమశిక్షణకు - శాంతియుత పరిష్కార మార్గానికి పట్టంకట్టాడు కనుక మారుతున్న సామాజిక పరిస్థితుల్లో నేటి విద్యార్థుల్ని - నేటి యువతరాన్ని సక్రమ మార్గంలో నడిపించేందుకు - "చైతన్యవంతుల్ని" చేయాల్సిన అవసరం ఎంతైనావుంది. కులమత వర్గరహిత సమసమాజస్థాపనా కాంక్ష ప్రజాస్వామ్య విలువలు మానవతా దృక్పథం - జాతీయ భావన - విద్యావశ్యకత - యివి యీనాడు యువ తరానికి యెంతో అవసరం! ఈదృష్టితో అంబేద్కర్ జీవితచరిత్రరాసాను. కులవ్యవస్థపై అస్పృశ్యతపై అంబేద్కర్ సాగించిన పోరాటాలకు అసలు మూలకారణాలైన "కులం కుటిలత్వం - అస్పృశ్యతా" అమానుషత్వం - అసమానత్వం తెలుసుకోవటానికి కులవ్యవస్థ మీద - అస్పృశ్యతమీద ముందు కొంత చర్చచేసాను. చివరలో - అంబేద్కర్ సాధించిందేమిటి - ఆయన ఆశయాలేమిటి - ఆయన జీవితంనుండి తెలుసుకోవలసిందేమిటి

అన్న అంశాల్ని క్లుప్తంగా చర్చించాను. డా. అంబేద్కర్ జీవితం నుండి నేటి యువతరం నేటి విద్యార్థిలోకం తెలుసుకోవలిసింది ఎంతో ఉందని నానమ్మకం. అలానే ఏపాటి కొద్ది చదువున్నా - వయోజనులు - గృహిణులు చదువుకొంటానికి వీలుగా సాధ్యమైనంత వరకు "సరళమైన భాషలో" రాసాను. యువక విద్యార్థిపాఠకలోకానికి యీ గ్రంథం యేమాత్రం ఉపయోగపడినా - నేచేసిన శ్రమఫలించినట్లే! అదినాకు ధన్యత గూర్చినట్లే!

## కృతిస్వీకర్త గురించి

ఈ గ్రంధాన్ని డా. బి. స్వామిగారికి అంకితం యిస్తున్నా. నాకున్న ఆత్మీయులైన కొద్దిమంది స్నేహితులలో ఆయన ఒకరు. మాస్నేహం నాల్గుదశాబ్దాలది. ఆయన "ప్రొఫెసర్ ఆఫ్ మెడిసన్"గా పనిచేసాడు. నాగార్జున విశ్వవిద్యాలయానికి కొంతకాలం ఉపాధ్యక్షుడిగా గూడాపనిచేసాడు. ఆంధ్రయూనివర్సిటీకి శ్రీ ఎల్. బుల్లయ్యగారు వైస్-చాన్సలర్గా వున్నకాలంలో ఆయనతో సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి స్వామిగారికి. దాని ఫలితంగా ఆంధ్రవిశ్వవిద్యాలయ సిండికేటులో - సెనేటులో ఎకడిమిక్ కౌన్సిల్లో పదిహేను సంవత్సరాలు పైబడి ఎన్నో కీలకమైన సంస్కరణలు ప్రవేశపెట్టుటకు తోడ్పడ్డాడు డా. స్వామి. ఆంధ్రప్రదేశ్ కౌన్సిల్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్లో తెలుగు విశ్వవిద్యాలయ కమిటీలో సభ్యునిగా - ఉన్నత విద్యారంగానికి సేవచేసే అవకాశం దొరికింది స్వామిగారికి. మెడికల్ - హెల్తు యూనివర్సిటీ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ మెంబర్గా ఆంధ్రామెడికల్ కౌన్సిల్ (హైదరాబాద్) ఇండియన్ మెడికల్ కౌన్సిల్ (న్యూఢిల్లీ) సభ్యునిగా "వైద్య, విద్యారంగానికి ఆయన శాయశక్తుల తన సహకారాన్ని అందిస్తున్నాడు. ఇలా డాక్టర్ అంబేద్కర్ వలె - అధ్యాపక వృత్తిని చేపట్టి - విద్యారంగానికి ఉడతాభక్తిగా - సేవలందిస్తున్నాడు డా. స్వామిగారు. విశాఖపట్నంలో స్థిరపడిన డాక్టర్ స్వామిగారు - విశాఖలో 'అంబేద్కర్' భవననిర్మాణంలో ముఖ్యమైన పాత్రనిర్వహించాడు. విశాఖ లైన్స్క్లబ్" సంస్థ అధ్యక్షునిగా - లైన్స్ డిప్యూటీ డిస్ట్రిక్ గవర్నరుగా -

"ప్రజాహిత" కార్యక్రమాల్లో చురుకుగా పాల్గొన్నాడు. ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ విశ్వవిద్యాలయాలలో "రిజర్వేషన్లు" అమలుచేస్తున్నతీరు సమీక్షించుటకు రాష్ట్రప్రభుత్వం డాక్టర్ స్వామిని ఏకసభ్యకమిషన్‌గా నియమించింది. వృత్తిరీత్యా వైద్యుడైన స్వామి - వృత్తిపరంగాను - యితర విధాలగాను - బడుగు వర్గాలవారికి - ముఖ్యంగా నిమ్నజాతుల పేద వారికి శక్తి కొలదిగా చేస్తున్న ప్రజాసేవకుడు! విశాఖపట్నంలోను - అనకాపల్లి విజయనగర పరిసర ప్రాంతాలలో డాక్టర్ స్వామి గారు మంచిపేరున్న డాక్టర్! విశాఖపట్నంలో ప్రముఖవ్యక్తి!

డాక్టర్ స్వామిగారి వ్యక్తిగత జీవితం తెలిసినవారికి - ఆయనలో డాక్టర్ అంబేద్కర్‌కున్న కొన్ని సుగుణాలు - లక్షణాలున్నట్లు గమనించగలరు. అంబేద్కర్‌కి - స్వామికి పోలికేమిటని అనుకోవచ్చు కొందరు! నక్కయెక్కడ - నాగలోక మెక్కడ అని సందేహంరావచ్చు. అది నిజమే అయినా మహనీయుల లక్షణాలు -సుగుణాలు కొన్ని సామాన్యులకు గూడా వుండవని రావని ఎక్కడుంది! డాక్టర్ అంబేద్కర్‌కి తల్లిదండ్రులు చిన్నతనంలోనే పోయారు. అలానే డాక్టర్ స్వామికి తల్లిదండ్రులు (బుడితి మాణిక్యమ్మ - సుబ్బయ్యలు) ఆయన చిన్నతనంలోనే పోయారు. డాక్టర్ అంబేద్కర్ పశ్చిమతీర 'కొంకణ' ప్రాంతీయ మహారాష్ట్రీయుడు. డాక్టర్ స్వామి - తూర్పుతీర పశ్చిమ గోదావరి మండల 'పాలకొల్లు' సమీప "కవిటం" గ్రామ నివాసి! తెలుగుబిడ్డ! ఆయన గోదావరినది జన్మస్థానం ప్రాంతంవాడైతే - యీాయన గోదావరి - సముద్ర సంగమస్థాన ప్రాంతంవాడు. డాక్టర్ అంబేద్కర్ లాగా - డాక్టర్ స్వామికి విద్యాభ్యాసం పట్ల ఎంతో ఆసక్తి, శ్రద్ధ. ఆయన లాగా యీాయన గూడా ఆర్థికంగా ఎన్నో కష్టాలుపడ్డారు. తల్లితండ్రులు గోల్పోయిన అనాథ బాలుడైన స్వామిని అయినవారెవరూ ఆదుకోలేదు చిన్నతనంలో ఒంటినిండా గుడ్డవుండేది కాదు. కడుపునిండా తిండివుండేదికాదు. పుస్తకాలు కొంటానికి - స్కూలు (కాలేజి) ఫీజు చెల్లించటానికి చేతిలో చిల్లిగవ్వ వుండేదికాదు. విద్యార్థిగా డాక్టర్‌స్వామి పడ్డబాధలు - అనుభవించిన మనోవ్యథ - హృదయావేదన బహుశా పగవాడు గూడా పడి

వుండదు. అయినా పెద్ద చదువులు చదవాలన్న పట్టుదల ఆయనకువుండడం వల్ల బాధలన్నీ ఓర్చుకొని చదువులు సాగించాడు. 1944లో డాక్టర్ అంబేద్కర్ ఆంధ్రాలో పర్యటించినప్పుడు పాలకొల్లు గూడా ప్రర్యటించడం జరిగింది. హైస్కూల్లో చదువుతున్న స్వామిని (చిన్నపిల్లవాడుగా) ఆ జన సందోహంలో తెలిసిన పెద్దలెవరో పైకెత్తుకొని డాక్టర్ అంబేద్కర్ దగ్గరకు తీసుకొని పోవడం జరిగింది. "బాగా చదువుకో - వృద్ధిలోనికి వస్తావు" అని డాక్టర్ అంబేద్కర్ బాలస్వామిని ఆశీర్వదించాడు! అంబేద్కర్ని స్వయంగా దర్శించి ఆయనకు జరిగిన ఘన సన్మానాన్ని కళ్ళారా చూసిన స్వామి అంబేద్కర్ గొప్పచదువులు చదవడంవల్లనేగదా - నాయకుడైనాడు - అందరూ ఆయన్ని గౌరవిస్తున్నారు. నేనుగూడా ఎందుకు బాగాచ దువుకోగూడదు. అన్న ఆలోచన ఆబాలునిలో (స్వామి) తళుక్కుమని మెరిసింది! అలా అంబేద్కర్ నుండి "స్ఫూర్తి" పొందిన స్వామికి డాక్టర్ అంబేద్కర్ ఆశీస్సులు గూడాతోడైనాయి గదా! పైగా డాక్టర్ అంబేద్కర్కు లాగా - ఆయనకున్న పట్టుదల - స్వయంకృషి - స్వయం ప్రతిభ ఆత్మవిశ్వాసం డాక్టర్ స్వామిని ఉన్నత విద్య అభ్యసించుటకు దోహదప డ్డాయి. నర్సాపూర్ టైలర్ "హైస్కూలులోను కాకినాడ "పి.ఆర్. కాలేజీ"లోను - కాకినాడ మెడికల్ కాలేజిలోను విద్యాభ్యాసం చేసాడు. ప్రతి తరగతిలోను ఆయన ఫస్ట్ మార్కులతో పాసయ్యేవాడు. ఎం.బి.బి. ఎస్. డిగ్రీ పుచ్చుకున్నాక - మెడిసిన్లో ఎం.డి డిగ్రీ గూడా పొందాడు. దరిమిలా ఆయన వైద్యశాస్త్రంలో యెన్నో ప్రత్యేక డిగ్రీలు గూడా సంపా దించాడు. గుంటూరు - కాకినాడ - వైజాక్ మొదలగు పట్టణాలలో డాక్టర్గా పనిచేసాడు. విదేశాలలో పర్యటించి - అంతర్జాతీయవైద్య సద స్సులలో పాల్గొని వైద్య శాస్త్రానికి సంబంధించిన పరిశోధనా పత్రాలు గూడా సమర్పించిన ప్రతిభావంతుడు డాక్టర్ స్వామిగారు. ఈమధ్యనే - రాష్ట్ర ప్రభుత్వం Additional Director of Medical Education గా హోదాను ఆయనకు కల్పించింది.

సంసార పక్షంగా - స్వామిగారి సంసారం మూడుపూవులారుకాయలుగా విరాజిల్లుతుందని చెప్పవచ్చు. పోలీస్‌శాఖలో ఉన్నత అధికారిగా పని చేసిన బయ్యా పుల్లయ్య సత్యవతుల ప్రథమపుత్రిక "శకుంతల" స్వామిగారి ధర్మపత్ని. పుల్లయ్యగారు ప్రముఖ అంబేద్కరేయుడు. చదువూ సంస్కారం ఉన్న ఆదర్శకుటుంబం పుల్లయ్యగారిది. ఆ కుటుంబంనకు అల్లుడు కావడం స్వామిగారి జీవితంలో పెద్దమలుపు. అనుకూలవతి - గుణవతి అయిన శకుంతల భార్యగా పొందిన స్వామి అదృష్టవంతుడు! శకుంతల - స్వామిగారింట్లో లక్ష్మీ దేవిలా కాలుపెట్టిన వేళావిశేషం - స్వామిగారికష్టాలు తొలిగిపోయాయి. వారికి అంతా కలిసి వచ్చిందనే చెప్పాలి. ఆదర్శదంపతులైన స్వామి-శకుంతలలకు - ఆణిముత్యాలు వంటి సంతానం అయిదుగురు - మొదటిబిడ్డ అరుణ. (ఎ.మ్మెసి.పి.హెచ్.డి). ఆమె భర్త రాష్ట్రరవాణా శాఖలో ఉన్నత అధికారిగా పనిచేసిన పాములవెంకటరత్నంగారి మూడవకుమారుడు డా. రాజేంద్రప్రసాద్ (FRCS) - వారికి సుధీర్ - శ్వేతలు ఇద్దరుముద్దుబిడ్డలు. వారిప్పుడు ఇంగ్లండ్‌లోవుంటున్నారు. డా. సుబ్బారావు (M.D, DND) స్వామిగారి రెండవ సంతానం. మూత్రపిండాలస్పెషలిస్టు. భగవాన్ శ్రీ సత్యసాయిబాబా - తాను పుట్టపర్తిలో స్థాపించిన "సత్యసాయి సూపర్ స్పెషాలటీస్" ఆస్పత్రిలో డాక్టరుగా పనిచేయుటకు ఆహ్వానించాడంటే - డా. సుబ్బారావుకున్న వైద్య నైపుణ్యం, పేరు మనం గ్రహించవచ్చు! ఆయన భార్య డా. రేణు! అంబేద్కర్ (రెండవసారి) కులాంతరవివాహంచేసుకున్నట్లు - రేణూ - సుబ్బారావులది గూడా కులాంతరవివాహం. భావన(కుమార్తె) - అనసు(కుమారుడు) వారి సంతానం. స్వామిగారి మూడవసంతానం డా. కల్యాణి ఆమె భర్త డా. వినోద్ కుమార్ (IFS) . కావ్య - విశాల్‌కుమార్ వారి సంతానం. ఇండియన్ ఫారిన్‌సర్వీస్‌లో ప్రస్తుతం అల్జీరియా ఎంబసీలో "Second సెక్రటరీ" హోదాలో పనిచేస్తున్నాడు వినోద్‌కుమార్. స్వామిగారి నాల్గవసంతానం వేంకటరమణమూర్తి. (ఎమ్.టెక్. - కంప్యూటర్‌సైన్స్). ఢిల్లీలో Engineer's India

Ltd లో కంప్యూటర్ ఇంజనీర్‌గా పని చేసి మొన్ననే ఆస్ట్రేలియాతో Computer Scientist గా వెళ్ళాడు. స్వామిగారి ఆఖరి సంతానం రాజశేఖర్. ఇతను ఇంజనీర్‌గా (బి.ఇ. - ఎం.బి.ఎ.) SAIL (Steel Authority of India)) మొన్నటిదాకా పనిచేసాడు ఇప్పుడు I.A.S ఆఫీసరయ్యాడు. ఈ విధంగా స్వామిగారు ఐదుగురు బిడ్డలు ఉన్నత విద్యలభ్యసించి స్వదేశ విదేశాలలో ఉన్నత పదవులలో ఉన్నారు. "శకుంతల- స్వామి" పుణ్యదంపతుల గర్భశుక్తిముక్తాఫలాలు యీ ఐదురురు. ధన్యజీవులువారు.

నికృష్ట నిరుపేద కుటుంబంలో పుట్టి - తింటానికి తిండిలేక - కట్టుకుంటానికి గుడ్డలేక - చదువుకొంటానికి పుస్తకాలు కొనలేక కన్నవారిని చిన్ననాడే పోగొట్టుకొన్నా ఆదరించినవారు లేకపోయినా - పట్టుదలతో నిర్విరామస్వయంకృషితో - స్వయంప్రతిభతో - ఆత్మవిశ్వాసంతో - అష్టకష్టాలుపడి - ఉన్నత విద్యనేర్చి గొప్ప వైద్యుడైన డా. స్వామిగారికి వలె ఆయనకు గల్గిన ఐదుగురు సంతానం గూడా వున్నత విద్యలునేర్చి వున్నత పదవుల నలంకరించడం - కలయోవైష్ణవ మాయయో అనిపిస్తుంది ! అది ఆ దంపతులు పూర్వజన్మలో చేసుకున్న పుణ్యఫలం - ఆ బిడ్డల అదృష్టం! సుగుణ సంపన్నులు - ఆదర్శ మాతాపితరులైన - శకుంతల స్వామిగార్లు తమబిడ్డల్ని క్రమశిక్షణతో పెంచి పెద్దచేసి విద్యాబుద్ధులు నేర్పించడంతో పాటు తండ్రికున్న పట్టుదల - స్వయం కృషి - స్వయం ప్రతిభ ఆత్మవిశ్వాసం - ఆ బిడ్డలలో వుండడం అందుకు ముఖ్యకారణం! బిడ్డల్ని ఉన్నతవిద్యావంతుల్ని చేయటానికి స్వామిగారు పడిన తపన చేసి నకృషి మాటలకందనివి! అంబేద్కర్‌ని చదివించటానికి ఆయన తండ్రి రాంజీ సక్పాల్ కున్న పట్టుదల తీసుకున్న శ్రద్ధ పడిన తపన స్వామిగారు తన బిడ్డల చదువుల విషయంలో గుర్తుకొస్తాయి. కనుకనే స్వామిగారి సంతానం గురించి గూడా కొంత చెప్పడం జరిగింది.

ఇక స్వామిగారికి నాకూ మధ్యనున్న స్నేహసంబంధాల గురించి రెండు మూడు మాటలు - 1958 ప్రాంతంలో డా. స్వామిగారు

గుంటూరు ప్రభుత్వ ఆస్పత్రిలో డాక్టరుగా వచ్చాడు. అదే సమయంలో నేను ఉద్యోగరీత్యా గుంటూరులోనే వున్నాను. డాక్టరుగారువాళ్ళు నా ఆత్మీయ మిత్రుడు కె.ఐ. మధుసూదనరావుగారి యింటిప్రక్కనే వుండే వాళ్ళు! మొదట డాక్టర్‌గారితో అలా పరిచయమైంది నాకు. రోజూ సాయంత్రం కలుసుకుంటూండేవాళ్ళం. డాక్టర్ బాలసుందరం మెడికో నూకరాజు మాలో చేరేవాడు. మధు వాళ్ళ తల్లిదండ్రులు - అన్నమ్మ ఏక్సిల్‌గార్లు - ముఖ్యంగా వాళ్ళ అమ్మగారు - మమ్మల్ని తమ కన్న బిడ్డ లుగా చాలా ప్రేమగా చూసేవారు! రోజూ ఎవరో ఒకరియింట్లో రాత్రికి విందుభోజనం! మేమంతా ఇరవై-ముప్పై యేండ్ల మధ్యవాళ్ళం. అప్పుడే సంసార లంపటంలో పడిన కుర్రవాళ్ళం. సుఖ దుఃఖాలు - జీవితంలోని తీపి-చేదు అనుభవాలు యింకా పూర్తిగా రుచి తెలియని వాళ్ళం! అటు పిల్లలమూ కాదు. ఇటు జీవితానుభవం వున్న పెద్దవాళ్ళమూ కాదు ! మాలో అప్పుడు డా. స్వామిగారే కాస్త పెద్ద! అయితేనేం ఒక చిన్న పిల్ల వాడిలాగా ప్రవర్తించేవాడు. కల్లా కపటంలేనివాడు. ఎప్పుడూ నవ్వుతూ సరదాగా వుండేవాడు. సెలవుదినాల్లో అయితే అందరం పార్కులోకో - పోలీసు పేరేడ్ గ్రాండ్స్‌లోకో - వూరిబయటికో షికారుకెళ్ళేవాళ్ళం. ఉడక బెట్టిన కాల్చిన పల్లీకాయలు - కాల్చిన మొక్కజొన్నపొత్తులు - ముంతకింద మషాలా పప్పు కొనుక్కొని తింటూ అందరం పిల్లల్లాగా అల్లరిచేసుకొంటూ నవ్వుకొంటూ జోక్సు వేసుకొంటూ హాయిగా ఆనందంగా కాలంగడిపేవాళ్ళం! పోస్టుమాస్టర్ సుబ్బారావుని "వైట్" అని అల్లరిపెట్టేవాళ్ళం. "నీవేం సేల్స్‌టాక్స్ ఆఫీసరువయ్యా మాకేమీ వస్తువులు "ఫ్రీ"గా తెచ్చిపెట్టవు. సినిమాలకు ఫ్రీగా తీసుకొనిపోవు. మీ డిపార్టుమెంటులో అన్నీ "ఫ్రీ" అటగా " - అంటూ డాక్టర్ స్వామిగారు నన్ను సరదాగా గోలచేసేవాడు. అంతగా అల్లరిచేసిన డాక్టర్‌స్వామి - దరిమిలా మెడిసిన్ 'ప్రొఫెసరై' చివరకు వైస్‌చాన్సలరైనాడు. డాక్టర్ బాలసుందరం అమెరికాలో ప్రాక్టీసు చేస్తున్నాడు. డా. కె.యన్.రాజు (నూక రాజు) లండన్‌లో ప్రముఖవైద్యు

డిగా స్థిరపడ్డాడు. "మధు" ప్రస్తుతం నాగార్జున యూనివర్సిటీలో ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా పనిచేస్తున్నాడు. నేను వాణిజ్యపన్నుల శాఖలో డిప్యూటీ కమీషనర్‌గా ఉద్యోగంచేసి పదవీ విరమణచేసి - నాసాహిత్యవ్యాసంగంలో నేనిలావున్నాను! అనాటి "మధురస్మృతులు" స్మృతిపథంలో మెదిల్తే - ఆ తీయని రోజులు గుర్తుకొస్తే- గతంలోకి జారుకొనిపోయి కొన్నిక్షణాలపాటు మధురాతి మధుర దివ్యానుభూతిని పొందుతాను. మేమంతా యెప్పుడైనా యెక్కడైనా ఏదో ఫంక్షనులోనో ఏదో సందర్భంగా కలుసుకుంటే అనాటి తీయని జ్ఞాపకాల్ని గుర్తుచేసుకొని నవ్వుకొంటూంటాం. ఆనందిస్తుంటాం. ఆరోజులు మరలా రావుగదా అని అనుకొంటుంటాం. వయోభారంమీదప డుతున్నకొద్దీ సంసార లంపటంలో పడి పిల్లా జెల్లా కుటుంబ గొడవలతో యీనాడు బరువెక్కిపోయే గుండెకు చిరాకెత్తే మనస్సుకు - పిన్ననాటి జ్ఞాపకాలు - అనాటి మధుర స్మృతులు నిజంగా ఎంతో రిలీఫ్ (ఉపశమనం) కలిగిస్తాయి. గుండెబరువును తగ్గిస్తాయి. మనస్సు ఏదో మధుర ఊహాజగత్తులో ఆనందంతో ఓలలాడుతుంది !.

తర్వాత ఉద్యోగరీత్యామేము గుంటూరువదలిపెట్టివేరువేరు ప్రదేశాలకు వెళ్ళిపోయినా - మా మధ్యస్నేహబంధమలానేవుంది. దీనికితోడు స్వామిగారికి అంతకుముందునుండే శ్రీ కె. అప్పారావు. శ్రీ కె.యస్. ఆర్. మూర్తిగార్ల కుటుంబంతో చాలాసన్నిహిత సంబంధ బాంధవ్యాలుండేవి. శ్రీమూర్తిగారు (ఐ.ఏ.యస్) మధు నేను ఆంధ్రా యూనివర్సిటీలో ప్రాణ స్నేహితులం. ఆ విధంగా గూడా స్వామిగారితో నాస్నేహబంధం అలానే పదిలంగా కొనసాగుతోంది. దరిమిలా డా. స్వామిగారు నాగార్జున విశ్వవిద్యాలయానికి ఉపాధ్యక్షుడిగా మరలా గుంటూరు రావడం జరిగింది. అదృష్టవశాత్తు నేను వుద్యోగరీత్యా మరలా గుంటూరులోనే వుండడం తటస్థించింది. మధుసూదనరావు ఏ.సి. కాలేజీ లెక్చరర్‌గా, గుంటూరులోనే వుంటున్నాడు. మాస్నేహబంధం మరింతగా దృఢపడింది. ఇలా అప్పారావు గారి కుటుంబం - మూర్తిగారి కుటుంబము - మధుసూదనరావుకుటుంబం

- మాకుటుంబం - రక్తసంబంధమైన బంధువులం కాకపోయినా అంతకంటే ఎక్కువగా సన్నిహితసంబంధ బాంధవ్యాలు కల్గి అందరం ఒకే కుటుంబంగా మెలుగుతూ వస్తున్నాం. అది మా అదృష్టం! అది దేవుని కృప.

డా. స్వామిగారు అసలైన సిసలైన అంబేద్కరేయుడు. అంబేద్కర్ అంటే ఆయనకు ఎంతో భక్తిభావం. స్వామికి అంబేద్కర్ ఆదర్శమూర్తి - మార్గదర్శకుడు - అంబేద్కర్ ఆశయాలమేరకు ఉడతాభక్తిగా బడుగు వర్గాలవారికి చేయూతనిస్తూ వస్తున్నాడు. ఇంతకుముందు చెప్పినట్లు స్వామిగారిలో కొన్ని అంబేద్కర్‌గుణాలున్నాయి! ఆయన జీవితంలోని కొన్ని సంఘటనలకు - యీాయన జీవితంలోని కొన్ని సంఘటనలకు కొన్ని పోలికలున్నాయి! ఇద్దరూ అస్పృశ్య కులంలో పుట్టినవారు. ఇద్దరూ చిన్నతనంలో తల్లిదండ్రుల్ని పోగొట్టుకున్న అనాధలు - ఇద్దరూ 'విద్యాసక్తి' గల్గి పేదరికంలో అష్టకష్టాలుపడి ఉన్నతవిద్యలు నేర్చినవారు ! అంబేద్కర్ స్వాభిమాని - స్వామిగూడా స్వాభిమాని! అంబేద్కర్‌కున్న ఆత్మవిశ్వాసం - స్వయంప్రతిభ - నిజాయితీ - దీక్షాదక్షత - నిర్మోహమాటం - నిష్కపటత్వం - యీాయనకూ ఉన్నాయి. అంబేద్కర్ - నిమ్నజాతుల ఉద్ధారకుడై - నవభారత జాతిరత్నంగా ఖ్యాతిచెందాడు. డా. స్వామిగారు గూడా వైద్యరంగంలో విశాఖపట్నంలో ప్రముఖవ్యక్తిగా ప్రముఖ వైద్యునిగా - వైద్యరత్నగా వెలుగొందుతూ మనసా వాచా - కర్మేణా - అంబేద్కర్ ఆశయాలమేరకు - స్వజాతీయులకు ఉడుతాభక్తిగా సేవ లందిస్తున్నాడు. నేను మొదట్లో చెప్పినట్లు - "అంబేద్కర్ శతజయంతి వేడుకల సందర్భంలో "మరి మీరేమి రాస్తున్నారు" అని అడిగిన వారిలో డా. స్వామి ప్రధముడు. "పిల్లల కోసం అంబేద్కర్ జీవితం రాయాలను కొంటున్నాను. రాస్తే అది మీకే అంకితం యిస్తాను. నాకున్న మిత్రుల్లో మీకంటే మించిన అంబేద్కరేయుడు యింకెవరున్నారు" అని నేనన్నాను. పిల్లలకోసం మొదలుపెట్టి అది ఆపి పెద్దలకోసమని వ్రాస్తే అది యింత గ్రంథమైనది." అందుకే అంబేద్కర్‌పై నే వ్రాసిన యీా గ్రంధాన్ని డా.

స్వామిగారికి అంకితం యిస్తున్నాను. అది మాస్నేహ బంధానికి ప్రతీక! స్వామిగారు అంబేద్కరేయునిగా గుర్తింపుగా యీ అంకితం.

## కృతజ్ఞతలు

డా. అంబేద్కర్ ఆత్మకధ రాసుకోలేదు. ఆంగ్లంలో ధనంజయకీర్ రాసిన అంబేద్కర్ జీవితం - ఆయన జీవితాశయం (Dr Ambedkar - Life and Mission) అంబేద్కర్ జీవితానికి - ఆయన సాగించిన పోరాటాలకు ఆయన సాధించిన విజయాలకు పట్టుగొమ్మ! అంబేద్కర్‌ని స్వయంగా చాలాసార్లు కలసి ఆయన్ని "ఇంటర్వ్యూ"చేసి ఆయన బ్రతికుండగానే రాసిన గ్రంధమది! అధికారికమైనదది! తెలుగులో ప్రప్రధమంగా అంబేద్కర్ మీద వచ్చిన గ్రంధం - యెండ్లూరి చిన్నయ్యది! తర్వాత చెప్పుకోదగ్గది డా. విజయభారతి (బొజ్జా తారకంగారి జీవితభాగస్వామిని - పద్మశ్రీ బో. భీమన్న గారి ప్రధమ పుత్రిక) రాసిన గ్రంధం - నారచనకు యీ ముగ్గురి రచనలు కొంతవరకు ఉపయోగపడినవి. వారికే నాకృతజ్ఞతలు. అంబేద్కర్ రచనలు గూడా దోహదపడ్డాయి.

కోరినదే తడవుగా తమతమ అమూల్యమైన అభిప్రాయాలు రాసియిచ్చిన నాకు ఆత్మీయులు - నా శ్రేయోభిలాషులు - "రెండు కళ్ళు"గా నాకు మార్గదర్శకులుగా వున్న పూజ్యులు జస్టిస్ డాక్టర్ కె. పున్నయ్య గారికి శ్రీ కె.యస్.ఆర్. మూర్తి(ఐ.ఏ.ఎస్.)గారికి నాహృదయపూర్వక వందనాలు.

ఈగ్రంధాన్ని మాసాహితీ మిత్రమండలి - ప్రచురించటానికి - ఆనందంగా అంగీకరించినందుకు ప్రెసిడెంట్ శ్రీ బి. వేదయ్యగారికి - జనరల్ సెక్రటరీ శ్రీ ప్రొఫెసర్ యస్. గంగప్పగారికి - తదితర కార్యనిర్వహక సభ్యులకు నా నమస్సులు.

ఈ రచన మొదలు పెట్టిన దగ్గరనుండి - గ్రంధం సర్వాంగ

సుందరంగా వెలువడేవరకు - నాకన్ని విధాల చేదోడువాదోడుగా కొండంత అండగా నిలిచిన ఆత్మీయుడైన కవిమిత్రులు శ్రీ కొల్లా శ్రీ కృష్ణారావుగారికే, అంకితభావంతోనాకు కావలసిన సమాచారం సకాలంలో అందిచడంలో నాకు తోడ్పడిన మిత్రులు శ్రీ గనుమల జ్ఞానేశ్వర్‌గార్కి నా వందనాలు. నాకన్ని విధాల సహాయ సహకారాలందించిన ఆత్మీయులైన మిత్రుడు - ఉన్నతోద్యోగి శ్రీ కొండా మధుసూదనరావుగారికి నాహృదయ పూర్వక వందనాలు.

అంబేద్కర్ జీవితసన్నివేశాల కొన్నిటికి రేఖాచిత్రాలు కవర్ పేజీ చిత్రం - గీసిన ఆర్టిస్ట్ చందు హైదరాబాద్‌గారికి - కవర్ పేజీ చిత్రాన్ని రంగులతో సుందరంగా రూపుదిద్దిన ఆర్టిస్ట్ ఈశ్వర్ (ఆంధ్రజ్యోతి)విజయవాడగారికి వందనాలు చెప్పకుండా వుండలేను. మిత్రులు గెడ్డం చిన నరసింహం - జి.మంగపతిగార్లు - యిచ్చిన సహకారాన్ని కూడా మరిచిపోలేను.

కేవలం వ్యాపార దృష్టితోకాక - మంచీమర్యాద - సహృదయత కల్గిన అక్షరమాల D.T.P అధినేత శ్రీ కొడాలి శేషగిరిరావుగారికి అలానే - విజయలక్ష్మి ఆఫ్‌సెట్ ప్రింటర్స్ అధినేతలు శ్రీయుతులు M.S జయ వర్ధన్‌గారికి - C. సాంబశివరావుగారికి - నాయీ పుస్తకం - సర్వాంగ సుందరంగా సకాలంలో అచ్చువేసి యిచ్చినందులకు కృతజ్ఞతలు చెప్ప కుండా వుండలేను. మరి సెలవ్.

గ్రంధకర్త

## అంకితం

డాక్టరు అంబేద్కర్ వలె
డాక్టర్ స్వామిగూడ
బాల్యమందె తల్లిదండ్రిని
పోగొట్టుకున్న అనాధ!

డాక్టరంబేత్కర్ వలె
డాక్టర్ స్వామి గూడ
నిమ్నజాతుల్లో పుట్టాడు
నిరుపేదగా పెరిగాడు!

అంబేద్కర్ వలె స్వామిగూడ
విద్యాసక్తి కలవాడు
ఎన్నోకష్టాలు పడ్డాడు
ఉన్నత విద్యనేర్చాడు

అంబేద్కర్ వలె స్వామిగూడ
ఆత్మాభిమానమున్నవాడు
ఆత్మవిశ్వాసమున్నవాడు
అచంచల దీక్ష కలవాడు

ఆయన వలె యీాయన గూడ
స్వయంకృషి ఉన్నవాడు
స్వయం ప్రతిభ కలవాడు
స్వజాతి అభిమానమున్నవాడు.

ఆయన వలె యీాయన గూడ
నిజాయితీగ మెలగువాడు
నిష్కపటత్వం కలవాడు
నిర్భయంగ పలుకువాడు.

బాబా సాహెబ్ వలె
ఓ. స్వామి గూడా
కాలం విలువ తెలిసినవాడు
కష్టపడి శ్రమించువాడు.

అంబేద్కరంటె స్వామికి
అనుపమాభిమానం!
అంబేద్కరే స్వామికి
ఆదర్శపురుషుడు!

అంబేద్కర్ ఆశయాలకు
అనుగుణంగా స్వామి
శక్తికొలది స్వజాతీయులకు
చేయూతనిస్తున్నాడు!

అందుకే డాక్టర్ స్వామికి
అంబేద్కర్ పైని నా యీ కృతి
ఆదరాభిమానాలతో
అంకితమిస్తున్నా!

నలుబదేళ్ళ మాస్నేహం
నాల్గుకాలాలపాటు నిలిచేటట్లుగా
మాస్నేహబంధానికి గుర్తుగా
అంకితమిస్తున్నా నీకృతి మన స్ఫూర్తిగా!

అమూల్యశ్రీ

# కృతి స్వీకర్త



చిఱునగవు మోముకలవాడు స్నేహశీలి
నిర్మలుండు నిర్మోగమోటి నిర్భయుండు
పట్టుదలస్వయంకృషి స్వయంప్రతిభయున్న
స్వాభిమాని మత్కృతిపతి స్వామి గారు

## సతీ మణితో కృతిపతి



సతి "శకుంతల" గృహలక్ష్మి శాంతమూర్తి
స్వామి సహధర్మచారిణి సాధుశీల
మార్గదర్శక సుగుణ సంపన్నులైన
భవ్యచరితులాదర్శదంపతులువారు

## బాల్య మిత్రులు



స్నేహమునకుమించినతియ్యనిదియెలేదు
మిత్రునకుమించి ఆప్తుడీధాత్రిలేదు
మూర్తి - స్వామియును-మధు-అమూల్యశ్రీలు
బాల్యమిత్రులునల్వురుప్రాణసఖులు

# భారతజాతి రత్న డా. బి. ఆర్. అంబేద్కర్



దళిత-పేద-బడుగు జనోద్ధారకుడు
సత్యశీలి ప్రాజ్ఞుడు ప్రజాస్వామ్యవాది
భరత రాజ్యాంగ నిర్మాత భరతరత్న
విమల చరితుండు డాక్టరంబేద్కరుండు

Hand Writing of Dr. Ambedkar

I have been getting letters threatening my life. They are all not-paid. I have been telling my Secretary that in law when we hang a man we don't inflict a fine on him. Why should these assassins fine me by sending not-paid letters in addition to taking my life.

I am glad your father is keeping well.

Give my regards to Paranjpe. Tell him that I shall be delighted to hear from him if he cares to write to me.

With kindest regards

I am

Yours sincerely

B. R. Ambedkar

**Dr. B . Swami** MD. T.D.D. FIMSA; DSC (Hou)
Professor and Head of the Department of Medicene (Retd) Andhra Medical College and K.G. Hospital - Visakhapatnam
Ex- Vice Chancellor of Nagarjuna University
- Dasapalla Hill Colony - Visakhapatnam -3.

# కృతజ్ఞతలు

"భారతజాతిరత్న డా. బి. ఆర్. అంబేద్కర్" అనే గ్రంధాన్ని రచించి - ఆగ్రంధాన్ని నాకు అంకితమిస్తున్న గ్రంధరచయిత - అమూల్యశ్రీ - శ్రీ జాపూడి అమ్మలయ్యగారికి ముందుగా నాకృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

విశ్వవిఖ్యాత మహాపురుషుడు - బహుముఖప్రజ్ఞాశాలి - నవభారత రాజ్యాంగ నిర్మాత - బడుగువర్గాల పెన్నిధి - భారతదేశములో అమానుషమైన అస్పృశ్యతాదురాచారముచేత అణగారిపోతున్నకోట్లాది నిమ్నజాతులలో పుట్టి - మహావిజ్ఞానియై - తన జాతులవారిని సంఘటిత పరచి - వారి పరిపూర్ణదాస్యవిముక్తికై పోరాటం నడిపి - సమసమాజస్థాపనకు జీవితాంతం కృషిచేసిన మహోన్నత మానవతామూర్తి - డా. అంబేద్కర్. ఆ మహోన్నతుని జీవిత విశేషముల గూర్చి వ్రాసిన గ్రంధాన్ని నాకు అంకితముచేసి నాజీవితానికి ధన్యత చేకూర్చాడు మిత్రుడు అమ్మలయ్య. ఇది నా అదృష్టము - అది నా పూర్వజన్మ సుకృతం అనిపిస్తుంది!

ఒక్కొక్కసారి మనము కలలో గూడా ఊహించని సంఘటనలు మనజీవితాలలో జరిగిపోతుంటాయి. అలాంటిదే యీ సంఘటన - నేను యీ గ్రంథానికి కృతిభర్తను కావడం! జాషువాకవితావైభవం వంటి ఒక మంచి గొప్ప గ్రంథాన్ని రచించి ఆధునిక కవులలో రచయితలలో ఒకవిశిష్టమైన స్థానాన్ని సంపాదించుకొన్న అమూల్యశ్రీగారు తానురచించిన ఈ గ్రంధాన్ని నాకు అంకితమిస్తాడనీ ఆగ్రంథాన్ని కృతిభర్తగాస్వీకరించే అదృష్టము నాకు కలుగుతుందని నేనెన్నడూ ఊహించను గూడా లేదు. హైదరాబాదు సమీపమందున్న రామచంద్రాపురము (B H E L) లో సోదరుడు నరసింహామూర్తి (K.N. మూర్తి) పెద్ద కుమార్తె శోభశ్రీ (వివాహ) "నిశ్చితార్థ" సమయములో

- అక్కడచేరిన బంధుమిత్రుల సమక్షములో మిత్రుడు శ్రీ అమ్మలయ్య తన మనస్సులోని నిర్ణయాన్ని ప్రకటించి - అచ్చట చేరిన పెద్దలందరిచేత నా శిరస్సు మీద అక్షింతలు వేయించినప్పుడు నా ఆనందము వర్ణనాతీతము. అమూల్యమైన అమ్మలయ్యగారి అపూర్వమైన ప్రేమానురాగాలు - స్నేహమాధుర్యము నా తనువంతా పులకింపజేసింది. అది నాజీవితములో ఒక అపూర్వమైన సంఘటన - అది మాటల కందని మధురమైన అనుభూతి. ఈ గ్రంధానికి కృతిభర్తగా ఉండుటకు నాకు అర్హత ఉన్నదా లేదా అనే తలంపు ఆనాడు వెంటనే నామనస్సులోనికి వచ్చింది. ఈ ఆలోచన చాలా రోజులు నామనస్సులో మెదులుతూ వచ్చింది. నేను - మనసా - వాచా - కర్మేణా - అంబేద్కర్ ఆశయాలను నమ్మి వాటిని ఆచరిస్తూ - నిమ్నజాతులవారి సేవలో నాశక్తి మేరకు కృషిచేస్తున్నందుకు బహుశా మిత్రుడు శ్రీ అమ్మలయ్య తన గ్రంధానికి నన్ను కృతి భర్తగా యెంచుకొన్నాడని నేను చివరకు తేల్చుకొన్నాను. కృతిభర్తగా నాకబ్బిన అదృష్టము నన్ను కొంతకొంత సంతృప్తి పరచిన మాట నిజం!

అమ్మలయ్యగారితో నా పరిచయము నాలుగు దశాబ్దాలనాటిది. ఉద్యోగరీత్యా 1957లో నేను గుంటూరులో ఉండడం తటస్థించింది. శ్రీ అమ్మలయ్య గూడా ఉద్యోగరీత్యా గుంటూరులోనే ఉండటం జరిగింది. మాకు పొరుగున ఉన్న శ్రీమధుసూదనరావు (మధు) గారు, అమ్మలయ్యగారు స్నేహితులు కావడంవల్ల - అలా ఆయనతో నాకు మొదట పరిచయమైనది. శ్రీ మధు శ్రీ అమ్మలయ్య డా. బాలసుందరము - డా. నూకరాజు, పోస్టుమాస్టరు సుబ్బారావు - నేను - మేమంతాకలసి ఒక మిత్రబృందముగా కలిసిపోవుట జరిగినది. ప్రతి సాయంత్రము మా గృహములోనో వాళ్ళయిళ్ళల్లోనో మిత్రులందరముచేరడము - నవ్వులతో - కేరింతలతో ఒకరిమీద ఒక రు హాస్యపుమాటలు (జోక్సు, విసురుకొంటూ - సంతోషముగా - సరదాగా కాలక్షేపము చేయటము నిత్యకృత్యముగా వుండేది. ఆరోజులు తలంచుకొంటే యిప్పటికీ నా మనస్సంతా అనిర్వచనీయమైన ఆనందముతో నిండిపోతూవుంటుంది. నేను గుంటూరులో

ఉన్నంత కాలము రోజులు అలాగు హాయిగా గడిచిపోయినవి. తర్వాత ఉద్యోగరీత్యామేము గుంటూరు వదలిపెట్టి వేరువేరు చోట్లకు వెళ్ళిపోవ డము జరిగింది. అయినా మామధ్యస్నేహం అలానే కొనసాగుతూవచ్చింది. తర్వాత చాలా సంవత్సరములకు నేను నాగార్జున విశ్వవిద్యాలయానికి వైస్ చాన్సలరుగా మరలా గుంటూరు వెళ్ళడము జరిగింది. అమ్ముల య్యగారు డిప్యూటీ కమీషనరుగా మరలాగుంటూరు రావడము జరిగింది. A.C. కాలేజీ లెక్చరర్‌గా మధుసూదనరావుగారు గుంటూరులో వుంటు న్నాడు. దీనితో - మాపూర్వస్నేహము మరింతగా బలపడింది. మా ముగ్గురి కుటుంబాలు చాలా సన్నిహితముగా ఉంటూ ఒకే కుటుంబము రీతిగా మెలగుతూ కొనసాగుతున్నాయి. దానికి తోడు శ్రీ. కె. అప్పా రావుగారితోను ఆయన సహోదరుడు శ్రీ కె.యస్.ఆర్. మూర్తి (I.A.S.) గారితోను నాకు అంతకుముందు చాలాకాలమునుండే సన్నిహిత సంబంధాలు వున్నాయి (విశాఖలో అప్పారావుగారు ఉద్యోగరీత్యావున్నప్పటి నుండి", శ్రీ మూర్తి శ్రీ మధుసూదన రావు శ్రీ అమ్ములయ్యగా రలు ఆంధ్రా యూనివర్సిటీలో స్నేహితులు కనుక ఆవిధముగా గూడా నాకు అమ్ములయ్యగారితో స్నేహము మరింతగా వృద్ధిచెందింది. ఆమధ్య నా సోదరతుల్యుడు శ్రీ శ్రీ రామచంద్రమూర్తి (K.S.R. Murthy) గారి సతీమణి అనసూయామూర్తిగారు అనారోగ్యముతో బాధపడుతూఉంటేమే మందరము మూర్తిగారింటిలో తరచుగా కలుసుకొంటూ వుండే వాళ్ళము. పాత జ్ఞాపకాల్ని గుర్తుకు తెచ్చుకునే వాళ్ళం.

బహూశా యీనలుబది ఏండ్లస్నేహబంధము వలన అమ్ములయ్య గారు యీ గ్రంథాన్ని నాకు అంకిత మివ్వాలనే నిర్ణయానికి వచ్చి వుంటాడని నేను విశ్వసిస్తున్నాను. ఎంతోమంది విజ్ఞులు గొప్ప వారు - నాకంటే అధికులు ఆయనకు మిత్రులెందరో ఉండగా నాకే తనగ్రంథాన్ని అంకితముచేస్తున్న అమ్ములయ్యగారికి కృతజ్ఞతలు తెలియజేయడము తప్పమరేమిచేయగలను? వారికి వారి కుటుంబానికి ఆయురోగ్యములు శాంతి సౌభాగ్యములు కలు గజేయమని ఆభగవంతుని మనసారా ప్రార్థించడము తప్ప.

ఈ గ్రంథము సరళమైన భాషలో సామాన్యునికి కూడా సులభముగా ఉన్నమయ్యే్శైలిలో అంబేద్కర్‌ని జీవితములో జరిగిన సంఘటనలన్నీ పొందు పరచి చక్కగా రూపొందించాడు మిత్రుడు అమూల్యశ్రీ. అక్కడక్కడా ఆయన వెలిబుచ్చిన అభిప్రాయాలు చేసిన కొన్ని వ్యాఖ్యలు కొంతమం దికి నచ్చకపోవచ్చు. అయితే గ్రంథ రచయిత భావస్వాతంత్ర్యమునకు అవి మచ్చుతునకలని నావ్యక్తిగత అభిప్రాయము. రచయితకున్న స్వేచ్ఛను ఎవరు కాదనగలరు? పాఠకలోకము - మరియు ఆంధ్ర దేశములో ఉన్న అంబేద్కరీయులు - యీ గ్రంథము యొక్క - మంచిచెడ్డలను - దాని విశిష్టతను - గొప్పతనమును నిర్ణయించవలసిన వారు. నాకు "ఆదర్శ మూర్తి" అయిన డా. అంబేద్కర్ గురించి వ్రాసిన గ్రంథమునకు నన్ను కృతిపతిగా చేసి నాజన్మకు ధన్యత చేకూర్చిన గ్రంథకర్త అమూల్యశ్రీ జె. అమ్మలయ్యగారికి మరొక్కసారి మనసారా కృతజ్ఞతలు తెలియజేసుకొంటూ సెలవు తీసుకుంటున్నాను.

- జయ్ భీమ్ -

(సం.) డా. బి. స్వామి.

అస్పృశ్యత రూపు మాపి
అగ్ర అంత్య భేదముడిపి
నిష్కల భారత జాతికి
నీడయైన బోధి ప్రియ!
— మహాకవి బోయి భీమన్న

## విషయ సూచిక

నాల్గవ అధ్యాయం - ఉద్యమ అంబేద్కరం



ఐదవ అధ్యాయం - ఉద్ధారక అంబేద్కరం

## ఆరవ అధ్యాయం - రాజకీయ అంబేద్కరం



## ఏడవ అధ్యాయం - రాజ్యాంగ అంబేద్కరం

XXXX

# తొలిపలుకులు

ప్రియమైన పాఠకులారా!

మనమిప్పుడు ఓ మహా గొప్ప దేశ నాయకుడి గురించి తెలుసుకుందాం. దేశ నాయకులంటే మీకు తెలుసుగదా! ఎన్నో కష్టాలు పడి ఎన్నో త్యాగాలు చేసి ఎంతో దేశ సేవ చేసిన వారిని ప్రజలకెంతో మేలు చేసిన వారిని మనం దేశ నాయకులని అంటుంటాం. జాతిపిత మహాత్మా గాంధి చాచా నెహ్రూ- నేతాజీ-వల్లభాయ్‌పటేల్ - వంటి దేశ నాయకుల గురించి తెలియని వారుండరు. మీలో కొంతమంది వారిని గురించి తెలుసుకొనే వుంటారు. ఆ కోవకు చెందిన ఇంకొక గొప్ప నాయకుడిని గురించి యిప్పుడు తెలుసుకుందాం. ఆయనిప్పుడు జీవించిలేడు. ఆయన చనిపోయి గూడా చాలా యేండ్లయినది. నిన్న మొన్నటి వరకు గాంధీజీ గురించి తెలిసినంతగా - నెహ్రూజీ గురించి తెలిసినంతగా ఆయన గురించి ప్రజలకు తెలియదు. అందుకు కారణాలు చాలా వున్నాయి. ఇటీవలి కాలంలోనే ఆయన గొప్పదనం అందరూ గుర్తించడం మొదలెట్టారు. ఆయన గురించి ఆయన జీవితం గురించి తెలుసుకుంటున్నారు. పోయిన సంవత్సరమే (1990-91) ఆయన శత జయంతి ఉత్సవాలు మన దేశంలో ఘనంగా జరిగాయి. ఆ ఉత్సవాలు యీ సంవత్సరం గూడా (1991-92) దేశమంతటా అటు ప్రభుత్వం వారు ఇటు ప్రజలు జరుపుకొన్నారు. ఆయన మీద వివిధ భాషల్లో గ్రంథాలు వెలువడుతున్నాయి. ఆయన పేరుమీద పోస్టల్ స్టాంప్‌ను ప్రభుత్వం విడుదల చేసింది. రూపాయి నాణాలు గూడా విడుదల చేశారు. ఆయనపై రేడియోలలో -టీ.వీలలో లలితగీతా లొస్తున్నాయి. ఆయన జీవితంపై సీరియల్స్ వచ్చాయి. ఇప్పుడు సినిమాలు గూడా తీస్తున్నారు. ఆయన రాసిన గ్రంథాలన్నీ మహారాష్ట్ర ప్రభుత్వం వారు పది-పదకొండు సంపుటాలుగా ప్రచురించారు. కేంద్ర ప్రభుత్వం ఆయన రచనల్ని వివిధ భాషల్లో ప్రచురించటానికి కృషి చేస్తుంది. ఆయన విగ్రహాలు వూరూరా-వాడవాడలా నెలకొల్పుతున్నారు.

పార్లమెంటు యెదుట నిలువెత్తు విగ్రహం వుంది. చూపుడు వేలుతో పార్లమెంటును చూపిస్తూ రెండవచేత్తో రాజ్యాంగ గ్రంథం పట్టుకొని వున్నట్లు వుంది విగ్రహం. హైదరాబాద్‌లో టాంక్‌బండ్ మీద విగ్రహం వుంది. 1990లో ఆయనకు కేంద్ర ప్రభుత్వం భారతరత్న గౌరవ బిరుదు ప్రదానం చేసింది. ఆయన శత జయంతి ఉత్సవాల సందర్భంలో ఆయన కీబిరుదు నిచ్చారు. 1990 సంవత్సరాన్ని అంబేద్కర్ ఆశయాల ప్రతీకగా - దేశంలో - "సామాజిక న్యాయ వత్సరం" గా పాటించారు. ఆయన బ్రతికుండగా దేశంలో ఆయన్ని యింత ఘనంగా భారత ప్రభుత్వం గాని యావత్ దేశ ప్రజలుగాని గౌరవించలేదు. బహుశా దేశంలో ఒక్క గాంధీజీకి- ఒక్క నెహ్రూకు మాత్రమే యింత ఘనంగా శత జయంతి వేడుకలు జరిగాయి! మనరాష్ట్రంలోని సార్వత్రిక విశ్వవిద్యాలయానికి ఆయన పేరుగూడా పెట్టారు. ఆయన పుట్టిన తారీఖు ఏప్రిల్ 14ని మన రాష్ట్రప్రభుత్వం అధికారిక సెలవుదినంగా ప్రకటించింది. ఆయన బ్రతికుండగా ఆయనకు జరగని "గొప్ప గౌరవం" ఆయన చనిపోయిన 35 సంవత్సరాలకు జరగడం గొప్ప విశేషమే. మరి ఆ మహానాయకుడెవరో మీలో ఒకరైనా వూహించగలరా! ఆయన పేరు చెప్పగలరా! ఆ.. ఆయనే డాక్టర్ అంబేద్కర్.

ఆయన అభిమానులు -అనుచరులు పూజ్య భావంతో ఆయన్ని "బాబాసాహెబ్" అని పిలుస్తారు! గాంధీజీని "బాపూజీ" అని పిలిచినట్లు! నెహ్రూజీని "చాచా నెహ్రూ" అని పిల్లలు పిలిచినట్లు! -సుభాష్ చంద్రబోస్‌ని అందరూ "నేతాజీ" అని పిలిచినట్లు! జగజ్జీవన్‌రామ్‌ని "బాబూ"అని పిలిచినట్లు! అంబేద్కర్ ఉన్నత విద్య నభ్యసించి "డాక్టరేట్లు"పొందాడు. అందుకే ఆయన్ని డాక్టర్ అని సంబోధిస్తారు. అయినా ఆయన వైద్యంలో డాక్టర్ మాత్రం కాదు! ఆయన పూర్తి పేరు భీమ్‌రావ్-రామ్‌జీ-అంబేద్కర్- కనుకనే క్లుప్తంగా బి.ఆర్. అంబేద్కర్ అని అంటారు.

మాతృదేశం పట్ల గౌరవ సూచికంగా మనం "జైహింద్" అని అంటాం. అలాగే ఆయన అనుచరులు ఆయన పట్ల గౌరవంగా "జైభీమ్"

అంటారు. కొందరు గొప్ప వారుగా పుడతారు. వారినే కారణజన్ములని అంటారు. మరికొందరు ఏ గొప్ప పనులు చేయకపోయినా- అదృష్టం కొద్దీ గొప్ప వారుగా కీర్తింపబడతారు. మరికొందరు గొప్ప తనాన్ని సాధిస్తారు. అంబేద్కర్ యీా మూడవ కోవకు చెందుతాడు. ఆయన అట్టడుగు సమాజంలో అంటరాని కులంలో పుట్టాడు. నిరుపేద కుటుంబంలో పుట్టాడు. అష్టకష్టాలు పడ్డాడు. నిమ్న జాతీయుల్ని వుద్ధరించటానికి ఆయన యెన్నో ఉద్యమాలు నడిపాడు. జీవితమంతా పోరాడాడు. గొప్ప నాయకుడయ్యాడు. ఆయన గొప్ప నాయకుడెలా అయ్యాడో గొప్పతనాన్ని యెలా సాధించాడో-ఆయన జీవితం తెలుసుకుంటేగాని -మనకు తెలియదు. మరి మనమిప్పుడు ఆ మహానాయకుని జీవితం గురించి తెలుసుకుందాం!

* * * *

కలడంబేద్కరు నా సహోదరుడు
మాకైయష్ట కష్టాలకుం
బలియై సీమకు పోయి క్రమ్మరిన
విద్వాంసుండు వైశ్రాయిమే
ల్కొలువందుంగల దొడ్డవాడతడు
నీకున్ స్వాగతంబిచ్చి పూ
వల పూజల్ పొనరించెనే యతని
మెప్పుల్ నీకు జయారంభముల్.

శ్రీ జి. జాషువ

# కులవ్యవస్థ - అస్పృశ్యత

పాఠకులారా! : అంబేద్కర్ గురించి తెలుసుకునే ముందు మనం కులవ్యవస్థ గురించి - అస్పృశ్యత గురించి తప్పక తెలుసుకోవాల్సిన అవసరం ఉంది. ఎందుకంటే ఆయన అస్పృశ్యుడుగా పుట్టాడు. చాలా కష్టాలు పడ్డాడు. అవమానాలు పొందాడు. గొప్ప చదువులు చదివి కులవ్యవస్థ గురించి - అస్పృశ్యత గురించి కూలంకషంగా (లోతుగా) పరిశోధనలు చేసాడు. కులనిర్మూలన కోసం కృషి చేసాడు. అస్పృశ్యత పోగొట్టటానికి గట్టి కృషి చేసాడు. నిమ్న జాతీయులను ఉద్ధరించటానికి జీవితాంతం పోరుకాడాడు. కనుక - కుల వ్యవస్థ సమస్యకు అస్పృశ్య సమస్యకు - అంబేద్కర్ జీవితానికి ఆయన నడిపిన ఉద్యమానికి చాలా అవినాభావ సంబంధం ఉంది. ఒకవిధంగా అంబేద్కర్ జీవితమంటే - నిమ్నజాతీయుల ఉద్ధరణ ఉద్యమ చరిత్ర.

అసలీ కులాలు - కులవ్యవస్థ అంటే ఏమిటి? అది ముందు తెలుసుకోవాలి. మన దేశంలో మన హిందూసమాజంలో అదొక సాంఘిక కట్టడి! ఒకప్పుడది మంచిదేమో! కొద్దిమంది సనాతన హిందువుల దృష్టిలో యిప్పటికీ అది మంచిదేమో. కాని మారిపోతున్న కాలంతోపాటు సామ్యవాదం ప్రబలుతున్న యీనాడది అమానుషమైన దురాచారం అని దాదాపుగా అందరూ అంగీకరిస్తున్నారు. దానిని రూపుమాపటానికి కృషి చేస్తూనే ఉన్నారు. కులవ్యవస్థ అంటే - మన భారతీయుల్ని - సామాజికంగా - విడదీసి విభజించడమన్నమాట. అదొక అమానుషమైన క్రూరమైన సాంఘిక వ్యవస్థ. ఈ దురాచారం మన దేశంలోనే తప్ప - మన హిందూ సమాజంలో తప్ప - మన హిందూ మతంలో తప్ప మరెక్కడా లేదు. ఏ దేశంలో లేదు. ఏ సమాజంలోలేదు. ఏ మతంలోలేదు.

అసలీ కులాలు ఎప్పుడొచ్చాయో - ఎలా వచ్చాయో - ఎందుకొచ్చాయో ఎవరూ సరిగ్గా చెప్పలేక పోతున్నారు. అలానే యీ కులాలలో 'అస్పృశ్యత' గూడా ఎప్పుడొచ్చిందో - ఎందుకొచ్చిందో ఎలా వచ్చిందో ఎవరూ చెప్పలేకపోతున్నారు. పురాణాలు శాస్త్రాలు చెప్పిందానికి - చరిత్ర

కారులు చెప్పేందానికి పొంతన కుదరడంలేదు. హిందూ శాస్త్రాల ప్రకారం యీ కులాలు - అస్పృశ్యత వేలాది సంవత్సరాలనాడు హిందూ సమాజంలో పాదుకున్నాయి. చరిత్రకారులు చెప్పిన ఆధారాల ప్రకారం రెండు మూడువేల సంవత్సరాలకు పూర్వం యీ దురాచారాలు లేవు. మొదట మూడు వర్ణాలు అంటే మూడు కులాలు ఉన్నట్లు శాస్త్రాల ప్రకారం తెలుస్తుంది! "ఆర్యాః త్రైవర్ణికాః" అని గౌతమ ముని చెప్పాడు. అంటే ఆర్యులు మూడు వర్ణాల-(కులాలు) వారని అర్థం. బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - యీ మూడు వర్ణాలు! ద్వాపర యుగంనాటి శ్రీకృష్ణభగవానుడు "చాతుర్వర్ణ్యం మయా సృష్టమ్ గుణకర్మ విభాగశః" అని భగవద్గీతలో స్పష్టంగా సెలవిచ్చాడు. చేసే వృత్తినిబట్టి - గుణగణాల్ని బట్టి - నాల్గు వర్ణాలు అంటే - బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య - శూద్ర వర్ణాలు తానే సృష్టించినట్లు శ్రీకృష్ణుడు చెప్పాడు. "పంచమ వర్ణం" అప్పటికి లేదు. "నాస్తితు పంచమః" అని మనుస్మృతి చెబుతోంది. మనువు కాలానికి గూడా పంచమ వర్ణంలేదు. మనువు క్రీస్తుకు పూర్వం సుమారు పది హేను వందల సంవత్సరాలకు పూర్వం వాడని శాస్త్రాలవల్ల తెలుస్తుంది! వర్ణ సంకరం వలన శూద్రులు - అస్పృశ్యులు పుట్టారని మనువంటాడు. విరాట్ పురుషుని (సృష్టికర్త - దేవుడు) ముఖం నుండి బ్రాహ్మణులు- బాహువులు (చేతులు) నుండి క్షత్రియులు - ఊరువులు (తొడలు) నుండి వైశ్యులు పాదముల నుండి శూద్రులు పుట్టారని ఋగ్వేదంలోని పురుష సూక్తంలో పేర్కొనబడింది. విచిత్రమైన విషయం ఏమిటంటే - పైన చెప్పిన విధంగా - కులాల పుట్టుకను గురించి చెప్పిన హిందూ శాస్త్రాలే 'జన్మనాంజాయతే శూద్రః' అనిగూడా చెప్పాయి. అంటే జన్మరీత్యా అందరూ శూద్రులే అని అర్థం!

కులవ్యవస్థ గురించి - అస్పృశ్యత గురించి చరిత్రకారుల సిద్ధాంతం మరో విధంగా వుంది. సృష్టి పరిణామ క్రమ సిద్ధాంతం ప్రకారం - జీవశాస్త్రం ప్రకారం - మానవ శాస్త్రం ప్రకారం - వానరం నుండి నరుడు పరిణామం చెందాడు. కోతుల్లాగానే - ఆటవిక ఆదిమ మానవులు

తెగలుగా - గుంపులుగా అడవుల్లో - కొండ గుహల్లో జీవించేవారు. కాలం గడిచే కొద్దీ జనాభా పెరిగే కొద్దీ - తెగలుగా చీలిపోయారు. ప్రపంచంలో వివిధ ప్రాంతాలకు తరలి వెళ్ళారు. బ్రతకటానికి వారు అన్ని విధాల అనువైనచోట్ల ఆవాసాలు యేర్పాటు చేసుకోవడం జరిగింది. అప్పుడువాళ్ళలో యీ కులాలులేవు!

క్రీస్తుకు పూర్వం నాలుగైదు వేల యేండ్ల ప్రాంతంలో భారతదేశంలో ద్రావిడులు బాగా నాగరికత సంతరించుకున్న జాతిగా రూపుదిద్దుకొన్నారు. వీరు ఉత్తర భారత దేశంలో గంగా సింధూనదీ తీరమైదాన ప్రాంతాలలో నివసించేవారు. వీరు గాక నాగులు - గోండులు - సంతానులు అనే మొదలగు ఆటవిక జాతులవారు గూడా ఉండేవారు. సింధూలోయలోని మహోంజదారో - హరప్పా సంస్కృతి ఆనాటి ద్రావిడ నాగరికతను చాటుతుందని చరిత్ర పాఠాలలో మీలో చాలామంది చదివే ఉంటారు.

క్రీస్తుకు పూర్వం సుమారు రెండు మూడు వేల సంవత్సరాల ప్రాంతంలో మధ్య ఆసియా - మధ్య ఐరోపా - కాస్పియన్ సముద్ర తీర ప్రాంతాల నుండి ఆర్యులనే జాతివారు భారతదేశం వచ్చారు. ఆర్యులకు - ద్రావిడులకు ఆటవిక - ఆదిమ జాతులకు చాలా యుద్ధాలు ఘర్షణలు జరిగాయి. ఈ ఘర్షణల్లో ఆర్యులదే పైచేయి అయింది. ఓడిపోయి - లొంగని ద్రావిడ జాతులవారు వింధ్య పర్వతాలు దాటి దక్షిణ భారతదేశానికి తరలి వచ్చారు. ఓడిపోయి లొంగిపోయి - ఆర్యులతో రాజీపడి వారితో సంబంధ బాంధవ్యాలూ పెట్టుకొన్నారు కొందరు ద్రావిడులు. అందుకే దక్షిణ భారతదేశాన్ని "ద్రావిడ దేశంగా పిలుస్తారు. ఉత్తర భారతాన్ని" ఆర్యావర్తమంటారు.

ఈ సామాజిక పరిణామ క్రమంలో కాలక్రమేణ జనాభా పెరిగి వీళ్ళు జీవనోపాధి కొరకు - వివిధ వృత్తులు చేపట్టవలసి వచ్చింది. ఇదే కాలంలో వైదిక మత సంప్రదాయం దేశంలో బాగా వ్యాప్తిచెందింది. సమాజంలో నిర్బంధ వృత్తివిధానం అమలులోనికి వచ్చింది. అంటే ఒక వృత్తిని చేసేవారు అదే వృత్తి తప్ప వేరే వృత్తిని చేయకూడదన్న నియమం కఠినంగా

అమలు చేయడం జరిగింది. ఈ నిర్బంధ వృత్తుల నుండి వర్ణవ్యవస్థ పుట్టుకొచ్చింది. ఆర్య జాతులవారి పెత్తనం పెరగసాగింది. ఆర్యుల శరీర చ్ఛాయ తెలుపు ద్రావిడుల శరీరచ్ఛాయ నలుపు. జాతుల శరీర చ్ఛాయను బట్టి "వర్ణవ్యవస్థ" రూపుదిద్దుకుంది. "ఆర్యాఃత్రైవర్ణికాః" అని గౌత ముడన్నాడని చెప్పుకొన్నాం. మొదట మూడు వర్ణాల వారే అనుకున్నాం. బ్రాహ్మణులది వేదాధ్యయనం శుభకార్యాలు జరిపించడం పూజారి వృత్తి! క్షత్రియులది రాజ్యపాలన! వైశ్యులది - వ్యవసాయం - వర్తకం! ఆర్యులే బ్రాహ్మణ వర్గం వారని చరిత్ర కారుల అభిప్రాయం - కొంత కాలం గడిచిన తర్వాత బ్రాహ్మణ పెత్తనానికి హద్దు లేకుండా పోయింది. వైదిక సంప్రదాయాల్ని - బ్రాహ్మణుల పెత్తనాన్ని కొందరు ఎదిరించారు. వారే శూద్రులుగా - అస్పృశ్యులుగా రూపొందారు.

పైన చెప్పుకొనిన - అగ్రకులాలను ముఖ్యంగా బ్రాహ్మణ వర్గాన్ని మొదట ఎదిరించి - తర్వాత లొంగిపోయి అగ్రవర్ణాల వారికి "దాస్యం" చేసిన వారు "శూద్రు" లైనారు. శూద్రుల చేత 'వెట్టిచాకిరి' చేయిం చుకున్నా - వాళ్ళను తమ యిండ్లలోనికి రానిచ్చేవారుకాదు. ఇండ్లలో భోజనం పెట్టేవారు కాదు. వారికి ఉపనయన సంస్కారాలు లేకుండా చేసారు. వేదాల్ని చదవనీయకుండా చేసారు! ఎదిరించి లొంగని వార్ని అగ్రవర్ణాల వారు సమాజం నుండి వూరి నుండి "వెలివేసారు". వారే అస్పృశ్యులు అంత్యజులు - పంచమవర్ణం వారైనారు. మనం చెప్పుకొన బోయే అంబేద్కర్ గూడా కులవ్యవస్థమీద - అస్పృశ్యతమీద పరిశోధనలు చేసాడు. గ్రంథాలు రాసాడు. అవన్నీ ముందుముందు తెలుసుకుందాం.

నిర్బంధ వృత్తి విధానం చివరకు జన్మరీత్యా కులవ్యవస్థగా రూపొం దింది. వ్యవసాయం చేసేవారిది కాపు కులమైనది. గొర్రెలు ఆలమందలు కాసే వారిది యాదవ కులమైనది. మంగలిపని చేసే వారిది నాయీ బ్రాహ్మణ (మంగలి) కులమైనది. కల్లు గీసే వారిది గౌడ (గౌండ్ల) కులమై నది. గుడ్డలుతికే వారిది చాకలి (రజక) కులమైనది. గుడ్డలు నేసేవారిది సాలె కులమైనది. ఈ విధంగా - కమ్మరి, కుమ్మరి, మేదర -తదితర

వృత్తులు చేసుకుని జీవించేవారు - ఆయా కులాల వారిగా సమాజంలో యెంచబడ్డారు.

వృత్తుల్ని బట్టి పుట్టిన కులాలు - జన్మను బట్టి కులాలుగా మారి పోయాయి. పోనీ కులవృత్తులు అలానే ఉన్నాయా అంటే అవీ లేవు. బ్రాహ్మణులు - కేవలం పూజారి వృత్తిలోనో వేద బోధకులుగానో లేరు. వారు వ్యాపారాలు చేస్తున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. ఇలానే యితర కులాల వారు గూడాను. అయితే నీచవృత్తులుగా యెంచబడే - చాకలి - మంగలి - కమ్మరి - కుమ్మరి - నేత - మొదలగు వృత్తులు వారు మాత్రం మొత్తం మీద తమ తమ కులవృత్తుల్లోనే ఉన్నారు. ఇప్పుడు వారిలో గూడా కొందరు చదువుకొని ఉద్యోగాలు చేస్తున్నారనుకోండి!

వృత్తుల్ని బట్టి కులాలు పుట్టాయి బాగానే వుంది. అవి జన్మను బట్టి కులవృత్తులైనాయి. అదీ బాగానే ఉంది. ఎవడి కులవృత్తి వాడు చేసు కుంటూ యితర వృత్తులవారిని గౌరవిస్తూ యెవడికివాడు సుఖంగా బ్రతికితే ఏ గొడవా ఉండేదికాదు. కొన్ని కులాలు అగ్రకులాలని - మరికొన్ని శూద్ర కులాలని - మరి కొన్ని అంటరాని కులాలని కట్టడి చేయడంవల్లనే గొడవ వచ్చిపడింది. తిరకాసంటే అసలు యిక్కడే ఉంది. అంటే వృత్తి గౌరవం (Dignity of labour) కులగౌరవం (Dignity of caste) సమాజంలో లేకుం డాపోయింది. బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య కులాలు "అగ్రవర్ణా"లైనవి. సమాజంలో గౌవరం - అన్ని హక్కులు - అన్ని సౌఖర్యాలు వాళ్ళవే. పెత్తనమంతా వారిదే. దరిమిలా వచ్చిన శూద్రులు మూడు అగ్రవర్ణాల వారికి "దాస్యం" చేసి జీవించడం ఆ తర్వాత వచ్చిన పంచమకులస్థులు అసలు సంఘానికి "బాహ్యులు" "అంత్యజులు" "వారు తాకరానివారు. చూడరానివారు - వినరానివారు" వారికి సమాజంలో ఏ హక్కు లేదు. ఏ గౌరవంలేదు!

ఈ పంచమ వర్ణంవారి సామాజిక స్థితి చాలా దయనీయంగా ఉండేది. పై నాల్గు కులాలవారు యీ పంచమ వర్ణంవారిని "తాకే వారుకాదు." వీళ్ళు అగ్రవర్ణాల వారుండే ఊరికి వెలుపల దూరంగా

నివసించేవారు. పూరి గుడిసెలలోనో చెట్లకిందనో బ్రతికేవారు. వీళ్ళు పగటి పూట ఊరిలోకి రాకూడదు. సామాన్యంగా రాత్రిపూటనే రావాలి. ఒకవేళ పగటిపూట రావలసివస్తే - ముఖానికి గుడ్డ అడ్డం పెట్టుకుని అగ్రవర్ణాల వారితో మాట్లాడాలి. మెడకు ముంత మొలకు చీపురు గంటకట్టుకుని మరీ ఊళ్ళోకి రావాలి. ఉమ్మివస్తే వీధిలో వేయడానికి వీలులేదు. ముంతలో వేసుకోవాలి. మొలకు చీపురెందుకంటే వీధిలో నడ వవలసి వస్తుంది కనుక కట్టుకున్న చీపురు వాళ్ల పాదముద్రలు చెరిపి వేయాలన్నమాట. అంటే రాచవీధి కూడా వాళ్ళనడకతో మైలపడిపో గూడదన్నమాట ఆ వీధిలోనేగదా అగ్రవర్ణాల వాళ్ళు నడిచేది. నడు ముకు గంట యెందుకంటే - వాళ్ళు నడుస్తుంటే గంట మోగుతుంది. అస్పృశ్యులు ఊళ్ళోకి వస్తున్నట్లు గుర్తు అది. అగ్రవర్ణాలవారు ఆబాల గోపాలం యిళ్ళల్లోకి పోయి తలుపులు వేసుకుంటారన్నమాట. వాళ్ళని అంటుకోరాదు - చూడరాదుగదా. అందుకని వాళ్ళొస్తున్నప్పుడు - పొర పాటుగానైనా యెవరైనా అగ్రవర్ణంవారు వీధిలో వస్తున్నట్లు గ్రహించగానే - అంటరానివాళ్ళు గోడలచాటుకు పరుగెత్తాలి! వాళ్ళు చూడరాని వాళ్ళు కదా! అగ్రవర్ణాల మగవారితో వాళ్ళు మొగానికి గుడ్డ అడ్డం పెట్టుకుని మాట్లాడాలి! చూసారా! ఎంత ఘోరమో! ఎంత దారుణమో! వాళ్ళు ఊరిబావి నీళ్ళు తాగటానికి వీలులేదు. వాళ్ళుండే వాడల్లో - గూడెల్లో వేరే బావుల నీళ్ళు తాగాల్సిందే . లేకపోతే, కాల్వలలోని నీళ్ళో - మురికి కుంటలలోని నీళ్ళో తాగాల్సివచ్చేది. వాళ్ళు ఒంటినిండా గుడ్డకట్టుకోటానికి వీలులేదు. మగవాళ్ళకు గోచిపాత! ఆడవాళ్ళకు దిసిమొలకుగుడ్డ! వాళ్ళు కాళ్ళకు చెప్పులు వేసుకోకూడదు. బంగారు వెండినగలు ధరించటానికివీలు లేదు. రాగి యిత్తడి ఆభరణాలు పెట్టుకోవాలి. ఇంటిలో మట్టి పాత్రలు వాడుకోవాలి. వాళ్ళకు స్వంత ఆస్తి ఉండటానికి హక్కులేదు. వాళ్ళు చదువుకోకూడదు. శూద్రులకు మాదిరిగా వాళ్ళు వేదాలు చదవకూ డదు. విన కూడదు కూడా. సంస్కృతం నేర్చుకోకూడదు. వీళ్ళకు ఊరి గుళ్ళల్లోకిపోయి హిందూ దేవుళ్ళను పూజించటానికి హక్కులేదు. వారి గూడేలలో - వారి పేటలలో - నూకాలమ్మ - పోలేరమ్మ - మైసమ్మ -

బతకమ్మ - అంకాళమ్మ - పైడమ్మ - పోచమ్మ మొదలగు "క్షుద్రదేవత" లను పూజించుకోవలసిందే. వారికి ఊరివారందరితో "పంక్తి భోజనాలు" చేసే అదృష్టం ఉండేదికాదు. అగ్రవర్ణాలవారు తిని ఊరిబయట పారేసిన విస్తళ్ళలోని "యెంగిలి మెతుకులు" తినేవారు. పొలాలలో - అడవులలో దొరికే కాయలు దుంపలు తిని బ్రతికేవారు. శ్మశానాలకు కాపలా ఉండే వారు. అగ్రవర్ణాలవారి పొలాలలో తోటలలో ప్రొద్దస్తమానం పనిచేసేవారు. వాళ్ళ దయాధర్మంమీద ఆధారపడి వారిచ్చిన కూలీనాలితో వెట్టిచాకిరీ చేస్తూ పొట్ట పోసుకునేవారు. విచిత్ర మేమంటే యీ పంచములు "గిరిజనులు" కాదు. "పుర"జనులే! హిందూవులే. అయితే హిందూస మాజంలో "మనిషి" కన్న హీనంగా పశువుల్లాగా - నీచంగా కుష్టురోగుల్లా చూడబడేవారు. ఈ పంచమ కులం ఎలా పుట్టిందో శాస్త్రాలు సరిగ్గా చెప్ప లేదు. వర్ణసంకరం వలన చండాలురు పుట్టారని మనువంటాడు. చండాలురు అంటే అస్పృశ్యులే! దానికి తోడు అగ్రవర్ణాలవారి పెత్తనాన్ని ధిక్కరిం చినవారు .- నాటి మత సంప్రదాయాల్ని యెదిరించినవారు లేక ఆనాటి సాంఘిక కట్టుబాట్లను పాటించనివారు, సంఘం నుండి వెలివేయబడ్డా రని మనం చెప్పుకోవచ్చు. ఇలా వెలివేయబడినవారే చివరకు "అంటరాని" వారై వుంటారని మనం చెప్పుకోవచ్చు. ఈ "వెలి" ఆచారం - యీనా టికీ - కొన్ని ఆటవిక తెగలలో - మారుమూల గ్రామాలలో చూస్తున్నాం గదా!

మనం మరువరాని పచ్చినిజం ఒకటున్నది. మనదేశంలో హిందువులు చెట్టును పూజిస్తారు. పుట్టకు పాలు బోస్తారు. రాయినీ మొక్కుతారు. కోతి (హనుమాన్)ని కొలుస్తారు. పక్షి (గరుత్మంతు)ని పూజిస్తారు. నంది (బసవేశ్వరుడి)కి నైవేద్యం పెడతారు. పంది (వరాహ అవతారం)ని వర్ణిస్తారు. చీమకు పంచదార వేస్తారు. విషమున్న పాముని "ఆదిశేషుడుగా, నాగదేవత"గా పరమ పవిత్రంగా పూజిస్తారు. అందుకే మహాకవి జాషువా "కనపడలేదు దైవతము కాని పదార్థము భారతంబునన్" అని అంటాడు.

అదేమంటే చరాచర జీవకోటిలో పరమాత్మ అంతర్ లీనంగా వెలుగొందుతోందని హిందువులు నమ్ముతారు. అయితే హేతువాదులు నాస్తికులు యిదంతా మూఢనమ్మకమని కొట్టిపారేస్తారనుకోండి! అది అలావుంచి యెవరి నమ్మకం వారిది అనుకుందాం. పోనీ చెట్టును-పుట్టను-రాయిని రప్పను పూజించుకోవడం వాళ్ళ యిష్టం, వాళ్ళ నమ్మకం అని సరిపెట్టుకొందాం. అందుకు యెవరికీ అభ్యంతరం లేదనుకుందాం! ఘోరమైన- క్రూరమైన విషయం ఏమిటంటే-తమ పొలంలో పాలేరుగా పనిచేసే సాటిమనిషిని పంచముడని వెలివేయడం మాత్రం అన్యాయం! అయితే ఆ పంచముడు పండించే ధాన్యంనకు "అంటు" దోషంలేదు! అతడు పితికి యిచ్చిన పాలకు 'అంటు' లేదు. అతన్ని మాత్రం 'అంటు' కుంటే మహాపాపం! కుక్కల్ని - పిల్లుల్ని ముద్దుపేర్లు పెట్టి - గోముగా పెంచుతారు. కండలు కరిగించి-పంటలు పండించి-మనకు తిండి పెట్టే పాలేరుని 'పంచముడ'ని మన పంచకు చేరనీయకపోవడం ఎంత దారుణం! ఎంత్ర క్రూరం! ఎంత అమానుషం!

చాలా విచిత్రమైన విషయమేమంటే ఎవరైనా మతం మారొచ్చు. పార్టీ మారొచ్చు. నేడు భిక్షాధికారి రేపు లక్షాధికారి కావచ్చు. కాని ఒక మాలవాడు బ్రాహ్మణుడు కావాలంటే కుదరదు. ఒక కాపు వాడు కమ్మ కులంలో చేరతానంటే సమాజం ఒప్పుకోదు. అందుకు చట్టం గూడా లేదు. అంత కరుడు గట్టి పోయిందన్నమాట యీ కుల వ్యవస్థ!

ఒక చిన్న ఉదాహరణ చెప్పుకుందాం. ఈ చిత్రపటాన్ని చూడండి.



మన హిందూ సమాజం నాలుగు గదులున్న పెద్ద మేడ భవనం అనుకుందాం. ఈ నాల్గు గదులు ఒకదానితో మరొకటి సంబంధం లేనివి. ఒక గదిలోనుండి యింకో గదిలోనికి దారిలేదు. ఒక్కో గదికి ఒకేదారి! లోనికి పోవటానికి బయటికి రావటానికి! పోనీ ఒక గది బయటిదారినుండి యింకో గది బయటిదారి గుండా ఒక గదినుండి యింకో గదిలోనికి పోవటానికి వీలులేదు. ఈ నాల్గు గదులు నాల్గు కులాలన్నమాట. మేడ బయట రెండు "అవుట్ హౌస్‌లు" ఉన్నాయి. ఒకటి పంచములది. రెండవది గిరిజనులది. వీటిల్లోనివారికి మేడలోనికి ప్రవేశం లేదు. తెలిసిందా! యే కులానికాకులం "గిరి" గీసుకున్న "సంకుచితత్వం!"

అగ్రకులాలైన బ్రాహ్మణ-క్షత్రియ-వైశ్యులలోనే మరలా అంటుదోష మున్నది! మొత్తం మీద వాళ్ళూ వీళ్ళూ కలిసి మెలిసి తిరిగి ఒక కులం వారింట్లో ఇంకో కులం వారు భోజనం చేయరు. మరీ యిది బ్రాహ్మణ కులం వారికి పెద్ద పట్టింపు. ఒకరి కులం పిల్లను మరొక కులం వారికి యివ్వరు. అలానే శూద్రులలోను అస్పృశ్యులలోనూ యిదే అంటుదోషమున్నది! పట్టణప్రాంతాలలో యీ అంటు దోషం అంతగా కనిపించకపోయినా పల్లెప్రాంతాలలో మనకు యిది ప్రస్ఫుటంగా కనిపిస్తుంది.

విచిత్రమైన విషయం ఏమిటంటే ఒకానొకనాడు మూడు అగ్రవర్ణాలవారికి దాస్యం చేసిన శూద్రులు కాలక్రమేణా శక్తియుక్తులతో యీనాడు అగ్ర వర్ణాల వారిగా చెలామణి అవుతున్నారు. శూద్రులు అంటే మన ఆంధ్రలో రెడ్డి-కమ్మ-కాపు వెలమ మొదలగు వారు. దురదృష్టవశాత్తు ఆనాడు శూద్రులైన యాదవ గౌడ తదితరులు అగ్రవర్ణాల వారు కాలేకపోయారు. వారు వెనకబడిన కులాల జాబితాలో చేరిపోయారు. మరీ ఘోరమైన విషయం ఏమిటంటే ఒకానొకనాడు అస్పృశ్య కులాలుగా వున్న చాకలి మంగలి సాలె మొదలగు కులాలవారు తెలివిగా అంటరానికులం నుండి బయట పడి యీనాడు వెనకబడిన కులాల జాబితాలో చేరిపోయారు. పంచమ కులస్థులు తమ కులాలలోనే చాకలి-మంగలి వృత్తుల వారిని యేర్పాటు చేసుకొన వలసిన దుస్థితి దాపురించింది!

మరలా యీ నాలుగైదు కులాలలోనే ఎన్నో శాఖలు బ్రాహ్మణుల్లో వైదికులు నియోగులు వైష్ణవులు మొదలగు శాఖలు. వైశ్యుల్లో క్షత్రియుల్లో గూడా శాఖలు కమ్మకులంలో ఎన్నో శాఖలు రెడ్డి కులంలో ఎన్నో శాఖలు కాపు కులంలో శాఖలు. చివరకు అస్పృశ్యతల్లో గూడా ఎన్నో ఉపశాఖలు. విచిత్రమేమంటే ఒక కులంలోనే వుపశాఖలవారు యిదివరలో ఒకరింట్లో యింకొకరు భోంచేసేవారు కారు. ఒక శాఖ వారు మరొక శాఖవారు వివాహాది సంబంధ బాంధవ్యాలు పెట్టుకొనేవారు కారు. ఈ నాడంతటి పట్టింపు లేదనుకొండి.

గమ్మత్తు చూడండి. మాయింటిపేరు 'జూపూడి' వారు. ఈ "జూపూడి" వారు అటు అగ్రవర్ణాలవారిలో వున్నారు. ఇటు పంచమకులం వారిలోనూ వున్నారు. అలానే "గుర్రం" వారు. "దాసరి" వారు. అంటే అందరూ ఒకే గోత్రికులేగదా! కాని వాస్తవానికి కులాన్ని బట్టి గోత్రం! ఇంకో తమాషా చూడండి. ఇద్దరు "అపరిచయస్తులు" రోడ్డు మీదనో- బస్సులోనో-రైలులోనో కలుసుకుంటే-పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ - "మీరెవరు" అన్న ప్రశ్న ఒకరికొకరు వేసుకోవడం పరిపాటి! అంటే మీ కులమేమిటి? మీ గోత్రమేమిటి అని ప్రశ్నించడం అన్నమాట. ఈ ప్రశ్నవేసి-యెదుటవారి కులం తెలుసుకునే వరకు నిద్ర పట్టదన్నమాట! ఇటువంటి ప్రశ్న మనదేశంలోనే తప్ప మరే దేశంలోను వేసుకోరని మరిచిపోకండి.

ఈ విధంగా ఆనాడు నాల్గు కులాలైతే-యీనాడు దేశంలో నాల్గువేలు కులాలున్నాయి! మన రాష్ట్రంలో అస్పృశ్యులు అంటే షెడ్యూల్డు కులాలు (ఎస్.సీ.లు) ప్రభుత్వ లెక్కల ప్రకారం 59 వున్నవి. మాల మాదిగ దాసరి అరుంధతీయ-ఆది యాంధ్ర-రెల్లి-పాకి-మొదలగునవి. అలానే షెడ్యూల్డు తెగలు (ఎస్.టీలు) 33 ఉన్నవి. ఎరుకల - యానాది చెంచు లంబాడి (సుగాలి)- గొండు-కోయ మొదలగునవి. ఇకపోతే వెనుకబడిన తరగతులు మొత్తం 93 ఉన్నవి. ఈ వెనుకబడిన తరగతులవారిని నాల్గు గ్రూపులు చేసారు. మొదటి గ్రూపులో ("ఎ") 38-రెండవ గ్రూపులో ("బి")

21-మూడవ గ్రూపులో ("సి") -1 నాల్గవ గ్రూపులో ("డి") 33 ఉపకులాలు వున్నాయి.

ఈ అంత్యజుల్లో-అంటే-అస్పృశ్యులు పంచమ వర్ణం వారిలో ఎందరో గొప్ప వారున్నారు. గుణగణాల్లో ధైర్యసాహసాల్లో-భక్తిప్రపత్తుల్లో వీళ్ళు అగ్ర వర్ణాల వారికి ఏ మాత్రం తీసిపోలేదు. ఉదాహరణకు రామాయణం రాసిన వాల్మీకి మహర్షి బోయవాడు. మహాభారతం రాసిన వ్యాసభగవానుడు పరాశరుని కుమారుడు. వశిష్టుని భార్య అరుంధతీదేవి పంచమ కులస్థురాలు. పరాశరముని మతంగముని గొప్ప ఋషులు. వీరంతా పంచమ కులస్థులైనా వారూ, వారు రాసిన కావ్యాలు యీనాటికీ దేశంలో ఎంతో గౌరవంతో పూజింపబడుతున్నారు. అంటే వాళ్ళు అవర్ణులైనా (అంత్యజులైనా) బహుశా ఆనాడు అస్పృశ్యత లేదేమో. భక్తనందనార్ ముమ్మడివరం బాలయోగి పలనాటి సైన్య అధ్యక్షుడు మాలకన్నమదాసు-మహాకవి జాషువా పద్మశ్రీ బోయిభీమన్న దేశనాయకులు అంబేద్కర్ జగజ్జీవనరామ్ దామోదరం సంజీవయ్య మొదలగువారు పంచమ కులస్థులేగదా! కులంలో తక్కువేమోగాని గుణంలో తక్కువ కాదు అనే లోకోక్తి వీరందరి వలన ఋజువగుతోంది! తెనుగులెంక "మొదలు లేదంట తరువాత మొలిచెనంట కులము-కులమేటికి చెప్ప గుణము చాలు" అంటాడు. "కులము హెచ్చు తగ్గుగొడవలు పనిలేదు సానుజాతమయ్యె సకల కులము" అంటాడు వేమన. అంతా ఒకే విధంగా పుట్టాడంటాడు. "మంచి చెడ్డలు మనుజులందున యెంచి చూడగరెండె కులములు" అంటాడు గురజాడ.

ఆనాటి కుటిల కులవ్యవస్థను తలచుకొంటే - ఆనాటి అస్పృశ్యుల దయనీయ స్థితి తలంచుకొంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. గుండె జలదరిస్తుంది. కన్నులు చెమ్మగిల్లతాయి. ఇది నిజమేనా అనిపిస్తుంది. అందుకే జాషువాకవి "నాదు కన్నీటి కథ సమన్వయము సేయ ఆర్ద్ర హృదయమ్ముగూడ కొంతవసరమ్ము" అంటాడు. అంటే సాటి మనిషి "దయనీయ స్థితి"కి సానుభూతి చూపే "మానవతా" దృక్పథం వుండాలని అంటాడు.

అయితే ఆనాటి కులవ్యవస్థ అస్పృశ్యుల దయనీయ స్థితి అలాగే

కొనసాగలేదు. కాలం గడుస్తున్న కొద్దీ వందలు వేలు సంవత్సరాలు గడిచిన తర్వాత మానవతా వాదులైన మహాపురుషులు పుట్టారు. సహృదయులైన సంస్కర్తలు జన్మించారు. మనిషి సాటి మనిషిని యింత ఘోరంగా పశువుకన్న హీనంగా చూడడం ధర్మం కాదని గ్రహించారు. పురాణాలు, శాస్త్రాలు, స్మృతులు శ్రుతులు పరిశీలించారు. ఈ కులాలు యీ అస్పృశ్యత దేవుడు సృష్టించలేదని తెలుసుకున్నారు. బుద్ధి బలం గల్గిన కొందరు స్వార్థపరులు చేసిన "కుట్ర" గా గ్రహించారు. హిందూ మతాన్ని సంస్కరించటానికి వుద్యమాలు లేవదీసారు.

హిందూ మతంమీద ముందు దాడిచేసిన వారు లోకాయతనులు చార్వాకులు. అన్ని అసమానతలకు మూలం మతం కనుక మత విశ్వాసాలు మతాచారాలు మూఢనమ్మకాలు ప్రజల్లో పోగొట్టటానికి కృషిచేశారు. హేతువాద దృష్టి మానవతావాదం ప్రచారం చేసారు. వారు దేవుడే లేడు పొమ్మన్నారు. వారిది నాస్తిక వాదం!

క్రీస్తుపూర్వం నాలుగైదు వందల సంవత్సరాల కాలంలో జైన బౌద్ధ మతాలు హిందూ మతాన్ని హిందూ శాస్త్రాల్ని బాగా వ్యతిరేకించాయి. బౌద్ధ మతం కర్మ సిద్ధాంతాన్ని కర్మకాండను విగ్రహారాధనను వ్యతిరేకించింది. భూతదయ హేతువాదం సత్ప్రవర్తన (సచ్ఛీలత) ప్రజలలో పెంపొందించింది. కుల వ్యవస్థను నిరసించింది. మనుష్యులంతా సమానమని చెప్పాడు బుద్ధుడు. అస్పృశ్యులు శూద్రులు అధిక భాగం బౌద్ధమతం స్వీకరించారు. అయితే ఆదిశంకరాచార్యులవారు వచ్చి వైదికమతాన్ని పునరుద్ధరించాడు. బౌద్ధం అడుగంటింది. తర్వాత దేశంలో వ్యాప్తి చెందిన వైష్ణవ-శైవమత సంప్రదాయాలు కుల వ్యవస్థను నిర్మూలించటానికి గట్టి కృషి చేసాయి. ఒక దానికొకటి పోటీపడ్డాయి. రామానుజాచార్యులు అంత్యజుల్ని తన మతం లోనికి తీసుకున్నాడు. వైష్ణవ మతాచార్యులైన పన్నెండు మంది ఆళ్వారులలో పంచమ కులస్థుడైన తిరుప్పాణియాళ్వారు ప్రముఖుడు. షుమారు అదే కాలంలో వీరశైవాన్ని వ్యాప్తి చేసిన వీర బసప్ప శైవాన్ని స్వీకరించిన అస్పృశ్యులకు సమాన గౌరవం కల్పించాడు.

ఆనాడు ఎందరో శూద్రులు అస్పృశ్యులు వీరశైవం స్వీకరించారు.

తెలుగు దేశంలో షుమారు ఎనిమిది వందల సంవత్సరాల క్రితం పల్నాటి మహామంత్రి (గుంటూరుజిల్లా) బ్రహ్మనాయుడు అందరికీ చాప కూడు పెట్టించాడు (అంటే అన్ని కులాల వారిని ఒకే పంక్తిని భోజనం పెట్టించాడు) మాలకన్నమదాసును సైన్యాధ్యక్షుడిగా చేసాడు. షుమారు ఐదారువందల సంవత్సరాల క్రితం కడపజిల్లాలో పోతులూరి వీరబ్రహ్మేంద్ర స్వామివారు కులవ్యవస్థను తీవ్రంగా ఖండించాడు. తన తత్వాలలో కులాన్ని ఖండించాడు. దూదేకుల సాహెబు సిద్దయ్యను మాదిగ కక్కయ్యను తన శిష్యులుగా స్వీకరించాడు. షుమారు నాలుగు వందల సంవత్సరాల క్రితం యోగి వేమన (గుంటూరుమండలం కొండవీడు- అని కొందరు మరి కొందరు కడప మండలం వాడంటారు) కుల మతతత్వాల్ని అంటరానితనాన్ని-తన సహజవేదాంత ధోరణిలో తన పద్యాలలో తీవ్రంగా ఖండించాడు.

గత శతాబ్దంలో (పందొమ్మిదవ శతాబ్దం) దయానంద సరస్వతి-స్వామి శ్రద్ధానంద ఆర్యసమాజం స్థాపించి వేదాల్ని చదువుకొనే హక్కు శూద్రులకు అస్పృశ్యులకు గూడా కల్పించారు. కులాలపై ధ్వజమెత్తారు. అస్పృశ్యతను నిరశించారు. బెంగాల్ లో రాజారామ్ మోహన్ రాయ్ బాహ్మ సమాజాన్ని స్థాపించి సతిసహగమనాన్ని వ్యతిరేకించాడు. కులవ్యవస్థ పై దాడి చేసాడు. అలానే సాధు పుంగవులు భక్తకబీర్ భక్తరామదాస్ చండీదాస్ భక్త తుకారామ్ రామానంద్ గురునాయక్ స్వామీ వివేకానంద మొదలగు వారు మానవులందరు దేవుని బిడ్డలనీ కులభేదాలు మనిషి సృష్టించినవని కుల వ్యవస్థను తీవ్రంగా నిరశించారు. మహారాష్ట్రంలో మహాత్మా జోతిబాపూలే కుల నిర్మూలనకు అస్పృశ్యత నిర్మూలనకు గట్టి కృషిచేసాడు.

మన తెలుగుదేశంలో యీ యిరవయ్యో శతాబ్దం ప్రారంభంలో గురజాడ అప్పారావు వీరేశలింగం పంతులు పిఠాపురం రాజా మొదలగు వారు కులవ్యవస్థను నిరసించారు. అస్పృశ్యతను నిర్మూలించటానికి కృషిచేసారు. కవిరాజు త్రిపురనేని రామస్వామి చౌదరి-దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు - గోరా (గోపరాజు రామచంద్రరావు) కుల వ్యవస్థపై ధ్వజ

మెత్తారు. మహారాష్ట్రలో బరోడా మహారాజా గైక్వాడ్ - తమిళదేశంలో పెరియార్ రామస్వామినాయకర్ కులవ్యవస్థను వ్యతిరేకించారు. నైజాం రాష్ట్రంలో భాగ్యరెడ్డివర్మ- నెల్లూరు ప్రాంతంలో ఏనుగు పట్టన్న (పట్టాభిరామిరెడ్డి) తిక్కవరపు రామిరెడ్డి - గోదావరి సీమలో రఘుపతి వేంకటరత్నం నాయుడు కృష్ణా మండలంలో రాంజీరావు పంతులు గుంటూరు మండలంలో త్రిపురనేని సాధువమ్మ కె.కె. తాయారమ్మ-నేతిచలపతిరావు స్వామిసీతారాం వంటి అగ్ర కులస్థులు "హరిజనుల" విద్యాభివృద్ధికి గట్టి కృషి చేసారు.

మహాకవి జాషువా (గబ్బిలం) పద్మశ్రీ బోయి భీమన్న (పాలేరు) కళాప్రపూర్ణ జ్ఞానానందకవి గొప్ప కవులు పంచమ కులంలో పుట్టి కుల వ్యవస్థను నిరసిస్తూ అస్పృశ్యుల్ని జాగృతం చేస్తూ రచనలు చేసారు. దళిత విప్లవకవులైన గద్దర్ శివసాగర్ కులవ్యవస్థపై ధ్వజమెత్తి జనసామాన్యాన్ని చైతన్యవంతులుగా చేస్తున్నారు. మంగిపూడి వేంకటశర్మ నిరుద్ధ భారతంలో పంచమ వర్ణంవారి పుట్టు పూర్వోత్తరాల్ని వివరించాడు. బంకుపల్లి మల్లయ్యశాస్త్రి హిందూశాస్త్రాలలో "అస్పృశ్యత" యెక్కడా చెప్పలేదని సవివరంగా శాస్త్రీయ దృష్టితో నిరూపించాడు. వీరు పంచముల్ని చైతన్య వంతుల్ని చేసారు. అగ్రవర్ణాల వారికి కనువిప్పు కావటానికి కృషి చేసారు. ఉన్నవ లక్ష్మీ నారాయణ మాలపల్లి నవల ద్వారా ఆచార్య రంగా (హరిజన నాయకుడు) నవల ద్వారా కులవ్యవస్థను నిరసిస్తూ హరిజనులలో చైతన్యం గలిగించారు. ప్రొఫెసర్ కొలకలూరి ఇనాక్-బొజ్జా తారకం-కత్తి పద్మారావులు తమ రచనల ద్వారా దళితులను జాగృతం చేస్తున్నారు!

కుల వ్యవస్థను నిరసించి అస్పృశ్యత నిర్మూలించటానికి మొదట కృషిచేసిన వారు అగ్రవర్ణాలవారే. మానవతా దృక్పథం కలిగిన సంస్కర్తలైన అగ్రవర్ణాల వారిని స్వకులస్థులే ఎన్నో యిబ్బందులు పెట్టారు. అడ్డంకులు కలిగించారు. కొందరినైతే స్వకులం నుండి వెలి వేసారు. తమ కులాలలో జరిగిన శుభ కార్యాలకు విందు భోజనాలకు యీ సంస్కర్తలను నిషేధించారు. మరికొందరైతే యీ సంస్కర్తల బిడ్డల్ని వివాహాది సంబంధ

బాంధవ్యాలు పెట్టుకోవటానికి నిరాకరించిన సందర్భాలెన్నో వున్నాయి. ఆర్య సమాజంలో గురు పరంపరలో ఒకరైన ధర్మవీర రామచంద్రను అస్పృశ్యతను నిర్మూలించటానికి కృషిచేసి నందుకుగాను హత్య గావించారు. ఇన్ని అడ్డంకులు ఎదురైనా ఉదార స్వభావులైన అగ్రవర్ణాలవారు తమ సంస్కరణ కార్యక్రమాల్ని మాత్రం విడిచి పెట్టలేదు. అట్టి అజ్ఞాత సంస్కరణ వాదులైన అసంఖ్యాక అగ్ర వర్ణాలవారికి నిమ్నజాతుల వారు ఋణపడి వున్నారని చెపితే తప్పు లేదు గదా!

నిన్నటి మొన్నటి వరకు (1947 జూలై) వరకు మనదేశాన్ని బ్రిటీషు వారు పరిపాలించారు. అస్పృశ్యుల్ని క్రైస్తవ మతంలోనికి తీసుకొన్నారు. వారికి బడుగు వర్గాలవారికి విద్యా ఉద్యోగ అవకాశాలు కల్పించారు. వారు విద్యా బుద్ధులు నేర్చుకొని సభ్య సమాజంలో తెల్లబట్ట కట్టి తలెత్తుకొని గౌరవ ప్రదంగా జీవించే విధంగా బ్రిటీషు పాలకులు కొంతలో కొంత తోడ్పడ్డారని చెప్పవచ్చు.

ఈ దేశంలో కమ్యూనిష్టు ఉద్యమం వచ్చి గూడా దళిత జాతుల్లో చైతన్యం తెచ్చింది. ఆ పార్టీ కులం పట్టింపు పట్టించుకోలేదు. దళితులు కమ్యూనిష్టు పార్టీలో చేరి పార్టీ కార్యకర్తలుగా అన్ని కులాల వారితో కలిసి మెలిసి తిరిగి పనిచేసారు.

గాంధీజీ చేపట్టిన హరిజన సేవా కార్యక్రమాలు సనాతన హిందువులలో కొంత హృదయ పరివర్తన తెచ్చింది. సహృదయంతో హరిజనుల్ని తమ వూళ్ళ లోనికి రానిచ్చారు. గుళ్ళలోనికి రానిచ్చారు. స్కూళ్ళలోనికి రానిచ్చారు. నీళ్ళ బావుల దగ్గరకు గూడా రానిస్తున్నారు.

మనమిప్పుడు చెప్పుకొనబోయే అంబేద్కర్ గూడా నిమ్నజాతుల ఉద్ధరణకు తన జీవితాంతం పోరాడాడు. చివరకు రాజ్యాంగ రచనా సంఘ అధ్యక్షుడై రాజ్యాంగంలో నిమ్నజాతుల వారికి రాజకీయ పరమైన హక్కులు విద్యా ఉద్యోగ అవకాశాల రక్షణలు కల్పించడంలో కృతకృత్యుడయ్యాడు. కనుక దళిత జాతుల వారీనాడు విద్యా వంతులౌతున్నారు. ఐ.ఏ.ఎస్., ఐ. పి.యస్. వంటి ఉన్నత ఉద్యోగాలు చేపడుతున్నారు. శాసనసభ్యులుగా

పార్లమెంటు సభ్యులుగా మంత్రులుగా ముఖ్యమంత్రులుగా రాణిస్తున్నారు. ఎందరో డాక్టర్లుగా ఇంజనీర్లుగా, న్యాయమూర్తులుగా, ప్రొఫెసర్లుగా ఉద్యోగాలు చేస్తున్నారు. ఇంకో ప్రక్క కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు యీ దళితుల శ్రేయస్సుకు బడుగు వర్గాల అభ్యున్నతి పధకాలు వేస్తూ అమలు పరుస్తున్నాయి. వాళ్ళ కాళ్లమీద వాళ్ళ నిలబడే విధమైన స్వయం ఉపాధి కల్పనా పధకాలు చేపడుతున్నారు. ప్రభుత్వం వారు బాంకుల వారు ఋణసౌకర్యం కల్పిస్తున్నారు. గృహాలు నిర్మిస్తున్నారు. ఇన్ని విధాలుగా ఇందరు చేసిన కృషి ఫలితంగా అస్పృశ్యుల్ని సభ్యసమాజ స్రవంతిలోనికి తీసుకొని రావటానికి ప్రభుత్వం కృషి చేస్తుంది. అయితే వారికి నిర్మించే గృహాలు (పక్కా గృహాలు) వూరికి దూరంగానే నిర్మిస్తున్నారు! అదే బాధాకరమైన విషయం!

మారుతున్న కాలంతో బాటు దళిత జాతుల వారి జీవన పరిస్థితులు నిజంగా నిశ్చయంగా మెరుగు పడుతున్నాయనే చెప్పవచ్చు. "ఆనాటి తాకరాని వినరాని చూడరాని" దుస్థితి యీనాడు వారికి లేదు. అగ్రవర్ణాల వారు బళ్ళలోనికి గుళ్ళలోనికి అందరుతోపాటు దళితులను రానిస్తున్నారు, ఊళ్ళలోనికి రానిస్తున్నారు. హరిజనులు పుర జనులైనారని చెప్పవచ్చు. పట్టణ ప్రాంతాలలో యీ అస్పృశ్యత గురించి పెద్దగా పట్టించుకోనేవారు లేరని చెప్పవచ్చు. అయితే గ్రామప్రాంతాలలో యీ కుల తత్వం అస్పృశ్యత భావం యింకా పూర్తిగా పోలేదు. మరీ మారుమూల గ్రామాలలో యీ కులభేదం అంటరానితనం యింకా తాండవిస్తోందని చెప్పవచ్చు. అంటే ఒకానొకనాడు పంచములకు సవర్ణ హిందువులలో వున్న "చూడరాని" "వినరాని" "మాట్లాడరాని" దుస్థితి పోయిందని చెప్పవచ్చు. కాని "అంటరాని"తనం మాత్రం గ్రామసీమల్లో బాగా వుందని చెప్పాలి. అగ్రవర్ణాల వారు దళిత జాతుల వారిమీద దౌర్జన్యం సాగిస్తూనే వున్నారు. ఉదాహరణకు మనరాష్ట్రంలో కారంచేడు-చుండూరు బీహార్‌లో బెల్చి మొదలగునవి మచ్చుకు ఒకటిరెండు సంఘటనలు మాత్రమే. మనం రోజూ పేపర్లో చూస్తున్నాం. దేశంలో ఎక్కడో ఒకచోట "దళితుల" పై

దాడులు జరుగుతున్నాయి. పంచమ జాతులవారు పూర్వంలాగా తమకు అణిగిమణిగి వుండడం లేదన్నది అగ్రవర్ణాలవారి కోపం! విద్యాధికులైన చైతన్యవంతులౌతున్న దళితజాతుల వారు తమకు జరుగుతున్న 'అన్యాయాలకు' అగ్రవర్ణాలవారి మీద ద్వేషం. ఉభయత్రా ఇది మంచిదికాదు. ఒకేవూళ్ళో వుంటున్నవాళ్ళు రోజూ కలిసి మెలసి సోదరభావంతో యిరువర్గాలు సామరస్య పూర్వంగా అన్యోన్య ప్రేమాభిమానాలతో జీవించవలసిన అవసరం ఎంతేనివుంది. అందరూ బారతీయ సోదరులే గదా!

జాషువాకవి ఒక మాటన్నాడు. "వాని తలమీద పులిమిన పంకిలమును కడిగి కరుణింపలేదయ్యె గగనగంగ" అని అన్నాడు. చనిపోయిన సగర వంశరాజులకు పుణ్యగతులు కల్పించటానికి ఘోరతపస్సు చేసి భగీరధుడు ఆకాశ గంగను భూమ్మీదకు రప్పించాడుగదా! అట్టి పవిత్రమైన గంగ గూడా అస్పృశ్యతా పంకిలాన్ని (బురద) కడగలేక పోయిందని మహాకవి వ్యంగ్య వ్యాఖ్య మనోవ్యధ!

పాఠకులారా! చూసారుగా యీ కులాల గొడవ! అంతా గజిబిజిగా వుంది కదూ! పిల్లలు పాపం పుణ్యం తెలియని వారు. లోక జ్ఞానం లేనివాళ్ళు. ఏమిటీ కులాలు అనుకుంటారు. అందరు మనుష్యులు ఒకటిగానే కనిపిస్తున్నారు గదా అని అనుకొంటారు. నిజమే! మన మిప్పుడు తెలుసుకున్నాం గదా! కులాల్ని కొందరు కల్పించారని! తల్లి తండ్రులు పెద్ద వాళ్ళు యీ పిల్లలకు కుల భావన వాళ్ళ బుర్రలోనికి బాగా నాటుకొనేటట్లు యెక్కిస్తారు. మనం గొప్ప కులం వాళ్ళమని తక్కువ కులం కుర్రాళ్ళతో స్నేహం చేయొద్దనీ పెద్దోళ్ళు నూరిపోస్తారు. పెద్దలకు యీ కులం సంగతి చెప్పనవసరంలేదు.

పెద్ద కులాలలో పుట్టినవారు అది గౌరవమనుకొంటారు. తమ కులం గురించి గొప్పగా చెప్పుకుంటారు. "ఏమిటీ కులాలు" అని పైకి అన్నా యీ కులాలు పోవటానికి చిత్తశుద్ధితో కృషిచేయరు ఏ కొద్దిమందో తప్ప! తక్కువ కులంలో పుట్టినవారు చాలామంది తమ ఖర్మ అనుకుంటారు. తమ కులం గురించి చెప్పుకోరు. వారిలో "న్యూనత"

భావం వుంటుంది! లోలోన బాధపడతారు. అయితే యిప్పుడిప్పుడే ఆ కులాల్లో పుట్టిన యువకులు ధైర్యంగా యెదుర్కొంటున్నారు.

ఇక యీ కులాల గొడవ సంగతి అటు పెడదాం. మన కథా నాయకుడు అంబేద్కర్ అంటరాని కులంలో పుట్టి బాధలు పడ్డాడు- అవమానాలు పొందాడు. నిమ్న జాతుల ఉద్ధరణకు ఎన్నో ఉద్యమాలు నడిపాడు. జీవితంతో పోరాటం సాగించాడు. ఆయన జీవిత చరిత్ర అంటే అది నిమ్నజాతుల పోరాట చరిత్ర అన్నమాట! ఇప్పుడు ఆ విషయాలు తెలుసుకుందాం!

చివరకు ఒక విషయం. మనం యిప్పుడు కులాల గురించి అంటరానితనం గురించి సంబంధించిన మూడు నాల్గు పదాల గురించి వివరం తెలుసుకోవడం అవసరం. అస్పృశ్యులు అంటే అంటరాని వారు. స్పృశించుట అంటే అంటుకొనుట ముట్టుకొనుట. స్పృశ్యతకు వ్యతిరేకం అస్పృశ్యత. నిమ్నజాతీయులు అంటే అట్టడుగు ఉన్నవారు. నిమ్నము అంటే లోతు అడుగున అనిఅర్థం. అంటే సమాజంలో అట్టడుగు వర్గం వారు కనుక నిమ్న జాతీయులు అన్నారు. తర్వాత దళితులు దళితము అంటే ఖండింపబడినది విడిపోయినది అని అర్థం. సమాజం నుండి వెలివేయబడి విడదీయబడిన వారు కనుక దళితులు అని అర్థం. పంచమ వర్ణంఅంటే ఐదవ వర్ణం! నాల్గు వర్ణాల్ని శాస్త్రాలు సమ్మతించాయి. ఐదవ వర్ణంవారే అస్పృశ్యులు సవర్ణులు అంటే కులీనులు అంటే కులం ఉన్నవారు. అగ్రకులాలు నాల్గు అవర్ణులు అంటే వర్ణం (కులం) లేని వారు అంటరాని వారు అంత్యజులు అంటే చివర పుట్టినవారు అంటే ఐదవ కులంవారు. "షెడ్యూల్డు కులాలు" (ఎస్.సీ.లు) అని యిప్పుడు అందరూ వాడుతున్న పదం అస్పృశ్య కులాలుగా గుర్తింపబడిన వాటి జాబితాను రాజ్యాంగంలో (చివర) "షెడ్యూలు" లో చేర్చారు. అంటే ఒక పట్టికలో చేర్చారన్నమాట. కనుక అలా పిలుస్తున్నారు. హిందీలో అందుకే "అనుసూచిత్ జాతుల" వారు అని అంటారు.

పాఠకులారా! ఇప్పుడు మనం అంబేద్కర్ జీవితగాథ చెప్పుకుందాం.

# స్వస్థలం-వంశం-జననం

మన భారతదేశం పడమటి తీరాన్ని "కొంకణతీరం" అంటారు. ఆ కొంకణ తీరంలో మహారాష్ట్ర అనే రాష్ట్రం వుంది. మన రాష్ట్రానికి అది నైరుతి దిశలో వున్న సరిహద్దు రాష్ట్రం. మహారాష్ట్ర పౌరుషానికి ధైర్య సాహసాలకు పెట్టింది పేరు. ఛత్రపతి శివాజీ మహారాష్ట్రీయుడేగదా! గాంధీజీకి రాజకీయ గురువైన గోపాలకృష్ణ గోఖలే మహారాష్ట్రవాడు. వీర సావర్కార్ మహారాష్ట్రవాడు. స్వాతంత్ర్యం నా జన్మహక్కు అని ఎలుగెత్తి చాటిన బాలగంగాధర తిలక్ యీ కొంకణ ప్రాంతంవాడు.

ఈ కొంకణ తీరంలో రత్నగిరి జిల్లా వుంది. ఆ జిల్లాలో "అంబ వాడ" (అంబవదే) అనే పల్లెటూరు ఉంది. ఈ పల్లెటూరే అంబేద్కార్ తాతతండ్రుల స్వగ్రామం. అంబేద్కార్ తండ్రి రాంజీ మాలోజీ సక్పాల్. తల్లిపేరు భీమాబాయి. సక్పాల్ మిలిటరీలో సుబేదారుగా పనిచేసాడు. అందరూ ఆయనను "మేజర్ సుబేదార్" అని పిలిచేవారు. అంబేద్కార్ తాత (తండ్రి తండ్రి) మాలోజీ సక్పాల్ కూడా మిలిటరీలో సుబేదారుగా పనిచేసాడు.

అంబేద్కార్ పూర్వీకులు అంబవాడలో ప్రముఖులు. వారి మాటకు ఆ వూళ్ళో తిరుగులేదు. ఆ వూళ్ళో గౌరవప్రతిష్టలు ఉన్నవారు ఈ సక్పాల్ గోత్రికులు. వాళ్ళు ఆ గ్రామంలో "తలలో నాలుక" వంటి వారు. ఆ వూరి "గ్రామదేవత" తాలుకు పల్లకి తదితర దేవతా వస్తువులు వాళ్ళ ఇంటిలోనే భద్రపరిచేవారు. అంబేద్కార్ తాత తండ్రి మిలిటరీలో ఉద్యోగాలు చేసారు కనుక ఆ కుటుంబానికి కాస్త చదువు సంస్కారం ఉందని చెప్పవచ్చు. వారిది "మహర్" కులం. మహారాష్ట్రలో మహర్ కులస్థులు అంటరాని కులస్థులు. మన ఆంధ్రరాష్ట్రంలో మాల మాది గలు అంటరాని కులస్థులు. మహర్‌లు మన మాల మాదిగల మాదిరిగా అంటరాని కులస్థులన్నమాట.

తెలుగులో ఒక సామెత ఉంది. కూటికి పేదవాడైనా గుణానికి

పేదవాడు కాదంటారు. అలానే మహర్ కులస్థుల విషయంలో వాళ్ళు కులానికి 'అంటరాని వాళ్ళు' కావచ్చు. కాని మహర్‌లు ధృడకాయులు. ధైర్యసాహసాలు కలవారు. పౌరుషప్రతాపాలకు పెట్టింది పేరు. ఉదారస్వ భావులు. మగసిరి గలవారు. ఆత్మాభిమానం కలవారు. తెలివితేటలు కలవారు.

రాంజీ సక్పాల్ బలశాలి. మాటకారి. ధైర్యసాహసాలు కలవాడు. కష్టజీవి. సాధుస్వభావి. దైవభక్తి కలవాడు. కబీర్ భక్తి సాంప్రదాయం! పరులకు సహాయం చేసేబుద్ధికలవాడు. స్వాభిమాని. క్రమశిక్షణ కలవాడు. మత్తుపానీయాలు సేవించనివాడు. పూర్తిగా శాఖాహారి. మంచి క్రీడాకారుడు. క్రికెట్ ఫుట్‌బాల్ క్రీడలంటే ఆయనకిష్టం. ముఖంలో చిరునవ్వులు ఒలికేవి! ఆయన సంఘసేవకుడు.

భీమాబాయి రూపవతి. గుణవతి. విశాలఫాలభాగం! గుండ్రని పెద్ద కళ్ళు! నిగనిగలాడే నల్లని శిరోజాలు. సాత్వికురాలు. భక్తిప్రపత్తులు కలది. ఆమె తండ్రి పినతండ్రులు కూడా మిలటరీలో సుబేదారులుగా పనిచేసారు. తానా జిల్లాలో ముర్దాబాద్ గ్రామం వారిది. వాళ్ళు ముర్దాబ్‌కర్ వంశీకులు అంటరాని కులం వాళ్ళలో వాళ్ళు కాస్త సంపన్నులనే చెప్పవచ్చును. వీళ్లుకూడా కబీర్ భక్తి సాంప్రదాయం ఉన్నవారు.

రాంజీ సక్పాల్ మిలటరీలో సుబేదార్‌గా ఉండగానే అంబేద్కర్ పుట్టాడు. అంబేద్కర్ పుట్టేనాటికి సక్పాల్ మధ్యపరగణాల రాష్ట్రంలో (Central Provinces) "మౌ" (మవ్) అనే చిన్నపట్టణంలో ఉద్యోగం చేస్తూ ఉండేవాడు. రాంజీ సక్పాల్ మిలటరీ స్కూల్లో హెడ్మాస్టరుగా పనిచేసాడు. గణితం అంటే ఆయనకు మహాఇష్టం. మరాఠీ భాషపై ఎక్కడలేని మమకారం. తండ్రి పేరు తల్లిపేరు కలిసివచ్చేటట్లు అంబేద్కర్‌కు భీమ్‌రాం రాంజీ అంబేద్కర్ అని పేరు పెట్టారు. క్లుప్తంగా బి.ఆర్. అంబేద్కర్ అంటారు.

భీమాబాయి రాంజీలకు మొత్తము 14మంది సంతానం. కుచేలుడి సంతానమన్నమాట. అయితే అందులో బ్రతికి బట్ట కట్టినవారు ఐదు

గురు మాత్రమే. ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలు. బలరాం, ఆనందరావు, మంజుల, తులసి, అంబేద్కర్. అంబేద్కర్ ముఖం గుండ్రం విశాలమైన నొసలు. తల్లిపోలిక. అంబేద్కర్ ఆఖరి బిడ్డ. అంటే 14వ సంతానం. అంబేద్కర్ పుట్టినది 1891 ఏప్రిల్ 14వ తారీఖు. ఆయన 14వ సంతానం! 14వ తారీఖున పుట్టాడు. గమ్మత్తుగా వుంది కదూ! ఇతర దేశ నాయకులు పుట్టిన తారీఖులు మాదిరిగా అంబేద్కర్ పుట్టినరోజు దేశచరిత్రలో సుస్థిరస్థానం సంపాదించుకొన్నది. గాంధీజీ పుట్టిన తారీఖు మీకు గుర్తుందా! ఆయన 1862 అక్టోబర్ 2వ తారీఖున పుట్టాడు. మరి చాచానెహ్రూ జన్మించిన తారీఖు 1869 సంవత్సరము నవంబరు 14వ తారీఖు.

అంబేద్కర్ అమ్మ కడుపులో వుండగా ఒక విచిత్రమైన సంఘటన జరిగిందట. రామ్‌జీ సక్పాల్ బంధువొకాయన వరుసకు పినతండ్రి సన్యాసుల్లో కలిసిపోయాడట. ఆ సన్యాసి సక్పాల్‌కు కనిపించి వాళ్ళకు పుట్టబోయే మగబిడ్డ గొప్పవాడౌతాడని చెప్పాడట. సన్యాసి మాట నిజమైనదిగదా! గౌతమబుద్ధుని విషయంలో గూడా యిటువంటి సంఘటనే జరిగింది కదా! సిద్ధార్థుడు అమ్మకడుపులో వుండగా ఆమెకు ఓ వింత కల వచ్చింది. ఆ కల గురించి సిద్ధార్థుని తండ్రి జ్యోతిష్కుల్ని వివరణమడిగాడు. కొడుకు పుడతాడని పెద్దవాడైన తర్వాత మహారాజైనా అవుతాడు లేక గొప్ప సన్యాసి అయినా అవుతాడని చెప్పారు. అలానే సిద్ధార్థుడు గౌతమబుద్ధుడై గొప్ప సన్యాసి అయ్యాడు కదా! ఇలా ఎన్నో సంఘటనలు!

## బాల్యం-విద్యాభ్యాసం

రాంజీ సక్పాల్ ఉద్యోగవిరమణ చేసేనాటికి అంబేద్కర్‌కు రెండేళ్ళు మాత్రమే. "నకా"లో వారికి ఆస్తులు లేవు. అయినవారూ లేరు. భార్యాబిడ్డలతో సక్పాల్ స్వరాష్ట్రమైన మహారాష్ట్రకు వచ్చేసాడు. స్వగ్రామమైన అంబవాడలో గూడా ఆయనకు చర స్థిర ఆస్తులు ఏమీ లేవు. కొంకణ తీరంలోని "దపోలీ" (దాపోలీ) అనే చిన్న పట్టణంలో మొదట

మకాం పెట్టాడు. బాల అంబేద్కర్‌కు యిక్కడే మొదట అక్షరాభ్యాసం జరిగింది. సక్పాల్‌కు వచ్చే ఫించను చాలా తక్కువ. కుటుంబ పోషణకు సరిపోయేదికాదు. దపోలీలో ఏదైనా చిన్న ఉద్యోగం దొరుకుతుందేమోనని ప్రయత్నించాడు. కాని లాభంలేకపోయింది. కనుక ఏదైనా చిన్న వుద్యోగం కోసం వెతుక్కుంటూ సక్పాల్ భార్యాబిడ్డలతో మకాం 'సతారా' కు మార్చాడు. ఎట్లాగైతేనేం సతారాలోని మిలిటరీ ఆఫీసులో ఓ చిన్న ఉద్యోగం సంపాదించుకొనగలిగాడు. ఇప్పుడు కటుంబ పోషణకు దిగులు లేదు. కనుక పిల్లల్ని చదివించాలని సక్పాల్ అనుకున్నాడు. మిలిటరీ స్కూల్‌లో హెడ్‌మాష్టారుగా పనిచేసాడుగదా! విద్య యొక్క విలువ ఆయనకు తెలుసు. కనుక ఎన్ని యిబ్బందులున్నా పిల్లల్ని చదివించాలని నిశ్చయించుకొన్నాడు. అయితే అంటరాని వారినెవరు స్కూల్లో చేర్చుకుంటారు? అందరూ సక్పాల్ బిడ్డల్ని తమ స్కూళ్ళల్లో చేర్చుకొంటానికి నిరాకరించారు. అయితే అదృష్టవశాత్తు - మంచి మనసున్న ఓ మాష్టారు అంబేద్కర్‌ని అతని అన్నలిద్దరిని తన స్కూల్లో చేర్చుకున్నాడు. ఇలా బాల అంబేద్కర్ సతారాలో ఓ ఎలిమెంటరీ స్కూల్లో చేరాడు. ఆ బాలుని విద్యాభివృద్ధికి యిది శుభసూచకం!

ఇదిలా వుండగా దురదృష్టవశాత్తు అంబేద్కర్‌కు షుమారు ఆరేండ్ల వయస్సులో (1887 ప్రాంతం) తల్లి భీమాబాయి పరమపదించింది. ఆమె మరణం సక్పాల్‌కు పిడుగుపాటు వంటిదైనది. మగపిల్లలు ముగ్గురు పిన్నవారు. ఆడపిల్లలిద్దరికీ పెళ్ళిళ్ళు అయినవి (బాల్య వివాహాలు) మగపిల్లల పోషణ తనమీద వుంది! తల్లి మరణించినందులకు చిన్నారి పిల్లలు బావురుమన్నారు. బాల అంబేద్కర్‌కు తల్లిప్రేమ అంటే ఏమిటో తెలియదు. పసికందుగా తల్లిపాలు తాగి ఆమె ముద్దుమురిపాలను చూరగొన్నా అది అతనికి తెలియదు. తల్లి ప్రేమలో పెరగని దురదృష్టవంతుడు అంబేద్కర్. ఇలాంటి వాళ్ళు మీలో కొందరు వుండవచ్చు.

సక్పాల్ మనోనిబ్బరం గలవాడు. ధైర్యవంతుడు. దేవుడిమీద భారం వేసి పిల్లల్ని ప్రేమతో పెంచసాగాడు. వాళ్ళ విద్యాభ్యాసం పట్ల ప్రత్యేక శ్రద్ధ

తీసుకొనసాగాడు. అంబేద్కర్ అక్కలు మంజుల, తులసి లకు పెండిళ్ళు అయిపోయినా సహోదరుల మంచిచెడ్డల విషయంలో తండ్రికి సాయపడసాగారు. అంబేద్కర్ మేనత్త మీరా (మీరాబాయి) తల్లిలేని పిల్లలైన తన మేనళ్ళుళ్ళ శ్రేయస్సు పట్ల శ్రద్ధ తీసుకొనేది. ఆమెకు అంబేద్కర్ అంటే ప్రత్యేకమైన అభిమానం!

అంబేద్కర్ అందరికంటె చిన్నవాడు కనుక ఇంట్లో అందరికీ అతనంటే ఎంతో ప్రేమ! ఎంతో గారాబం! అంబేద్కర్ ఎర్రగా-బుర్రగా-బొద్దుగా-ముద్దుగా వుండేవాడు. చురుకైన వాడు. చాలా తెలివితేటలు గలవాడు. అంతేకాదు కాస్త పెంకిపిల్లవాడు. మొండిఘటం! కాస్త పేచీకోరు. తన మాటే నెగ్గాలని మొండికేసేవాడు. తండ్రి సక్పాల్ అంబేద్కర్‌ను బాగా చదివించాలని ఎన్నో తీయని కలలు కనేవాడు. అతనిపై తండ్రి యెన్నో ఆశలు పెట్టుకొనేవాడు.

మిలిటరీవాడైనా సక్పాల్ పాపభీతికలవాడు. దైవభక్తి కలవాడు. సాదుస్వభావం కలవాడు. రోజూ పిల్లల్ని దగ్గర కూర్చోబెట్టుకొని భజనలు చేసేవాడు. వాళ్ళది కబీర్ భక్తి సంప్రదాయం అని తెలుసుకున్నాం గదా! కబీర్ పాటలు పాడేవాడు. పిల్లలచేత పాడించేవాడు. భారత రామాయణ గాధలు పిల్లలకు వినిపించేవాడు. భక్త తుకారాం కీర్తనలు పాడేవాడు. మహా పురుషుల వీరగాధలు పిల్లలకు వినిపించేవాడు. సక్పాల్ మిలిటరీ స్కూల్ హెడ్‌మాస్టరుగా పనిచేసి యున్నాడు కనుక సత్‌ప్రవర్తన-క్రమశిక్షణ పిల్లలకు ముఖ్యమని ఆయనకు తెలుసు. మొక్కై వంగనిది మ్రానై వంగునా! అని తెలుగులో ఒక సామెత వుంది! పిల్లల్ని చిన్నతనంలోనే క్రమశిక్షణతో పెంచితే పెద్దవారై మంచివారౌతారు. బుద్ధిమంతులై తమ జీవితాల్ని చక్కబెట్టుకుంటారు.

పాఠకులారా! చిన్నతనంలో గాంధీజీకి వాళ్ళ అమ్మ భారత రామాయణ గాథల్ని వినిపించేదట. అలానే చాచానెహ్రూకు కూడా వాళ్ళ అమ్మ రామాయణ భారతగాథల్ని వినిపించేదట! అంబేద్కర్ చిన్నతనంలో తల్లిని పోగొట్టుకున్న దురదృష్టవంతుడు కనుక తండ్రే-తల్లిలా

పిల్లల్ని ప్రేమగా పెంచాడు-పిల్లలకు భారత రామాయణాలు వినిపించి క్రమశిక్షణతో పెంచాడు.

## అంటరానితనం-చేదు అనుభవాలు

అంటరానికులంవాడు అవడం వలన అంబేద్కర్ చిన్నతనంలోనే ఎన్నో చేదు అనుభవాలు చవిచూసేడు. స్కూల్లో సవర్ణ హిందువుల పిల్లలందరూ బెంచీలపై కూర్చొంటే అంబేద్కర్ అతని అన్న నేలమీద గోనెగుడ్డ పర చుకుని కాస్త దూరంగా కూర్చోవలసి వచ్చేది. మాస్టారు చెప్పే పాఠం వినేటంత వరకే ఆ అన్నదమ్ములకు సదుపాయం వుండేది. మాస్టారు వారినేమీ ప్రశ్నలు వేసేవాడు కాదు. వాళ్ళ పుస్తకాలు తాకేవాడు కాదు. అగ్రవర్ణాల పిల్లలు గూడా వారిని తాకేవారుకాదు. దాహం అయితే అగ్రవ ర్ణాల పిల్లలు వారికి 'దోసిలి'లో నీరు యెత్తిపోసేవారు. దూరంగా కూర్చొని అన్నం తినవలసి వచ్చేది. పిల్లలందరితో కలసి వాళ్ళు ఆడుకొనే అదృష్టం వుండేదికాదు. అందరూ సరదాగా ఆడుకొంటుంటే అంబేద్కర్ దూరంగా నుంచొని చూసేవాడు. తమనెందుకిలా 'దూరంగా' వుంచుతున్నారో ఆ పసిహృదయానికి అంతుపట్టేదికాదు. మనస్సులో మాత్రం బాధవేసేది. ఇంటికి వెళ్ళి వాళ్ళ నాన్నను అడిగితే పాపం ఆయన మాత్రం ఏమి చెప్పగలడు! ఆ పసిహృదయానికి "అస్పృశ్యత" దురాచారాన్ని గురించి అర్థమయ్యే విధంగా ఏమని చెప్పగలడు. ఎట్లా చెప్పగలడు. "మనం అంట రానివాళ్ళం బాబూ! అందుకే మనకీ దేశంలో అందరితో కలిసి మెలసి తిరిగే అదృష్టం లేదు" అని తండ్రి చెప్పేవాడు. "అంటరానితనం అంటే ఏమిటి? మనం గూడా అందరిలాగానే మనుష్యులమే కదా" అని బాల అంబేద్కర్ తండ్రిని ప్రశ్నించేవాడు. "ఇంతటి పెద్ద పెద్ద ప్రశ్నలు పిల్ల వాడవు నీకిపుడెందుకు నీవు పెద్దవాడవయిన తర్వాత నీకే విషయాలన్నీ తెలుస్తాయిలే" అని తండ్రి అంబేద్కర్‌కు నచ్చజెప్పటానికి ప్రయత్నం చేసే వాడు.

ఒకరోజు తన అన్నతో కలిసి బాల అంబేద్కర్ పొరుగూరు పోవటా

నికి ఎద్దుల బండిని మాట్లాడుకున్నారు. బండి యెక్కారు. బయలుదేరింది బండి. మాటల సందర్భంలో ఆ పిల్లలు "మహర్" కులస్థులని బండివాడు తెలుసుకున్నాడు. బండివాడికి ఒళ్ళుమండిపోయింది. తానూ- తన బండి మైలపడిపోయిందని ఆ పిల్లల మీద మండిపడ్డాడు. కోపం పట్టలేక ఎద్దును వదలి బండిని యెత్తేసాడు. పిల్లలు క్రిందపడిపోయారు. క్రిందపడ్డ పిల్లలు బిక్కమొకంతో బండివాడిని బ్రతిమాలారు. రెట్టింపు బాడుగ యిస్తామ న్నారు. బాడుగ రెట్టింపు యిస్తామనడంతో బండివాడు మెత్తపడ్డాడు. కోపం మటుమాయమైనది. అయితే బండివాడు ఒక షరతు పెట్టాడు. బండి-ఎద్దులు మైలపడ్డాయి కనుక తాను బండి ఎక్కనన్నాడు. పిల్లలే బండి తోలుకోవాలన్నాడు. పిల్లలందుకు ఒప్పుకొన్నారు. అంబేద్కర్ అన్న బండి తోలుతుంటే బండివాడు క్రింద బండివెంట నడుస్తుంటే వాళ్ళ ప్రయాణం సాగింది. చూసారా! అంటరాని కులం పిల్లలు బండి యెక్కగానే బండి యెద్దులు మైలబడ్డాయి! అయితే బాడుగ రెట్టింపు యిస్తామనేసరికి మైలా గిలా మటుమాయమై పోయింది! విచిత్రం! అందుకే పైసాలోనే పరమాత్మ వున్నాడని అంటారు. ధనమూల మిదం జగత్ గదా!

పాఠకులారా! ఇక్కడ యింకొక సంఘటన గుర్తుకొస్తుంది. అది గాంధీజీకి సంబంధించినది. ఆయన దక్షిణాఫ్రికాలో వున్నప్పుడు ఒకసారి ఆయన రైల్లో ఫస్ట్‌క్లాస్ (మొదటి తరగతి) పెట్టెలో ప్రయాణిస్తున్నాడు. టిక్కెట్టు కలెక్టర్ వచ్చి ఆయన్ని దిగమన్నాడు. టిక్కెట్టు వుంది. ఎందుకు దిగాలి అన్నాడు గాంధి. నీవు నల్లజాతివాడవు. నీవు మొదటి తరగతిలో ప్రయాణించరాదని ఆ తెల్ల టిక్కెట్టు కలెక్టర్ అన్నాడు. అయినా గాంధీజీ రైలు దిగకుండా వాదనకు దిగాడు. కోపం వచ్చిన టికెట్ కలెక్టర్ తర్వాత వచ్చిన స్టేషన్‌లో రైలు ఆగగానే గాంధీజీని క్రిందకు పడదోసాడు. చెప్పొచ్చింది యేమిటంటే దక్షిణాఫ్రికా వేరే దేశము. అక్కడ తెల్లదొర లదే ప్రభుత్వ పెత్తనం. గాంధీజీ భారతీయుడు. నల్లజాతీయుడు. కనుక గాంధీజీని రైలునుండి క్రిందకు పడదోసాడు. అది అన్యాయమైనా అక్కడ కారణముంది. ఇక్కడ అంబేద్కరుని బండివాడు పడదోసాడు. అంబేద్కరు

బండివాడు యిద్దరూ భారతీయులే! ఇద్దరూ నల్లజాతివారే! జాతిబేధం లేదు. రంగు బేధం లేదు. ఇది అన్యాయమే కాదు! అర్థం లేదు. అంబేద్కర్ అంటరానివాడు అనే కదా!

అది అలా వుంచుదాం. అంబేద్కర్ అతని అన్నా వాళ్ళు బండిలో ప్రయాణం సాగించారు. దారిలో ఆ పిల్లలకు విపరీతమైన దాహం వేసింది. ఎవరినడిగినా ఆ పసిపిల్లలకు త్రాగటానికి నీళ్ళివ్వలేదు. పైగా "అంటరాని వాళ్ళకు నీళ్ళెవరిస్తారు! పోయి కనిపించే ఆ మురికి గుంటలో నీళ్ళు త్రాగండి" అని అంటూ మురికిగుంటలు చూపించేవారు.

ఒకనాడు తలకు క్రాఫింగ్ చేయించుకొంటానికి అంబేద్కర్ మంగలి షాపుకెళ్ళాడు. కులం అడిగి తెలుసుకొన్న మంగలివాడు క్షవరం చేయలేదు సరికదా! అతన్ని చివాట్లు వేసి పంపాడు. ఆ మంగలివాడే రెండోరో జున ఆవుదూడ బొచ్చు కత్తిరించడం చూసాడు అంబేద్కర్ "పశువుని అంటుకొంటే తప్పులేదు. కాని మనిషిని అంటుకోవడం దోషం! ఏమిటీ కుల వ్యవస్థ - ఏమిటీ అస్పృశ్యత" అని ఆ పసి హృదయం క్షోభించింది. వాళ్ళ నాన్న వాళ్ళ అక్కలే అతనికి క్రాఫింగ్ చేసేవారు.

ఇంకొకనాడు అంబేద్కరుకు విపరీతమైన దాహం వేసింది. బావి దగ్గరకు వెళ్లేడు. తాను స్వయంగా నీళ్ళు తోడుకొని తాగకూడదు కనుక చాలాసేపు వేచి చూసాడు ఎవరైనా వస్తే నీళ్ళు తోడి పోస్తారేమోనని! కాని ఎంతసేపటికి ఎవరూ రాలేదు. దాహం ఎక్కువైపోతూ వుంది. ధైర్యం చేసాడు బావి నీళ్ళు తోడుకొని తాగాడు. అంతలో ఎవరో వచ్చారు. అంబేద్కరు కులం అడిగి తెలుసుకున్నారు. నలుగురు సవర్ణ హిందువులు పోగయ్యారు. పాపం ఆ బాలుణ్ణి చివాట్లు వేయడమే కాదు చితకబాదారు.

పాఠకులారా! చూసారా! అంటరాని కులంలో పుట్టడం వల్ల అంబేద్కర్ చిన్నతనంలోనే ఎన్నో అవమానాలు పొందాడు. తెలివితేటలున్నా మనిషి సాటి మనిషినెందుకిలా "అంటరాని" వాడని హీనంగా నీచంగా చూస్తున్నారో - ఏమిటీ కుల వ్యవస్థ ఏమిటీ అస్పృశ్యత అని చిన్నతనం

నుండే లోలోన మధనపడేవాడు. ఆలోచించేవాడు. హిందూ సమాజం పట్ల ద్వేషం పెంచుకొనసాగాడు. అసలీ కులాల గుట్టేమిటి? అస్పృశ్యత యెందుకొచ్చింది అని ఆలోచించేవాడు. ఇలాంటి అనుభవాలు చాలామందికి వస్తాయి. వాళ్ళు అందరూ మాత్రం బాధలు పడలేదా? అయితే కొంత మంది వాటిని మరిచిపోతారు! కాని అంబేద్కర్ స్వాభిమానం ఉన్నవాడు. పట్టుదల కలవాడు. జిజ్ఞాసకలవాడు. మీరు సర్ ఐజక్ న్యూటన్ అనే శాస్త్రవేత్త గురించి వినేవుంటారు. ఆయన "గురుత్వాకర్షణ శక్తి" ని కనిపెట్టాడు. అంబేద్కర్ న్యూటన్ వంటివాడు! కులవ్యవస్థమీద- అస్పృ శ్యతమీద పరిశోధనలు చేసాడు-రచనలు చేసాడు-ఉద్యమాలు నడిపాడు.

## ఉపాధ్యాయుల అభిమానం

సతారాలో అంబేద్కర్ ప్రాధమిక విద్య పూర్తిచేసి హైస్కూల్లో ప్రవేశించాడు. అయితే స్కూల్లో అటు విద్యార్థులు యిటు ఉపాధ్యా యులు అతన్ని 'హీనంగా' చూస్తూ వుండడం చేత చదువుపట్ల కాస్త వుదాసీన భావం కల్గింది అంబేద్కరుకి. చదువుపై ధ్యాస తగ్గి ఇంటిదగ్గరే వుండిపోవాలనిపించేది. పశువుల సంరక్షణ, మొక్కలు పెంచడం బాల అంబేద్కరుకి సరదాగా వుండేది. అయితే మానవతా దృక్పథం కల్గిన మంచి మాస్టార్లు అంబేద్కరుకి చేయూతనిచ్చారు. వారి అభిమానం, ప్రోత్సాహం అతనిలో విద్యపట్ల అభిమానం శ్రద్ధ కలగటానికి దోహదపడ్డాయి. పైగా తండ్రి పట్టుదల, ఆయనలోని విద్యాభ్యాసానికి తోడుపడింది.

అంబేద్కరు అసలుపేరు అంబావదేకర్ (అంబవడేకర్ - అంబవా డ్కర్) అది వాళ్ళ యింటిపేరు. వాళ్ళ పూర్వీకుల గ్రామం అంబావదే (అంబవాడ) కదా! మరి సక్పాల్ వారి గోత్రం. స్కూల్లో 'అంబేద్కర్' యింటిపేరున్న మాస్టారు ఒకరుండేవాడు. అంబవాడ్కర్ తెలివితేటలు, వినయవిధేయతలు చూసి ఆ మాస్టారికి ఆ పిల్లవాని పట్ల అభిమానం పెరి గింది. ఈ బ్రాహ్మణ మాస్టారు అంబేద్కర్‌కు రోజూ విరామ సమయంలో ఆయన తెచ్చుకున్న 'భోజనం' లో కొంతభాగం ప్రేమగా పెట్టేవాడు.

అంబేద్కర్ మొగమాటపడి వద్దన్నా బ్రతిమాలి ప్రేమతో పెట్టే వాడు. ఆ మాస్టారికి యీ "అంబవదేకర్ (అంబవాడ్కర్)" మాట ఎందువల్లనో నచ్చలేదు. తనయింటి పేరైన 'అంబేద్కర్' (అంబేడ్కర్) పేరును అంబడవాడ్కర్‌కు పెట్టాడు. ఆ మాస్టారు స్కూలు రికార్డుల్లో కూడా భీమరావ్‌రామ్‌జీ అంబేద్కర్ అని మార్చాడు. అంతే. ఆనాటి నుండి అంబవాడ్కర్‌కు 'అంబేద్కర్' పేరే స్థిరపడిపోయింది. ఇంతకు ఆ మాస్టారి అసలుపేరు పూర్తి పేరు మనకు తెలియకపోవడం దురదృష్టకరం. ఆయన పూర్తి పేరు తెలియకపోయినా ఆయన యింటిపేరేగదా - "అంబే ద్కర్" పేరు అది చరిత్రలో చిరస్థాయిగా నిలిచిపోయింది. అది ఆ మాస్టారి అదృష్టం. బ్రతికినంత కాలం ఆ ఉపాధ్యాయుడు అంబేద్కరుని మరిచిపోలేదు.

దినదినాభివృద్ధి చెందుతున్న అంబేద్కరుని ఆయన గమనిస్తూనే వున్నాడు. అప్పుడప్పుడు అంబేద్కరుని మెచ్చుకొంటూ, ప్రోత్సహిస్తూ వుత్తరాలు గూడా వ్రాస్తూండేవాడట. తన మాస్టారునుండి వుత్తరాలు వచ్చినప్పుడు అంబేద్కర్ ఆనందపడిపోయేవాడు. ఆ మాస్టార్ని అంబేద్కర్ ఎలా మరిచిపోగలడు ఆయనపేరే తనపేరు! అదే "అంబేద్కర్" అనేవారు.

అంబేద్కర్‌కు మరొక క్లాస్ టీచర్ 'పెండ్సే' అనే ఆయన ఒక రుండేవాడు. ఆయనా బ్రాహ్మణుడే. అయినా అంబేద్కరుని చాలా ప్రేమించేవాడు. పిల్లవాడు మంచివాడు. బాగా చదువుతాడు. పెద్దల యెడల భయభక్తులు కలవాడు. కనుక ఆ బ్రాహ్మణ మాస్టారికి అంబేద్కర్ అంటే ఎంతో అభిమానం. ఒకసారి అంబేద్కరుకు తోటి విద్యార్థి మిత్రులకు ఒక పందెం పడింది. ఆరోజు కురుస్తున్న జడివానలో గొడుగు లేకుండా యింటినుండి స్కూలుకు వెళ్ళాలన్నది ఆ పందెం! మిత్రుల సవాలును అంబేద్కరు అంగీకరించాడు. పుస్తకాల సంచీ-గొడుగు తన అన్నకు అప్ప గించాడు. జోరున కురుస్తున్న జడివానలో గొడుగులేకుండా స్కూలుకు చేరుకున్నాడు. బాగా తడిసి ముద్దయిపోయాడు. తల, గుడ్డలు, ఒళ్ళంతా ముద్ద ముద్దగా తడిసిపోయి వణకు వచ్చేసింది. అలా తడిసి ముద్దైపోయి వణుకుతున్న అంబేద్కరుని 'పెండ్సే' మాస్టారు చూడడం తటస్థపడింది.

వెంటనే తన కుమారుని వెంట అంబేద్కరుని తమ యింటికి పంపించాడు. వేడినీళ్ళ స్నానం చేయింపించాడు. తడిసిన గుడ్డలు ఆరిపోయేవరకు తనయింటిలోని వేరే పొడి గుడ్డలు ధరింపజేసాడు. పొడిగుడ్డలతో అంబేద్కర్ ఆలస్యంగా క్లాసుకు వచ్చాడు. మాస్టారు తనను ఏమీ దండించనందుకు అంబేద్కర్ సంతోషించాడు. అటువంటి పనులు యికమీదట చేయవద్దని అంబేద్కరును హెచ్చరించాడు 'పెండ్సే' మాస్టారు. అయితే పందెంలో గెలిచినందుకు మిత్రులు అంబేద్కరుని అభినందించారు. అతని సాహసం, ధైర్యం మిత్రులు మెచ్చుకున్నారు. పందెంలో గెలిచినందుకు అంబేద్కర్ గూడా ఏదో ఘనకార్యం సాధించినంత గర్వాతిశయంతో ఆనందపడ్డాడు.

అంబేద్కర్‌కు సహాయపడిన మరొక వుపాధ్యాయుడు కేలూస్కర్. ఈ కేలూస్కర్ సంఘ సంస్కర్త గూడా! అయితే అంబేద్కర్‌కు మాత్రం టీచర్ కాదు. అంబేద్కర్ కేలూస్కర్ పార్కులో తరచూ కలుసుకొంటూ వుండేవారు. అంబేద్కర్ తెలివితేటలు చూసి కేలూస్కర్ అతన్ని అభిమానించాడు, ప్రోత్సహించాడు. ముల్లర్ అనే ప్రొఫెసర్ గూడా వున్నాడు. ఆయన గురించి తర్వాత తెలుసుకుందాం!

పాఠకులారా! చూసారా! విద్యను బోధించే ఉపాధ్యాయులు విద్యార్థుల్ని ప్రోత్సహిస్తుంటే విద్యార్థులకు విద్య బాగా ఒంటపడుతుంది. స్కూల్లో అవమానాలు పొందుతున్నా మంచి మాస్టార్ల అభిమానం-సహకారం వుండబట్టేగదా అంబేద్కర్ చదువుల్లో బాగా రాణించాడు. దానికి తోడు తండ్రి ప్రోత్సాహం పట్టుదల వుంది. అందుకే గురుదేవోభవ, పితృదేవోభవ అన్నారు.

సతారాలో వుండగానే ఒక విచిత్రమైన సంఘటన జరిగింది. ఉన్నట్టుండి రామ్‌జీ సక్పాల్ రెండవ పెండ్లి చేసుకున్నాడు. రిటైరైన ముసలాడికి యిదేం రోగం అని అనుకున్నవారు లేకపోలేదు. అమ్మ దేవత! అమ్మ స్థానంలో మరో స్త్రీ ఇంట్లో వుండడం అంబేద్కరుకి గిట్టలేదు. సవతి తల్లిని చూస్తేనే ఒళ్ళు కంపరమెత్తిపోయేది అతనికి. తండ్రిమీద కోపం వచ్చింది. కాని తండ్రిని ఆ బాలుడేమనగలడు? చదువు మీద ధ్యాస తగ్గింది. ఇంట్లో వుండబుద్ధి పుట్టలేదు

అతనికి. బొంబాయి పోయి మిల్లు కార్మికుడిగా చేరితే తన కాళ్ళమీద తాను బ్రతుకవచ్చుననుకున్నాడు. సవతితల్లి వచ్చిన తర్వాత అంబేద్కర్ ఇంటిపట్టున సరిగ్గా వుండేవాడుకాదు. ఒకనాడు రైల్వేస్టేషనులో సామాను మోస్తూ వుండగా మేనత్త మీరాబాయి చూసింది. అంబేద్కరుని కోపపడింది. ఇంటికి తీసుకొని వచ్చింది. మేనత్త అంటే అతనికి ఎంతో ప్రేమ! అభిమానం! అమ్మలేని లోటు మేనత్త తీరుస్తోంది. ఇంటికి వచ్చినా అతనికి యింట్లో వుండాలనిపించలేదు. ఎలాగైనా బొంబాయి వెళ్ళి మిల్లు కార్మికుడిగా చేరిపోవాలని మళ్ళీ ఆలోచన చేయసాగాడు. సతారాలో చాలామంది పిల్లలు బొంబాయిలో మిల్లుల్లో బాల కార్మికులుగా పనిచేస్తున్నారు! మరి బొంబాయి పోవాలంటే రైలు టిక్కెట్టుకు డబ్బులు కావాలి. ఎట్లా? ఆలోచించాడు. మేనత్త బొడ్డులోని గుడ్డసంచిలో డబ్బులుంటాయి. అవి దొంగిలిస్తే బొంబాయి పోవచ్చు. అమ్మో దొంగతనమా అనుకున్నాడు. అయినా తప్పదని తేల్చుకున్నాడు. అయితే అవి దొంగిలించడమే కష్టం. దొంగతనం చేయడం అతనికి అసలు తెలియదుగదా!

రెండుమూడు రోజులు బాల అంబేద్కర్ వేసిన ప్లాన్లు పారలేదు. చివరకు ఎలాగో మేనత్త బొడ్డు సంచి దొంగిలించగలిగాడు. కాని ఏ లాభం? సంచిలో కేవలం ఒక్క అర్ధణా మాత్రమే వుంది. అర్ధణ అంటే యిప్పటి మూడు పైసలు. విలువలో మాత్రం యిప్పటి రూపాయి విలువకు మించియే యుండును. ఛీ! తాను చేసినదంతా వృధా ప్రయాసే. అర్ధణాతో బొంబాయి ఎలా పోవాలి? తాను కనిన కలలన్నీ గాలి మేడల్లా కూలిపోయాయి. వ్రతం చెడ్డా ఫలితం దక్కలేదు. ఎన్నడూ చేయని దొంగతనం చేసాడు. తీరా లాభం లేకపోయింది. తనలో తాను మధనపడ్డాడు. బాగా ఆలోచించాడు. తాను చేసింది చెడ్డపనని గ్రహించాడు. తన తప్పు తాను తెలుసుకున్నాడు. పశ్చాత్తాపపడ్డాడు. జీవితంలో మరలా దొంగతనం చేయకూడదని తనకు తానే ఒట్టేసుకున్నాడు. ఇంటిపట్టునే వుండి బుద్ధిగా చదువుకోవాలని తీర్మానించుకున్నాడు. నిజంగా మేనత్త బొడ్డు సంచిలో డబ్బులు ఎక్కువగా దొరికివుంటే అతడు బొంబాయి

తప్పికపోయి వుండేవాడు. మిల్లులో బాల కార్మికుడిగా జీవితం ప్రారంభించి వుండేవాడు. అప్పుడతడి జీవితం మరొక విధంగా వుండివుండేది. ఈ సంఘటనని ఆయనే పెద్దయిన తర్వాత ఏదో సందర్భంలో చెప్పాడు.

పాఠకులారా! చూసారుగా! దొంగతనం చేసి అది తప్పని బాల అంబేద్కర్ తెలుసుకున్నాడు. మరలా అటువంటి చెడ్డపనులు జీవితంలో ఆయన చేయలేదు. గాంధీజీ గూడా చిన్నతనంలో చెడు స్నేహాల వలన మాంసం తిన్నాడు. సిగరెట్లు కాల్చాడు. ఆయన వైశ్యుడుగదా! వాళ్ళు మాంసం తినరు. సిగరెట్లు కొనటానికి డబ్బులు లేకపోతే యింటి నౌకరు చొక్కా జేబులో పైసలు దొంగిలించాడు. తర్వాత తాను చేసింది చెడ్డపనులని గ్రహించాడు. చెడ్డ పనులు చేయకూడదని అనుకున్నాడు. మరలా జీవితంలో అలాంటి చెడ్డపనులు బాపూజీ చేయలేదు. నెహ్రూగూడా చిన్నతనంలో ఒకసారి వాళ్ళ నాన్న జేబులోని పెన్ను దొంగిలించాడు. పెన్ను కనిపించకపోయేసరికి వాళ్ళ నాన్న యింట్లో అందరిమీద కేకలు వేసాడు. ముఖ్యంగా యింటి నౌకర్లమీద మండిపడ్డాడు. వాళ్ళ నౌకరీ పీకేస్తానని అరిచాడు. నెహ్రూ తన తప్పు తెలుసుకున్నాడు. తప్పుచేసింది తాను శిక్ష యింకొకరికా! తన తప్పును స్వయంగా తండ్రిముందు ఒప్పుకుంటానికి ధైర్యం చాల్లేదు. పెన్ను తాను దొంగిలించాననీ, తప్పు క్షమించమని ఒక చీటీమీద వ్రాసి వాళ్ళ నాన్న టేబుల్ మీద బాల నెహ్రూ పెట్టాడు. ఆ చీటీ చూచి వాళ్ళ నాన్న యిలాంటి చెడ్డపనులు చేయవద్దని మంచిగా మందలించాడు. నెహ్రూ మరలా జీవితంలో దొంగతనం చేయలేదు. కనుకనే వారు గొప్పవారయ్యారు. పిల్లలు చెడ్డపనులు చేయకుండా తల్లిదండ్రులు-పెద్దలు క్రమశిక్షణతో పెంచాలి.

## బొంబాయిలో విద్యాభ్యాసం

పిల్లల చదువుల కోసం అంబేద్కరు తండ్రి సతారా నుండి బొంబాయికి మకాం మార్చాడు. ఆ మహానగరంలో పరేల్ ప్రాంతంలోని కార్మికవాడ (లేబర్ కాలనీ) లో ఓ చిన్న యిల్లు అద్దెకు తీసుకున్నాడు.

బొంబాయిలో ఆ రోజుల్లో మంచి పేరున్న హైస్కూలు ఎలిఫిన్‌స్టన్ హైస్కూలు. అంబేద్కరుని అతని అన్నని అక్కడ చేర్చాడు.

బొంబాయి పట్టణం రావడం అంబేద్కరునికి ఆనందం వేసింది ఆ మహానగరంలో కులాల పట్టింపు వున్నా సతారాలో వున్నంత తీవ్రంగా ఘోరంగా లేదు. స్వేచ్ఛావాయువులు పీల్చినట్లుంది. అంబేద్కర్ అంటరానివాడని తెలిసిన కొద్దిమంది పిల్లలు దూరదూరంగా మసలినా చాలామంది అంబేద్కరుతో కలిసి మెలిసి తిరిగేవారు. ఆటపాటల్లో అంబేద్కర్ చురుకుగా పాల్గొనేవాడు. అంబేద్కరుకు క్రికెట్ ఆటంటే ఎంతో యిష్టం. అతని తండ్రికి కూడా క్రికెట్ అంటే యిష్టం. అసలు క్రికెట్ పిచ్చి లేనివాడెవడైనా ఉన్నాడా? ఆనాడుగాని యీనాడు గాని.

అద్దెకుంటున్న యిల్లంతా కలిపి ఒక గది మాత్రమే. అదే పడక గది (బెడ్‌రూం) అదే వంటగది (కిచెన్) స్నానాలకు వేరే బాత్‌రూం లేదు. ప్రక్కనే మేకలు కట్టేసేవాళ్ళు. కట్టెపుల్లలు ఓ మూల పోగేసేవాళ్ళు. అంబేద్కరుకు చదువు సాగడం కష్టంగా వుండేది. అందరిలో అంబేద్కరే తెలివిగలవాడు. శ్రద్ధగా చదువుతాడు కనుక అతన్ని యెన్ని కష్టాలకోర్చియైనా పెద్ద చదువులు చదివించాలని తండ్రికుండేది. ఉన్నది ఒకేగది కనుక కొడుకు చదువుకు యిబ్బంది కలగకుండా వుండేందుకు ఒక పద్ధతి ఆలోచించాడు సక్పాల్. అందరు రాత్రి భోంచేసిన తర్వాత అంబేద్కరుతో సహా పిల్లలందరూ నిద్రపోవాలి. రామ్‌జీ సక్పాల్ వాకిట్లో కూర్చొని కునికిపాట్లు పడేవాడు. అర్ధరాత్రి దాటిన తర్వాత అంబేద్కర్‌ని లేపి దీపం ముట్టించి చదువుకోమని చెప్పి తండ్రి నిద్రపోయేవాడు. తెల్లవారు జామున ప్రశాంత వాతావరణంలో అంబేద్కర్ బాగా చదువుకొనేవాడు.

బొంబాయిలో ఎల్ఫిన్‌స్టన్ హైస్కూల్లో చదువుతున్నప్పుడు గూడా అంబేద్కరుకు అంటరానితనం అవమానాలు తప్పలేదు. ఒకనాడు క్లాసులో లెక్కలు మాస్టారు నల్లబల్ల (బ్లాక్ బోర్డు) మీద ఒకలెక్క వేసి దానికి సరియైన సమాధానం (అన్సరు) యెవరైనా చెప్పగలరా యని పిల్లల్ని అడి

గాడు. ఎవరూ మాట్లాడలేదు అంబేద్కరు లేచి ఆ లెక్కకు ఆన్సర్ తాను చెపుతానన్నాడు. అంబేద్కరుని బల్లదగ్గరకొచ్చి ఆన్సరు వేయమ న్నాడు మాస్టారు. బల్లకేసి అంబేద్కరు నాలుగు అడుగులు వేసాడో లేదో అగ్రకులాల పిల్లలు పెద్ద పెద్దగా కేకలు వేసారు బల్ల వెనుక వారి అన్నం ఉన్న టిఫిన్ డబ్బాలున్నాయి. బల్ల దగ్గరకు అంబేద్కరు వెళ్లితే వాళ్ళ అన్నం డబ్బాలు మైలపడతాయి. కనుక బల్లదగ్గరకు అంబేద్కరు వెళ్ళటానికి వీలులేదని ఆ పిల్లలు కేకలు! అంబేద్కరు సిగ్గుతో తలవంచుకు న్నాడు. మాస్టారు గూడా సవర్ణ హిందువుల పిల్లల్ని సమాధానపరచలేక పోయాడు. చూసారా! తెలివి తేటలున్నా అంటరానితనం అడ్డం వచ్చింది.

అంబేద్కరుకు సంస్కృతం చదవాలని వుండేది. ఐచ్ఛిక విషయంగా (Optional Subject) దాన్ని చదవాలని! హిందూ శాస్త్రాలు-వేదాలు-ఉపని షత్తులు అన్నీ సంస్కృత భాషలోనే వున్నాయి. సంస్కృతం నేర్చుకొంటే అవన్నీ తెలుసుకోవచ్చు. కులాల గొడవ అస్పృశ్యత గురించిన గుట్టు రట్టు చేయవచ్చు. అది ఆ పిల్లవాని ఆలోచన! కాని శూద్రులు అస్పృశ్యులు సంస్కృతం చదవరాదని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి గదా! మరి సవర్ణ హిందూ ఉపాధ్యాయులు అంబేద్కరుకి సంస్కృతం నేర్పటానికి ఒప్పుకుం టారా? చచ్చి గీపెట్టినా ఒప్పుకోలేదు. చేసేది లేక అంబేద్కర్ పార్శీ భాష చదవవలసి వచ్చింది. పెరిగి పెద్దయిన తర్వాత అప్పటికి సామా జిక పరిస్థితులు కాస్త మారినవి కనుక సంస్కృతం నేర్చుకున్నాడు.

1907లో అంబేద్కరు "మెట్రిక్యులేషన్" పాసయ్యాడు. అంటరాని కులం కుర్రాడు మెట్రిక్ ప్యాసవడం అంటే ఆ రోజుల్లో గొప్ప విషయం. అదొక వింత! పైగా బొంబాయిలోని మహర్ కులస్థులలో అంతవరకు ఎవరూ మెట్రిక్ చదివి పాసవలేదు. అంబేద్కరు ఆనందం చెప్పలేం. అంతకుమించి ఆతని తండ్రి సంతోషానికి అంతులేదు. బొంబాయిలోని మహర్ కులస్థులంతా అంబేద్కరుని అభినందించటానికి ఒక సభ ఏర్పాటు చేసారు. ఆనాటి సభకు ప్రముఖ సంఘసంస్కర్త ఎస్.కె. బోలె అధ్యక్షత వహించాడు. ప్రఖ్యాత మరాఠీ రచయిత, సంఘసంస్కర్త అయిన కృష్ణాజీ

అర్జున్ కేలూస్కర్ గూడా ఆ సభలో పాల్గొన్నాడు. ఈ కేలూస్కర్ అంబేద్కరుని అభినందించాడు. అంబేద్కరుని వున్నత విద్య నేర్చుకోమని సలహా యిచ్చాడు. తాను శాయశక్తులా సహాయపడతానన్నాడు. కేలూస్కర్ తాను రచించిన 'గౌతమ బుద్ధుని జీవిత చరిత్ర' కానుకగా అంబేద్కరు కిచ్చాడు. ఈ బుద్ధుని జీవిత చరిత్రనే తర్వాత అంబేద్కరుపై బాగా ప్రభావం చూపింది చివరకు బౌద్ధమతం స్వీకరించాడు. కేలూస్కర్ కూడా తాను మాట యిచ్చినట్లు అంబేద్కరుకు వున్నత విద్యాభ్యాస విషయంలో సహాయపడ్డాడు. అది తర్వాత తెలుసుకుందాం!

పాఠకులారా! చూసారా! చదువులలో అంబేద్కరు ఏ విధంగా పైకి వస్తున్నాడో! ఎన్ని కష్టాలు వచ్చినా చదువుపై అంబేద్కరుకున్న శ్రద్ధ అటువంటిది. తండ్రిగూడా ఎంతో ప్రోత్సాహం యిచ్చాడు. చూడండి! యింకో విషయం! సుమతీ శతకంలోని "పుత్రోత్సాహం తండ్రికి...." అన్న పద్యం గుర్తుందా? కొడుకు పుట్టినప్పుడు తండ్రికి కలిగే సంతోషం ముఖ్యం కాదట! కొడుకు ప్రయోజకుడైనప్పుడు అందరూ అతన్ని మెచ్చుకొన్న ప్పుడు తండ్రికి ఎంతో సంతోషము కలుగుతుందట. కొడుకు మెట్రిక్ పాసయ్యాడు అందరూ మెచ్చుకున్నారు. సక్పాల్‌కు నిజంగా సంతోషమే కదా!

## వివాహం

అంబేద్కర్ మెట్రిక్యులేషన్‌లో ఉత్తీర్ణుడైన తర్వాత కాలేజీలో చేర్చా లని తండ్రి గట్టి ప్రయత్నం చేయసాగాడు. ఆర్థిక పరమైన యిబ్బందులే అడ్డు వచ్చాయి. ఇంతలో కొడుకు పెండ్లి చేయాలని సక్పాల్‌కే మనస్సు కలిగింది. మెట్రిక్ పాసయిన అంబేద్కరుని చూచి యెందరో స్వకులస్థులు తమతమ పిల్లల్ని యిస్తామంటూ సక్పాల్ దగ్గరకు రావడం జరిగింది. సక్పాల్‌కు కొడుకు పెండ్లి చేస్తే బాగుండుననిపించింది. ఆరోజుల్లో బాల్య వివాహాలు జరిగేవి. దరిమిలా రాజారామ్ మోహన్‌రాయ్, వీరేశ లింగం పంతులు వంటి సంఘ సంస్కర్తల కృషి ఫలితంగా శారదా చట్టం

వచ్చింది. బాల్య వివాహాలు నిషేధించారు. ప్రస్తుతం అమ్మాయికి 18 సంవత్సరాలు, అబ్బాయికి 20 సంవత్సరాలు నిండనిదే పెండ్లి చేయడం చట్టప్రకారం నేరం! ఆ రోజుల్లో దేశంలో ఎక్కడైనా ఏ కులంలోనైనా బాల్య వివాహాలు చేయడం పరిపాటి.

అంబేద్కరు పెండ్లిమీద మోజు పడలేదు. అతని ధ్యాసంతా చదువుమీదనే. అయినా తండ్రిమాట కాదనలేక పోయాడు. తండ్రిమీద ఆయనకు భక్తివుంది. తండ్రి కోరిక తీర్చటానికి ఒప్పుకున్నాడు. దాపోలీ రైల్వేస్టేషనులో పోర్టరుగా పనిచేసిన వాలేంకర్ కుమార్తె పెండ్లికుమార్తె. పేరు రమాబాయి. వయస్సు తొమ్మిది సంవత్సరాలు మాత్రమే. ఆమె అమాయకురాలు కూడా. అప్పటికి ఆమె ఏమీ చదువుకోలేదు. పెండ్లి అయి ఆమె కాపురానికి వచ్చాక భర్త పట్టుదలపై రాయడం చదవడం నేర్చుకొంది. ఆమె రూపవతికాదు. కాని గుణవతి. ఆమె నెమ్మదస్తురాలు. సాత్వికురాలు. వినయవిధేయతలు గలది. అంబేద్కరుకు అప్పుడు పదిహేడు సంవత్సరాలు.

పెండ్లి చేయటానికి స్థలం అంటే వివాహ వేదిక ఎక్కడా దొరకలేదు. చివరకు బైకుల్లా మార్కెట్టులో రాత్రిపూట పెండ్లి చేయటానికి యిరు వర్గాల పెద్దలు నిశ్చయించారు. ఆ మార్కెట్టులో కాయగూరలేకాదు. చేపలు, మాంసం గూడా అమ్మేవారు. పగలంతా మార్కెట్టు జనంతో వ్యాపారంతో క్రిక్కిరిసి వుంటుంది. రాత్రిపూట ఖాళీగానే వుంటుంది గదా!

చీకటిపడగానే పెండ్లికుమారుని తరపువారు, పెండ్లి కుమార్తె తరపువారు మార్కెట్టుకు చేరుకున్నారు. ఓ పెద్ద పాకలో ఒక మూల అమ్మాయి తరపువారు, ఇంకోమూల అబ్బాయి తరపువారు "విడిది" దిగారు. ఆ స్థలాన్ని ఎంతగా శుభ్రం చేసుకున్నా చేపల కంపు, మురికి కంపు! ఒక ప్రక్క మురుగు నీటి ప్రవాహం! ఆ మార్కెట్టే "వివాహ వేదిక"గా ఆకాశమే పందిరిగా నక్షత్రాలే "విద్యుద్దీపాలు" గా గుడ్డిదీపాల వెలుగులో రమాబాయి-అంబేద్కరుల వివాహం రంగరంగ వైభోగంగా

జరిగింది. తెల్లవారు ఝామున కాయగూర వ్యాపారస్తులు, చేపలమ్ము కొనేవాళ్ళు వచ్చేసరికి పెండ్లి తంతు పూర్తి అయింది. రమాబాయి అంబేద్కరుల వివాహం 1907లో జరిగింది.

పాఠకులారా! చూసారా ఉత్తరోత్రా నిమ్నజాతుల వారి నాయకుడిగా, స్వతంత్ర భారతదేశ నూతన రాజ్యాంగ నిర్మాతగా రూపొందనున్న అంబేద్కరు వివాహం చేపల మార్కెట్టులో జరగడం విచిత్రంగా వుంది కదూ! విధి బలీయమైనది కదా! దైవలీలలు అలావుంటాయి.

## కాలేజి చదువులు

పెండ్లి చేసుకున్నా అంబేద్కర్ ధ్యాసంతా చదువులపైనే! మనమీ నాడు పెండ్లి కాగానే "పెండ్లాం బులుపు" తో చదువుల్ని అశ్రద్ధ చేస్తున్న వారినెందరినో చూస్తున్నాం. ఎలాగైనా కాలేజీలో చదవాలని ఆయనకు పట్టుదల. ఆర్థిక పరిస్థితులు బాగుండకపోయినా తండ్రికి గూడా కొడుకుని చదివించాలని పట్టుదల. బొంబాయిలోని ఎల్ఫిన్స్టన్ కాలేజిలో ఇంటర్ మీడియట్‌లో చేరాడు. చదువుల్లో చురుగ్గా వుండేవాడు. క్రికెట్-టెన్నిస్ ఆటలంటే గూడా అతను ఆసక్తి చూపేవాడు. ఈ ఆటల్లో మంచి ప్రవేశం గూడా సంపాదించాడు. బొంబాయి నగరం అంతర్ కళాశాలల క్రికెట్ ఆటల పోటీలలో పాల్గొని ప్రైజులు కూడా గెలుపొందాడు.

పెద్ద సంసారం! వచ్చే పెన్షను తప్ప వేరే ఆదాయం ఒ కనుక సకాల్‌కు సంసార పోషణ, పిల్లల చదువుల ఖర్చులు భరించడం కష్ట భారంగా వుండేది. ఈ రోజుల్లో షెడ్యూల్డు కులాల పిల్లలకు తదితర బడుగు వర్గాల పిల్లలకు ప్రభుత్వం "ఉపకార వేతనాలు" ఇస్తుంది. కాని ఆ రోజుల్లో అలాంటి సౌకర్యం లేదు. కనుక బాగా ఆలోచించిన తర్వాత అంబేద్కర్ ఒక్కడినే చదివించటానికి యింటిలో తీర్మానించుకొన్నారు. అన్నలిద్దరు అంబేద్కర్ కోసం చదువులు మానుకొన్నారు. కుటుంబ పోషణ నిమిత్తం అన్నలిద్దరు ఏవో చిన్న వుద్యోగాలలో చేరారు. అలానే అంబేద్కర్ అక్కలిద్దరు తమ్ముడి చదువుకోసం తమకు తోచిన

విధంగా సహాయపడేవారు. ఒక్కోసారి తమ సొమ్ములు తాకట్టు పెట్టి డబ్బు తెచ్చి తండ్రికిచ్చేవారు. ఒక్కోసారి కుమార్తెల దగ్గర "అప్పు" చేసేవాడు సక్పాల్. పెన్షన్ రాగానే అప్పు తీరుస్తూ వుండేవాడు. మేనత్త మీరా గూడా అంబేద్కర్‌కు తన శక్తికొలది సహాయపడేది. కాని వీళ్ళ కుటుంబాల ఆర్థిక పరిస్థితి కూడా అంతంత మాత్రమేగదా! ఈ పరిస్థితుల్లో ప్రముఖ సంఘసంస్కర్త కేలూస్కర్ గుర్తుకొచ్చాడు సక్పాల్‌కు. ఇదివరలో అంబేద్కర్ చదువుల విషయంలో సహాయపడతానని మాట యిచ్చాడు కేలూస్కర్. ఆయన్ని కలిసాడు సక్పాల్.

ఆరోజుల్లో బరోడా మహారాజావారు పేద పిల్లలకు ముఖ్యంగా నిమ్న జాతుల పిల్లలకు చదువులకోసం ఉపకార వేతనాలిచ్చేవాడు. కేలూస్కర్ మాస్టారు బరోడా మహారాజావారిని కలిసి అంబేద్కర్ విషయం వివరించాడు. అంబేద్కర్ తెలివితేటల గురించి ఉన్నత విద్యపై అతనికున్న ఆసక్తి గురించి వారి దారిద్ర్యాన్ని గురించి తెలుసుకున్నాడు బరోడా మహారాజావారు. అంబేద్కరు చదువుల నిమిత్తం నెలకు 25 రూపాయల ఉపకారవేతనం ఇచ్చేందుకు అంగీకరించాడు. ఒక్క 25 రూపాయలేనా అని మీరనుకోవచ్చు. ఇప్పుడైతే దాని విలువ వెయ్యి రూపాయలకేమాత్రం తగ్గదు. తండ్రి సక్పాల్ ఆనందానికి అంతులేదు. అంబేద్కర్ సంతోషానికి మేర లేదు. కొండంత బలం వచ్చినట్లైంది అంబేద్కరుకు. చదువులపై దృష్టి సారించాడు. ప్రొఫెసర్ ముల్లర్ అనే విదేశీయుడు కాలేజీలో పనిచేస్తుండేవాడు. అంబేద్కర్ తెలివితేటలు, అతని ఆర్థిక పరిస్థితి తెలుసుకున్న ఆ ప్రొఫెసర్ అతనికి అప్పుడప్పుడు బట్టలు కుట్టించి యిచ్చేవాడు. తన దగ్గర పుస్తకాలు చదువుకోవడానికి యిచ్చేవాడు. అయితే అంబేద్కర్ ఆరోగ్యం బాగుండక కొంతకాలం చదువులు ఆపివేశాడు. ఆఖరికి ఇంటర్‌మీడియెట్ పాసయి బి.ఎ. లో చేరి 1912లో బి.ఏ. డిగ్రీ పట్టం పుచ్చుకొన్నాడు అంబేద్కరు. మహర్ కులస్థులలో పట్టభద్రుడైన మొట్ట మొదటివాడు అంబేద్కరు. అంబేద్కరు గృహంలోను మహర్ సంఘంలోను వేడుకలు జరుపుకున్నారు.

ఆనాడు అంటే ఎనభై సంవత్సరాల క్రితం అస్పృశ్య కులస్థుడొకడు పట్టభద్రుడు కావడం విశేషమే. ఈనాడు ప్రభుత్వ సహాయసహకారాలతో చదివి పెద్ద ఉద్యోగాలు చేస్తున్నవారు చాలామంది వుండవచ్చు. కాని ఆనాడు అంటే పంచమ కులస్థుల్ని పరమనీచంగా, పశువులకన్నా హీనంగా చూసే ఆ రోజుల్లో పేదరికంలో మ్రగ్గిపోతున్నా పట్టుదలతో, శ్రద్ధతో అంబేద్కరు పట్టభద్రుడు కావడం నిజంగా విశేషమే కాదు అది గొప్ప విషయం!

## తండ్రి మరణం

బి.ఎ. పాసయిన అంబేద్కరుకు యింకా పై చదువులు చదవాలన్న కోరిక వుంది. అయితే కుటుంబ ఆర్థిక పరిస్థితులు బాగుండలేదు. తండ్రికి వచ్చే పెన్షను కుటుంబ పోషణకు ఏ మూలకొస్తుంది కనుక. సంసార పోషణకు ఏదో చిన్న వుద్యోగం చూచుకోవాలని ప్రయత్నాలు చేయసాగాడు. అదృష్టవశాత్తు బరోడా మహారాజావారు తమ సంస్థానంలో ఓ చిన్న వుద్యోగం యిచ్చారు. దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడంటారు. రాజావారి సంస్థానంలోని వుద్యోగస్థులు అంబేద్కరుని చూసి "అంటరాని వాడికి మా సరసన వుద్యోగమా" అని హేళన చేసేవారు. అవమానించేవారు. నానా బాధలు పెట్టేవారు. స్వాభిమానమున్న అంబేద్కరుకు చాలా కష్టం వేసేది. కాని కుటుంబ పోషణ నిమిత్తం వుద్యోగం చేయక తప్పదు. కనుక అగ్ర కులాల వుద్యోగస్థులు పెట్టే బాధలు అవమానాలు అన్నీ భరించాడు అంబేద్కర్. ఇంతలో బొంబాయి నుండి టెలిగ్రాం వచ్చింది. తండ్రికి 'సీరియస్' గా వుంది రమ్మని. తండ్రి అంటే అంబేద్కరుకు ఎంతో భయభక్తులు. ఎంతో ప్రేమ గౌరవం. తనను ఎంతగానో ప్రేమించాడు. తన చదువుపట్ల ఎంతో పట్టుదల చూపించాడు తండ్రి. తనను క్రమశిక్షణతో పెంచాడు. ఉద్యోగానికి రాజీనామా చేసి బొంబాయి తిరిగి వెళ్ళాడు. కొడుకుకోసం ఎదురుచూస్తున్నాడా అన్నట్లు సక్పాల్ గొంతులో కొన వూపిరితో బ్రతికున్నాడు. కొడుకుని చూడగానే

కనుకొనల నీరు నింపుకొని కొడుకు వీపు నిమురుతూ శాశ్వతంగా కన్ను మూసాడు. ఆ దుర్దినం 1913 ఫిబ్రవరి 2వ తేది. అంబేద్కర్ కుటుంబ సభ్యులు బావురుమన్నారు. తండ్రి మరణం అంబేద్కరుకు తీరని లోటు అయింది. అంబేద్కరు మానసికంగా క్రుంగిపోయాడు. అన్నలిద్దరు చిన్న వుద్యోగాలు చేస్తున్నారు. కుటుంబం గడిచిపోతున్నది. తండ్రి మరణం నుండి తేరుకున్న అంబేద్కరుకు ఉన్నత విద్యపై ధ్యాస మరలింది.

పాఠకులారా! రాజును బట్టి ప్రజలన్నారు. తండ్రిని బట్టి బిడ్డలు. మిలిటరీ వాడైన తండ్రి అంబేద్కరుని ప్రేమగా క్రమశిక్షణతో పెంచాడు. అతనిని బాగా చదివించాలన్న పట్టుదలతో అంబేద్కరు విద్యాభ్యాసం కోసం శక్తికొలది కృషి చేసాడు. కొడుకు బంగారు భవిష్యత్తు గురించి ఎన్నో తీయని కలలు కన్నాడు. తండ్రి పోవడం అంబేద్కరుకు తీరనిలోటేకదా!

* * *

విజ్ఞాన పథములో
వేగు జుక్కవు నీవు
అభ్యుదయ యాత్రలో
ఆదర్శ రవి నీవు
గొంతెత్తి నీ పాట వినిపింతునా
గంతేసి నీ బాట నడిపింతునా

మహాకవి బోయి భీమన్న

# బరోడా మహారాజావారి సహాయం

ఇంట్లో ఆర్థిక పరిస్థితులు బాగుండకపోవడం, తండ్రి మరణం అంబే ద్కర్‌ని క్రుంగదీసాయి. బి.ఎ. పాసయినా పై చదువులు చదవాలన్న అతని ఆశలు నిరాశలయ్యాయి. అయితే అదృష్టవశాత్తు ఇంతలో బరోడా మహారాజావారు విదేశీయ విద్య నభ్యసించదలచిన పేద విద్యార్థులకు ముఖ్యంగా నిమ్నజాతుల విద్యార్థులకు ఆర్థిక సహాయం చేస్తామని ప్రకటన చేసారు. ఈ ప్రకటన చూచిన అంబేద్కర్‌కు ప్రాణం లేచి వచ్చింది. ఈ ప్రకటన అంబేద్కర్ పాలిటి వరం లాంటిది. అంబేద్కర్ వెంటనే వెళ్ళి బొంబాయిలోనే మకాం చేసి యున్న మహారాజావారి దర్శనం చేసు కున్నాడు. తనకు విదేశీయ విద్య నిమిత్తం ఆర్థిక సహాయం చేయమని కోరాడు. మహారాజావారికి అంబేద్కర్ గురించి యింతకుముందే తెలుసు గదా! కాలేజీ చదువులకు తాము ఆర్థికంగా సహాయం చేసి యున్నాడు. పట్టభద్రుడైన అంబేద్కర్‌కు తమ సంస్థానంలో చిన్న వుద్యోగం గూడా యిచ్చి యున్నాడు. అంబేద్కర్ గుణగుణాలు తెలివితేటలు రాజావారికి కొంతవరకు యిదివరకే తెలుసు. అంబేద్కర్ అమెరికాలో ఉన్నత విద్య నభ్యసించటానికి రాజావారు ఆర్థిక సహాయం చేయటానికి అంగీకారం తెలి పారు. అయితే ఒక షరతు! అమెరికాలో ఉన్నత విద్య పూర్తి చేసుకొని స్వదేశం వచ్చాక అంబేద్కర్ బరోడా సంస్థానంలో పది సంవత్సరాలపాటు ఉద్యోగం చేయాలి! ఆ షరతుకు అంబేద్కర్ అంగీకరించాడు. ఇంతగా సహాయపడుతున్న మహారాజా వారి కొలువులో ఉద్యోగం చేయడం తన బాధ్యత అని అనుకొన్నాడు. అది తన అదృష్టం గూడా. విదేశాల నుండి చదువులు ముగించుకొని రాగానే స్వదేశంలో అంటరాని వాడైనతనకు వెంటనే వుద్యోగం దొరకాలి గదా! ఉద్యోగం చేయకపోతే కుటుంబ పోషణ కష్టమౌతుంది గదా! కనుక యీ షరతూ తనకు ఒకందుకు మంచిదను కున్నాడు. మహారాజా వారి షరతు మహా సంతోషంగా అంగీకరించాడు. మహారాజా వారికి కృతజ్ఞతలు తెలియజేసుకొన్నాడు. ఆయన మనస్సు ఆనందంతో నిండిపోయింది. ఆయన హృదయం ఉప్పొంగిపోయింది. తన

భవిష్యత్తు గురించిన తియని ఆలోచనలెన్నో ఆయన మనస్సులో మసక మసగ్గా లీలగా దోచాయి. అంబేద్కర్ విదేశీ విద్యకు మహారాజావారు సహాయ పడడం ఆయన కుటుంబ సభ్యులకు మిత్రులకు గూడా సంతోషం కలిగించింది.!

చూసారా! అంబేద్కర్ అదృష్టవంతుడు. మహారాజా వారు సమయానికి దేవుడిలా సహాయ పడ్డాడని చెప్పవచ్చు. బరోడా మహారాజావారి ఆర్థిక సహాయం అంబేద్కర్ బంగారు భవిష్యత్తుకు బాటవేసింది! ఆయన గొప్ప విద్యావేత్త అవటానికి తోడ్పడింది. ఆయన పుత్రరోత్రా గొప్ప నాయకుడవటానికి పరోక్షంగా దోహదపడింది!

## అమెరికాలో విద్యాభ్యాసం

అమెరికాలో ఉన్నత విద్యాభ్యాసం కోసం భారత దేశం నుండి వెళ్ళుతున్న మొట్టమొదటి అంటరాని కులస్థుడు అంబేద్కరు. బొంబాయి ఓడరేవులో అంబేద్కరుకు బొంబాయిలోని మహర్ - తదితర పంచమ జాతుల వాళ్ళు ఘనంగా వీడ్కోలు చెప్పారు. అభిమానులు-స్నేహితులు గూడా "బాన్ వాయేజ్" చెప్పారు. అగ్రవర్ణాల వాళ్ళు వింతగా చూసారు. పత్రికలన్నీ యీ వార్త ప్రముఖంగా ప్రకటించాయి.

ఆరోజుల్లో విదేశీయ విద్యాభ్యాసం అంటే గగన కుసుమం అంటే ఆకాశంలో పు ంచేపువ్వు! సంపన్నులు- అగ్రవర్ణాలవారే విదేశీ విద్యాభ్యాసం చేయడం అరుదు. మరి ఒక నిరుపేద అస్పృశ్యుడు విదేశీ విద్య కోసం అమెరికా వెళ్లడం అంటే మాటలు కాదు! అగ్రకులాల వారు కనుబొమలు ముడిచారు. గుసగుసలు పోయారు! శూద్రులు అస్పృశ్యులు మహా సంబరపడ్డారు. ఏది ఏమైనా అదొక విశేషం!

**1913**లో జులైలో అమెరికా దేశంలో కొలంబియా విశ్వవిద్యాలయంలో అంబేద్కర్ చేరాడు. అమెరికా దేశంలో ఎక్కడ చూచినా అన్ని జాతులు వారు కలిసి మెలిసి జీవించడం అంబేద్కరుకు ఆశ్చర్యం కలిగించింది. కాలేజీలో-హాస్టల్లో అందరూ ఆప్యాయంగా పలుకరించు కొంటూ

కలిసి మెలిసి అంతా సోదరులు వలే జీవించడం అంబేద్కరుని ఆనంద పరవశుణ్ణి చేసింది. తన మాతృదేశమైన భారతదేశంలో ఎన్ని కులమత కట్టుబాట్లు! ఎంత విషక్షతా భావం! ఒక మనిషిని సాటి మనిషే పశువుగా నీచంగా చూడడం ఎంత దారుణం మరి. అమెరికాలో అటువంటి కుల మత భేదాలు విపక్షతా భావం తనకు యెక్కడా కనిపించలేదు. అయితే నీగ్రోల విషయంలో కొంత "విపక్షత" ఉందనుకొండి! పంజరంలో నుండి బయట పడి ఆకాశంలో హాయిగా స్వేచ్ఛగా విహరించే విహంగం (పక్షి) వలె తనను తాను పోల్చుకున్నాడు. స్వదేశంలో కట్టుబాట్ల సమాజంలో పుట్టు బానిసలా బ్రతికిన ఆయనకు విదేశంలో - ఒక నూతన ప్రపంచంలో స్వేచ్ఛగా జీవితం గడపడం ఒక కొత్త అనుభూతి నిచ్చింది. ఆయన కదొక వింత అనుభూతి. మాటల కందని ఒక పరమానంద భరితమైన తీయని అనుభూతి.

అంబేద్కర్‌కు అమెరికాలో మొదట్లో వుంటానికి వసతి విషయంలో కాస్త యిబ్బంది కలిగింది. ఒకటి రెండు చోట్ల మకాం పెట్టాడు. అక్కడి వాతావరణం భోజనం ఆయనకు గిట్టలేదు. చివరకు లివింగ్ స్టోన్ హాల్‌లో చేరాడు. అక్కడ ఆయనకు అన్ని విధాలా బాగుంది! అమెరి కాలో చదువుకున్న బొంబాయికి చెందిన నావెల్ భతేనా గూడా అక్కడే వుండేవాడు. ఈ పార్శీ మిత్రుడు దరిమిలా అంబేద్కర్‌కు జీవితాంతం ప్రాణమిత్రుడయ్యాడు. అంబేద్కర్ భోజనం ఖర్చులకు చాలా పొదుపుగా ఖర్చు చేసేవాడు. పూటకు రెండు రొట్టెముక్కలు, ఒక ప్లేటు చేప ముక్కలు గాని ప్లేటు మాంసం గాని మాత్రమే తీసుకొనేవాడు. ఒక కప్పు కాఫీ లేక టీతో సరిపెట్టుకొనేవాడు.

అమెరికాలో అంబేద్కర్‌కు దృష్టి అంతా చదువుమీదనే. తాను వచ్చింది చదువుకోసం! బరోడా మహారాజు సహాయం చేసింది చదువుకోస మేగదా! కనుక అటు కాలాన్ని వృధా చేసేవాడుకాదు. ఇటు వృదా [illegible] చేసేవాడుకాదు. చిన్నతనంలోనే కాలం విలువ-డబ్బు వి[illegible] వివేకవంతుడు అతడు. విద్యాభ్యాసంలో గ్రంథ పరనంలో వ[illegible]

భారతదేశం నుండి ఇతర దేశాల నుండి వచ్చిన విద్యార్థులు విద్యాభ్యాసంనకు ఎక్కువ కాలం వినియోగించేవారుకాదు. క్లబ్బులు - సినిమాలు షికార్లు వినోద యాత్రలు నాట్యశాలలు పానశాలలుచుట్టూ నిరంతరం తిరుగుతూ వారు విలాస జీవితాలు గడిపేవారు. అయితే అంబేద్కర్‌ని యివేమీ ఆకర్షించలేదు. ధ్యాసంతా విద్యమీదనే! కేవలం విద్యాభ్యాసానికే కాలం సద్వినియోగం చేస్తూఖర్చులు గూడా తగ్గించుకొని కొంత పొదుపు చేసి బొంబాయిలోని కుటుంబానికి పంపేవాడు. కుటుంబం ఆర్థిక పరిస్థితి బాగాలేదు గదా!

ఎం.ఏ క్లాసులో తనకిష్టమైన రాజకీయ శాస్త్రం-నైతిక శాస్త్రం-మానవశాస్త్రం-ఆర్థిక శాస్త్రం - పాఠ్య అంశాలుగా యెన్నుకున్నాడు. కొలంబియా విశ్వవిద్యాలయ గ్రంథాలయంలోని దాదాపు ముఖ్యమైన గ్రంథాలన్నీ చదివాడు. ఒక ప్రక్క తన పాఠ్య గ్రంథాలను క్షుణ్ణంగా అధ్యయనం చేస్తూ వుండేవాడు. మరొక ప్రక్క తన విజ్ఞాన పరిధిని పెంచుకొంటానికి యితర మంచి గ్రంథాలు గూడా చదివేవాడు. అమెరికా స్వాతంత్ర్య పోరాటం గురించిన గ్రంథాలు చదివాడు. అమెరికాలో నీగ్రోల బానిస విముక్తి పోరాటాన్ని గురించిన రచనలు చదివాడు. బూకర్ వాషింగ్‌టన్ అబ్రహాం లింకన్‌ల గురించి చదివాడు. ఫ్రెంచి విప్లవానికి దోహదపడిన ఫ్రెంచి రచయితలైన వాల్టేర్ రూసోల రచనలు చదివాడు. దేవుడు-స్వర్గం మొదలగు విషయాలపై హేతువాద దృష్టితో పరిశీలనా విమర్శక రచనలు చేసిన రాబర్టుయింగరాల్స్- జార్జి బెర్నార్డ్‌షా వంటి మహా మేధావుల గ్రంథాలు గూడా చదివాడు. దొరికిన మంచి పుస్తకాలన్నీ చదివాడు. పుస్తకాల షాపులు తిరిగి - ఫుట్‌పాత్‌లు వెతికి - దొరికిన మంచి పుస్తకాలన్నీ కొనేవాడు. అవన్నీ చదివేవాడు.

ఆరోజుల్లో భారతదేశంలో బ్రిటీషు పరిపాలన వుండేది. దానికి వ్యతిరేకంగా స్వాతంత్ర్యం కోసం భారతీయ మేధావులు దేశాభిమానులైన నాయకులు వుద్యమం ప్రారంభించారు. లాలా లజపతిరాయ్ అనే బెంగాలీ రాష్ట్రీయుడు భారత స్వాతంత్ర్యం కోసం గదర్ పార్టీని స్థాపించి వుద్యమం

మొదలుపెట్టాడు. అంబేద్కరుని తన పార్టీలో చేరి స్వాతంత్ర్య పోరాటంలో చేరమని లజపతిరాయ్ అడిగాడు. దేశానికి స్వాతంత్ర్యం రావటానికి తనకు అభ్యంతరం లేదు కాని తన విద్యాభ్యాసం పూర్తి అయ్యేవరకు తాను రాజకీయాలలో ప్రవేశించనని నిష్కర్షగా చెప్పాడు. చూసారా! విద్యార్థిగా తాను రాజకీయాలలో ప్రవేశించకూడదని ఆయన నిర్ణయించుకున్నాడంటే చదువులపై ఆయనకున్న పట్టుదల మన కర్థమవుతుంది. ఈనాడు మనం చూస్తున్నాం కాలేజీ-హైస్కూలు విద్యార్థులు రాజకీయాలలో తలదూర్చి విద్యాభ్యాసం పట్ల శ్రద్ధ చూపడం లేదు. తమ బంగారు భవిష్యత్తును పాడుచేసుకుంటున్నారు. తల్లిదండ్రులిచ్చే డబ్బును దుర్వినియోగం చేస్తున్నారు. ఉద్యమాలు సమ్మెలు బంద్‌లు యివే నేటి విద్యార్థుల నిత్య కార్యక్రమాలు

ఈ విధంగా చదువులపై దృష్టి లగ్నం చేసి అంబేద్కర్ ఏన్షియంట్ ఇండియన్ కామర్స్ Ancient Indian Commerce " భారతదేశంలో ప్రాచీన వాణిజ్యం" అనే అంశంపై పెద్ద పరిశోధక వ్యాసాన్ని రచించాడు. కొలంబియా విశ్వవిద్యాలయం ఆయనకు 1916లో యీ వ్యాసంనకు ఎం.ఏ డిగ్రీ నిచ్చింది. అదే సంవత్సరం ఆయన భారతదేశం లో కులాలు వాటి పుట్టుపూర్వోత్తరాలు (కేస్ట్ ఇన్ ఇండియా దెయిర్ జెనిసిస్ మెకానిజం అండ్ డెవలప్‌మెంట్) అనే పెద్ద వ్యాసం రాసాడు. దీనిని కొలంబియా విశ్వవిద్యాలయం ఏర్పాటు చేసిన డాక్టర్ గోల్డెన్‌వేజర్ ఎంత్రోపాలజీసెమినార్‌లో చదివాడు. భారతదేశంలో వున్న కులవిభేద తత్వం అతన్ని అప్పటికే ఆలోచింపజేసిందన్న మాట! భారతదేశంలోని కులవ్యవస్థ అమెరికా వారికి ఆశక్తి, ఆశ్చర్యం కలిగించింది.

మరికొద్ది రోజులకు నేషనల్ డివిడెంట్స్ ఆఫ్ ఇండియా - ఏ హిస్టారిక్ అండ్ ఎనలిటికల్ స్టడీ భారతదేశ జాతీయాదాయం దాని చారిత్రకపరిశీలన అనే అంశంపై తన సిద్ధాంత వ్యాసాన్ని విశ్వ విద్యాలయానికి సమర్పించారు. విశ్వవిద్యాలయం ఆయనకు డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ (పి.హెచ్.డి) డిగ్రీని ప్రదానం చేసింది. తర్వాత కొంత కాలానికి ఒక లండన్ సంస్థ వారు దీనిని ది ఎవల్యూషన్ ఆఫ్ ప్రొవిన్షియల్ ఫైనాన్స్ ఇన్ బ్రిటీ ష్

ఇండియా అనే పేరుతో ప్రచురించారు. ఆనాటి బ్రిటీషు ఇండియాలోని అతి క్లిష్టమైన ఆర్థిక విషయాలను క్షుణ్ణంగా పరిశీలించి రాసిందీ గ్రంథం. ఇందులో బ్రిటీషు పాలకులు బ్రిటీషు ఇండియాలో భారతదేశంలో అనుసరిస్తున్న ఆర్థిక దమననీతిని అంబేద్కర్ నిర్భయంగా విమర్శించాడు. ఆర్థికపరంగా బ్రిటీష్ వారి స్వార్థ ప్రయోజనాల్ని విమర్శించాడు. భారతీయులకు ఆర్థికంగా ఆనాడు జరుగుతున్న అన్యాయాల్ని ఆయన ఎత్తి చూపాడు. అందులో ఆయన బడ్జెట్ పై వెలుబుచ్చిన అభిప్రాయాలు చాలా విలువైనవి. ఆరో జుల్లో బడ్జెట్ సమావేశాల్లో శాసన సభ్యులందరి చేతుల్లోను యీ గ్రంథం వుండేదట! దానిని బట్టి ఆ గ్రంథం యొక్క ప్రాముఖ్యతను మనం తెలుసు కోవచ్చు. అమెరికాలోని ఆర్థిక శాస్త్రవేత్తలు అంబేద్కర్ తెలివితేటల్ని తెగ మెచ్చుకున్నారు. ఒక అభినందన సభయేర్పాటు చేసి- ఆ ఆర్థిక శాస్త్ర వేత్తలు అంబేద్కర్ని సన్మానించారు. కొలంబియా విశ్వవిద్యాలయం లో అంబేద్కర్కు మార్గదర్శకుడిగా వున్న ప్రొఫెసర్ ఎడ్విన్ సెలిగ్మేన్ యీ సిద్ధాంత వ్యాసాన్ని చాలా మెచ్చుకున్నాడు. నాకు తెలిసినంతలో యింతటి విపులమైన సిద్ధాంత వ్యాసాన్ని నేను చూడలేదని ఆయన కొని యాడాడు. అంత పిన్న వయస్సులోనే అంబేద్కర్ అంతటి గొప్ప రచనని చేయడం విశేషం. మాతృదేశానికి అంబేద్కర్ యిచ్చిన మొదటి కానుక యిది అని చెప్పవచ్చు. తనకు విదేశీ విద్యనిమిత్తం ఆర్థిక సహాయం చేసినందుకు కృతజ్ఞతగా దీనిని బరోడా మహారాజు శ్రీ శాయజీరావ్ గైక్వాడ్కు అంకితం యిచ్చాడు. బరోడా మహారాజావారు ఆర్థిక సహాయం చేయకపోతే అంబేద్కర్ యింతటి ఉన్నత విద్య నభ్యసించగలిగేవాడా మరి! బరోడా మహారాజా వారు అంబేద్కర్ పాలిట దేవుడు!

నేటి విద్యార్థులు గూడా అంబేద్కర్లాగా చదువుల మీదనే శ్రద్ధ చూపి బాగా చదువుకోవాలి. ఆయన లాగా గొప్ప చదువులు చదవగల్గు తారు. తల్లిదండ్రులు - పెద్దలు -అంబేద్కర్ తండ్రిలా తమ పిల్లల్ని క్రమ శిక్షణతో పెంచాలి. బాగా చదివించాలి. తప్పకుండా అంబేద్కర్ లాగా విద్యావేత్తలు కాగలరు! అదృష్టం వుంటే గొప్పవారు గూడా కావచ్చు!



అంబేద్కర్ తండ్రి సుబేదార్ రాంజీ సక్పాల్



బరోడా మహారాజా శాయాజీరావ్ గైక్వాడ్



మొదటి భార్య రమాబాయితో డా. అంబేద్కర్



బాల అంబేద్కర్‌ను అతని అన్నను బండివాడు క్రిందకు పడద్రోయుట



బావిదగ్గర నీరుతోడుకొని త్రాగుతున్నందులకు
సవర్ణహిందువులు బాల అంబేద్కర్‌ను దండించుట.




బ్లాక్ బోర్డు పై లెక్క వేయుటకు బాల అంబేద్కర్ పోవుచుండగా వద్దని
సవర్ణ హిందువుల పిల్లలు అల్లరి చేయుట



విద్యార్థిగా అంబేద్కర్ (అమెరికాలో)



బారిష్టరుగా డా. అంబేద్కర్

M.A., Ph.D., D Sc., Bar-at-Law



డా. అంబేద్కర్ బరోడా సంస్థానంలో రక్షణశాఖకార్యదర్శిగా పని చేస్తున్నప్పుడు బంట్రోతు ఫైళ్ళను బల్లపైకి విసరివేయుట



పార్శీవాడు సత్రం నుండి డా. అంబేద్కర్ పెట్టెబేడా బయటకు విసరికొట్టి అతన్ని దూషించుట

# లండన్‌లో విద్యాభ్యాసం

అమెరికాలో చదువు పూర్తి చేసుకున్న అంబేద్కర్‌కు ఇంకా చదవాలని ఉంది. లండన్ వెళ్ళి చదవాలనుకున్నాడు. 1916లో అమెరికా నుండి బయలు దేరి లండన్ చేరుకున్నాడు. ఇంగ్లండు లోని గ్రేస్‌ఇన్ కాలేజ్‌లో చేరాడు. తనకిష్టమైన న్యాయశాస్త్రాన్ని ఎన్నుకున్నాడు. హెరాల్డ్ లాస్కీ పాఠశాలలో ఆర్థిక రాజకీయ శాస్త్రాలు తన పాఠ్య అంశాలుగా తీసుకున్నాడు. చదువులపై దృష్టి సారించాడు. ఇంతలో బరోడా మహారాజావారి సంస్థానం నుండి ఆయనకు పిడుగు వంటి వర్తమానం అందింది. బరోడా సంస్థానం అంబేద్కర్‌కి యిస్తున్న ఉపకారవేతనం పూర్తి అయ్యింది. కనుక వెంటనే ఇండియాకు బయలు దేరి రావలసిందని ఆ వార్తలోని సారాంశం. అసలీ విషయం రాజావారికి తెలియనే తెలియదు. సవర్ణులైన సంస్థానంలోని ఉన్నతాధికారులు పన్నిన పన్నాగమిది. అంబేద్కర్ యింకా చదవడంవారికి యిష్టంలేదు. రాజావారి తాకీదు కనుక తనకు యిండియాకు వెళ్ళడం తప్పదు. ఆయన చదువుల్ని పర్యవేక్షిస్తున్న ప్రొఫెసర్ కానన్‌ని అంబేద్కర్ స్వయంగా కలిసాడు. విషయం వివరించాడు. చదువులు మధ్యలో ఆపి అంబేద్కర్ స్వదేశం వెళ్ళటానికి ప్రొఫెసర్ అంగీకరించాడు. అయితే నాల్గు సంవత్సరాల లోపల వచ్చి అంబేద్కర్ తన చదువుల్ని పూర్తి చేయవలసి ఉంది. ప్రొఫెసర్ మంచి తనానికి అంబేద్కర్ కృతజ్ఞతలు తెలియజేసాడు.

## ఇండియాకు తిరిగిరాక

చదువులు మధ్యలో ఆపివేసి మహారాజావారి పిలుపు మేరకు అంబేద్కర్ లండన్ నుండి ఇండియాకు బయలుదేరాడు.

ఆయన అమెరికాలోను ఇంగ్లండులోనుకొన్న పుస్తకాలు పెట్టెలలో పెట్టి ఒక ఓడలో యిండియాకు రవాణా చేసేడు. ఆయన ఇంకో ఓడలో ఇండియాకు బయలుదేరాడు. మొదటి ప్రపంచయుద్ధం జరుగుతున్న రోజులవి. పుస్తకాలు పంపిన ఓడను బ్రిటను శత్రువులు మధ్యదరా సముద్రంలో

ముంచివేసారు. అదే అంబేద్కర్ ప్రయాణిస్తున్న ఓడ అనుకుని కుటుంబ సభ్యులు ఎంతో గాబరాపడ్డారు. ముఖ్యంగా భార్య రమాబాయి అయితే అసలు అన్నం నీళ్ళు లేకుండా మంచం పట్టింది. చివరకు అంబేద్కర్ ఓడలో బొంబాయిలో క్షేమంగా దిగుతున్నట్లు వార్త ఆయిన యింటికి మిత్రులకు చేరింది. కుటుంబ సభ్యుల ఆనందానికి అంతులేదు. భర్త క్షేమంగా వస్తున్నందుకు రమాబాయి తమ యిలవేల్పు పాండురంగడికి పూజలు చేసింది. స్వదేశం చేరిన అంబేద్కర్‌కు కుటుంబ సభ్యులు-కొద్దిమంది సన్నిహిత మిత్రులు బొంబాయిలో ఘనంగా స్వాగతం పలికారు. విదేశాలలో ఉన్నత విద్యతోపాటు డాక్టరేట్లు సంపాదించి-ప్రొఫెసర్ల ప్రశంసలనందుకొని-స్వదేశం వచ్చిన మొట్టమొదటి అస్పృశ్య కులస్థుడు అంబేద్కర్! అదే యింకో అగ్ర కులస్థుడైతే-ఎంత ఆర్భాటంగా స్వాగతం లభించేదో!

## బరోడా సంస్థానంలో ఉద్యోగం

అంబేద్కర్ బరోడా సంస్థానంలో ఉద్యోగంలో చేరవలసి వుంది. బొంబాయి నుండి బరోడా వెళ్ళటానికి చేతిలో చిల్లి గవ్వలేదు. ఇంతలో ఆయన పుస్తకములు రవాణాచేసిన ఓడల కంపెనీవారు ఆయన పుస్తకాలు సముద్రంలో మునిగిపోయినందుకు నష్టపరిహారం క్రింద కొంత సొమ్ము ఆయనకు చెల్లించారు. అవసరానికి చేతికి డబ్బు అందింది అన్న సంతోషమున్నా వెలకట్టలేని పుస్తకాలు పోయినందుకు అంబేద్కర్ చాలా బాధపడ్డాడు.

అంబేద్కర్ బరోడా వెళ్ళాడు ఉద్యోగంలో చేరటానికి విదేశాల నుండి గొప్ప చదువులు చదివి వస్తున్నందుకు తనకు రాజావారు గొప్పగా స్వాగత సన్నాహాలు చేయిస్తారనుకున్నాడు. కాని ఆయన ఆశ నిరాశ అయినది. ఎవరూ స్టేషన్‌కు రాలేదు. చాలా నిరూత్సాహపడ్డాడు. వాస్తవానికి అంబేద్కర్‌కి ఘనంగా స్వాగతం పలకవలసిందని రాజావారు స్వయంగా హుకుమ్ జారీ చేసాడట! అయితే సవర్ణ హిందువులైన సంస్థాన ఉద్యోగులు "అంటరాని వాడికేమిటి స్వాగతం" అని గప్‌చి

ప్గా ఊరుకున్నారు. రాజావారికి అన్నీ తెలియవు గదా! అంబేద్కర్‌కి బరోడా స్టేషన్లో ఎవరూ స్వాగతం పలకలేదు. పెట్టే బేడాతో రాజావారి సంస్థానానికి వెళ్లాడు. సంస్థానంలో రక్షణ శాఖలో కార్యదర్శిగా నియమించినట్లు తెలిసింది. సంతోషంగా ఉద్యోగంలో చేరాడు. విదేశీయ ఉన్నత విద్య నభ్యసించినందుకు పెద్ద వుద్యోగమే దొరికిందనుకున్నాడు. రాజావారికి మనస్సులో కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. ఇక ఉంటానికి ఇల్లు దొరకలేదు. ఏ హోటల్లో, హాస్టల్లో రూం యివ్వమన్నారు. పార్శీవాళ్ళ సత్రంలో చేరాడు. అయితే ఆయన ఆనందం కొద్ది రోజులు మాత్రమే. సంస్థానంలోని ఉద్యోగులు ఆయన్ని చులకనగా కుష్టిరోగి వానిలాగా చూడడం మొదలుపెట్టారు. చివరకు గుమాస్తాలు-బంట్రోతులు ఆయనపట్ల అసభ్యకరంగా-అమర్యాదకరంగా ప్రవర్తించసాగారు. బంట్రోతులు ఆఫీసు ఫైళ్ళు అంబేద్కర్ చేతికి అందించడం లేదు. ఫైళ్ళు ఎత్తి విసరి ఆయన టేబుల్‌మీద వేసేవారు. ఆయనకు త్రాగేనీరు అందుబాటులో లేకుండా చేసేవారు. ఆయన ఆఫీసుకు వచ్చిపోయేటప్పుడు దారిలో పరచివుండే తివాసీని తీసివేసేవారు! ఆయనతో యెవరూ మాట్లాడేవారు కాదు. ఈ అవమానం భరించలేక - "లైబ్రరీ" లో తలదాచుకొనేవాడు పాపం! కారణం అంబేద్కర్ అస్పృశ్యుడు గదా! అంబేద్కర్ చాలా బాధపడసాగాడు.

తాను విదేశాలలో ఉన్నత విద్యనభ్యసించి ఎన్నో డిగ్రీలు సంపాదించిన ప్రజ్ఞావంతుడు- చదువుతోపాటు సంస్కారం వున్నవాడు! అయినా తానింకా యీ దేశంలో "అంటరానివాడు! ఎంత ఘోరం! ఎంత దారుణం! అమెరికాలో-ఇంగ్లాండులో అయితే-తన కక్కడ ఎంత గౌరవం! ఎంత ఆదరణ! కాని ఇంత విజ్ఞానవంతుడైనా చదువూ సంస్కారమూ ఉన్నా తన మాతృదేశంలో మాత్రం తన సాటి భారతీయ సోదరుల ముందు తానింకా ఒక అస్పృశ్యుడు-అంటరానివాడు! తాను విదేశాలలో పొందిన ఉన్నత డిగ్రీలు-తన సంస్కారమూ-కేవలం ఒక బంట్రోతు ముందు గూడా పనికిరాకుండా పోవడం అంబేద్కర్‌కు ఎంతో మనోవ్యధను-ఎంతో బాధను కలిగించాయి! ఈ హిందూ సమాజంపట్ల-యీ కులవ్యవస్థపట్ల ద్వేషం-కోపం ముంచుకొ

చ్చాయి. విదేశీ విద్యాభ్యాసం కోసం బరోడా మహారాజావారిచ్చిన వుపకార వేతనానికి ప్రతిఫలంగా తాను రాజావారి సంస్థానంలో పది సంవత్సరాలు వుద్యోగం చేయాలి! ఓరి దేవుడా! పది సంవత్సరాలపాటు యీ విధమైన బాధలు-అవమానాలు యెలా భరించాలి! మహారాజా వారికి తనపట్ల క్రింది వుద్యోగులు ప్రదర్శిస్తున్న అమానుషమైన అవమానకరమైన ప్రవర్తన గూర్చి తెలియజేశాడు. రాజావారేదో తనకు మేలు చేస్తాడనుకొన్నాడు. కాని రాజావారు యీ విషయంలో తన అసహాయతను వెలిబుచ్చాడు! గత్యంతరం లేని పరిస్థితుల్లో రాజావారి అనుమతి తీసుకొని బరోడా సంస్థానంలోని వుద్యోగానికి స్వస్తి చెప్పాడు. సంస్థానం నుండి బయటపడ్డాడు. వూపిరి పీల్చుకున్నాడు. మరి కుటుంబ పోషణ యెలాగా అని ఆలోచిస్తూ దిక్కుతోచని స్థితిలో కాళ్ళీడ్చుకుంటూ యింటికి వచ్చాడు.

మూల్గుతున్న నక్కపై తాటికాయ పడిందట! కష్టాలువస్తే అలాగే ఒకదానివెంట మరొకటి వెంటవెంటనే వస్తాయి. అంబేద్కరు అద్దెకుంటున్న పార్శీ సత్రం వాడు అంబేద్కరును, చూచి మండిపడ్డాడు. "నీవు అంటరానికులం వాడవని ముందెందుకు చెప్పలేదు. చదువుకున్నావు కాని బుద్ధిలేదు. హిందువుడినన్నావు కులం పేరు చెప్పకుండా మోసం చేస్తావా- చండాలుడికి యిల్లెవరు అద్దెకిస్తారు" అంటూ నానా చివాట్లు పెట్టాడు. అనరాని మాటలన్నాడు. "నేను హిందువుణ్ణి - చదువు సంస్కారమూ వున్నవాణ్ణి" అని అంబేద్కర్ ఎంతో ప్రాధేయపడ్డాడు. "నీవు మహర్‌వి. అంటరానికులం వాడివి. ఛీ.పో" అంటూ అంబేద్కర్ సామాన్లు పార్శీవాడు రోడ్డుమీదికి గిరవాటు వేసి విసరికొట్టాడు. నిస్సహాయస్థితిలో-దిక్కుతోచని స్థితిలో - దీన వదనంతో -తన పెట్టె బేడా పట్టుకొని-కాళ్ళీడ్చుకొంటూ వెళ్ళి దగ్గరలో వున్న రోడ్డు ప్రక్క చెట్టు క్రింద చతికిలపడ్డాడు. చదువు సంస్కారం వున్న తనకే యీ దేశంలో యీ హిందూ సమాజంలో దిక్కులేదే! గౌరవం లేదే! విద్యాగంధం లేక అజ్ఞానంతో కూలీనాలీ చేసుకొని పశువుల్లా బ్రతికే కోట్లాది అమాయకులైన తన స్వజాతీయులైన నిమ్న జాతీయుల దీనస్థితియేమిటి అని ఆలోచించాడు! గుండె చెరువైనది!

బావురుమన్నాడు. తన చేతులలో తన ముఖం పెట్టుకొని దుఃఖించాడు. అంతలో తేరుకొన్నాడు. తమాయించుకొన్నాడు. దుఃఖించడం పిరికివాళ్ళ పని! "ధైర్యేసాహసే లక్ష్మీ" అన్నారు. ఈ కులవ్యవస్థను కూకటివేళ్ళతో పెకిలించాలి. ఈ అస్పృశ్యతను నిర్మూలించాలి. అంతవరకు తాను విశ్రమించేది లేదని తనలో తాను నిశ్చయం చేసుకున్నాడు!

పాఠకులారా! చూసారా! పాపం అంబేద్కార్ పరిస్థితి చూస్తే జాలివేస్తుంది. ఈ హిందూ సమాజంలోని అమానుషమైన యీ అంటరానితనం దురాచారం ఎంతటి ఘోరమైనదో క్రూరమైనదో-తేటతెల్లంగా తెలుస్తోంది! విదేశాలలో ఉన్నతవిద్య నభ్యసించాడు. ఆయన అఖండ మేధా సంపత్తికి విదేశీయులు మెచ్చుకొన్నారు, గౌరవించారు. కాని మాతృదేశంలో " అంటరానివాడన్న" ముద్ర వుండడం వలన- ఎంత అవమానం పొందాడు! ఎంత అగౌరవం పొందాడు. ఆఫీసులో అవమానం! ఉంటానికి యిల్లు అద్దెకు దొరకలేదు.

బరోడాలో వుద్యోగంలో చేరిన అంబేద్కార్‌కి అద్దెకొంప దొరకలేదు. హోటల్లో రూమ్ యివ్వమన్నారు. అంబేద్కార్ శ్రేయోభిలాషి సంఘసంస్కర్త అయిన కేలూస్కార్ ప్రమేయంతో ఓ సంపన్న విద్యాధికుడు అంబేద్కారుకు ఇల్లు అద్దెకిస్తానన్నాడు. తీరా ఆయన యింటికి పోయేసరికి అతని భార్య పేచీ పెట్టింది! అంబేద్కారుకి యిల్లు దొరక్క-నానాతంటాలు పడి పార్శీ వాళ్ళ సత్రంలో ఒక గది అద్దెకు తీసుకున్నాడు. కులం తెలుసుకొని ఆ పార్శీవాడు అంబేద్కారునిప్పుడు గెంటివేసాడు! ఈనాడు గూడా అద్దెకు ఇల్లు అడిగితే కులం ఏమిటంటారు! కులం తెలుసుకొని "నా కభ్యంతరం లేదు కాని మాయింటావిడ లేక మాముసలి తల్లిదండ్రులు ఒప్పుకోవడం లేదని" చెప్పేవారు చాలామంది వున్నారీనాడు.

పాఠకులారా! ఇటువంటి అవమానాలు ఒక్క అంబేద్కార్ మాత్రమే పడ్డాడని అనుకోవద్దు. ఆయన స్వాభిమాని! తన అనుభవాలన్ని "రికార్డు" చేసుకొని వుండడంవల్ల అవన్నీ మనకు తెలిసాయి. ఆయన గొప్పవాడయ్యాడు కనుక ధనంజయకేర్ వంటివారు వ్రాసినటువంటి ఆయన జీవిత చరిత్రవలన

అవన్నీమనకు తెలిసాయి. అంబేద్కర్ లాగానే పంచమజాతుల్లో పుట్టి విద్యాధికులై గొప్పవారైన వారందరూ యిటువంటి బాధలు పడ్డారు. పద్మశ్రీ బోయి భీమన్న యిటువంటి బాధలుపడ్డాడు మహాకవి జాషువా యిటువంటి అవమానాలు పొందాడు. "కర్ణు డేమాయె కులపరీక్షకుల నడుమ" అని జాషువా వాపోయాడు. తన కవిత్వాన్ని మెచ్చుకొన్నవారు "మీదే కులమన్న ప్రశ్న వెలయించి చివాలున లేచిపోవుచో బాకునక్కుమ్మినట్లు" బాధపడ్డాడాయన. దామోదరం సంజీవయ్య యిటువంటి అవమానాలు పొందాడు. బాబూ జగజ్జీవనరామ్ బాధలుపడ్డాడు. చదువుకొని వున్నత వుద్యోగాలు చేస్తున్న ఎందరెందరో యిటువంటి అవమానాలు బాధలు పడ్డారు. పడుతున్నారు. శాసన సభ్యులు మంత్రులు యిటువంటి బాధలు పడ్డారు. ఇక చదువూ సంస్కారం లేక వెట్టి చాకిరి చేసుకొని బ్రతికే కోట్లాది దళిత జాతియుల బాధలు చెప్పటానికి ఏళ్ళూ పూళ్ళూ చాలవు!

అంబేద్కర్‌ని బరోడా సంస్థానంలో ఉద్యోగం చేయనీయకుండా సంస్థానంలో సవర్ణ ఉద్యోగులు కృతకృత్యులయ్యారు. అయితే అంతటితో వాళ్ళు ఆగలేదు. అమెరికా చదువులకు సహాయం చేసినందుకుగాను పది సంవత్సరాలపాటు-అంబేద్కర్ సంస్థానంలో ఉద్యోగం చేయాలన్ని షరతు ఒకటుందిగా! పది సంవత్సరాలు కాదు గదా పట్టుమని నెలరోజులు గూడా అంబేద్కర్ బరోడా సంస్థానంలో ఉద్యోగం చేయలేదు. పైగా ఆయనే ఉద్యోగానికి రాజీనామాచేసి వెళ్ళిపోయాడు. (రాజీనామా చేసేవరకు ఆయన్ని వాళ్ళెంతగా అల్లరిపెట్టారో-అవమానించారో అది వాళ్ళకు తెలుసు ఆయనకు తెలుసు! భగవంతుడికి తెలుసు). కనుక తీసుకున్న ఉపకార వేతనం తాలూకూ సొమ్ము (డబ్బు) తిరిగి చెల్లించమని అంబేద్కర్‌కు దరిమిలా తాకీదు పంపారు! ఈ "లీగల్ నోటీసు" (చట్టపరమైన తాకీదు) సంగతి రాజావారికి తెలియదు! ఇదంతా సంస్థానంలోని సవర్ణ ఉన్నతోద్యోగులు పన్నిన పన్నాగమన్నమాట. ఈ తాకీదు చూచిన అంబేద్కర్ ముందు ఆశ్చర్యపడ్డాడు. అది సంస్థానం ఉద్యోగుల కుట్ర అని గ్రహించాడు. స్వయంగా వెళ్ళి అంబేద్కర్ రాజావారి దర్శనం చేసుకు

న్నాడు! సంబంధిత సంస్థాన ఉద్యోగస్థుల్ని పిలిపించి రాజావారు చీవాట్లు వేసాడు. తాకీదును ఉపసంహరించుకొన్నారు. అంబేద్కర్ సంస్థానానికి దమ్మిడీ చెల్లించవలసిన అవసరం లేదని రాజావారు అంబేద్కర్‌కి హామీ ఇచ్చారు. రాజావారి సహృదయతకు అంబేద్కర్ కృతజ్ఞతలు తెలియజేసాడు.

## అధ్యాపక వృత్తి

బరోడా సంస్థానంలో ఉద్యోగం మానివేసిన తర్వాత కుటుంబ పోషణ అంబేద్కరుకు చాలా కష్టసాధ్యమైనది. బరోడా నుండి బొంబాయి చేరుకున్నాడు. చేతిలో చిల్లిగవ్వలేదు కనుక పార్శీ పిల్లలకు "ట్యూషన్లు" చెప్పి వచ్చే కొద్దిపాటి సంపాదనతోనే కాపురం నెట్టుకొని పోసాగాడు. అర్థి కశాస్త్రవేత్తగా వ్యాపారస్తులకు స్టాకు-షేర్ల వ్యవహారాలలో సలహాలివ్వడం ద్వారా కొంత సంపాదించేవాడు. "బాట్లీబాయ్"కంపెనీలో సలహాదా రుగా చేరాడు. అయితే అంబేద్కర్ అంటరానికులం వాడని తెలుసుకొన్న వ్యాపారులు ఆయన దగ్గరకు రావడం మానివేసారు. మరలా సంపాదన కుంటుపడింది. అదృష్టవశాత్తు-బొంబాయి గవర్నరు సైడన్‌హోమ్ గారి సిఫారసు పై బొంబాయిలోని "సైడన్‌హోమ్" కాలేజిలో రాజకీయ ఆర్థిక శాస్త్రములందు (ప్రొఫెసర్) అధ్యాపకుడిగా 1819 నవంబరులో బాధ్యత స్వీకరించాడు. అంటరానివాడు ప్రొఫెసరా! ఆయన పిల్లలకు పాఠాలేమి చెప్పగలడని అనుకొన్నారు. అయితే ఆయన పాఠాలు చెపుతుంటే పిల్లలు శ్రద్ధగా నిశ్శబ్దంగా వినేవారు. ఆయన క్లాసులకు విద్యార్థులంతా హాజర య్యేవారు. నిదానంగా ఆయన మహర్ కులస్థుడని తెలిసినా విద్యార్థులు అంతగా పట్టించుకోలేదు. పాఠాలు బాగా చెపుతున్న మంచి ప్రొఫెసర్‌గా విద్యార్థులందు గౌరవం సంపాదించుకొన్నాడు అంబేద్కరు. కాని ఆయన గౌరవం కాలేజీలో పెరిగిపోవడం సహించని కొందరు అగ్రవర్ణములకు చెందిన అధ్యాపకులు ఆయన అంటరానివాడని అసభ్యకరంగా చులక నగా చూసేవారు. అధ్యాపకులు నీళ్ళు త్రాగే కూజాను అంబేద్కరుని అంటుకోనివ్వలేదు! "అంటరానివాడు ప్రొఫెసరా" అంటూ సూటీ పోటీ

మాటలనేవారు!. కుటుంబ పోషణకై ఆ బాధలు అవమానాలు అన్నీ భరించాడు అంబేద్కర్. విద్యార్థులు "మంచి మాస్టారని" గౌరవిస్తే సహ అధ్యాపకులు గిట్టక ఆయన్ని అవమానించారు! అడుగడుగునా ఆయనకు అన్నీ అవమానాలే! పాపం ఆయన ఎంత బాధపడ్డాడో.

## మూక్‌నాయక్ పత్రిక స్థాపన

మహాత్మా జోతి బాపూలే - బరోడా మహారాజా - కొల్హాపూర్ రాజా - శివరామ్ జనకాంబ్లే - కర్మవీర్ షిండే వంటి -మహనీయులు మహారాష్ట్రలో నిమ్నజాతుల ఉద్ధరణకు కృషి ప్రారంభించారు. కాంగ్రెస్‌వారు గూడా 1917లో కలకత్తాలో జరిగిన కాంగ్రెస్ మహాసభలలో స్వాతంత్ర్య పోరాటం తీవ్రతరం చేయాలన్న తీర్మానంతోపాటు హరిజన ఉద్ధరణ గూర్చి తీర్మానం చేసారు. 1919 మాంటేగు చెల్మ్‌ఫర్డ్ సంస్కరణలు దేశంలో ప్రవేశపెట్టారు. వాటి లోపాలను ధైర్యంగా ఎత్తిచూపాడు అంబేద్కర్ వయోజన ఓటింగ్‌విషయమై స్వయంపరిపాలన తీరుపై ప్రజాభిప్రాయం సేకరించుటకై సౌత్‌బరో కమిటీ ఇండియాలో పర్యటించింది. ఆ కమిటీ ముందు అంబేద్కర్ వ్యక్తిగతంగా ప్రత్యక్షంగా హాజరై నిమ్న జాతీయులకు ప్రత్యేక నియోజక వర్గాలు యేర్పాటు చేయాలనీ కోరాడు. వారి జనాభా దామాషాను (నిష్పత్తి) బట్టి నిమ్న జాతీయులకు చట్ట సభలలో స్థానాలు ప్రత్యేకంగా కేటాయించాలని డిమాండ్ చేసాడు. ఇన్నాళ్ళు బహిరంగంగా నిమ్నజాతులవారు సమస్యల గూర్చిమౌనంవహించిన అంబేద్కర్‌మొట్టమొదటిసారిగా సౌత్‌బరో కమిటీ ముందు నిమ్న జాతీయుల హక్కుల గురించి డిమాండ్ చేయడం గమనించదగ్గ విషయం. దేశంలో స్వపరిపాలన గురించి బ్రిటీషు వారిని డిమాండ్ చేసే ముందు సవర్ణ హిందువులందరూ నిమ్న జాతీయులపట్ల తమ వైఖరి మార్చుకోవాలని హెచ్చరించాడు. నిమ్న జాతుల రక్షణ - హక్కుల గురించి సవర్ణ హిందువులు తగు శ్రద్ధ తీసుకోవాలని కోరాడు. నిమ్న జాతీయులకు ప్రత్యేక నియోజకవర్గాలు ఏర్పాటు చేయాలని డిమాండు చేసాడు. వాళ్ళకు కొన్ని ప్రత్యేకమైన స్థానాలు కేటాయించాలని

గూడా డిమాండ్ చేసాడు. నిమ్న జాతీయులకు రాజకీయ రిజర్వేషన్లు వుండాలని అంబేద్కర్ 1920 ప్రాంతం నుండే డిమాండ్ చేయడం మొదలెట్టాడన్నమాట!

దళిత జాతుల సమస్యల్ని అందరికీ తెలియజేయాలనుకున్నాడు. దళితుల్ని జాగృతం చేయాలనుకొన్నాడు. అందుకు ఒక పత్రికను 1920 జనవరిలో స్థాపించాడు. దానిపేరు "మూక్ నాయక్" కొలహాపూర్ మహారాజావారు యీ పత్రిక నడపటానికి ఆర్థిక సహాయం అందించాడు. అంబేద్కర్ తన జీతం కొంత ఖర్చు చేసేవాడు. మూక్‌నాయక్ అంటే మూగవారి నాయకుడని అర్థం. దళిత జాతులవారు నోరులేని మూగజీవుల్లా సవర్ణహిందువులు ఎన్ని బాధలు పెట్టినా నోరుమూసుకొని వెట్టిచాకిరీ చేసుకుంటూ బ్రతుకుతున్నారు కనుక వారి నాయకుడు యిపుడు తాను కనుక ఆ పత్రికకు "మూక్ నాయక్" అని పేరు పెట్టాడు. ఇది మరాటీ వారపత్రిక. అనతికాలంలో ఈ పత్రిక అందరి ప్రశంసలను పొందింది. దానికి మహారాష్ట్రలో మంచి ఆదరణ లభించింది.

1920 మే నెలలో నాగపూర్‌లో అఖిల భారత నిమ్న జాతుల మహాసభ జరిగింది. కొలహాపూర్ మహారాజాసాహూ వారు ఆ సభలకు అధ్యక్షత వహించాడు. అంబేద్కర్ మొట్టమొదటిసారి జాతీయస్థాయిలో బహిరంగవేదికనెక్కడం అదే మొదలు! నిజానికి 1920 మార్చి నెలలో మాన్‌గామ్‌లో కొల్హాపూర్ రాజావారు హాజరైన నిమ్నజాతీయుల సభలో అంబేద్కర్ మొట్టమొదటసారి బహిరంగవేదికనెక్కి నిమ్నజాతీయుల సమస్యల మీద మాట్లాడాడు! అయితే నాగపూర్‌లో జరిగింది జాతీయస్థాయి మహాసభలన్నమాట. ఆ సభలో కులాల పుట్టు పూర్వోత్తరాల గురించి మాట్లాడాడు. అస్పృశ్యత దురాచారం పూర్వాపరాల గురించి మాట్లాడాడు. అగ్రవర్ణాల అమానుష విషక్షత గూర్చి విమర్శించాడు. నిమ్న జాతుల వారు ఆత్మగౌరవంతో - ధైర్యంతో స్వయంశక్తితో -దీక్షతో సమస్యల్ని పరిష్కరించుకోవటానికి చైతన్యవంతులు కావటానికి విజ్ఞప్తి చేశాడు.

# తిరిగి విదేశాలలో విద్యాభ్యాసం

అంబేద్కర్‌కి కాలేజీలో ప్రొఫెసర్‌గా కాస్త మంచి జీతం వచ్చేది. కొంత కుటుంబ ఖర్చులకి వాడేవాడు. కొంత తాను స్థాపించిన మూక్‌నాయక్ పత్రిక నడపటానికి ఖర్చుపెట్టేవాడు. మరికొంత పొదుపు చేసుకొనేవాడు. పూర్వంకన్న యిప్పుడు తన ఆర్థిక పరిస్థితి పరవాలేదు. కనుక లండన్‌వెళ్ళి చదువు పూర్తిచేయాలని నిశ్చయించుకొన్నాడు. అప్పుడు లండన్ ప్రొఫెసర్ యిచ్చిన నాల్గు సంవత్సరాల గడువుగూడా పూర్తికావొస్తుంది. అయితే లండన్ చదువులకు తన దగ్గర వున్న డబ్బు సరిపోదు. పూర్వం బరోడా మహారాజావారిలాగా సహాయపడేవారెవరూ యిప్పుడు కనిపించలేదు. కొల్హాపూర్ మహారాజావారు సహృదయుడు. నిమ్నజాతుల పట్ల ప్రేమాభిమానాలున్నవాడు. మూక్‌నాయక్ పత్రికకు సహాయపడుతున్నాడు. ఆయన దగ్గర కొంత అప్పుపుచ్చుకున్నాడు. పార్శీ మిత్రుడు నావల్ భతేనా దగ్గర కొంత ధనం అప్పుతీసుకున్నాడు.

1920 జులై మాసంలో లండన్ బయలు దేరాడు కుటుంబ భారం-అమాయకురాలు రమాబాయి మీద పడేసాడు. ఆయన అన్నకుటుంబం గూడా వాళ్ల యింటిలోనే వుంటున్నది. కుటుంబ గొడవలెలావున్నా చదువు ముఖ్యమాయనకు. సెప్టెంబర్‌లో లండన్‌లో ఉన్నతవిద్య నభ్యసించడం మొదలెట్టాడు. ఒక ఆంగ్లేయ వనిత నడిపే "వసతిగృహం"లో వసతి యేర్పాటుచేసుకున్నాడు. భోజనం కూడా అక్కడే. అంబేద్కర్ వంటి విదేశీయ విద్యార్థులు ముఖ్యంగా భారతీయ విద్యార్థులు యీ వసతి గృహం లోనే వుండి చదువుకొనేవారు. అయితే ఆ ఆంగ్ల వనిత కాస్త గడుసు గయ్యాళి గంప. విద్యార్థులకు కడుపునిండా అన్నం పెట్టేదికాదు. ఉదయం పూట టీ తోపాటు ఒక బన్‌రొట్టె-వెన్న (బట్టర్) ఒక చేప ముక్క "బ్రేక్‌ఫాస్ట్"గా యిచ్చేది. రాత్రికి బట్టర్ (వెన్న)తో బిస్కట్లు ఒక కప్పు 'సూప్' యిచ్చేది. అంతే! ఆ రోజుల్లో యిప్పటిలాగా మంచి హోస్టళ్ళు హోటళ్ళు వుండేవి కాదు. ఒకటి రెండు అడపాదడపా వున్నా - అవి చాలా సంపన్నులకు మాత్రమే! అంటే అక్కడ సామాన్యులు

భరించలేనంత విపరీతంగా వుండేవి రూమ్ రెంట్‌లు- ఫలహార భోజనాదు లరేట్లు ! అంబేద్కర్ పేదవాడాయె. విదేశీ చదువులకోసం వెళ్ళిన వాళ్ళు తిండి తిప్పలు విషయంలో యిలా యిబ్బందులుపడేవారు. అంబేద్కర్‌కి తిండికాదు ముఖ్యం చదువులు!

లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో "ఎకనామిక్స్" రాజకీయ శాస్త్రంతోపాటు బార్ ఎట్ లా డిగ్రీ కోసం చదువు గ్రేస్‌ఇన్‌లో ప్రారంభించాడు. కేవలం డిగ్రీ తాలూకూ గ్రంధాలు మాత్రమే కాదు విజ్ఞానం యిచ్చే యితర గ్రంధాలు గూడా చదివేవాడు. రోజుకు 18 గంటలు చొప్పున కష్టపడి చదివేవాడు. లైబ్రరీలలో గంటల తరబడి పుస్తకాలు చదివేవాడు. అప్పటికి లండన్ లోని బ్రిటీష్ మ్యూజియం లైబ్రరీ ప్రపంచంలోని లైబ్రరీలలో కెల్లా గొప్పది పెద్దది. లైబ్రరీకి వుదయం అది తెరిచే సమయానికి వెళ్ళేవాడు. లైబ్రరీకి వెళ్ళే పాఠకులు-విద్యార్థులలో అంబేద్కర్ మొదటివాడు! సాయంత్రం లైబ్రరీ మూసేవరకు గ్రంధాలు తిరగేసే వాడు. నోట్సు రాసుకునేవాడు. సాయంత్రానికి నోట్సు పెద్ద కట్ట అయ్యేది. మధ్యలో ఒక రొట్టెముక్కతో టీ లేక కాఫీ తాగేవాడు. లేకపోతే అదీలేదు. చదువులో నిమగ్నమైపోతే ఒక్కోసారి ఆ టీ గూడా తాగేవాడు కాదు. లైబ్రరీ మూసేవరకు చదువుతూ వుండేవాడు. ఒక్కో సారి లైబ్రరీ సిబ్బంది వచ్చి ఆయన్ని బలవంతంగా బయటికి పంపించి వేసి లైబ్రరీ మూసివెళ్ళేవారు. లైబ్రరీ నుండి వెళ్ళే పాఠకులలో ఆయనే ఆఖరివాడు! ఆ లైబ్రరీలో వున్న ముఖ్యమైన మంచి పుస్తకాలన్నీ చది వాడు. అలా ఆ లైబ్రరీలోని మొత్తం పుస్తకాలు చదివినవారు ప్రపంచంలోనే ఆనాటి వరకు యిద్దరు ముగ్గురు మాత్రమే వుండేవారు. కమ్యూనిష్టు సిద్ధాంత రచయిత కారల్‌మార్క్స్-ఇటలీ నిర్మాత మజినీ- కమ్యూనిష్టు సోవియట్ రష్యా నిర్మాత లెనిన్ భారత విప్లవవీరుడు సావర్కర్ - ఆ లైబ్రరీలోని మొత్తం పుస్తకాలు చదివాడు. ఇప్పుడు అంబేద్కర్ ఆ లైబ్రరీలోని పుస్తకాలు మొత్తం చదివారు. ఇవికాక లండన్ యూనివర్సి టీలోని పుస్తకాలు లండన్‌లోవున్న యితర గ్రంధాలయాలలోని పుస్తకాలు

ముఃఖ్యమైనవి తిరగేసాడు. పగలంతా లైబ్రరీలో చదివి సాయంత్రానికి కాళ్ళీడ్చుకొంటూ నీరసంగా యింటికి వచ్చేవాడు. కాస్త విశ్రాంతి తీసుకొనేవాడు . ఆ వసతి గృహం యజమానురాలు రాత్రికి బిస్కట్లు-జామ్, ఒక కప్పు మటన్ సూప్ యిచ్చేది. అంబేద్కర్‌కు ఆకలి తీరేదికాదు. అలాగే అర్ధాకలితో రాత్రి పూట మరలా పుస్తకాలు పట్టుకొనేవాడు. ప్రొద్దుపోయేవరకు చదివేవాడు. ఆకలి బాధ విపరీతంగా వచ్చేది. భారతీయ మిత్రుడొకడు అప్పడాలు (పాపడ్) పెట్టేవాడు. నకనకలాడుతున్న ఆకలి మంటతో ఆ అప్పడాలు నాలుగైదు తినేవాడు. ఒక కప్పు టీ తాగి పడుకొనేవాడు.

ప్రావిన్షియల్ డీసెంట్రలైజేషన్ ఆఫ్ ఇంపీరియల్ ఫైనాన్స్ ఇన్ బ్రిటిష్ ఇండియా అనే పరిశోధనా పత్రాన్ని సమర్పించాడు లండన్ విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎస్.సి. పట్టా పొందాడు. తర్వాత 1922 అక్టోబరులో “ది ప్రోబ్లం ఆఫ్ ది రూపీ” (రూపాయి సమస్య) అనే సిద్ధాంత పత్రాన్ని సమర్పించాడు. అదే సమయంలో బారిస్టర్ పరీక్ష రాసి బారిస్టర్ పట్టా పుచ్చుకున్నాడు. రూపాయి సమస్య మీద అంబేద్కర్ వెలిబుచ్చిన కొన్ని తీవ్రమైన వ్యాఖ్యలుపై ప్రొఫెసర్ కానన్ అభ్యంతరం తెలిపాడు. పౌండు- రూపాయిల మధ్య నెలకొల్పిన మారకం విలువ వలన బ్రిటీష్ ప్రభుత్వానికి ప్రయోజనకరంగా వుందని - బ్రిటీ ష్ యిండియా (భారతదేశ) ప్రజలకు ఆర్థికంగా నష్టదాయకంగా వుందని అంబేద్కర్ తన సిద్ధాంత వ్యాసంలో బ్రిటీష్ ప్రభుత్వాన్ని తీవ్రమైన పదజాలంతో విమర్శించాడు. ఈ సిద్ధాంత వ్యాసంలో కొన్ని మార్పులు చేయవలసిందిగ అంబేద్కర్‌కు సూచనలిచ్చాడు ప్రొఫెసర్ కానన్. అంబేద్కర్‌కు అంతగా యిష్టం లేకపోయినా విద్యార్థిగా తన ప్రొఫెసర్ మాటవినక తప్పలేదు. మూల సిద్ధాంతానికి భంగం లేకుండా అంబేద్కర్ అక్కడక్కడా సరళమైన పదాలతో గూడిన వ్యాఖ్యలతో మార్పులు చేసాడు. ఈ కారణాల వలన ఆయనకు డి.యస్.సి పట్టా (డాక్టర్ ఆఫ్ సైన్సు) ఆయన స్వదేశం తిరిగి వచ్చాక 1923 లో గాని రాలేదు. బ్రిటీష్ ప్రభుత్వం ఆర్థిక విధానాన్ని అంబేద్కర్ తీవ్రంగా విమర్శించినా- ఆయన చెప్పిన వాస్తవాల్ని

ఆయన నిశిత పరిశీలనను శాస్త్రీయ దృక్పధాన్ని ప్రొఫెసర్ కాననీ గూడా మెచ్చుకొనకుండా వుండలేకపోయాడు. ఆలస్యంగానైనా డాక్టరేట్ యివ్వక తప్పలేదు.

లండన్ చదువులతో ఆయన ఆగలేదు. లండన్ నుండి జర్మనీ వెళ్ళాడు. బాన్ విశ్వ విద్యాలయంలో ఆర్థిక తర్క శాస్త్రాలు అధ్యయనం చేసాడు. విదేశాలలోనే ఇంకా చదవాలని మరిన్ని డాక్టరేట్లు తీసుకోవాలని ఆయనకుండేది. అయితే చేతిలో పైసా లేదు. ఇండియాలో అప్పు యిచ్చేవాడు కనిపించలేదు. ఇండియాలో కుటుంబ ఆర్థిక పరిస్థితి బాగుండలేదు. కనుక 1923 లో అంబేద్కర్ యిండియాకు తిరిగి వచ్చాడు.

చూసారా! యిదివరలో అమెరికాలో ఎం.ఎ.పి.హెచ్.డి. డిగ్రీలు పొందాడు. లండన్‌లో ఎం.యస్.సి.డియస్.సి. బార్-ఎట్-లా- డిగ్రీలు పొందాడు. ఆర్థిక పరిస్థితులు బాగుండకపోయినా ఆయన ఇన్ని డిగ్రీలు పొందాడు. నిమ్న జాతుల్లోగాని యితర కులాలలోగాని ఆనాడుగాని యీనాడుగాని అంబేద్కర్‌లా యిన్ని డిగ్రీలు పొందిన నాయకుడెవడూలేడు. ఇన్ని శాస్త్రాలు చదివి యిన్ని డిగ్రీలు పొందిన నిమ్న జాతీయుడు లేనేలేడు. అది గొప్ప విషయం. అరుదైన విషయం. అంబేద్కర్ జ్ఞాన తృష్ణ అటువంటిది. నేటి విద్యార్థులు గూడా చదువుపై దృష్టి కేంద్రీకరించి బాగా చదవాలి. విద్యలేనివాడు వింత పశువు అన్నారు. విద్యావేత్తలైతేనే జీవితంలో అభివృద్ధిలోనికి రాగలరు. వంశానికి - వూరికి - దేశానికి పేరు తేగలరు. తల్లిదండ్రులు - పెద్దలు పిల్లల్ని ప్రోత్సహించాలి.

* * *

అంబేద్కరా - నీవు
అవతరించకపోతె
ఈ మూగ జీవాలు
ఏ నీడ చేరేను!

పద్మశ్రీ బోయి భీమన్న

# బారిష్టరుగా ప్రాక్టీసు

అంబేద్కర్ 1923లో లండన్ నుండి ఇండియాకు తిరిగి వచ్చాడు. బొంబాయిలో బారిష్టర్‌గా ప్రాక్టీస్ మొదలుపెట్టాడు. హైకోర్టులో ప్రాక్టీసు చేయుటానికి సవర్ణ హిందువుల కుతంత్రాలవల్ల మొదట్లో వీలుపడలేదు. అంటరానివాడు "వకీలా" అని హేళన చేసేవారు. కేసులు ఆయనకు రానీయకుండా దుష్ప్రచారం చేసేవారు. మొదట్లో జిల్లా కోర్టులో ప్రాక్టీస్ మొదలుపెట్టాడు. ఒకటి రెండు పెద్ద కేసులలో అంబేద్కర్ గెలిచాడు. ఒక పరువు నష్టం దావా కేసులో అంబేద్కర్ గెలిచాడు. దానితో ఆయన ప్రాక్టీసు పెరిగింది. ఒక కేసులో అంబేద్కర్ ఒక రోజు ఏకబిగువున ఏడు గంటలు మాట్లాడాడు. తర్వాత హైకోర్టులో ప్రాక్టీస్ చేసాడు.

సంపన్నుల దగ్గర ఫీజు బాగా గుంజేవాడు. పేదల దగ్గర నామమాత్రంగా తీసుకొనేవాడు. దళితుల కేసులలో అసలు ఫీజు తీసుకొనేవాడు కాదు. పైగా మరీ పేదవారెవరైనా వస్తే వాళ్ళకు భోజనం పెట్టే వాడు. ప్రయాణ ఖర్చులు గూడా యిచ్చేవాడు. " మూక్ నాయక్" పత్రిక ద్వారా మహారాష్ట్రలో కొంత పేరు సంపాదించుకొన్నాడు అంబేద్కర్. లాయర్‌గా నిమ్నజాతీయులకు ఉచిత సలహాలిస్తూ వుచితంగా వాళ్ళ కేసులు వాదిస్తూ వుండడంచేత అంబేద్కర్ పేరు నిమ్న జాతీయులలో మరింత ప్రాకింది. మనం యిక్కడొక విషయాన్ని గుర్తు చేసుకొందాం. గాంధీజీ దక్షిణాఫ్రికాలో లాయరుగా వున్నప్పుడు ఆయన భారతీయుల కేసు లన్నీ నామమాత్రం ఫీజు తీసుకొని వాదించేవాడు. దానితో గాంధీ అంటే దక్షిణాఫ్రికా భారతీయులకు గొప్ప అభిమానం యేర్పడింది. అనతికాలంలోనే వారి హక్కుల పోరాటంలో గాంధీజీ నాయకుడైనాడు. అట్లాగే అంబేద్కర్ నిమ్న జాతుల వారికి న్యాయ సలహాలు ఉచితంగా యిచ్చి వారికి అభిమానపాత్రుడైనాడు. అనతికాలంలోనే వారికి నాయకుడైనాడు.

పాఠకులారా! చూసారా! లాయరుగా మంచిపేరు, బాగా సంపాదన రావాలంటే న్యాయ తర్క శాస్త్రాలలో మంచి ప్రవేశం వుండడమే

కాదు. వాదనా పటిమ-వాక్‌చాతుర్యం గూడా ఉండాలి. అంబేద్కర్‌కి యివి పుష్కలంగా వున్నాయి. లాయర్‌గా బాగా రాణించాడు. అంబేద్కర్ జీవితంలో స్థిమితపడ్డాడు.

## బహిష్కృత హితకారిణి సభ

1924 సంవత్సరం నాటికి అంబేద్కర్ న్యాయవాద వృత్తిలో బాగా స్థిరపడ్డాడు. లాయరుగా బాగా రాణించడం వల్ల రెండు చేతులా బాగా సంపాదించేవాడు. ఇక కుటుంబ పోషణకు దిగులేమాత్రం లేదు. ఇక నిమ్న జాతీయుల ఉద్ధరణకు ఆయన కంకణం కట్టుకున్నాడు. ఆయన స్వాభిమానమున్నవాడు. ఆత్మవిశ్వాసం కలవాడు. పట్టుదల కలవాడు. తన స్వశక్తి మీద తనకు నమ్మకం వుంది. అనుకున్న పని చేయగల తెలివితేటలు-శక్తియుక్తులు గల్గిన నాయకుని లక్షణాలున్నవాడు. నిమ్న జాతీయుల బాధలు కష్టాలు తనకు తెలిసినట్లు యితర కులాలవారికి తెలియవు. అస్పృశ్యుడిగా తాను పడిన బాధలు పొందిన అవమానాలు తనకు అనుభవపూర్వకమైనవి. తేలుకుట్టిన వాడికి తెలుసు ఆ బాధలోని తీవ్రత-ఆకలి అయ్యేవాడికి తెలుసు కడుపుమంట! దెబ్బ తిన్న పులికి తెలుసు ఆ దెబ్బ యొక్క బాధ! అవమానం పొందిన వాడికి తెలుసు ఆ మానసిక వ్యధ! అగ్ర వర్ణాల వారు ఎందరో నిమ్న జాతీయుల ఉద్ధరణకు కృషిచేసారు. చేస్తున్నారు. అస్పృశ్యత నిర్మూలించటానికి కృషి చేసారు. చేస్తున్నారూ. వారు చేపట్టిన సంస్కరణలు కొంతవరకే ఫలించాయి. కనుక ఎవరి ప్రమేయం లేకుండా తనకు తానే ఒంటరిగా నిమ్నజాతుల ఉద్ధరణకు ఉద్యమం నడపాలనుకున్నాడు.

సమతా సైనికదళ్‌ని స్థాపించాడు. సమతా సమాజ్ సంఘ్‌ని స్థాపించాడు. వారికి అవసరమైన ట్రైనింగ్ యిప్పించాడు. అవసరమైనప్పుడు వారి సేవలు ఉపయోగించుకొనేవాడు. తాను చేపట్టే కార్యక్రమాలు నిర్మాణాత్మకంగా అమలుపరచటానికి 1924 మార్చి మాసంలో బొంబాయిలో "బహిష్కృత హితకారిణి సభ" ను స్థాపించాడు. ఆయన దానికి

గౌరవ అధ్యక్షుడిగా వున్నాడు. బొంబాయిలోని ప్రముఖ న్యాయవాది సర్. చమన్ లాల్ హీరాలాల్ సీతల్ వాడ్ అధ్యక్షులు. శివతార్కర్ కార్యదర్శి-సర్వశ్రీ బి.జికేర్-డాక్టర్ వి.పి చవాన్ -జి.కె. నారిమన్ వంటి ప్రముఖులు సభ్యులు. వీరంతా నిమ్న జాతీయులుకారు. మానవతావాదులైన సంస్కర్తలు-నిమ్న జాతుల శ్రేయోభిలాషులు. జాదవ్ యీ సభకు కోశాధికారి!

"బహిష్కృతులు" అంటే సంఘం నుండి బహిష్కరింపబడిన వారు. సంఘం నుండి వెలివేయబడినవారు. వెలివేయబడిన వారి హితం (మంచి) గూర్చే సభ-యీ బహిష్కృత హితకారిణి సభ! నిమ్న జాతుల బాలబాలికలు చదువుకొంటానికి స్కూళ్ళు వసతి గృహాలు స్థాపించడం యీ సభ యొక్క ముఖ్య ఆశయము. నిమ్న జాతులవారి కష్ట నిష్టూరాలు తెలుసుకుంటూ వాటిని ప్రభుత్వ దృష్టికి తీసుకొనిపోయి వారి సమస్యల్ని పరిష్కరించటానికి కృషి చేయడం. వ్యవసాయ రంగంలో పారిశ్రామిక రంగంలో శ్రామికులుగా పనిచేస్తున్న నిమ్న జాతీయులకు ప్రత్యేక శిక్షణ యిప్పించి-యిటు పని మెరుగుదలకు అటు వారి జీవన పరిమాణాల్ని మెరుగుపరచటానికి కృషిచేయుట-యివీ యీసభ చేపట్టే కార్యక్రమాలు-అంబేద్కర్ ఆలోచనలు పదిమందికి తెలియజేయటానికి "సరస్వతీ విలాస్" అనే పత్రికను స్థాపించాడు. దరిమిలా "బహిష్కృత్ భారత్" పత్రిక పెట్టాడు. ఈ సభ యొక్క ఉప సంఘాలు మహారాష్ట్రలో ప్రతి జిల్లాకేంద్రంలో నెలకొల్పాడు. షోలాపూర్ బెల్గాం మొదలగుచోట్ల హాస్టళ్ళు స్థాపించాడు. బొంబాయి లో పరేల్‌లో ఒక హాకీ క్లబ్ స్థాపించాడు. బైకుల్లాలో ఒక లైబ్రరీ స్థాపించాడు. అవసరమైన సమయాల్లో అప్పులిచ్చి నిరుపేదలను ఆదుకొంటానికి ఒక సహకార సంఘాన్ని నెలకొల్పాడు. ఈ సభను నిర్వహించటానికి విరాళాలు వసూలు చేసాడు. ప్రభుత్వం గ్రాంటు సంపాదించగలిగాడు. తానూ స్వయంగా కొంత ఆర్థిక సహాయం చేసాడు. అంబేద్కర్ కోర్టుల్లో న్యాయవాది వృత్తిని ఒకప్రక్క చేస్తూనే వున్నాడు. ఇంకో ప్రక్క తీరిక చేసుకొని నిమ్న జాతుల ఉద్ధరణ కార్యక్రమాల్ని ముమ్మరం చేసాడు. హితకారిణి సభ

చేపట్టిన నిర్మాణ కార్యక్రమాలు అర్థవంతంగా అమలుచేయటానికి చురుకైన నిమ్నజాతీయుల యువకుల్ని సమీకరించాడు.

## నిమ్నజాతుల ఉద్ధరణ - సంస్కరణ మార్గం

ముందు నిమ్న జాతీయులన్ని చైతన్యవంతుల్ని చేయాలనుకున్నాడు. వారిని సంస్కరించాలనుకొన్నాడు. తరతరాల నుండి చదువూ సంస్కారమూ లేక బానిస వృత్తులు చేసుకొంటూ "అజ్ఞాన అంధకారం" లో కొట్టుమిట్టాడుతూ పశువులకన్న హీనంగా బ్రతుకుతున్నారు. కనుక వారిని జాగృతం చేయాలనుకొన్నాడు. కాస్త బ్రెయిన్ వాష్ చేయాలనుకున్నాడు. అస్పృశ్యతా దురాచారం నిర్మూలించటానికి ముందు ప్రయత్నించాడు. అన్ని కులాల వారిని చేరదీసి సహ పంక్తి భోజనాలు ఏర్పాటు చేసాడు. కులాంతర వివాహాల్ని చేసుకోమని నిమ్నజాతీయుల్ని ప్రోత్సాహించాడు. మహారాష్ట్రలో గణపతి ఉత్సవాలు ఆయన జరిపించేవాడు.

అంతకన్న ముఖ్యమైనది-అమాయకులైన అక్షరజ్ఞానం లేని పల్లెటూరి నిమ్నజాతీయుల్ని జాగృతం చేయాలనుకున్నాడు. వారిని చైతన్యవంతుల్ని చేయాలనుకున్నాడు. వారిలో మానసిక పరివర్తన తీసుకొని రావాలనుకున్నాడు. తీరిక చేసుకొని వూరూరా-వాడవాడలా తిరిగి సభలు పెట్టేవాడు. సమావేశాలు ఏర్పాటు చేసేవాడు. వారికి బోధ చేసేవాడు. ఆయన వాళ్ళను చైతన్యవంతుల్ని చేయటానికి ఆయన చేసిన వుపన్యాసాల తీరిలా వుండేది.

కులాల్ని దేవుడు సృష్టించారని చెప్పే మాట నమ్మొద్దని వారికి నచ్చచెప్పేవాడు. కొందరు తెలివిగల స్వార్థపరులు కులాల్ని పెట్టారని చెప్పేవాడు. శాస్త్రాల్ని నమ్మవద్దని చెప్పేవాడు. దేవుడు-దయ్యమని నమ్మవద్దని చెప్పేవాడు. విగ్రహారాధన మానమని చెప్పేవాడు. పూజలు చేస్తే తులసీ దళ దండలు వేసుకొంటే తీర్థయాత్రలు చేస్తే మీ బ్రతుకులు బాగుపడవని చెప్పేవాడు. యజ్ఞయాగాదుల్లో మేకల్ని బలిస్తారు కాని సింహాల్ని పులుల్ని బలి యివ్వరు. కనుక మీరు సింహాలుగా గర్జించాలని నిమ్నజాతీయులను

పుత్సాహపరిచేవాడు. చీమూ నెత్తురూ చచ్చి స్వాభిమానం లేకపోతే చచ్చి పోవడం మంచిదని వారిని రెచ్చగొట్టేవాడు. ఎవరో వచ్చిమిమ్మల్ని వుద్ధరిస్తారని కూచోవద్దని చెప్పేవాడు. ఎందరో మహాత్ములు పుట్టారు గిట్టారు. అస్పృశ్యత ఆనాడూ-యీనాడూ అలానే వుందన్న సంగతి మరిచిపోవద్దని చెప్పేవాడు. నిమ్న జాతీయులు ముందు చదువుకోవాలి. వివేకవంతులు కావాలి. సంఘటితం పడాలి. హక్కులకోసం ఆందోళన చేయాలని ప్రబోధించేవాడు. మనిషికి కేవలం ఒక్క తిండి మాత్రమే ప్రధానం కాదు. అంతకన్నా ముఖ్యమైనది ఆత్మగౌరవం. ఆత్మ గౌరవం లేనివాడు పశువు కన్నా హీనం. అటువంటివాడు బ్రతికినా ఒకటే చచ్చినా ఒకటే! సమాజంలో గౌరవప్రదమైన జీవితం గడపాలని ప్రతివాడూ గట్టిగా ప్రయత్నం చేయాలి. మనిషిగా బ్రతకాలని నిశ్చయించుకోవాలి. బానిసగా ఒకడి పంచన పడి నీచ వృత్తులు చేసి బ్రతికే కంటే చస్తేనే మంచిది. బానిస మనస్తత్వం మార్చుకోవాలి. మీ కాళ్ళ మీద మీరు నిలబడాలి. స్వాభిమానంతో స్వయం కృషితో పట్టుదలతో ఆత్మవిశ్వాసంతో మీ న్యాయమైన హక్కులకోసం పోరాటం సాగించాలని మరీ మరీ బోధ చేసేవాడు. మేం అంటరాని వాళ్ళం మా కర్మ యింతే అనే బానిస భావన ముందు పోవాలని బోధ చేసేవాడు. శుచి-శుభ్రం గురించి బోధించేవాడు-గొడ్డు మాంసం తినవద్దని చెప్పేవాడు-మద్య పానం చేయవద్దని హెచ్చరించేవాడు. వేశ్యావృత్తి చేసే స్త్రీలకు ఆ నీచమైన పని మానమని మరీ హెచ్చరించేవాడు.

మరో ప్రక్క తాను నడిపే పత్రికల్లో వ్యాసాలు రాసేవాడు. కులాలు శాస్త్రాల గుట్టురట్టు చేసేవాడు. హిందూ సమాజాన్ని హిందూ మతాన్ని విమర్శించేవాడు. వాటిని నమ్మి అంటిపెట్టుకొని వున్న మాకే "బానిస బ్రతుకు" దాపురించిందని గుర్తు చేసేవాడు.

ఈ విధంగా మొట్టమొదట అంబేద్కర్ నిమ్న జాతీయుల గుడ్డి నమ్మకాల్ని పోగొట్టటానికి ప్రయత్నించాడు. మూఢ ఆచారాల్ని మాన్పించటానికి ప్రయత్నించాడు. చదువులేని అమాయకుల్ని యీ విధంగా సంస్కరించుటకు ప్రయత్నించాడు.

పాఠకులారా -అంబేద్కర్ నిమ్నజాతీయుల్ని సంస్కరించబూనడం సంతోషదాయకం. పద్మశ్రీ బోయిభీమన్న "కూలగొట్టుడు కులమత కుటిలతలను సమము చేయుడు మానవ సామ్యములను" అని యేనాడో చెప్పాడు. మనుష్యులుగా పుట్టిన వారంతా సమతా భావంతో సమాజంలో గౌరవంగా జీవించాలంటే కులమతాల విభేదాల్ని మరిచిపోవాలిమరి!

## బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడిగా

రోజు రోజుకు నిమ్న జాతీయుల ఉద్ధరణకు అంబేద్కర్ ప్రారంభించిన ఉద్యమం రాష్ట్రంలో బాగా వ్యాప్తి చెందసాగింది. దానితో ఆయన పేరు ప్రతిష్ఠలు గూడా రాష్ట్రంలో వ్యాపింపసాగాయి. అందువలన - 1926లో ఆయన బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడిగా బొంబాయి గవర్నరు చేత నియమింపబడ్డాడు. ఈ నియామకం వలన ఆయన ప్రజాజీవితం కొత్త మలుపు తిరిగిందని చెప్పవచ్చును. దేశంలో ఆయనికి ఒక రాజకీయ నాయ కునిగా గుర్తింపు వచ్చినట్లైనది. ప్రభుత్వం ఆయన ప్రజాహిత సేవల్ని గుర్తించిందన్నమాట. రాజకీయంగా నిమ్న జాతుల వారి హక్కుల కోసం పోరాడటానికి ఆయనకు మంచి అవకాశం దొరికింది. ఆయన చేస్తున్న కృషికి యిదొక వేదికగా లభించింది. ఆయన కౌన్సిల్ సభ్యుడు అయినం దుకు ఆయన మిత్రులు-అనుచరులు ఎంతో సంతోషించారు. ఆయన్ని సన్మానించారు. కానుకలిచ్చారు. వచ్చిన కానుకల్ని ఆయన నడుపుతున్న హితకారిణిసభకు యిచ్చివేసాడు.

ఆయన కౌన్సిల్ సమావేశాల్లో చురుగ్గా పాల్గొనేవాడు. బడ్జెట్ సమావేశాలలో తప్పక పాల్గొని తన అభిప్రాయాలు తెలిపేవాడు. పన్నుల విధానం మీద విద్యా విధానం మీద- నిమ్న జాతుల బడుగు వర్గాల సమ స్యల మీద ఆయన ప్రత్యేక శ్రద్ధ తీసుకొని తగు సూచనలిచ్చేవాడు. పోలీసు ఉద్యోగాలు నిమ్న జాతుల వారికి బడుగు వర్గాల వారికి లభించేందుకు ఆయన గట్టి కృషి చేసాడు.

పాఠకులారా! చూసారా! అసెంబ్లీ కౌన్సిల్ సభ్యునిగా నిమ్న జాతి

యుల ఉద్ధరణ కృషిలో ఆయనకిదొకమంచి అవకాశం. మీదు మిక్కిలి ఆయనకిదొక ముందడుగు!

## మహద్ పోరాటం

బొంబాయి నగరానికి సమీపంలో కొలాబాజిల్లా వుంది. ఆ జిల్లాలో మహద్ అనే పెద్ద గ్రామముంది. ఆగ్రామంలో ఆగ్రామ వాసులందరూ త్రాగటానికి ఒకే ఒక మంచినీటి చెరువు వుంది. మీకు తెలుసోలేదో యిప్పటికీ మనదేశంలో మారుమూల గ్రామాలలో చెరువు నీరే ప్రజలు త్రాగుతుంటారు. ఈ మహద్ గ్రామంలోని నిమ్నజాతులవారిని మాత్రం ఆవూరి సవర్ణహిందువులు ఆచెరువు నీరు ముట్టుకోనిచ్చేవారుకాదు. అవూళ్ళోవున్న అన్ని కులాల వారు చివరకు మహమ్మదీయులు క్రైస్తవులు కూడా ఆచెరువునీరు వాడుకొంటానికి హక్కు వుంది. కాని నిమ్న జాతులవారు మాత్రం ఆనీటిని వాడుకొంటానికి వీలులేదు. మురికి గుంటల్లో నీరు కాలవల్లోనీరు మాత్రమే వాళ్ళువాడుకొంటూ కాలంగడిపేవారు. మురికి నీటిని త్రాగడం వల్ల నిమ్నజాతుల వారికి నానా రోగాలు రొష్టాలు అధికమయ్యేవి. మందులు మాకులు లేక వాళ్ళలో యెక్కువ మంది చనిపోయేవాళ్ళు. అయితే వాళ్ళ గోడువినే నాధుడేలేడు. వాళ్ళ బాధలు చూసేదయామయుడేలేడు.

పాఠకులారా! ఈ ఒక్క గ్రామంలోనే కాదు ఆనాడు చాలా గ్రామాలలో నిమ్నజాతుల వారిని వూరిబావినీరు వూరిచెరువునీరు వాడుకోనిచ్చేవారు కాదు. ఇటువంటి గ్రామాలు మారుమూలల్లో యిప్పటికీ వున్నాయి. అయితే సంఘసంస్కర్త శ్రీబోలేచేసిన కృషి ఫలితంగా బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ 1923 లోనే మహద్ చెరువు నీరు అగ్రకులస్థులంతా - కులబేధాలు లేకుండా వాడుకోవచ్చని తీర్మానం చేసింది. మహద్ మునిసిపాలిటీ గూడా ఆకౌన్సిలు తీర్మానానికి ఆమోదం తెలిపింది. అయితే ఆగ్రామ సవర్ణహిందువులు మాత్రం ఆతీర్మానాన్ని అమలుపరచకుండా అడ్డుపడసాగారు. చెరువు "నీరు" ముట్టుకొంటే - "తోలు" వొలిచేస్తాం! "పానీ" త్రాగితే ప్రాణాలు తీసేస్తాం, కాళ్ళు విరగ్గొడతాం -

చేతులు నరికేస్తాం - ఎవడొస్తాడో దమ్ములుంటే రమ్మనండి. కబడ్దార్!" అని సవర్ణ హిందూవులు - నిమ్నజాతీయుల్ని బెదరగొడుతూవుండేవారు. అవ్వారి నిమ్నజాతీయులలో అగ్రవర్ణాలవారి నెదిరించే ధైర్యం లేదు. అంగ బలం అసలే లేదు.

అంబేద్కర్ దరిమిలా బొంబాయి అసెంబ్లీ కౌన్సిల్ సభ్యుడైనాడు కదా! ఆయన మరలా ఆ మహద్ చెరువు నీటిసమస్యను చేపట్టాడు. సన్నిహిత సహచరులు సురేంద్రనాధ్ టిప్నీస్ - సుబేదార్ సావర్కర్ ఆనం దరావ్ చిత్రేలతో యీ విషయం దీర్ఘంగా చర్చించాడు. మహద్ గ్రామంలో 1927 మార్చి నెలలో సమావేశం యేర్పాటుచేసాడు. ఆ సభకు రాష్ట్రం నలుమూలల నుండి వేలాది నిమ్నజాతీయులు హాజరైనారు. ఆ సభలో అంబేద్కర్ మాట్లాడుతూ గ్రామ చెరువు గ్రామస్థులందరి ఉమ్మడి ఆస్తి! అది ఏదోఒక కులంవారి స్వంత ఆస్తికాదు. ఆచెరువు నీటిమీద అంద రికీ హక్కువుంది. చెరువు నీళ్ళు మహమ్మదీయులు - క్రైస్తవులు గూడా వాడుకొంటున్నారు. ఒక్క నిమ్నజాతీయులకే చెరువు నీళ్ళు వాడుకొనే హక్కులేకపోవడం అన్యాయం! అమానుషం! నిమ్నజాతీయుల్ని గూడా అగ్ర వర్ణాల వారు మర్యాదగా చెరువునీరు వాడుకోమననీయండి లేకపోతే పరి ణామాలు తీవ్రంగా వుంటాయి. అందుకు అగ్రవర్ణాలవారే బాధ్యులౌతారని హెచ్చరించాడు.

రెండోరోజు ఉదయం అంబేద్కర్ చెరువు దగ్గరకు ఒక వూరేగింపు బయలుదేరదీసాడు. ఆయన అనుచరులు స్వకులస్థులు వేలాదిమంది ఆవూరే గింపులో పాల్గొన్నారు. మేళతాళాలతో భజనచేసుకుంటూ అందరూ వుత్సా హంగా బయలుదేరారు. యుద్ధంలో సైన్యాన్ని ముందుకు నడిపించే వీరునిలా అంబేద్కర్ వూరేగింపు ముందుభాగాన నడిచాడు. అగ్రవర్ణాలవారంతా తమ ఇండ్లలో వుండి యిదంతా గమనిస్తున్నారు. ఊరేగింపు చెరువుదగ్గరకు చేరు కొంది. అంబేద్కర్ మొదట చెరువులోనికి దిగాడు! రెండు చేతులతో దోసిలి బట్టి చెరువు నీరు తీసుకొని ముందుగా తాను త్రాగాడు. అందరూ జయజయ ధ్వానాలు చేసారు. చూస్తారేం మీరు త్రాగండి నీరు అన్నాడు. అందరూ

చెరువులో దిగినీరు త్రాగారు. అంబేద్కర్ ముఖంలో తృప్తి తాండవించింది. ఆనందం వెల్లివిరిసింది. గొప్పవిజయం సాధించినట్లు ఆయన అనుభూతి పొందాడు. అందరూ ఆనందంతో "జే"లు కొట్టారు. ఇక చెరువులో నీరు మీరు గూడా రోజూ నిర్భయంగా వాడుకోండి. ఎవరడ్డం వస్తాడోచూస్తా అని గంభీరస్వరంతో అంబేద్కర్ అందరికీ హామీయిచ్చాడు. ఆరోజుతోవాళ్ళ మంచినీటి సమస్య తీరిపోయిందని మహద్ గ్రామంలోని దళిత జాతీయులు సంబరపడ్డారు. పాఠకులారా మనకు ఇక్కడొక సంఘటన గుర్తుకొస్తుంది. గాంధీజీ దండి గ్రామంవద్ద సముద్రం నీళ్ళు దోసిళ్ళతో ముందుతీసు కొని ఉప్పుతయారుచేయించిన సంఘటన అది. బ్రిటీషు వారు ఉప్పుమీద పన్ను విధించినందుకు నిరసనగా ఆయన ఉప్పు సత్యాగ్రహంచేసాడు. అయితే అది విదేశీయ ప్రభుత్వం పన్నువేసినందుకు నిరసన. ఇక్కడ అంబేద్కర్ హిందువులలోనే కొందరిని చెరువునీరు త్రాగనీయునందుకు చేసిన పోరాటం. తేడా గమనించండి!

అంబేద్కర్ వెనుదిరిగి విశ్రాంతి గృహానికి వెళ్ళిపోయాడు. వచ్చిన వారంతా ఆనందోత్సాహాలతో వెనుదిరిగి యెవరిదారిన వారు వెళ్ళడం మొదలుపెట్టారు. అంతలో దళితవర్గాలవారు ఆవూళ్ళోవున్న వీరేశ్వరాల యంలోనికి ప్రవేశించబోతున్నారని అగ్రవర్ణాలలో ఒకపుకారు పుట్టించారు. చెరువునీరు ముట్టుకోవడమేకాదు గుళ్ళోకి గూడా దూరబోతున్నారా యీ అంటరాని వాళ్ళు అని అగ్రవర్ణాలవారికి కోపం వచ్చింది. కత్తులు కర్ర లతో అగ్రవర్ణాలవారు వెనుదిరిగిపోతున్న దళిత వర్గాల మీద దాడిచేసారు. చేతికి దొరికిన వారిని దొరికినట్లు చిన్నా పెద్దా ఆడామగా తేడా లేకుండా చితక బాదారు. హఠాత్తుగా దాడిజరగడంతో దళితులు ఖంగుతిన్నారు. వారు ఊహించని దీదాడి. దాడిని యెదుర్కొంటానికి వాళ్ళు సిద్ధంగా లేరు. చేసేదిలేక ఎక్కడివాళ్ళు అక్కడ పరారయ్యారు. పారిపోతున్న వారిని వెంబడించి తరిమి తరిమి కొట్టారు సవర్ణహిందువులు. అంతలోనే దళిత యువకులంతా యేకమయ్యారు. తాడో పేడో తేల్చుకోవాలనుకు న్నారు. అగ్రవర్ణాల వారిమీద యెదురుదాడి చేయుటానికి సిద్ధపడ్డారు. తమ

నాయకుడైన అంబేద్కర్‌ని కలిసి సంప్రదించారు. అగ్రవర్ణాల వారి దాడి గురించి తెలుసుకున్న అంబేద్కర్ ఆగ్రహ ఆవేశాలతో వూగిపోయాడు. అయితే శాంతి ప్రియుడైన అంబేద్కర్ ఎదురుదాడికిది సమయం కాదని గ్రహించాడు. తొందరపడవద్దు ఆగండని ఆయన తన అనుచరులకు నచ్చచెప్పాడు. దళితయువకులు ఆవేశంతో వున్నా తమనాయకుడిమాట వాళ్ళకు వేదవాక్కు కనుక ఆగిపోయారు. అలాకాక అంబేద్కర్ గూడా వాళ్ళను ఉసిగొల్పి వున్నట్లైతే ఆనాడు మహద్ గ్రామం రణరంగంగా మారివుండేది. రక్తపు యేర్లు ప్రవహించివుండేవి. ఇంతలో పోలీసులు రంగప్రవేశం చేసారు. పోలీసాఫీసర్ అంబేద్కర్‌ని కలిసాడు. నాజాతి వారు నామాట వింటారు. ముందు మీరు వెళ్ళి అగ్రవర్ణాలవారిని అదుపు చేయండి అని అంబేద్కర్ ఆవేశంగా అన్నాడు. మొత్తంమీద పరిస్థితి మరీ విషమించకుండా యిరుపక్షాలవారిని శాంతింపజేసారు. అంబేద్కర్ ఆయన అనుచరులు గ్రామం విడిచివెళ్ళిన తర్వాత ఆగ్రామ సవర్ణ హిందువులు సనాతన హిందూమతాచార్యుల్ని సంప్రదించారు. మంచినీటి చెరువు నీటిని అంటరాని వాళ్ళు ముట్టుకోవడంతో చెరువునీరు మైలపడిపోయింది. మరి ఆనీరు త్రాగడమెలా? మైలపోవటానికి మార్గమేమిటని మతాచార్యులు దీర్ఘంగా ఆలోచించారు. ఆగమశాస్త్రపండితులు వేదపండితులు పంచామృతంతో చెరువునీటిని శుద్ధిచేయడ మొక్కటే మార్గమన్నారు. బక్కెట్లకొద్దీ ఆవు పేడ ఆవు పెరుగు ఆవు పాలు ఆవు మూత్రం ఆవు నెయ్యి తేనె వూళ్ళోను చుట్టుప్రక్కల గ్రామాలలోను క్షణాల మీద పోగుచేసారు. వేదపండితులు వేదమంత్రాలు వల్లిస్తుండగా పేడ మూత్రం పెరుగు పాలు నెయ్యి తేనె మంచినీటి చెరువులో కలిపారు. చెరువు నీటిని "శుద్ధి" చేసారు. సవర్ణులంతా తమ చెరువు "మైల" పోయి "పాప" పరిహారమై "పరిశుభ్రమై" పోయినట్లు తెగ సంబరపడిపోయారు.

పశువుల మలమూత్రాలు చెరువులో కలపడంవల్ల చెరువు నీరు మరింత మురికి [illegible] అపరిశుభ్రమైపోయి-కలుషితమైపోయి త్రాగటానికి వీలులేకుండాపోయింది. అనారోగ్యం చేస్తుంది. కాని ఆ నీరు యే విధంగా

చూచినా పవిత్రం (పావనం) యెలా అవుతుందని అంబేద్కరు మండి పడ్డాడు. సనాతన హిందువుల మూఢ నమ్మకాలకు ఆవేదన చెందాడు. సాటి మనిషి చెరువు నీరు ముట్టుకొంటే యెలా మైలపడిందని ప్రశ్నించాడు. చెరువులో పేడ-మూత్రం కలిపితే అపరిశుభ్రం కాకుండా పవిత్రం యెలా అయ్యిందో అర్థం కావడం లేదన్నాడు. అగ్రవర్ణాల వారి చర్య నిమ్నజాతుల వారికి అవమానకరమైన దని సిగ్గు మాలినపని అని బాధ పడ్డాడు. ఈదేశం యీ హిందూ సమాజం యెప్పుడు బాగుపడుతుందని ఆవేదన చెందాడు. నిమ్నజాతులవారిపై దాడిచేసినందులకు సవర్ణ హిందువులపై అంబేద్కరు సలహాపై కోర్టులో కేసులు వేసారు. కోర్టులో కేసు చాలా కాలం నడిచిన తర్వాత కొంతమంది సవర్ణ హిందువులకు కఠిన కారాగార శిక్ష గూడా పడింది. మహాద్ చెరువు నీటి సమస్య అంతటితో ఆగలేదు.

మొత్తం మీద అంబేద్కర్ చేపట్టిన మహాద్ పోరాటం దేశంలో సంచలనం సృష్టించింది. అన్ని పత్రికలు ఈ విషయానికి బాగా ప్రచారం యిచ్చాయి. అంతవరకు మహారాష్ట్రలోనే అంబేద్కర్ పేరు పరిమితమై వుండిపోయింది ఈ మహాద్ పోరాటంతో ఆయన పేరు దేశమంతా వ్యాపించింది. గాంధీజీగాని - కాంగ్రెస్ వారుగాని అంబేద్కర్ చేపట్టిన మహాద్ చెరువు నీటి ఉద్యమాన్ని బహిరంగంగా సమర్థించకపోవడం విచారకరం. "హరిజన" ఉద్ధరణ తన ముఖ్యకార్యక్రమాలలో ఒకటని కాంగ్రెస్ పార్టీ యిదివరకే తీర్మానం చేసింది కాని మహాద్‌లో తాగేనీటి సమస్య విషయంలో కాంగ్రెస్‌వారు నిమ్మకునీరెత్తినట్లు ఏమీ పట్టించుకోలేదు. పోనీ అంబేద్కర్ వుద్యమానికి గాంధీజీ - కాంగ్రెస్ వారు సహాయపడలేదు సరికదా సానుభూతి ప్రకటించలేదు. ప్రోత్సహమివ్వలేదు. కనీసం ఆయన్ని మెచ్చుకొనలేదు. ఇది బాధాకరమైన విషయమే!

దళిత జాతుల్లో చైతన్యం రావటానికి యీ మహాద్ సంఘటన దొహదపడింది. ఈ మహాద్ పోరాటం అంబేద్కర్‌కు ఆత్మస్థైర్యం ఆత్మవిశ్వాసం పెంపొందింపచేసింది. ఆయన ఆలోచనలకు కొండంత బలం చేకూ

ర్చింది. నిమ్న జాతుల హక్కులకోసం ఆయన చేపట్టిన ఉద్యమంలో యీ మహద్ పోరాటం మొట్టమొదటి విజయమని చెప్పవచ్చు. అది అతి చిన్న విషయమైనా అదొక చారిత్రక సంఘటన! నిమ్న జాతుల న్యాయమైన హక్కులకై అంబేద్కర్ చేపట్టిన పోరాటంలో అదొక ముందడుగు. అయితే మహద్ చెరువు నీటి సమస్య పూర్తిగా పరిష్కారం కాలేదు. అంబేద్కర్ ప్రారంభించిన మహద్ పోరాటం అంతటితో ఆగలేదు.

## బహిష్కృత్ భారత్ పత్రిక

మహద్ పోరాటంతో అటు అంబేద్కర్ పేరు ప్రజల్లో ప్రచారానికి వచ్చింది. ఇటు అంబేద్కర్‌కు తాను చేపట్టిన నిమ్న జాతుల ఉద్ధరణ ఉద్యమం పట్ల ఆత్మ విశ్వాసం ఉత్సాహం నైతికబలం కలిగించాయి. కనుక తన ఉద్యమ కార్యక్రమాలు తన ఆలోచనలు పదిమందికి తెలియజేయడం మంచిదనుకున్నాడు. దానివలన యెంతో ప్రయోజనం ఉంటుందని ఆయన నమ్మాడు. అందుకు ఒక ప్రసార సాధనం వుంటేనే అది సాధ్యమౌతుంది కనుక ఒక పత్రిక స్థాపించాలనుకున్నాడు. ఇదివరలో నడిపిన మూక్‌నాయక్ పత్రిక ఆయన లండన్‌లో చదువులకై వెళ్ళడంతో మూత పడ్డది. సరస్వతీ విలాస్ పత్రిక విద్యార్థులకోసం పెట్టింది. అదీ సరిగ్గా నడవడంలేదు.

1927 ఏప్రిల్ నెలలో బహిష్కృత్ భారత్ అనే పత్రికను స్థాపించాడు. తన నాయకత్వంలో నడుపుతున్న "బహిష్కృత హితకారిణి సభ" చేపడుతున్న దళిత జన ఉద్ధరణ కార్యక్రమాలు కులవ్యవస్థ మీద తన ఆలోచనలు యీ పత్రికలో ప్రచురించేవాడు. బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సమావేశాల్లో ఆయన చేసిన ప్రసంగాలు గూడా యీ పత్రికలో ప్రచురించేవాడు. నిమ్న జాతీయుల్ని జాగృతం చేయడంకోసం యీ పత్రికలో వ్యాసాలు రాసేవాడు. నిమ్నజాతీయుల్లో స్వాభిమానం-స్వయంకృషి సంఘటిత భావం పెంపొందించటానికి వారిని చైతన్యవంతుల్ని చేయడం యీ పత్రిక యొక్క ముఖ్య ఉద్దేశం.

# మనుస్మృతి దహనం

మహద్ చెరువు నీటి సమస్య తీరలేదు. అంబేద్కర్ ఆయన అను చరులు చెరువులో దిగి నీరు త్రాగినంత మాత్రాన -మహద్ గ్రామంలోని సవర్ణ హిందువులు దళిత జాతులవారిని నీరు ముట్టుకోనీయడం లేదు. బొంబాయి శాసనసభ చేసిన తీర్మానాన్ని మన్నించమనీ - నిమ్నజాతీయుల్ని చెరువు నీళ్ళు వాడుకోనీయమని - జిల్లా మేజిస్ట్రేట్ చెప్పిన మాట వారు వినలేదు. పైగా మునిసిపాలిటీచేత ఆ చెరువు "చౌదార్" చెరువుగా తీర్మానం చేయించారు. "చౌదార్" అంటే కొందరి ఆస్తి అని అర్థం. చెరువు సవర్ణ హిందువులదే తప్ప వూరివారందరిదీ కాదని దానర్థం. దానికి తోడు దళితులపై దాడిచేసినందుకు సవర్ణ హిందువులపై పెట్టిన కోర్టుకే సుల్లో సవర్ణ హిందువులకు కొందరికి కఠిన కారాగార శిక్షపడింది. దానితో సవర్ణ హిందువులు మరీ రెచ్చిపోయారు చెరువు నీరు వాడుకోనీయకపో వడంతోపాటు ఆ వూరి దళితజాతులవార్ని హిందువులు నానా హింసలు పెట్టడం మొదలు పెట్టారు. ఈ విషయం తెలిసిన అంబేద్కర్ ఆగ్రహంతో ఉగ్రనరసింహ అవతారమెత్తాడు. ఆవేశంతో వూగిపోయాడు. హితకారిణి సభ ద్వారా పలుచోట్ల సభలు ఏర్పాటు చేయించాడు. ఆ సభల్లో మహద్ గ్రామ అగ్రవర్ణాల వారి ఆగడాలు ఎండగట్టాడు. అగ్రవర్ణాల వారి దౌర్జన్యాలు - నిమ్నజాతులవారి కష్టాలు అందరికీ వివరించేవాడు. ఇవన్నీ బహిష్కృత భారతిలో ప్రచురించేవాడు. మహద్ చెరువు నీరు దళితుల్ని వాడుకోని య్యకపోతే సత్యాగ్రహం చేపడతామని ప్రకటించాడు. అందుకు సన్నాహాలు చేయడం మొదలుపెట్టాడు. విరాళాలు వసూలు అయ్యాయి. "సమాజ్ సమతా సైనిక్‌దళ్" లో వాలంటీర్లు చేరడం మొదలుపెట్టారు. ఇదంతా కనిపెట్టి చూస్తున్న మహద్ గ్రామ సవర్ణ హిందువులు చౌదార్ చెరువు కొందరి ఆస్తి మాత్రమేనని కోర్టులో దావా వేసారు. కోర్టు వారు అగ్ర వర్ణాల వారికి అనుకూలంగా తాత్కాలిక ఉత్తర్వు ఇచ్చారు (Temporary Injection) కోర్టు ఆర్డర్ అండ చూచుకొని సవర్ణులు మరీ రెచ్చిపో యారు. అంబేద్కర్ దళిత జాతులవారు తీవ్రంగా ప్రతిస్పందించారు.

దళిత జాతులవారిని సమీకరించి మహద్ పట్టణంలో రెండోసారి అంబేద్కర్ సమావేశం జరిపాడు. రాజ్ భోజ్ తదితర నిమ్న జాతి నాయకులు అంబేద్కర్‌కు అండగా నిలబడ్డారు. నిమ్న జాతీయుల దయనీయ స్థితికి అగ్రవర్ణాల వారి అమానుషమైన ఆగడాలకు మూలకారణం "మనుస్మృతి" అని ఆయన విరుచుకొనిపడ్డాడు. శూద్రులు అస్పృశ్యులు - వేదాలు చదవరాదని - వినరాదని - చదివిన వారి నాల్కలు తెగనరకాలనీ - విన్నవారి చెవుల్లో సీసం కరిగించి పోయాలనీ శాసించిన మనుస్మృతి మూలాననే శూద్రులకు అస్పృశ్యులకు యీ దుస్థితి పట్టిందని విమర్శించాడు. మను ధర్మశాస్త్రం అండ చూచుకొనే అగ్రవర్ణాల వారు దళితజాతుల్ని హీనంగా చూస్తున్నారు! మనుస్మృతిపై అంబేద్కర్‌కు పట్టలేని కోపం వచ్చింది. 1927 డిశంబరు 25 వ తారీఖున వేలాది మంది శూద్రులు దళితజాతులవారి సమక్షంలో "మనుస్మృతి" ని బహిరంగంగా దహనం చేసాడు. ఈ వార్త యావత్ భారతదేశంలో "దావానలం" లా వ్యాపించింది. సనాతన హిందువులు కారాలు మిరియాలు నూరారు. హిందూ మతాచార్యులు యిది సహించరాదని విమర్శించారు. కొందరిది హిందూ మతానికి జరిగిన "అపచారం"గా అవమానంగా భావించారు ఆవేదన చెందారు. అయితే దేశ నాయకులెవరూ కాంగ్రెస్ వారెవరూ ముఖ్యంగా గాంధీజీగానీ నెహ్రూజీగాని నోరుమెదపలేదు. శూద్ర కులాలవారు నిమ్న జాతీయులు అభ్యుదయ భావాలు కలిగిన యువతరం సంతోషించారు.

పాఠకులారా! అంబేద్కర్ మనుస్మృతిని బహిరంగంగా తగలబెట్టాడంటే దానర్థం - అది అగ్రవర్ణాల వారికి కనువిప్పుకావాలని. అది కుటిల కులవ్యవస్థను క్రూరమైన అస్పృశ్యతను సమర్థిస్తుంది కనుక అందుకు నిరసనగా దానిని తగల బెట్టాడన్నమాట! అంతే కాని - మనుస్మృతిని తగలబెట్టగానే కులాలు కూలిపోతాయనిగాని - అస్పృశ్యత అణగారి పోతుందనిగాని అర్థంకాదు! కుటిల వ్యవస్థ మీద - అమానుషమైన అస్పృశ్యతా దురాచారం మీద ఆయనకున్న ద్వేషానికి అది గుర్తు!

మహద్ పోరాటం ఉధృతం చేస్తాననీ తలపెట్టిన సత్యాగ్రహం ప్రారం

బిస్తానని అంబేద్కర్ ప్రకటించాడు. అయితే కోర్టు తీర్పు వచ్చే వరకు తమ పోరాటాన్ని వాయిదా వేసుకోమని జిల్లా కలెక్టర్ అంబేద్కర్‌ని కలిసి పదే పదే విజ్ఞప్తి చేసాడు. కోర్టులు చట్టం పట్ల అభిమానమున్న వాడు అంబేద్కర్. అలాగే ఆయన శాంతి ప్రియుడు. కలెక్టర్ విజ్ఞప్తి మేరకు తన ఉద్యమాన్ని తాత్కాలికంగా నిలుపుదలచేస్తున్నట్లు ప్రకటించాడు. దానితో మహద్‌లోని సవర్ణులేకాదు రాష్ట్రంలోని అగ్రవర్ణాలవారంతా వూపిరిపీల్చు కున్నారు.

ఆనాడు చెరువులో దిగి నీరు దోసిట బట్టి తాగడం యీనాడు మనుస్మృతి బహిరంగంగా తగలబెట్టడం అంబేద్కర్ చేపట్టిన వుద్యమంలో పెద్ద ముందడుగు! ఉద్యమ విజయ సంకేతాలు! నిమ్నజాతీయుల్ని సంఘ టిత పరిచిన సంఘటనలు. అంబేద్కర్‌కు ఆత్మ స్థైర్యం ఆత్మ విశ్వాసం చేకూర్చిన సంఘటనలు.

అంబేద్కర్ బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్లో సభ్యుడిగా వుండగా ఆయన్ని స్టార్ట్ కమిటీలో సభ్యుడిగా బొంబాయి ప్రభుత్వం నియమించింది. నిమ్నజాతీయులు- ఆదిమవాసుల జీవన పరిస్థితులు పరిశీలించటానికి యీ కమిటీ బెల్గాం-నాసిక్ తదితర ప్రాంతాలు ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలు పర్యటించింది. ఈ పర్యటనలో అంబేద్కర్ చేదు అనుభవాలు యెదుర్కో నవలసి వచ్చింది. ఆయన అస్పృశ్యుడని - ఒక చోట టాంగా యెక్క నీయలేదు. టాంగావాలాతో సంప్రదించారు. వాడు టాంగా నిస్తాను కొని తానుతోలనన్నాడు. ఎవరినైనా బండిని తోలుకోమన్నాడు. అంబేద్కర్ అభిమాని యొకడు టాంగాను తోలాడు. అనుభవంలేని వాడు. కొత్తవా డుకావడం వల్ల - గుర్రం బెదిరింది. టాంగా బోల్తా పడింది. అంబేద్కర్ క్రిందపడిపోయాడు. కాలు ఎముక విరిగింది. అసెంబ్లీ సభ్యుడైనా అస్పృ శ్యుడేగదా!

చూసారా! అంబేద్కర్ ఒంటరిగా ఎలా ఉద్యమిస్తున్నాడో ! ఎలా ముందడుగు వేస్తున్నాడో! మనుస్మృతి దహనం చేస్తే సమస్య తీరిపో తుందని కాదు. అది ఆయన కోపానికి చిహ్నం. అగ్రవర్ణాల వారికి

అది కనువిప్పు కావాలని ఆయన ఆకాంక్ష! మనుస్మృతి కులం కుళ్ళుకు అసమానతకు ప్రతిరూపమని అలా చేశాడు.

## నాసిక్ దేవాలయ ప్రవేశ ఉద్యమం

దళిత జాతీయుల్ని హిందూ దేవాలయాలలోనికి రానీయరని మనం ముందు చెప్పుకున్నాం. అందరూ దేవుని బిడ్డలని హిందూ మతం చాటుతుంది. మరి నిమ్న జాతీయుల్ని గుళ్ళలోనికి యెందుకు రానీయడంలేదు! అంబేద్కర్ నిమ్నజాతీయుల దేవాలయ ప్రవేశం ఉద్యమం చేపట్టాడు.

1930 మార్చిలో అంబేద్కర్ స్వయంగా నాసిక్‌లోని కాలారామ్ దేవాలయంలోనికి నిమ్నజాతుల వారి ప్రవేశం కోసం ఉద్యమం చేపట్టాడు. నిమ్నజాతుల నాయకుడైన బి.కె. గైక్వాడ్ తదితరులు అంబేద్కర్‌కు అండగా నిలబడ్డారు. గుడిలోనికి నిమ్న జాతీయుల వారి ప్రవేశాన్ని దేవాలయ ధర్మకర్తలు నానుస్తూ కాలయాపన చేయసాగారు. ప్రత్యక్ష పోరాటానికి రాష్ట్రంలోని వేలాది మంది నిమ్నజాతీయుల్ని సమీకరించాడు అంబేద్కర్. ఈ పోరాటంలో శ్రీయుతులు పి.యస్ రాజ్‌భోజ్- శివతార్కార్- బి.జికేర్ ప్రధాన్ - పతిత్ పావనదాస్ వంటి కాకలు తీరిన నాయకులు పాల్గొన్నారు. వందలాది మహిళలు గూడా పాల్గొన్నారు. అయితే దేవాలయ ద్వారాలు మూసివేసారు ధర్మకర్తలు పూజారులు. జిల్లా మెజిస్ట్రేట్ జిల్లా పోలీసు అధికారి వచ్చి అంబేద్కర్‌కు నచ్చ చెప్ప ప్రయత్నించారు. అంబేద్కర్ వారి మాట ససేమిరా వినలేదు. నిమ్న జాతీయులు దేవాలయంలోని దేవుణ్ణి దర్శించుకోవలసిందే అన్నాడు. దేవాలయం తలుపులు తీయటానికి ధర్మకర్తలు పూజారులు అంగీకరించలేదు. మూసిన తలుపులు మూసినట్లే ఉన్నాయి. నెలరోజులు గడిచినా గుడి తలుపులు తెరవలేదు. గుళ్ళో దేవుడికి పూజా పునస్కారాలు గూడా లేకుండా పోయాయి. నిమ్నజాతీయులవాలంటీర్లు వంతులు వారీగా దేవాలయం నలుప్రక్కలు ముఖ ద్వారాల దగ్గర రోజూ బైఠాయింపు చేస్తూ సత్యాగ్రహ ఉద్యమం సాగిస్తున్నారు. ఇంతలో శ్రీరామ నవమి సమీపిస్తోంది. ఆనాటికైనా గుడి తలుపులు తీసి

దేవుడికి పూజలు జరుపలేకపోతే గ్రామానికి ఏం కీడు ముంచుకొస్తుందో అని ధర్మకర్మలు పూజారులు గ్రామ పెద్దలు ఆందోళన చెందసాగారు. అంబేద్కర్ తదితర నిమ్న జాతీయ పెద్దలతో బేరాలకు దిగారు. శ్రీరామ నవమి ఉత్సవాలలో హిందువులతోపాటు అస్పృశ్యులు గూడా పాల్గొనేటట్లు అంగీకారం కుదిరింది. మొదటి రోజునకార్యక్రమం సజావుగానే సాగింది. హిందువులు దళితులు అందరూ కలిసి ఉత్సవ కార్యక్రమాల్లో పాల్గొన్నారు. రెండవ రోజు రథోత్సవంలో హిందువులకు దళితులకు ఘర్షణలు జరిగాయి.

ఆ అలజడి అంతటితో ఆగలేదు. నాసిక్ జిల్లా అంతటా ప్రాకి పోయింది. హిందువులకు- నిమ్నజాతీయులకు గ్రామగ్రామంలో ఘర్షణలు జరగడం మొదలైనాయి. హిందువులు మర్యాదగా నిమ్నజాతులవారిని గౌరవించాలని లేకపోతే ప్రత్యక్ష పోరాటం చేపట్ట వలసివస్తుందని అంబేద్కర్ తీవ్రంగా హెచ్చరించాడు. మహారాష్ట్రలో ప్రారంభమైన యీ దేవాలయ ప్రవేశ ఉద్యమం యితర రాష్ట్రాల లోనికి గూడా ప్రాకింది. మద్రాస్-మధురై తిరువన్కూర్-గురువాయూర్ మొదలగు చోట్ల ఉద్యమాలు జరిగాయి. ఆంధ్రలో రాజమండ్రి ఏలూరు విశాఖపట్నం చిత్తూరు మొదలగు ప్రాంతాలలో ఉద్యమం బయలుదేరింది. హిందువులు నిమ్నజాతులవారిని దేవాలయాల లోనికి రానీయకుండా నానా హింసలు పెట్టేరు.

1929లో సమతా అనే పత్రికను స్థాపించాడు. దాని స్థానంలో 1930లో జనతా పత్రికను స్థాపించాడు. దరిమిలా యీ పత్రికకు అంబేద్కర్‌కుమారుడు యశ్వంత్ రావ్ సంపాదకత్వం వహించాడు. జనతా పత్రిక ధోరణి చూసి ప్రభుత్వం దానిపై ఒక కన్నేసి వుండేది. అంబేద్కర్ దేవాలయప్రవేశ ఉద్యమాన్ని గాంధీజీ కంటే ముందే చేపట్టాడు. అయితే నిమ్నజాతీయుల అభ్యున్నతికి దేవాలయ ప్రవేశం అంతముఖ్యమైన దికాదని ఆయన గ్రహించాడు. వారి సామాజిక ఆర్థిక పరిస్థితులు మెరుగు పరచాలని ఆయన వారి హక్కులుకై పోరు సాగించాడు.

పాఠకులారా! ఒక ముఖ్య గమనిక. 'హరిజన' ఉద్ధరణ చేస్తున్నాం అనే గాంధీజీ - కాంగ్రెస్ వారు అంబేద్కర్ నడుపుతున్న నాసిక్

దేవాలయ ప్రవేశ విషయంలో కిమ్మనకుండా వూరకుండిపోయారు. ఇంకో విషయం - కేలప్పన్ అనే సంస్కర్త కేరళలో గురువాయూర్‌లో హరిజన దేవాలయ ప్రవేశ ఉద్యమం చేపట్టాడు. గాంధీజీ ముందు కేలప్పన్‌ను సమర్థించారు. తర్వాత తొందరపడవద్దని సలహాయిచ్చాడు. గాంధీజీ- కాంగ్రెస్ వారి రెండు నాల్కల ధోరణిని అంబేద్కర్ తీవ్రంగా విమర్శించాడు. కేంద్ర శాసన సభలో రంగయ్యర్ సుబ్బరాయన్‌లు "అస్పృశ్యతా నివారణ బిల్లు" ప్రవేశపెట్టారు. గాంధీజీ అంబేద్కర్‌ని యీ బిల్లును సమర్థించమన్నాడు. బిల్లులో "అస్పృశ్యత పాటించడం నేరమని" లేదు కనుక దానిని సమర్థించనని అంబేద్కర్ తేల్చి చెప్పాడు. కాంగ్రెస్ వారు గూడా యీ బిల్లును వ్యతిరేకించారు. రంగయ్యర్ బిల్లును మొదట సమర్థించిన గాంధీజీ చివరకు వ్యతిరేకించాడు.

* * *

వెలివేయంబడి నట్టి వర్గమున ఆ
విర్భావమున్ బొంది - ని
శ్యల దీక్షన్ చదువుల్ గడించి - కులదా
స్య వ్యూహముల్ చెండి - సం
కెలలన్ ద్రెంచి - నిరుద్ధ భారత విము
క్తిన్ దెల్పి - కూలీలు రా
జులుగా జూచిన నాయకోత్తమ - నమ
స్సుల్ - డాక్టరంబేద్కరా!

పద్మశ్రీ బోయి భీమన్న

# సైమన్ కమిషన్

1919 బ్రిటీష్ యిండియా చట్టప్రకారం యిండియా రాజ్యాంగాన్ని సవరించే ముందు భారతీయుల అభిప్రాయాలు సేకరించేందుకు బ్రిటీషు ప్రభుత్వం సైమన్ నాయకత్వంలో సైమన్ కమిషన్ యిండియాకు పంపించింది. ఈ కమిషన్‌లో అందరూ బ్రిటీషు వారే సభ్యులు. భారతీయులెవరూ లేరు. భారతదేశంలో పర్యటిస్తూ భారతీయుల అభిప్రాయాలు సేకరించే కమిషన్‌లో భారతీయులెవరూ సభ్యులుగా లేకపోవడం పట్ల ఆనాడు దేశంలో ఆగ్రహం వెల్లుబికింది.కాంగ్రెస్ పార్టీ సైమన్ కమిషన్‌కు సహకరించేందుకు నిరాకరించింది.

మీరు వినే వుంటారు. ఈ సైమన్ కమిషన్ దేశంలో ఎక్కడికి వెళ్ళితే అక్కడ గోబ్యాక్ సైమన్ (Go back Simon) సైమన్ వెనక్కి వెళ్లిపో అంటూ ప్రజలు నాయకులు నినాదాలిస్తూ సైమన్ కమిషన్‌ను బహిష్కరించారు. అయితే బొంబాయి రాష్ట్ర సలహా సంఘం తరుపున అంబేద్కరు సైమన్ కమిషన్‌ను కలిసాడు. భారతదేశంలో నిమ్నజాతుల వారి దయనీయ జీవిత స్థితి గతుల గూర్చి ఒక నివేదిక సమర్పించాడు. నిమ్నజాతుల సమస్యల విషయంలో దేశ నాయకులతో హిందూ నాయకులతో తాను విభేదించినా దేశ స్వాతంత్ర్య విషయంలో మాత్రం తాను కాంగ్రెస్ పార్టీ నాయకులతో ఏకీభవిస్తానని గట్టిగా చెప్పాడు. ఒకదేశాన్ని పాలించే అధికారం యింకొక దేశానికెక్కడుంది! అని సైమన్ కమిషన్‌కు కుండబద్దలు కొట్టినట్లు చెప్పాడు. భారతదేశం స్వతంత్రమై నూతన రాజ్యాంగాన్ని రూపొందించుకోవాలి. ఆ రాజ్యాంగం ప్రకారం పీడిత కులాల వారికి రక్షణలు కల్పించాలి అని ఆయనంటూ యింకా స్వతంత్ర భారతదేశంలో నిమ్నజాతీయులు పాలకులుగా వుండగోర్తారుకాని పాలితులుగా రెండవ తరగతి పౌరులుగా వుండేందుకెంత మాత్రం అంగీకరించరు అని నొక్కి చెప్పాడు. దేశ జనాభాలో అయిదవవంతు ఉన్న దళిత జాతులకు సముచిత ప్రత్యేక స్థానాలు కేటాయించాలని తన నివేదికలో కోరాడు.



మహద్ చౌదార్ చెఱువులోదిగి డా. అంబేద్కర్ (తన అనుచరులతో)
నీరు త్రాగుట




తాను స్థాపించిన జనతా మొదలగు పత్రికల మధ్య
డా. అంబేద్కర్



లండన్‌లో రెండవరౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొన్న
1) గాంధీజీ 2) డా. అంబేద్కర్ తదితర భారతీయ ప్రతినిధులు



ఎరవాడ జైలులో ఆమరణ దీక్షపూనిన గాంధీజీతో
డా. అంబేద్కర్ సమావేశమగుట



తాను స్థాపించిన ఇండిపెండెంటు లేబర్‌పార్టీ సభ్యులతో డా. అంబేద్కర్



తాను స్థాపించిన అఖిలభారత నిమ్నజాతుల సమాఖ్య
సభ్యులతో డా. అంబేద్కర్



వైస్రాయ్ లార్డ్ వేవల్ మరియుకౌన్సిల్ సభ్యులతో కార్మికసభ్యుడుగా
డా. అంబేద్కర్



బొంబాయిలో డా. అంబేద్కర్ స్థాపించిన సిద్ధార్థ కళాశాల భవనం (ఆనందభవన్)

# మొదటి రౌండ్ టేబుల్ సమావేశం

1930 మే మాసంలో సైమన్ కమిషన్ తన నివేదికను బ్రిటీషు ప్రభుత్వానికి సమర్పించింది. భారతదేశంలో విభిన్న జాతులు వివిధ మతాలు వివిధ కులాల వారి మధ్య స్వాతంత్ర్యం విషయంలో ఏకాభిప్రాయం లేదు కనుక యింతలో స్వాతంత్ర్యం యివ్వనక్కరలేదు. కేంద్ర శాసన సభలోని 250 స్థానాల్లోను 150 స్థానాలు హిందువులకు దళిత జాతులకు కలిపి యివ్వాలి. మిగతా 100 స్థానాలు మహమ్మదీయులు సిక్కులు తదితర అల్ప సంఖ్యాక వర్గాలకు యివ్వాలి. ఇదీ సైమన్ కమిషన్ నివేదికలోని సారాంశం!

సైమన్ కమిషన్ నివేదికకు వ్యతిరేకంగా దేశమంతటా అలజడి రేగింది. స్థానాలు కేటాయించడంలో తమకు అన్యాయం జరిగిందని కాంగ్రెస్ వారు పెద్ద విమర్శ లేవదీసారు. నిమ్నజాతులకు ప్రత్యేక స్థానాలు కేటాయించలేదని అంబేద్కర్ సైమన్ కమిషన్ నివేదిక మీద విరుచుకొని పడ్డాడు. కనుక భారతీయుల్ని శాంతింపజేయాలని బ్రిటీషు ప్రభుత్వం తలపెట్టింది. కనుక లండన్‌లో 1930 నవంబరులో వివిధ భారతీయ ప్రతినిధులతో రౌండ్ టేబుల్ సమావేశం ఏర్పాటు చేసింది. బ్రిటీషు ప్రభుత్వం భారతదేశం లోని అన్ని పార్టీలవారిని అన్ని మతాల వారిని అన్ని వర్గాలవారిని ఆహ్వానించింది. సంస్థా నాధిపతులను గూడా ఆహ్వానించింది. ఈ సమావేశాన్ని కాంగ్రెస్ పార్టీ బహిష్కరించింది. దళిత జాతుల తరుపున అంబేద్కర్ ఆర్ శ్రీనివాసన్ యీ సమావే శాల్లో పాల్గొన్నారు. సర్వశ్రీ సర్.తేజ్ బహదూర్ సప్రూ-యం. ఆర్. జయకర్ రైటానరబుల్ శ్రీనివాస శాస్త్రి. జిన్నా-అగాఖాన్- సర్దార్ ఉజ్వల్‌సింగ్ డాక్టర్ బి.యస్. మూంజే.కె.టి. పాల్-సర్.సి.పి. రామ స్వామి అయ్యర్ సర్. అక్బర్ హైదరీ మొదలగు హేమాహేమీలు యీ సమావేశాల్లో పాల్గొన్నారు. ఈ రౌండు టేబుల్ సమావేశాన్ని తెలుగులో "గుండ్రని బల్ల" సమావేశాలు అని అంటారు. ఇది ఎబ్బెట్టుగా వుంది కదూ!

ఈసమావేశాల్ని బ్రిటీష్ చక్రవర్తి ప్రారంభించాడు. బ్రిటీష్ ప్రధాని రామ్‌సే మేక్డొనాల్డ్ సమావేశాలకు అధ్యక్షత వహించాడు.

సమావేశాల్లో పాల్గొన్న నాయకులందరు సంస్థాన ప్రతినిధులు తమ తమ అభిప్రాయాలు వెల్లడించారు. మొత్తం మీద అందరూ భారతదేశానికి స్వాతంత్ర్యం సాధ్యమైనంత త్వరలో యిచ్చి తీరాలని వాదించారు. అయితే అంబేద్కర్ గూడా దేశానికి స్వాతంత్ర్యం యివ్వాలని కనీసం ముందుగా డొమినియన్ స్టేటస్ యిచ్చి తీరాలని కోరాడు. భారత దేశంలో హిందూ సమాజంలో పేరుకు మాత్రం హిందువులుగా పరిగణింపబడుతున్నా తర తరాల నుండి చెప్పలేని హింసలకు అవమానాలకు దోపిడీకి- గురి అవుతూ పశువులకన్న హీనంగా బ్రతుకుతున్న నిమ్నజాతుల వారికి భద్రత హక్కులు ముందు ఇచ్చి తీరాలని గట్టిగా వాదించారు. ఆయన అల్పసంఖ్యాక వర్గాల ఉప సంఘంలో సభ్యుడు - నిమ్నజాతీయుల్ని అల్పసంఖ్యాక వర్గాలలో చేర్చాలని అన్నాడు. వారికి యీ క్రింది డిమాండ్లు కోరుతూ "అల్ప సంఖ్యాక ఉపసంఘానికి" ఒక మెమొరాండం సమర్పించాడు!

1) సవర్ణ హిందువులతో సమానమైన పౌరహక్కు 2) కుల విపక్ష నుండి రక్షణ 3) శాసన సభల్లో ప్రాతినిధ్యం 4) ప్రభుత్వ ఉద్యోగాలలో ప్రాతినిధ్యం 5) మంత్రివర్గాలలో ప్రాతినిధ్యం ఇవి తప్పక నిమ్నజాతుల వారికి వుండితీరాలని అంబేద్కర్ కోరాడు. అగ్రవర్ణాల వారు నిమ్నజాతీయుల్ని అణగతొక్కివేసారు. పోనీ బ్రిటీష్ వారొచ్చి అయినా వాళ్ళను ఉద్ధరించారా అంటే అదీలేదు. కనుక స్వతంత్ర భారతదేశంలోనే మా నిమ్నజాతీయుల హక్కులు మేం సంపాదించుకొంటాం కనుక దేశానికి స్వాతంత్ర్యం యివ్వాలని కోరాడు. ఇంగ్లాండు - యితరదేశాల పత్రికలు ఆయన్ని ప్రశంసించాయి. బ్రిటీషు నాయకులు ఆయన్ని కొనియాడారు. బ్రిటీషు నాయకుల్ని కలిసి నిమ్నజాతీయుల దుస్థితి వివరించాడు. బ్రిటీష్ పత్రికల్లో వ్యాసాలు రాసాడు. అంబేద్కర్ గురించి ఆయన ప్రతిభ గురించి నిన్నటి వరకు యిండియాలో మాత్రమే తెలుసు. ఇప్పుడు బయటి ప్రపంచానికి గూడా తెలిసిపోయింది! నిమ్నజాతీయులదయనీయస్థితి గురించి

వాళ్ళ అభ్యున్నతికి అంబేద్కర్ చేస్తున్న [illegible] యిప్పుడు లోకానికి తెలిసింది.

అంబేద్కర్ దేశస్వాతంత్ర్యాన్ని [illegible] షించారు. అయితేస్వాతంత్ర్యానికి ఎవరు [illegible] ట్టడం పట్ల చాలా మంది కాంగ్రెస్ [illegible] ఇక్కడ ఒక చిన్న సంఘటన గురించి [illegible] నాధీశులతో పాటు బరోడా మహారాజావారు కూడా ఈ [illegible] పాల్గొన్నాడు. ఆయన అంబేద్కర్ ఉపన్యాసం [illegible] చాతుర్యం - వాదనా పటిమ - శాస్త్రీయ [illegible] - [illegible] ఆయన మాట్లాడిన తీరు చూచి బరోడా [illegible] య్యాడు. అంబేద్కర్ ఉన్నత విద్యకు బరోడా మహారాజా [illegible] సహాయం చేసింది. అంబేద్కర్ యింతటి ప్రయోజకుడైనందుకు [illegible] వాడైనందుకు రాజావారు ఆయన్ని కళ్ళారా చూసి మురిసిపోయాడు. అంబేద్కర్‌ని మనసారా అభినందించాడు. ఆ ఆనందంతో అంబేద్కర్‌కి విందు ఏర్పాటు చేసాడు (కొద్ది మంది ప్రముఖులతో). మహారాణి వారికి మహారాజావారు అంబేద్కర్ గురించి గొప్పగా చెప్పాడు. ఇంతగా యిప్పుడు ఆనందించిన రాజావారు ఆనాడు అంబేద్కర్‌ని సంస్థాన ఉద్యోగులు పెట్టిన బాధలకు ఏమీ చేయలేక పోయారు. సమావేశాలు ముగిసాక అందరూ స్వదేశం తిరిగి వచ్చారు. అంబేద్కర్‌కి స్వదేశంలో అఖండ స్వాగతం లభించింది. దళిత జాతుల ఏకైక నాయకుడని అంబేద్కర్‌ని అందరూ ప్రశంసించారు. దళితులు ఆయన్ని తమ నాయకుడని శ్లాఘించారు.

పాఠకులారా! దళిత జాతుల హక్కులకోసం లండన్‌లో బ్రిటీష్ చక్ర వర్తి ముందు బ్రిటీష్ ప్రధాని ముందు అంబేద్కర్ ఎంత నిర్భయంగా ఎంత గట్టిగా ఎంత నిర్మొహమాటంగా వాదించాడో చూసారా! చాలా ఆశ్చర్యంగా వుంది కదూ! ఆయన ప్రపంచ దృష్టి నాకర్షించాడు.

# గాంధీజీతో సమావేశం

రౌండ్ టేబుల్ సమావేశం నుండి తిరిగి వచ్చాక అంబేద్కర్‌కు అనేక చోట్ల సన్మానాలు జరిగాయి. ఆయన్ని నిమ్నజాతీయుల రక్షకుడిగా కొనియాడసాగారు. రెండో ప్రక్క గాంధేయులు కాంగ్రెస్ వారు అంబేద్కర్ దేశ స్వాతంత్ర్యానికి నిమ్నజాతీయుల హక్కులకు ముడిపెట్టడం తీవ్రంగా విమర్శింపసాగారు. ఒక పక్షం వారు రెండో పక్షం మీద ఒకరు నొకరు తీవ్ర పద జాలంతో విమర్శించుకోవడం మొదలుపెట్టారు.

ఈ పరిస్థితుల్లో గాంధీజీ అంబేద్కర్‌తో స్వయంగా మాట్లాడితే పరిస్థితులు కొంత సర్దుబాటు కావచ్చునని తలంచాడు. ఎలాగైతేనేమి గాంధీజీ గొప్ప లౌక్యమెరిగినాడు కదా! 1931 ఆగస్టులో బొంబాయిలోని మణి భవన్‌లో గాంధీజీ కోరిక మేరకు అంబేద్కర్ గాంధీజీని కలుసుకున్నాడు.

కాంగ్రెస్ వారు తామూ హరిజనుల ఉద్ధరణకు లక్షలాది రూపాయలు వెచ్చించి శ్రద్ధగా కృషిచేస్తున్నామన్నాడు గాంధీజీ. నిమ్నజాతుల సేవ విషయంలో కాంగ్రెస్ వారి చిత్త శుద్ధి పై తనకు నమ్మకం లేదన్నాడు అంబేద్కర్. ప్రతి కాంగ్రెస్ కార్యకర్త విధిగా ఖద్దరు కట్టాలని నియమం వుంది కదా! అలానే ప్రతి కాంగ్రెస్ కార్యకర్త అస్పృశ్యతను పాటించ రాదన్న నియమమెందుకు పెట్టలేదని అంబేద్కర్ ప్రశ్నించాడు. దేశ స్వాతంత్ర్యాన్ని కాదన కుండా తాను నిమ్నజాతీయుల ఉద్ధరణకు త్రికరణ శుద్ధిగా కృషిచేస్తూంటే తనను దేశద్రోహి అని యెందుకు కాంగ్రెస్‌వారు చిత్రిస్తున్నారని ప్రశ్నించాడు అంబేద్కర్. స్వాభిమానంతో ఆత్మ విశ్వాసంతో స్వయం సహాయంతో తమ సమస్యల్ని తామే పరిష్కరించుకుంటామని గాంధీజీతో నిష్కర్షగా చెప్పాడు అంబేద్కర్. కుక్కల కంటే పిల్లుల కంటే తననూ తన నిమ్న జాతీయులను నీచంగా చూస్తున్న దేశం తమ మాతృదేశమని చెప్పకొంటానికి సిగ్గుగా వుందని అంబేద్కర్ నిర్భయంగా అన్నాడు. అస్పృశ్యులు హిందూ సోదరులు. వారికి ప్రత్యేక రాజకీయ రక్షణలు కల్పించటానికి తాను ఏ మాత్రం అంగీకరించేంది లేదని గాంధీజి అంబేద్కర్‌కు కరాకండిగ తేల్చి చెప్పాడు. తన వైఖరి ఏమిటో ఖచ్చితంగా తేల్చిచెప్పినందుకు కృతజ్ఞతలు తెలియజేసి అంబేద్కర్ ఆవేశంతో బయటికి వచ్చేసాడు.

గాంధీజీ- అంబేద్కర్‌ల మధ్య సమావేశం వలన సమస్య ఏమాత్రం పరిష్కారం కాలేదు. ఎవరి వైఖరిలో వారున్నారు. గాంధీజీని నమ్ముకుంటే తమ సమస్యలు పరిష్కారం కావని స్వయంకృషితో ఆత్మ విశ్వాసంతో సంఘటితంగా మనకు మనమే పోరాటం సాగించవలసి వున్నదని అంబేద్కర్ తన అనుచరులకు పిలుపు నిచ్చాడు.

అంబేద్కర్‌లోని నిర్భయత్వాన్ని వాదనా పటిమను నిజాయితీని ధృఢ నిశ్చయాన్ని చూచి గాంధీజీ ఆశ్చర్యపోయాడు. అంబేద్కర్‌ని గాంధీజీ చూడడం అదే మొదటిసారి.

పాఠకులారా! గాంధీజీ అంటే ఆనాడు భారతీయులకు దేవుడు. ఆయన మాట వేదవాక్కు. ఆయనతో మాట్లాడడానికి గొప్ప గొప్ప నాయకులే భయపడే వాళ్ళు. గాంధీజీకి ఎదురు చెప్పినవారు ఆనాడు బహూశా లేరేమో కాంగ్రెస్‌లో. మరి అంబేద్కర్ గాంధీజీతో ధైర్యంగా నిర్మొహమాటంగా కుండ బద్దలుకొట్టినట్లు మాట్లాడాటంటే నిజంగా ఆయన నిర్భయ భయంకరుడు ప్రతివాద భయంకరుడు!

## రెండవ రౌండ్ టేబుల్ సమావేశం

లండన్‌లో రెండవ రౌండు టేబుల్ సమావేశాలు 1931 సెప్టెంబర్ నుండి డిశంబర్ దాకా జరిగింది. ఈలోగా అంటే 1931 మార్చిలో గాంధీ - ఇర్విన్‌ల మధ్య ఒక ఒడంబడిక జరిగింది. ఉధృతంగా సాగుతున్న సత్యాగ్రహ ఉద్యమాన్ని తాత్కాలికంగా నిలిపివేయటానికి అంగీకారం కుదిరింది. గాంధీజీ - కాంగ్రెస్ వారు రెండవ రౌండు టేబుల్ సమావేశాల్లో పాల్గొనేందుకు సమ్మతించారు. పరిస్థితులు విషమించకుండా చేయాలన్నది బ్రిటీ షు వారి ఆలోచన. తెగిందాకా తాడు లాగ కూడదన్నది వారి పద్ధతి అదే సమయంలో సాధ్యమైనంతవరకు భారతదేశానికి స్వాతంత్ర్యం యివ్వకుండా మంచిగా కాలయాపన చేయడం వారి ప్లాను! మొదటి సమావేశాల్ని బహిష్కరించిన కాంగ్రెస్ వారు యీ రెండవ సమావేశా

వారు హాజరైనారు. గాంధీజీ గూడా హాజరైనారు. మొదటి సమావేశంలో పలెనే సంస్థాన ప్రతినిధులు మహమ్మదీయ సిక్కు-క్రైస్తవ ప్రతినిధులు గూడా హాజరైనారు. జయకర్ -సెతల్వాడ్-మాలవీయ- సరోజినీనాయుడు - రామస్వామి మొదలియార్ - జిన్నా - శాస్త్రి -మీర్జా-ఇస్మాయిల్ మొదలగువారు పాల్గొన్నారు. అంబేద్కర్ గూడా హాజరైనాడు.

ఈ రెండవ సమావేశాలు జరిగిన నాటికి బ్రిటన్‌లో లేబర్ ప్రభుత్వం లేదు. జాతీయ ప్రభుత్వం అధికారంలోనికి వచ్చింది. భారతదేశానికి అధికారం హస్తగతం చేయటానికి ప్రస్తుత బ్రిటీషు ప్రభుత్వం సుముఖంగా లేదు. గాంధీజీ మైనారిటీల కమిటీలో సభ్యుడైనాడు. అంబేద్కర్ ఫెడరల్ స్ట్రక్చరల్ కమిటీలో సభ్యుడు. సంస్థాన అధిపతులకు మహమ్మదీయులకు తదితర అల్ప సంఖ్యాక వర్గాలకు కాంగ్రెస్ ప్రాతినిధ్యం వహిస్తున్నదని గాంధీజీ వాదించాడు. కనుక ఒక్క కాంగ్రెస్ పార్టీ ప్రతినిధులు తప్ప మిగిలిన వారెవరికీ యీ సమావేశంలో పాల్గొనే హక్కు లేదని గాంధీజీ వాదన. ఆయన దృష్టిలో నిమ్నజాతీయుల తరుపున వచ్చిన అంబేద్కర్ పాల్గొన కూడదని అర్థం. ఆయన గాంధీజీ ప్రతిపాదనలు వినడు. మిగతా అందరూ గాంధీజీ చెప్పు చేతలలోని ప్రతినిధులు. కనుక అంబేద్కర్‌ని యీ సమావేశంలో పాల్గొనకుండా చేస్తే గాంధీ మాట మీద బ్రిటీషు ప్రభుత్వం వారు స్వరాజ్యం యిచ్చేందుకు వెంటనే అంగీకరిస్తారు. ఇదీ గాంధీజీ మన స్సులోని ఆలోచన. అయితే గాంధీజీ వాదనను సమావేశాలలో పాల్గొన్న యితర వర్గాల ప్రతినిధులు గూడా అంగీకరించలేదు. చివరకు బ్రిటీషు ప్రభుత్వం గూడా గాంధీజీ వాదనను తిరస్కరించింది. సంస్థాన అధిపతు లను - మహమ్మదీయులను గాంధీజీ లోపాయికారిగా మంచి చేసుకోవాలని చేసిన ప్రయత్నాలు ఫలించలేదు.

మహమ్మదీయులు సిక్కులు హిందువులు కాదు కనుక వారికి ప్రత్యేక హక్కులు యివ్వడం సమంజసమని గాంధీజీ వాదన. హరిజనులు హిందువులు కనుక స్వాతంత్ర్యం వచ్చాక వారి అభ్యుదయం మేం చూసుకొంటామన్నాడు. స్వతంత్ర భారత దేశ రాజ్యాంగంలో హరిజనుల

సమస్యను ఒక "అనుబంధం"గా (Appendix) చేర్చటానికి గాంధీ సమ్మతించాడు. ప్రత్యేక హక్కులు - రక్షణలకు మాత్రం గాంధీజీ ససేమిరా ఒప్పుకోలేదు. అంబేద్కర్ వాదన యిందుకు భిన్నమైనది. నిమ్నజాతీయులు పేరుకు హిందువులు మాత్రమే కాని హిందూ సమాజంలోవారిని పశువులకన్న హీనంగా చూస్తున్నారు. వారు సమాజంలో సమాన గౌరవం గలిగి జీవించాలనంటే వారికీ ప్రత్యేక హక్కులు ఉండి తీరాలని అంబేద్కర్ వాదన. ఇదే వాదనను మొదటి సమావేశంలో గూడా గట్టిగా చేసి యున్నాడు అంబేద్కర్. అల్ప సంఖ్యాక వర్గాల హక్కులపై కొన్ని అంశాలపై అంగీకారం కుదిరినా ముస్లిం సిక్కుల విషయంలో అంగీకారం కుదరలేదు. సమావేశాలు వాయిదా పడ్డాయి.

బ్రిటీష్ చక్రవర్తి భారతీయ ప్రతినిధులకు విందు ఏర్పాటు చేసాడు. గాంధీజీ కేవలం (మొలకు) సగం అంగీతోనే విందుకు హాజరయ్యాడు. చక్రవర్తికి బ్రిటీష్ నాయకులకిది నచ్చకపోయినా - సర్దుకొనిపోయారు. చక్రవర్తి అంబేద్కర్‌ని ప్రత్యేకించి పలకరించి - ఆయన కుటుంబ విషయాలు - భారతదేశంలోని నిమ్న జాతీయుల దయనీయ జీవన పరిస్థితుల్ని గూర్చి వివరాలడిగి అంబేద్కర్ నుండి ఆసక్తిగా తెలుసుకున్నాడు.

ప్రతినిధులు ఇంటి ముఖం పట్టారు. స్వదేశం తిరిగి వచ్చారు వట్టి చేతులతో నిరాశతో. అంబేద్కర్ లండన్ నుండి అమెరికా వెళ్ళాడు. లండన్‌లో అమెరికాలో మంచి పుస్తకాలు సేకరించాడు. తిరిగి స్వదేశం వచ్చాడు. ఆయనకు ఘనసన్మానాలు జరిగాయి. మహారాష్ట్ర ప్రభుత్వం "జస్టిస్ ఆఫ్ పీస్" అనే బిరుదు ఇచ్చింది. మరలా గాంధేయులు అంబేద్కరేయులు ఒకరిమీద మరొకరు విమర్శలు చేసుకోవడం మొదలు పెట్టారు. తీవ్రస్థాయిలో విమర్శలు చేసుకున్నారు. స్వల్ప ఘర్షణలు గూడా జరిగాయి.

## కమ్యూనల్ అవార్డు

ఇండియాకు తిరిగి వచ్చాక- కాంగ్రెస్ నాయకులతో సుదీర్ఘంగా చర్చించాడు గాంధీజీ. ఆయన బ్రిటీషు ప్రధానికి ఒక లేఖ వ్రాసాడు. హరి

జనులకు ప్రత్యేక నియోజకవర్గాలుండరాదని అయితే సంయుక్త నియోజక వర్గాలకయితే తమకు అభ్యంతరం లేదని ఆ లేఖలో గాంధీజీ తెలిపాడు. హరిజనులకు గాని ప్రత్యేక నియోజక వర్గాలు ఇస్తే తాను ప్రాణ త్యాగం చేస్తానని గూడా బెదిరించాడు బాపూజీ.

ఇదిలా వుండగా - నిమ్నజాతీయ ప్రముఖ నాయకులలో ఒకడు - అంబేద్కర్‌కు అనుచరుడు అయిన యం. సి. రాజా హిందూ మహాసభ నాయకుడు మూంజేతో రహస్యంగా మంతనాలు జరిపాడు. నిమ్నజాతీయులకు ప్రత్యేక నియోజక వర్గాలు అక్కరలేదు "సంయుక్త" నియోజకవర్గాలు చాలు అని లోపాయికారి ఒప్పందం చేసుకున్నాడు. లండన్‌లోని బ్రిటీష ప్రధానికి టెలిగ్రాములు పంపారు. ఇందులో కొందరి కాంగ్రెస్ వారి హస్తంగూడా వుందని కొందరంటారు. రాజా తలపెట్టిన ద్రోహానికి అంబేద్కర్ చాలా కష్టపడ్డాడు. ఏమైతేనేం కానిమ్మని ధైర్యంగా వున్నాడు. ఇంతకు రాజాకు అంబేద్కర్ మీద కష్టమేమిటంటే అయన్ని రౌండు టేబుల్ సమావేశాలకు తీసుకొనిపోలేదని పైగా ఆయనకు ప్రాముఖ్యం యివ్వడంలేదని!

ఇక్కడ యింకొక ముఖ్యవిషయం మనం గుర్తుంచుకోవాలి. రౌండ్ టేబుల్ సమావేశాల కాలంలో బ్రిటీష్ ప్రభుత్వం వివిధ సబ్-కమిటీలను ఏర్పాటు చేసిందని తెలుసుకున్నాం. వాటిల్లో అంబేద్కర్ సభ్యుడని తెలుసుకున్నాం. ఓటుహక్కు కమిటీలో గూడా ఆయన సభ్యుడు. ఈ కమిటీకి "లోధియన్" అధ్యక్షుడు. ఈ కమిటీ దేశంలో పలు ప్రాంతాలు తిరిగింది. ప్రజల అభిప్రాయాల్ని సేకరించింది. కమిటీలోని యితర సభ్యులు చింతామణి - జోషీలకు - అంబేద్కర్‌కు పడేదికాదు. అంబేద్కర్ చేసిన రెండు ముఖ్య సూచనలు కమిటీ అంగీకరించక తప్పలేదు. మొదటిది వయోజన ఓటింగు హక్కు. రెండవది "అస్పృశ్యత" దురాచారానికి గురి అవుతున్న వారిని మాత్రమే "దళితులు" (నిమ్నజాతీయులు)గా గుర్తించడం. ఇదివరలో - సంచార జాతులు, కొండజాతులు, నేరస్థ జాతులు గూడ "నిమ్నజాతుల" జాబితాలో వుండేవారు. ఇది అంబేద్కర్ విజయం.

1932 ఆగష్టు 14వ తేదీన బ్రిటీషు ప్రధాని రామ్‌సే మాక్డొనాల్డు కమ్యూనల్ అవార్డును ప్రకటించాడు. మహమ్మదీయులు క్రైస్తవులు సిక్కులతో పాటు నిమ్నజాతీయులకు కూడా ప్రత్యేక నియోజకవర్గాల యేర్పాటుకు ఈ కమ్యూనల్ అవార్డు వీలు కల్పించింది. ఒక్క గాంధీజీ కాంగ్రెస్ వారు తప్ప మిగిలిన వారంతా యీ కమ్యూనల్ అవార్డు పట్ల సంతోషం ప్రకటించారు. ఈ అవార్డు ముఖ్యంగా అంబేద్కరు కృషికి గొప్ప విజయం. నిమ్నజాతీయులకు అంబేద్కరు పోరాడి సాధించిన రాజకీయ హక్కు అని చెప్పవచ్చు. నిమ్నజాతీయులు శూద్రులు అంబేద్కరును ప్రశంసించారు. అయితే సనాతన హిందువులు కాంగ్రెస్‌వారు ఆయన్ని హిందూ మత వ్యతిరేకిగా బ్రిటీషు తొత్తుగా దేశద్రోహిగా చిత్రించారు. ఎవరేమన్నా తన నిమ్నజాతీయులకు తానుయిన్నాళ్ళుగా ఆశించి పోరాడిన ప్రత్యేక నియోజక వర్గాలు రావడం పట్ల అంబేద్కరు ఆనందానికి మేరలేదు.

## గాంధీజీ ఆమరణ దీక్ష

కమ్యూనల్ అవార్డు ప్రకారం హరిజనులకు ప్రత్యేక నియోజక వర్గాలు యివ్వడం గాంధీజీకి సుతరాము ఇష్టంలేదు. మొదటి నుండీ ఆయన హరిజనులకు ప్రత్యేక హక్కులు వుండకూడదనే వాదిస్తూ వస్తున్నాడు. అంబేద్కర్ వాదన ఇందుకు భిన్నం. నిమ్న జాతీయులకు ప్రత్యేక హక్కులున్నప్పుడే యీ హిందూ సమాజంలో వాళ్ళు గౌరవంగా బ్రతుకుతారని అంబేద్కర్ మొదటి నుండీ వాదిస్తున్నాడు. కమ్యూనల్ అవార్డుకు నిరసనగా గాంధీజీ పూనాలోని యెరవాడ జైలులో ఆమరణ దీక్ష ప్రారంభించాడు. అది దేశంలో కాస్త కల్లోలానికి దారితీసింది. స్వాతంత్ర్యంకోసం నాయకత్వం వహిస్తున్న బాపూజీ చనిపోతే దేశానికి స్వరాజ్యం రావడం చాలా కష్టమని గాంధేయులు కాంగ్రెస్‌వారు ప్రచారం చేయసాగారు. దీనికి మూలకారకుడు అంబేద్కర్ అని గూడా దుష్ప్రచారం చేయడం మొదలుపెట్టారు. బాపూజీ ప్రాణాలు నిలబెట్టండని గాంధేయులు గగ్గోలు పెట్టసాగారు. అంబేద్కర్‌ను ఎలా అయినాసరే ఒప్పించండని దేశంలోని నాయకులంతా

గొడవమొదలుపెట్టారు. గాంధీజీ ప్రాణానికి ముప్పు యేర్పడితే దేశంలో పరిణామాలు తీవ్రంగా వుంటాయి. ఒక ప్రక్క గాంధీజీ ప్రాణాలు కాపాడాలి! మరో ప్రక్క తన జాతి హక్కులు కాపాడుకోవాలి! తన జాతి ఆయనకు ప్రాణం! ఆయనకు అగ్ని పరీక్ష అయ్యింది. నిమ్నజాతీయుల హక్కులకు తన ప్రాణాలకు గాంధీజీ ముడిపెట్టడం బాగుండలేదని - అందులో అర్థం లేదని అంబేద్కర్ అభిప్రాయపడ్డాడు. గాంధీజీ ఆమరణ దీక్ష పూనడం దురదృష్టకరమన్నాడు అంబేద్కర్. గాంధీజీ ఆమరణ దీక్ష వలన హిందువులకు నిమ్నజాతీయులకు ద్వేషాలు పెరిగిపోయే ప్రమాదముందని గూడా అంబేద్కర్ హెచ్చరించాడు. నిమ్న జాతీయుల న్యాయమైన హక్కులను మాత్రం బలిపెట్టేది లేదని స్పష్టం చేసాడు. గాంధీజీ ప్రాణాలు కాపాడడంలో తానూ శక్తి వంచనలేకుండా ప్రయత్నిస్తానన్నాడు. నిమ్నజాతీయుల న్యాయమైన ప్రత్యేక హక్కులకు భద్రతకు భంగం కలిగించని యే నిర్ణయానికైనా తాను సిద్ధమేనని అంబేద్కర్ తెలియజేసాడు.

మాలవీయ మొదలగు వారు అంబేద్కర్‌తో సంప్రదించారు. ప్రత్యేక నియోజక వర్గాలకు బదులు సంయుక్త నియోజక వర్గాలు హరిజనులకు కేటాయించడం మధ్యే మార్గమని సప్రూ ఒక పథకం తయారు చేసాడు. నిమ్నజాతి నాయకుడైన యం.సి.రాజా అంబేద్కర్ మిత్రుడైన బి.యస్. మూంజే సంయుక్త నియోజక వర్గాలకు మొగ్గుచూపారు. అంబేద్కర్ ఒక్కడే ఈ విషయంలో ఏకాకి అయిపోయాడు. రాజేంద్రప్రసాదు రాజాజీ సర్‌తేజ్ బహదూర్ సప్రూ మాలవీయ కృషిఫలితంగా అంబేద్కర్ గాంధీజీని కలుసుకుంటానికి యేర్పాట్లు జరిగాయి. ఆమరణ దీక్షలో క్రుంగి కృశించి శల్యావశిష్టమైన బాపూజీని అంబేద్కర్‌కలుసుకున్నాడు. గాంధీజీని చూడగానే అంబేద్కర్ మనస్సు కరిగింది. దేశ స్వాతంత్ర్యం కోసం సాగుతున్న ఉద్యమ సారథియైన మీరు మరణించడం నాకు గూడా యిష్టం లేదు. మీ ప్రాణాలు కాపాడడానికి నా మనస్ఫూర్తిగా సహకరిస్తాను. అని గాంధీజీకి అంబేద్కర్ హామీ యిచ్చాడు. సప్రూ చేసిన సంయుక్త నియోజక వర్గాల ప్రతిపాదన ఉభయులకు- అంగీకారమైనది. ఫలితంగా పూనా

ఒడంబడిక జరిగింది. ఇది చరిత్రాత్మకమైనది.

పాఠకులారా! అంబేద్కర్ గాని మొండివైఖరి వదిలి పెట్టకుండా వుండి వుంటే గాంధీజీ ప్రాణాలకు ముప్పు వాటిల్లి వుండేదేమో! దేశ చరిత్ర గతిమారిపోయి వుండేదేమో! మొత్తం మీద అంబేద్కర్ తనకు బద్ధ శత్రువుగా భావించే గాంధీజీ పట్ల తన వైఖరి మార్చుకోవడం చాలా మంచిదైంది! ఆయన సమయస్ఫూర్తి సహృదయత మానవతా దృక్పథం మరొకసారి బుజువైనాయి. అంబేద్కర్‌ని రాజాజీ మరీ మెచ్చుకొని తన పెన్ను బహూకరించాడు. అంబేద్కర్‌కి!

## పూనా ఒడంబడిక

ఇరువర్గాల నాయకుల సంప్రదింపుల ఫలితంగా ఒక ఒడంబడిక కుదిరింది 1932 సెప్టెంబరు 24 తేదీన. ఇదే చారిత్రాత్మకమైన పూనా ఒడంబడిక. ఒడంబడికపై మొదట మాలవ్య అంబేద్కరులు సంతకాలు చేసారు. కాంగ్రెస్ తరుపున రాజాజీ రాజేంద్రప్రసాద్ - బిర్లాథక్కర్ - సోలంకి సప్రూ మొదలగు నాయకులు సంతకాలు చేసారు. నిమ్నజాతీయుల తరుపున ఆర్ శ్రీనివాసన్ పి.యన్. రాజాభోజ్ రాజా ప్రభృతులు సంతకాలు చేసారు. ఈ పూనా ఒడంబడికతో గాంధీజీ నిరాహారదీక్ష విరమించాడు. దేశంలో చెలరేగిన అలజడి చల్లారింది. రాజకీయ నాయకులు వూపిరి పీల్చుకున్నారు. ఇంతటి ప్రాముఖ్యతను సంతరించుకున్న పూనా ఒడంబడికలోని ముఖ్యాంశాలు తెలుసుకుందాం.

1) రాష్ట్రాల శాసన సభలలో కేంద్ర శాసన సభలో నిమ్నజాతీయులకు సంయుక్త నియోజక వర్గాలుంటాయి. నిమ్నజాతీయులకుప్రత్యేక స్థానాలు నిర్ణయించబడ్డాయి. ఉదాహరణకు ఆనాడు మనది మద్రాస్ రాష్ట్రం. మద్రాస్ రాష్ట్రంలో నిమ్నజాతీయులకు ప్రత్యేకించబడిన స్థానాలు 30 బొంబాయికి 15 స్థానాలు. ఇలా ఒకో రాష్ట్రానికి ఒకో విధంగా ప్రత్యేక స్థానాలు కేటాయించటం జరిగింది.

2) నిమ్న జాతీయులకై ప్రత్యేకించబడ్డ ప్రతిస్థానానికి ఎన్నిక జరిగే

పద్ధతి యీ విధంగా వుంటుంది. కేటాయించిన నియోజకవర్గంలోని నిమ్న జాతీయ ఓటర్లంతా కలిసి మొదట నలుగురు అభ్యర్థులను ఎన్నుకుంటారు. ఆ నలుగురిలో ఒకర్ని మాత్రమే (నిమ్న జాతీయుణ్ణి) ఎన్నికల్లో పోటీగా నిలబెడతారు. నిమ్న జాతీయులు సవర్ణ హిందువులు కలిసి సంయుక్తంగా అభ్యర్థిని యెన్నుకుంటారు. ఇదే నిమ్న జాతీయులకు ప్రత్యేకించిన సంయుక్త నియోజక వర్గ విధానమంటే!

3) కేంద్ర శాసన సభలో ఉన్న మొత్తం స్థానాల్లో 18 శాతం నిమ్న జాతీయులకు కేటాయించటం జరుగుతుంది.

4) నిమ్నజాతీయులకు ఈ ప్రత్యేక ప్రాతినిధ్యం ప్రథమంగా పది సంవత్సరాలపాటు అమలు పరచడం జరుగుతుంది.

5) అగ్రవర్ణాలవారు - నిమ్నజాతీయుల్ని అంటరాని వారిగా భేదభావంతో చూడకుండా వుండేందుకు చర్యలు తీసుకోవడం జరుగుతుంది.

6) నిమ్నజాతీయులకు విద్యా విషయంలో ప్రభుత్వ ఉద్యోగాల విషయంలో అర్హతను బట్టి సదుపాయాలు కల్పించటానికి చర్యలు తీసుకోవడం జరుగుతుంది.

ఈ పూనా ఒడంబడిక చారిత్రాత్మకమైనది. నిమ్నజాతీయుల రాజకీయ హక్కుల విషయంలో అంబేద్కర్ సాధించిన గొప్ప విజయమిది. అంబేద్కర్ కనిన కలలకు ఫలితమిది. ఆయన పోరాడిన ఆశయానికి విజయమిది!

* * *

అంబేద్కరా - నీ అంతటి వాడు
పుట్టలేదు - మరి పుట్టబోడు
నీ సంకల్పము నెరవేరినచో
మానవత్వమె మాధవత్వమౌ!

— పద్మశ్రీ బోయి భీమన్న

# మూడవ రౌండు టేబుల్ సమావేశం

గాంధీజీ అంబేద్కర్‌ల మధ్య కుదిరిన పూనా ఒడంబడిక చట్టబద్ధం చేయాల్సి వుంది. చట్టబద్ధమైతేనే ఆ ఒడంబడిక లోని తీర్మానాలు అధికారికంగా అమలుపరచడం వీలౌతుంది. చట్ట బద్ధమైతేనే దానికి ప్రభుత్వ పరంగా గుర్తింపు యిచ్చినట్లౌతుంది. ఈ ఒడంబడిక చట్ట బద్ధం చేసే ముందు వివిధ భారతీయ ప్రతినిధులతో బ్రిటీషు ప్రభుత్వం చర్చించదలచుకొంది. అందుకు మరలా లండన్‌లో మూడవ రౌండ్ టేబుల్ సమావేశాలు యేర్పాటు చేసారు. ఈ సమావేశాలు 1932 నవంబర్-డిశంబర్ మాసాలలో జరిగాయి. ఈ సమావేశాలకు కాంగ్రెస్ వారు హాజరు కావటానికి నిరాకరించారు. అయితే అంబేద్కర్-జయకర్-సప్రూ ప్రభృతులు హాజరయ్యారు.

ఈ సమావేశాలలో పెద్దగా చర్చించిన విషయాలు లేవు. ఇదివర కటి సమావేశాలలో రూపొందించిన ప్రతిపాదనల్ని పూనా ఒడంబడికను బ్రిటీషు పార్లమెంటు జాయింట్ కమిటీ ముందు ఉంచడం జరిగింది. ఈ ప్రతిపాదనల శ్వేత పత్రంలో కొన్ని విరుద్ధమైన అంశాలున్నాయని అంబేద్కర్ అభ్యంతరం లేవదీసాడు. అంబేద్కర్ చర్చిల్ మధ్య తీవ్రమైన వాగ్వివాదం జరిగింది. చర్చిల్‌తో అందునా మాతృదేశం గాని దేశంలో అంబేద్కర్ నిర్భయంగా నిర్మోహమాటంగా వాదించడం ఇంగ్లండ్‌లోని పత్రికలన్నీ ప్రముఖంగా ప్రచురించాయి. ఈ శ్వేత పత్రం ఆధారంగానే 1935 భారత ప్రభుత్వ చట్టం రూపొందిచడం జరిగింది.

పూనా ఒడంబడిక జరిగిన తర్వాత గాంధీజీ స్వాతంత్ర్య ఉద్య మంతో పాటు హరిజన ఉద్ధరణ కార్యక్రమం ముమ్మరం చేసాడు. హరి జనసేవక్‌సంఘు కార్యకర్తలు కాంగ్రెస్ కార్యకర్తలు గ్రామగ్రామాన హరిజన ఉద్ధరణ కార్యక్రమాలు చేపట్టారు. హిందువులలో గాంధీజీకున్న పలుకుబడి వల్ల కాంగ్రెస్ వారి కృషి వల్ల సనాతన హిందువులలో కాస్తంత మార్పు వచ్చిందనే చెప్పొచ్చు. హరిజన ఉద్ధరణ కొంత జరిగింది. గాంధీజీ హరిజన సేవ వట్టినాటకం అని అంబేద్కర్ విమర్శించినా సనాతన హిందూవుల

హృదయ పరివర్తన గావించి గాంధీజీ హరిజనులపట్ల మానవతా దృక్పథం కల్పించారనడంలో సందేహంలేదు.

## రాజ గృహ

అంబేద్కర్ చాలా నిరుపేద కుటుంబంలో పుట్టాడని తెలుసుకున్నాం గదా! వాళ్ళ తండ్రి మిలిటరీలో చిన్న వుద్యోగిగా యెక్కడెక్కడో పనిచేసాడు. తండ్రి నుండి అంబేద్కరుకు చరస్థిరాస్తులు ఏమీ వారసత్వంగా దక్కలేదు. అంబేద్కరు చిన్న చిన్న యిండ్లలో అద్దెకున్నట్లు మనం చెప్పకున్నాం. బరోడా సంస్థానంలో వుద్యోగం చేసినా లెక్చరర్‌గా పనిచేసినా వచ్చే సంపాదన కుటుంబ పోషణకే సరిపోయేది. కాస్తో కూస్తో మిగిలితే నిమ్న జాతుల వారికోసం ఆయన నడిపిన పత్రికలు ప్రచురించటానికి సరిపోయేది. లాయరుగా ప్రాక్టీస్ చేసినపుడు మంచి ప్రాక్టీసు వుండేది. రెండు చేతులా సంపాదించేవాడు. లాయర్‌గా ప్రాక్టీస్ చేస్తూ బాగా సంపాదిస్తూన్నా ఉంటున్న అద్దె ఇల్లు రెండు గదులే! ఒకసారి కొల్హాపుర్ మహా రాజా వారు వచ్చారు. ఆయన్ని కూర్చోబెట్టి మర్యాద చేయటానికి యిబ్బంది అయ్యింది. రాజావారే సర్దుకుపోయారు.నిమ్నజాతుల వుద్ధరణకు ఆయనకొంత ఖర్చు చేసినా కాస్త వెనక వేసుకుంటానికి వీలు చిక్కింది.

— స్వంత యిల్లు లేకుండా అద్దె యింట్లో కాపురముండేది యెన్నాళ్ళని! బొంబాయి నగరం శివారులలో దాదర్ వద్ద స్థలం కొన్నాడు. తన దగ్గర డబ్బు తక్కువగా వుంటే మిత్రుల దగ్గర అప్పు పుచ్చుకొన్నాడు. వాస్తు శాస్త్రం ప్రకారం తానే ప్లాన్ వేసాడు. అన్ని సదుపాయాలు వుండేటట్లు ప్లాను వేసాడు. ముఖ్యంగా తాను పుస్తక ప్రియుడుకదా! అప్పుడప్పుడు కొన్న పుస్తకాలు విలువైనవి వేలాది వున్నాయి. పుస్తకాలంటే ఆయనకు ప్రాణంతో సమానం. ఇంట్లో స్వంత గ్రంథాలయం వుండేటట్లుగా ప్లాను వేసాడు. పెద్ద భవనం నిర్మించుకొన్నాడు. అంచెలంచెలుగా ఐదు అంతస్థుల గృహం కట్టాడు.దానికి రాజగృహం అని పేరు పెట్టాడు. గౌతమ బుద్ధుని

తండ్రి శుద్ధోదనుని రాచనివాసం పేరు రాజగృహం కపిలవస్తు నగరంలో వుండేది. హిందూ మతం పట్ల ద్వేషం పెంచుకున్న అంబేద్కర్‌ని బుద్ధుని బోధలు ప్రభావితం చేసాయి. ఆ అభిమానంతో తన స్వంత యింటికి రాజగృహం అని పేరుపెట్టాడు. అది చాలా పెద్ద భవనం! స్వంత యిల్లు కట్టుకొని అందులో కాపురం పెట్టిన అంబేద్కరు ఎంతో సంతోషించాడు.

## రమాబాయి మరణం

అంబేద్కర్‌కు రమాబాయి అనుకూలవతియైన భార్య. భర్తంటే ఆమెకు అమితమైన భయ భక్తులు. పెండ్లి అతి చిన్న వయస్సులో జరిగి పోయింది. అప్పటికి ఆమె ఏమీ చదువుకోలేదు. కాపురానికి వచ్చాకనే ఆమె భర్త బలవంతం మీద చదవడం రాయడం నేర్చుకొంది. ఆమె బాధ్యతలు గుర్తెరిగిన యిల్లాలు, అభిమానవతి మనోనిబ్బరం కలది. సాత్వి కురాలు భర్త మాట జవదాటి యెరుగుని పతివ్రత నిదానస్తురాలు. శాంతి ప్రియురాలు. మితభాషి మృదుభాషి. ఆత్మ స్థైర్యం కలది. ఇల్లు-పిల్లలు-భర్త సుఖం తప్ప బయటి ప్రపంచమంటే ఏమిటో తెలియని పరమ సాధ్వీమణి. భర్తకు ఇంటి విషయాలు మీద కంటే నిమ్నజాతి విషయాల మీదనే శ్రద్ధ యెక్కువ అని ఆమెకు తెలుసు. భర్త వుద్యమానికి అడ్డు వచ్చేదికాదు. ఆమెకు యిల్లే స్వర్గం. - పిల్లలు భర్తే ఆమెకు సర్వస్వం.

భర్తతో హాయిగా సరదాగా కాలం గడిపిన రోజులు ఆమెకు చాలా తక్కువ. చిన్నతనంలో పెండ్లికాగానే భర్త విదేశీ చదువుల నిమిత్తం అమెరికా ఇంగ్లాండు దేశాలకు వెళ్ళి పోయాడు. ఇండియాకు తిరిగి వచ్చిన తర్వాత ఏదో కొద్ది కాలం మినహాయిస్తే ఆయన రాత్రింబవళ్ళు నిమ్న జాతుల ఉద్ధరణకై ఏవేవో కార్యక్రమాలలో మునిగిపోయేవాడాయె! ప్రతినెల సంసారం ఖర్చుల క్రింద కొంత డబ్బు ఆమె చేతిలో పెట్టి చేతులు దులుపుకునేవాడు. తన గ్రంథ పఠనం రచనలు చేసుకొనడం తన వుద్యమం యివి ఆయన నిత్య జీవిత కార్యక్రమాలు. పాపం, ఆ అమాయకురాలు సంసారం అంతా చూచుకొనేది. పైగా అంబేద్కర్ సోదరుని కుటుంబం

కూడా వీరిమీదనే ఆధారపడి వుండేది. అంబేద్కర్ మారుతల్లి (సవతి తల్లి) గూడా అంబేద్కర్ దగ్గరే వుండేదాయె! ఆమె అంతగా సర్దుకొని పోయే మనిషికాదు. అయినా అంత పెద్ద కుటుంబాన్ని జాగ్రత్తగా సముదాయించుకొని వచ్చేది రమాబాయి చాలా పొదుపుగా ఖర్చు చేసేది.

రమాబాయి అంబేద్కర్‌లకు మొత్తం సంతానం ఐదుగురు అయితే ముగ్గురు కొడుకులు ఒక కుమార్తె పసికందులుగానే పోయారు. బ్రతికి బట్టకట్టినవాడు యశ్వంత్ ఒక్కడే. అంబేద్కర్ చదువుల నిమిత్తం అమెరికా వెళ్లేనాటికే రమాబాయి గర్భవతి. ప్రథమంగా రమేష్ పుట్టిపోయాడు. తర్వాత సంతానం గంగాధర్. వాడూ అంతే మూడవ సంతానం యశ్వంత్. ఇతడే బ్రతికి బట్టకట్టినవాడు. అయితే యశ్వంత్ ఎప్పుడూ అనారోగ్యంగా ఉండేవాడు. బ్రతికిన వాడు కనుక అంబేద్కర్‌కు ప్రేమ. తర్వాత ఒక కూతురు పేరు ఇందు పుట్టి పోయింది. ఆఖరివాడు రాజరత్న. ఆఖరి పిల్ల వాడంటే అంబేద్కర్‌కు ఎంతో ప్రేమ. మొదటి బిడ్డను ఆఖరి బిడ్డను తల్లిదండ్రులు గారాబంగా ప్రేమగా చూసుకొంటారు. అయితే దురదృష్టవశాత్తు రాజరత్న కూడా చిన్నతనంలోనే చనిపోయాడు. ఈ చిన్న పిల్లవాడు పోయినపుడు ఆ పిల్లవాని శవాన్ని కౌగలించుకొని రోదించాడు అంబేద్కర్. ఆ పిల్లవాడు వుండే గదిలోనికి పోవటానికి కొన్ని రోజులు ఆయనకు మనస్కరించలేదు. పుష్పించిన పూ వుల్ని భూదేవి కర్పితం చేసి తృణ కంటకాలు మిగిలిన కళలేని పాడువడ్డవనంలా వుంది తన జీవితమని అంబేద్కర్ మిత్రునికి వ్రాసిన వుత్తరంలో ఆయన మనోవేదన తెలియజేసాడు. అందరూ తెలివిగల చురుకైన అందమైన పిల్లలు. కన్న బిడ్డల్ని పోగొట్టుకొని కన్నీళ్ళే మిగిలేయని ఆవేదన చెందాడు.

పోతే రమాబాయి ఆరోగ్యమూ అంతంత మాత్రమే. ఇంటి పట్టున వుండని భర్త ఆరోగ్యం గురించే ఆమె దిగులు. ఆయన్ని చంపుతామని వుత్తరాలొస్తుండేవి. ఆ వార్త విన్న రమాబాయి గుండెలదిరిపోయేవి. తన ఆరోగ్యం పిల్లల సుఖం కన్న భర్త క్షేమం గురించే ఆమె ఎప్పుడు పూజలు పునస్కారాలు చేసేది. ఆమెకు ఇష్టదైవం పండరీ నాధుడు. ఇష్టదైవాన్ని

ముప్పొద్దుల పూజిస్తూ కేవలం తులసీ తీర్థం పుచ్చుకుంటూ భర్త కోసం యెదురుచూసేది. ఇంటికొచ్చిన భర్తను కండ్లార చూచుకొని హృదయంలో ఉప్పొంగిపోయేది. పరమానందం పొందేది ఆ పిచ్చి తల్లి.

రోజురోజుకు ఆమె ఆరోగ్యం క్షీణించడం మొదలుపెట్టింది. యశ్వంత్ ఆరోగ్యం గూడా సరిగ్గా వుండేదికాదు. డాక్టర్ల సలహా మేరకు స్థలం మార్పు గూడా చేసాడు. కొంతకాలం ధార్వార్‌కు మకాం మార్చాడు. అయితే ఆయన కున్న ప్రజాహిత వ్యాపకాల వల్ల అక్కడ ఎంతకాలమని వుండగలడు? మరలా మకాం బొంబాయికి మార్చాడు. ఇష్టదైవం పండరీనాధుని దర్శనం చేసుకొంటానికి పండరీపురం తీసుకొని పొమ్మని ఆమె భర్తను పదే పదే కోరేది. అయితే హిందూ దేవుళ్ళంటే విగ్రహారాధన అంటే ఆయనకు గిట్టవు గదా. అంటరాని కులం వాళ్ళను ఆ దేవుళ్ళు చూడనీయరు ఆ బ్రాహ్మణ పూజారులు. ఇంట్లోనే నీ యిష్టదైవాన్ని పూజించుకో అనేవాడు అంబేద్కర్. అమాయకురాలు ఆ పిచ్చితల్లి భర్తమాటకు ఎదురు చెప్పేదికాదు. నోరు మూసుకొని కూర్చునేది. అయినా ఇష్టదైవాన్ని దర్శించుకోలేకపోతినే అని లోలోన కుమిలిపోయేది.

అనారోగ్యంతో మంచం పట్టింది రమాబాయి. ఎన్ని మందు లిప్పించినా లాభం లేక పోయింది. మంచంలో తీసుకొని తీసుకొని ఆ మహాసాధ్వి రమాబాయి చివరకు 1935 మే నెల 27న తారీఖున శాశ్వతంగా కన్ను మూసింది. ఆమె తుది శ్వాస విడిచినపుడు భర్త ఆమె చెంతనే వున్నాడు. భర్త కేసి చూస్తూ తృప్తిగా భర్త చేయి పట్టుకొని ఆమె తుదిశ్వాస విడిచింది. అంబేద్కర్ పసిపిల్లవాడిలా భోరున విలపించాడు. ఆయనకు అంతగా యిష్టం లేకపోయినా హిందూ మతాచారం ప్రకారం ఆమె భౌతిక కాయానికి దహన క్రియలు జరిపాడు. శ్రాద్ధ కర్మలు చేసాడు.

భార్యపోయిన తర్వాత అంబేద్కర్‌లో ఒక విధమైన వైరాగ్యం చోటు చేసుకొంది. చెట్టంత మనిషి కొండంత గుండె గల మనిషి! గుండు గొరిగించుకొని కాషాయ వస్త్రాలు ధరించాడు. ఎవరితోను మాట్లాడకుండా మౌనంగా పరధ్యానంగా రోజులు గడిపేవాడు. ఇంటికి యిల్లాలే

దీపం అన్నారు. ఆ దీపం ఆరిపోయింది. ఇల్లంతా అంధకార బంధురంగా వుంది. చంటి పాపలే కన్న వారి కంటి పాపలన్నారు. ఒక్క బిడ్డ తప్ప పుట్టిన బిడ్డలందరినీ చిన్న తనంలోనే పోగొట్టుకున్నాడు. ఊరంతటి పెద్ద గృహంలో ఒంటరి బ్రతుకైపోయింది. తాను ఏనాడూ భార్యా బిడ్డల సుఖం గురించి పెద్దగా పట్టించుకోలేదు. రాత్రింబవళ్ళు తన నిమ్నజాతీయుల ఉద్ధరణకై ఉద్యమాలు నడపడంతోనే ఆయనకు సరిపోయింది. తన జాతి శ్రేయస్సు గురించి ఆలోచించాడు పాటు పడ్డాడు. కాని తన స్వంత కుటుంబ సభ్యుల శ్రేయస్సు ఆయన అంతగా పట్టించుకోలేదు. జాతి శ్రేయస్సుకొరకు తన భార్యా బిడ్డల్ని బలిచేసుకొన్నాడు. తానెంత దురదృష్టవంతుడు. ఈ ఒంటరి జీవితం దుర్భరంగా వుంది! జీవ కళలేని గృహంలో జీవచ్ఛవం మాదిరి కాలం గడిపేవాడు.

శిరోముండనంగావించుకొని (గుండు గొరిగించుకొని) కాషాయ వస్త్రాలు కట్టుకొని సన్యాసిలా మౌనంగా రోజులు గడుపుతున్న అంబేద్కర్‌ని చూచి మిత్రులు అనుచరులు భయపడ్డారు. ఆశ్చర్యపోయారు. సన్యాసుల్లో కలిసిపోతాడేమోనని అనుమానపడ్డారు. నిమ్న జాతీయుల ఉద్ధరణ కోసం ఆయన చేపట్టిన ఉద్యమం అంతటితో ఆగిపోవల్సిందేనా అని దిగులు పడ్డారు. నిమ్నజాతీయులకు యిక దిక్కెవరు అని ఆవేదన చెందారు. ఇక నిమ్నజాతీయుల అతిగతీ చూసేనాథుడెవరు అని బెంగపడ్డారు. అయితే అదృష్టవశాత్తూ తనకు తానే తమాయించుకొన్నాడు. మనోధైర్యం తెచ్చుకొన్నాడు. ఆత్మ విశ్వాసం పుంజుకొన్నాడు. అంబేద్కర్ భార్యా వియోగ మనోవ్యధ నుండి మెల్ల మెల్లగా బయటపడసాగాడు.

పాఠకులారా! చూసారా భార్యను అర్ధాంగి అన్నారు. అంటే భర్త దేహంలో భార్య సగ భాగమన్నమాట. శివుడు అర్ధనారీశ్వరుడు గదా! శివుడిలో పార్వతి సగభాగం శరీరంలో వుంటుంది. భార్య పోతే మరి భర్త గూడా సగం చచ్చిపోయినట్లే గదా. ఇంటికి యిల్లాలు దీపం అన్నారు. చంటిపాపలు కన్నవారి కంటి పాపలన్నారు. భార్య పోయిన తర్వాత మరి ఆయన గృహం చీకటి గుహ అయినట్లే గదా! ఆయన ముద్దులొలి

కెదు బిడ్డలు పోయిన తర్వాత ఆయన గ్రుడ్డివాడైపోయినట్లేగదా. ఇంకా ఆయన ఇంటిలో కళ ఎక్కడ ఉంటుంది. ఆయనకు ఆనందం ఎక్కడుంటుంది.

భార్య చనిపోతె అందుకే అంబేద్కర్ సగం చచ్చి సన్యాసిలా తయారయ్యాడు. నెహ్రూ భార్య కమలానెహ్రూ ఆరోగ్యం గూడా సరిగ్గా వుండేదికాదు. దేశ స్వాతంత్ర్య ఉద్యమంలో ముమ్మరంగా పాల్గొంటూ జైళ్ళలో మ్రగ్గుతూ నెహ్రూ వుండేవాడు. కమలా నెహ్రూ అనారోగ్యంగా బాధ పడేది ఆమె కూడా అచిరకాలంలోనే చనిపోయింది. రమాబాయి గూడా అచిరకాలంలోనే పోయింది.

## లా కాలేజి ప్రిన్సిపాల్‌గా

భార్య రమాబాయి పోయిన తర్వాత కొద్ది కాలం వైరాగ్య జీవితం గడిపాడు అంబేద్కర్. అంతలో బొంబాయి లోని ప్రభుత్వ లా కాలేజి ప్రిన్సిపాల్ గా నియమిస్తూ ప్రభుత్వం నుండి ఉత్తర్వులు వచ్చాయి. భార్యపోయి దిగులుగా ఉన్న ఆయనకు ఉద్యోగంలో చేరాలని లేదు. అయితే శ్రేయోభిలాషులైన మిత్రులు ఉద్యోగంలో చేరమని సలహా యిచ్చారు. ఉద్యోగంలో చేరితే ఆ పదవీ బాధ్యతలతో భార్య దిగులు తగ్గిపోతుందని మనస్సుకు శాంతి లభిస్తుందని మిత్రులు నచ్చ చెప్పారు. మిత్రుల సలహాలోని అర్థం గ్రహించాడు. లా కాలేజీ ప్రిన్సిపాల్‌గా 1935 జూన్‌లో చేరాడు.

అంబేద్కర్ స్వతహాగా విద్యావేత్త. విద్యాభిమాని. పుస్తక ప్రియుడు. గ్రంథ పఠన ప్రియుడు. న్యాయశాస్త్రవేత్త బారిష్టరు. లా కాలేజి ప్రిన్సిపాల్‌గా ఆయన కాలేజీ పురోభివృద్ధికి ఎంతో కృషి చేసాడు. విద్యార్థుల ఆదర అభిమానులు చూరగొన్నాడు. తన సమయమంతా కాలేజీ పనుల తోనే ఆయన గడుపుతుండడం చూచిన మిత్రులు ఆయన రాజకీయాలకు స్వస్తి పలుకుతాడో ఏమో అని అనుమానపడ్డారు. కొంతమంది సన్నిహితులు ఆయన్ని అడగనే అడిగారు. నాజాతి వారికి కొన్ని హక్కులు కల్పించడంలో కృతకృత్యుడనన్నాడు.

ప్రస్తుతం కాలేజి అభివృద్ధికి కృషిచేస్తూన్నాను. అవసరమైతే మరలా రాజకీయాలలోనికి వస్తాను. అని మిత్రులతో చెబుతూ వుండేవాడు. నిమ్న జాతీయులకు కొన్ని హక్కులు సాధించి పెట్టాను. అని ఆయన అనడంలోని వుద్దేశం పూనా ఒడంబడిక ద్వారా నిమ్నజాతీయులకు రాజకీయ హక్కులు కల్పించడం అన్నమాట. కాలేజీ అధ్యాపకులు విద్యార్థులు ఆయన్ని గురు భావంతో ఆరాధించేవారు. లా కాలేజీ ప్రిన్సిపాల్‌గా 1938 వరకుపనిచే సాడు. కాలేజీ ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్నా తీరిక సమయాల్లో ఆయన తన నిమ్నజాతీయుల సమస్యల పట్ల శ్రద్ధ తీసుకొనేవాడు. దళిత బస్తీలకు స్వయంగా వెళ్ళి వారి సమస్యలు విని వాటిని పరిష్కరించటానికి తన ప్రయత్నం తాను చేసేవాడు.

## యౌలా మహాసభ మతం మార్పిడి శపథం

స్వతహాగా అంబేద్కర్ చిన్నతనం నుండి అస్తికుడే. ఆయన తల్లి తండ్రులు కబీర్ భక్తి సంప్రదాయం కలవారు. చిన్నతనంలో అంబేద్కర్ తండ్రి పిల్లల్ని దగ్గర కూర్చోబెట్టుకొని కబీర్ భక్తి పాటలు పాడి- పిల్లల చేత పాడించేవాడని తెలుసుకున్నాం. పిల్లలకుభారత రామాయణ గాథలు వినిపించేవాడు. అంబేద్కర్ భార్య పాండురంగ విఠల్ పరమభక్తురాలు. కనక అంబేద్కర్‌కి మతం అంటే అభిమానంవుండేది. అయితే పెరిగి పెద్దవాడయ్యేకొద్దీ ఆయన మతాచారాల్ని - మూఢానమ్మకాల్ని నిరశించే వాడు. అస్పృశ్య కులంలో పుట్టడంవల్ల ఆయన ఎన్నో బాధలు పడ్డాడు. ఎన్నో అవమానాలు పాలైనాడు. సాటి మనుష్యుల్ని "అస్పృశ్యుల్ని" చేసి పేరుకు హిందువులు అయినా - గుళ్ళల్లోనికి రానీయక పోవడం అంబేద్కర్‌కు బాధకలిగించింది. దాన్ని తీవ్రంగా వ్యతిరేకించాడు. హిందూమతంపై ద్వేషం పెంచుకున్నాడు. మనిషిని మనిషిగా గౌరవించని హిందూమతంలో ఉండేకన్న యింకో మతం స్వీకరిస్తే బాగుంటుందని అంబేద్కర్‌కు ఆలోచన వచ్చింది. సాటి మనిషిని అంటరానివాడిగా వెలివేసిన హిందూ మతంలో ఉండేకన్న మనిషిగా గౌరవించే వేరే మతంలో చేరిపోవాలన్న

ఆలోచన అంబేద్కర్‌ని కొన్నాళ్ళుగా వేధిస్తోంది!

1935 అక్టోబర్ 13వ తేదీన మహారాష్ట్రలో యోలా (యవ్‌లా) అనే చిన్న పట్టణంలో ఒక పెద్ద మహాసభ యేర్పాటు చేసాడు. అంబేద్కర్ హిందూ మతాన్ని విడిచి పెడతాడన్న వార్త తెలియడంతో ఒక్క మహారాష్ట్ర నుండే కాదు, నైజామ్ దక్కన్, గుజరాత్, కర్ణాటక ప్రాంతాలనుండి వేలాది నిమ్న జాతీయులు యీ మహాసభలో పాల్గొన్నారు.

ఈ మహాసభకు రణ్‌కాంబ్లే అధ్యక్షత వహించాడు. అంబేద్కర్ హిందూమతాన్ని - శాస్త్రాల్ని తీవ్రంగా విమర్శించాడు. నిమ్న జాతీయులు పేరుకు మాత్రం హిందువులు, కాని సవర్ణ హిందువులు వారిని "అస్పృశ్యుల్ని" చేసి హీనంగా నీచంగా చూడడం విమర్శించాడు. విదేశీయ ఉన్నత విద్య నేర్చి బరోడా సంస్థానంలో ఉద్యోగంలో చేరిన తనను సవర్ణ హిందువులు పెట్టిన బాధలు - వివరించాడు. చదువూ సంస్కారమూ ఉన్న తనకే అద్దె కొంప దొరకకపోతే, కోట్లాది సామాన్య నిమ్న జాతీయుల గతేమిటని ప్రశ్నించారు. మహద్ చెరువు మంచి నీటిని నిమ్న జాతీయులు వాడుకొనే విషయంలో సవర్ణ హిందువులు పెట్టిన బాధలు గుర్తు చేసాడు. కాలారామ్ దేవాలయంలో నిమ్న జాతీయుల్ని ప్రవేశించకుండా ధర్మకర్తలు పూజారులు పెట్టిన బాధలు పూసగుచ్చినట్లు వివరించాడు. "దురదృష్టవశాత్తు నేను హిందువుడిగా పుట్టాను. అది నా చేతిలో లేదు." కాని అమానుషమైన విధంగా అగౌరవమైన రీతిలో తాను హిందువుడిగా హిందూ సమాజంలో జీవించటానికి మనస్కరించడంలేదని తేల్చి చెప్పాడు. "హిందువుడిగా మాత్రం మరణించ"నని వేలాది మంది సమక్షంలో బహిరంగంగా శపథం చేసాడు. తనతోపాటు తన అనుచరుల్ని గూడా హిందూమతం విడిచిపెట్టమని విజ్ఞప్తి చేసాడు. అయితే ఏ మతంలో చేరుతాడో అప్పుడు ప్రకటించలేదు. ఆలోచించి ప్రకటిస్తానన్నాడు. కులవివక్షలేని - సమాన గౌరవం యిచ్చే మతంలో చేరతానని మాత్రం వెల్లడించాడు.

అంబేద్కర్ ఆయన అనుచరులు హిందూమతాన్ని వదలిపెట్టి పోతారన్న వార్త దేశంలో పెద్ద సంచలనాన్ని సృష్టించింది. "పోతే పోనీలే పీడా

విరగడ అయిపోతుందని" కొద్దిమంచి సనాతన హిందువులు సంబరపడ్డారు. కాని నాయకులు హిందుమత పీఠాధిపతులు హిందూమతం 'బలహీన'పడు తుందని ఆందోళన పడసాగారు. ఎందుకంటే నిమ్న జాతీయుల జనాభా దేశజనాభాలో దాదాపు యిరవై శాతం వుంది కనుక కాంగ్రెస్ వారంతా అంబేద్కర్ నిర్ణయాన్ని విమర్శించారు. ఆనాటి కాంగ్రెస్ పార్టీ అధ్యక్షుడు డా. రాజేంద్రప్రసాద్ అంబేద్కర్ నిర్ణయాన్ని విమర్శించాడు. ఎందరో కాంగ్రెస్ పెద్దలు అంబేద్కర్ దగ్గరకు రాయబారాలు నడిపారు. మతం మార్చుకోవద్దని నచ్చచెప్పటానికి, అంబేద్కర్ మిత్రుడు వీరసావర్కర్ అంబే ద్కర్‌ని హిందూమతం వదలి పెట్టవద్దని విజ్ఞప్తి చేసాడు. హిందువులైన హరిజన సోదరులు హిందూమతాన్ని వదలి పెట్టి వేరే మతంలోకి పోవటానికి శాస్త్రాలు అంగీకరించవని గాంధీజీ ఒక ప్రకటన చేసాడు. విద్యావిహీనులైన హరిజనులు తరతరాలుగా హిందువులుగా వుంటూ హిందూ మతాచారాల్ని పాటిస్తూ వస్తున్నారు. కనుక అంబేద్కర్ ఏ ఉద్దేశంతో మతం మార్పిడి కోరుతున్నాడో ఆ ఆశయం బహుశా నెరవేరకపోవచ్చునని గాంధీజీ తన అభిప్రాయం వెళ్ళడించాడు. అయితే అంబేద్కర్ ఆవేదన ఆగ్రహం తాను అర్ధం చేసుకోగలనని మాత్రం గాంధీజీ అన్నాడు.హిందువులు కొం దరు అంబేద్కర్‌ని "హిందూమతవ్యతిరేకి"గా హిందూద్రోహిగా చిత్రించి ప్రచారం చేయసాగారు.

ఇదిలా ఉండగా - వివిధ మతాచార్యులు - మతపీఠాధిపతులు అంబేద్కర్‌కు ఉత్తరాలు రాసారు. కొందరు రాయబారాలు పంపారు. మరికొందరు మతాచార్యులు స్వయంగా వచ్చి అంబేద్కర్‌ని కలుసుకు న్నారు. "మా మతంలో చేరండి - మామతంలో కుల విచక్షణలేదు, మీకు సమాన గౌరవం, సకల సౌకర్యాలు కలుగజేస్తామని" యీ విధంగా వివిధ మతాలవారు అంబేద్కర్‌ని వూపిరాడకుండా చేసారు.

దరిమిలా **1936** జనవరిలో పూనాలో (ఇప్పుడు పూనే అంటు న్నారు) మరొక పెద్ద సభ యేర్పాటు చేసాడు. ఆ సభకు యన్. శివరాజ్ అధ్యక్షత వహించాడు. ఏదిఏమైనా - ఎవరెన్ని విధాల విమర్శిం

చినా, ఎంతగా ప్రలోభపెట్టినా తానూ, తన అనుచరులు హిందూమతాన్ని విడిచిపెట్టడం ఖాయమని అంబేద్కర్ పునరుద్ఘాటించాడు. ఆ తర్వాత 1936 మే నెల చివరలో బొంబాయి దగ్గరున్న దాదర్ వద్ద యింకొక పెద్ద సభయేర్పాటు చేసాడు. హైదరాబాద్ (తెలంగాణా) అంబేద్కర్‌గా పేరు పొందిన బి.యస్. వేంకటరావ్ ఆ సభకు అధ్యక్షత వహించాడు. ఈ సమావేశాలకు వివిధ మత గురువుల్ని ఆహ్వానించారు. రెవరెండ్ స్టాన్లీజోన్స్ అనే యూరోపియన్ మిషనరీని కూడా ఆహ్వానించారు.

ఆ దాదర్ మహాసభలో అంబేద్కర్ దీర్ఘ ఉపన్యాసం చేసాడు. మత మన్నది మనిషికిని దైవత్వానికి దారిచూపాలి. దానికి మనిషికి స్వేచ్ఛ, సమాన గౌరవం, సోదర భావం అవసరం. మతం మనిషి కోసంగాని మనిషి మతంకోసం యేర్పడలేదన్నాడు. మానవుడు సంఘజీవి. సాంఘిక కట్టుబాట్లు మనిషి జీవిత విధానాన్ని మెరుగు పరచాలి. దురదృష్టవశాత్తు కొందర్ని అంటరాని వారినిచేసింది హిందూ మతం. మనిషిగా గౌరవంగా బ్రతికే హక్కు లేనప్పుడు ఆ మనిషి ఆ మతాన్ని విడిచిపెట్టటం కంటే వేరే మార్గం లేదు. మనిషిని ముట్టుకోవద్దం దీహిందూ మతం. మనిషిని గుడిలోనికి రానీయ వద్దం దీమతం. అటువంటి మతంలో వుండేకన్నా ఆ మతాన్ని వదిలేసి వేరే మతంలో చేరిపోతేనే మంచిది. ఈవిధంగా సాగింది ఆయన ఉపన్యాసం. హిందూమతాన్ని వదలిపెట్టడమన్న నిర్ణయంలో తిరుగులేదని మరలా పునరుద్ఘాటించాడు అంబేద్కర్.

అంబేద్కర్ మతం మారడం ఖాయమని తేలడంతో ఆయన్ని వివిధ మతాధిపతులు కలుసుకున్నారు. గోవాలో క్రైస్తవ మతం పుచ్చుకున్న వేలాది మందిని మరలా హిందూమతంలోనికి మార్చాడు - హిందూమతాచార్యుడు మసూకర్ మహరాజ్. ఆయన వచ్చి అంబేద్కర్‌ని కలుసుకున్నాడు. మతం మారొద్దని విజ్ఞప్తిచేసాడు. ఇటలీ దేశ బౌద్ధ సన్యాసి లోకనుధా అంబేద్కర్‌ని కలిసాడు. కులభేదం లేనిది బౌద్ధమతమని ఆయన అంబేద్కర్‌కి నచ్చచెప్ప ప్రయత్నించాడు. నిజాం నవాబు అంబేద్కర్ దగ్గరకు రాయబారాలు నడిపాడు. అంబేద్కర్ ఆయన కులస్థులు ముస్లిం మతం

పుచ్చుకుంటే ఐదుకోట్ల రూపాయలు నిమ్న జాతుల ఉద్ధరణకు ఇస్తాన న్నాడు. నైజామ్ సంస్థానంలో హైదరాబాదు హైకోర్టులో అంబేద్కర్ని శాశ్వత ప్రధాన న్యాయమూర్తిగా చేస్తామని ఆశ చూపాడు. క్రైస్తవ మతగురువైన బిషప్ బ్రెంటన్ దావరన్ బ్రాడ్ల - అంబేద్కర్కు ఒకలేఖ వ్రాసాడు. విశ్వవ్యాప్తమైన క్రైస్తవ మతంలో కుల భేదాలులేవని - అంబే ద్కరేయులకు క్రైస్తవ మతంలో సకల మర్యాదలు - గౌరవం గలిగిస్తామని ఆ బిషప్ రాసాడు.

హిందూ మహాసభనాయకుడు డా. మూంజే అంబేద్కర్తో చర్చిం చాడు. వారిద్దరి మధ్య రహస్యంగా ఉత్తర ప్రత్యుత్తరాలు గూడా నడిచాయి. అంబేద్కర్ అనుచరులు - నిమ్నజాతినాయకులు జయకర్ - బిర్లా - నరేం ద్రనాధ్ యం.సి. రాజాలు హిందూమతాన్ని వదలిపెట్టటానికి యిష్టపడడం లేదు. కాంగ్రెస్ వారి అభిమానం పొందేందుకు అంబేద్కర్ - మూంజీల మధ్య నడిచిన ఉత్తరాల్ని రాజా బయటపెట్టాడు. అంబేద్కర్ మనస్సులోని ఆలోచనల గుట్టు రట్టు అయ్యింది. ముస్లిం మతం కన్న, క్రైస్తవ మతం కన్న సిక్కుమత ఆచారాలు, హిందూమత ఆచారాలకు దగ్గరలో ఉన్నాయి. నిమ్న జాతీయులంతా సిక్కుమతం స్వీకరించడానికి అభ్యంతరంపెట్టరని అంబేద్కర్ ఆలోచన. మొదట్లో ఆయన సిక్కు మతం మొగ్గుచూపా డన్న మాట. ఏది ఏమైనా తాను దీర్ఘంగా ఆలోచించి తన నిర్ణయం తర్వాత చెబుతానన్నాడు. నిమ్నజాతీయులలోనే కొందరికి మతం మార్పిడి యిష్టంలేదు. ఎందరో మిత్రులు, అనుచరులు, నాయకులు ఒత్తిడి చేయడం వల్ల, మతంమార్పిడి విషయాన్ని కొంతకాలంపాటు వాయిదా వేస్తున్నట్లు అంబేద్కర్ ప్రకటించాడు.

పాఠకులారా! అంబేద్కర్ మతం మార్చుకోవడానికి చెప్పిన కార ణాలు సబబని అనిపించినా - ఆయన మతం మార్పుకొంటానని అనడం దురదృష్టకరం. ఏమైనా మతం మార్పిడి నిర్ణయం వాయిదా వేయడం సంతోషం.

# ఇండిపెండెంట్ లేబర్ పార్టీ

1935 బ్రిటీష్ ఇండియా చట్టప్రకారం భారత దేశంలో స్వయం పరిపాలనా విధానాన్ని అమలు పరచవలసి ఉన్నది. అందుకుగాను 1937లో దేశంలో ఎన్నికలు జరుపవలసి ఉన్నది. ఇది అంబేద్కర్ గ్రహించాడు. తానే ఎవరి ప్రమేయం లేకుండా ఒక రాజకీయ పార్టీని పెట్టాలనుకున్నాడు. ఇన్నేళ్ళుగా ఆయన దళితుల కోసం పోరాటం సాగిస్తూ వస్తున్నాడు. దానికి తోడు న్యాయవాదిగాను బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్లోను - బయటా కార్మికుల సమస్యలు పరిష్కరించటానికి కృషిచేస్తూ వచ్చాడు. కనుక నిమ్న జాతులలోనేకాదు ఇతర బడుగు వర్గాలు, పేద వర్గాలవారిలో కూడా అంబేద్కర్‌కు మంచి పలుకుబడి వుంది. తనకున్న పలుకుబడి, రాజకీయాలలో గూడా పనిచేస్తుందని వూహించాడు. వచ్చిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలనుకున్నాడు. రాజకీయాలలోకి ఒక్కడే స్వతంత్రంగా దిగాడు. 1936 ఆగష్టు నెలలో ఇండిపెండెంట్ లేబర్‌పార్టీని స్థాపించాడు. తన పార్టీ ఎన్నికల ప్రణాళిక (మేనిఫెస్టో) గూడా ప్రకటించాడు. ఆ పార్టీ ఆశయాలలోని ముఖ్యమైనవి - (1) వ్యవసాయ కూలీలకు పని పరిస్థితులు మెరుగు పరచడం, న్యాయమైన గిట్టుబాటు కూలీరేటు లభించేటట్లు చూడడం (2) పారిశ్రామిక కార్మికులకు న్యాయమైన పనిగంటలు, న్యాయమైన దినసరివేతనాలు, బోనస్‌లు లభించేటట్లు చూడడం (3) పెద్దపెద్ద భూస్వాములనుండి చిన్న చిన్న కౌలుదార్లకు రక్షణ కల్పించడం (4) భారీ పరిశ్రమల స్థాపన జరిగేటట్లు కృషి చేయుట. (5) గ్రామీణ ప్రాంతాలలో వయోజన విద్యావికాసానికి కృషిచేయుట (7) కుల మత ఘర్షణలు జరుగకుండా చట్టరీత్యా చర్యలు తీసుకొనుట (8) కులమతముల ప్రమేయంలేకుండా నూతన విద్యావిధానం ప్రవేశ పెట్టడానికి కృషి చేయుట.

అంబేద్కర్ యీ పార్టీని పెట్టి యిప్పటికి దాదాపు అరవై సంవత్సరాలైంది. అప్పటికే కార్మిక వర్గాల శ్రేయస్సు కోసం ఆయన ఆలోచనలు, ప్రణాళికలు ఎంత గొప్పగా ఉండేవో దీనినిబట్టి తెలుస్తుంది. ఈ పార్టీని ఆయన కేవలం నిమ్న జాతుల వారికోసం పెట్టలేదు. అన్ని కులాలలోని

కార్మికుల కోసం పెట్టాడు. ఎన్నికలు సమీపిస్తుండగా తన పార్టీ అభ్యర్థులు పోటీ చేస్తున్న నియోజక వర్గాలలో విస్తృతంగా పర్యటించి ప్రచారం చేసాడు. ధనిక భూస్వాముల దోపిడీ విధానాన్ని విమర్శించాడు. ఎన్నికలలో కాంగ్రెస్ పార్టీగట్టి పోటీనిచ్చింది. 1937 ఫిబ్రవరిలో బొంబాయి అసెంబ్లీకి ఎన్నికలు జరిగాయి. అంబేద్కర్ లేబర్ పార్టీ 15 రిజర్వుడు స్థానాలకు పోటీపెట్టింది. అందులో 13 స్థానాలు గెలుచుకుంది. అందరి అంచనాలు తలక్రిందుల చేసి అంబేద్కర్ లేబర్ పార్టీ అఖండ విజయం సాధించింది. అది అంబేద్కర్ వ్యక్తిత్వానికి విజయమని చెప్పవచ్చు. లేబర్ వర్గాలలో ఆయన కున్న పలుకుబడి యెంతటిదో దీనిని బట్టి వూహించుకోవచ్చు. బొంబాయి శాసన సభలో వామపక్షాలు నాయకుడిగా ఆయన ఎన్నికైనాడు.

దరిమిలా బొంబాయి రాష్ట్రంలో జిల్లా బోర్డు ఎన్నికలు జరిగాయి. ఇప్పుడు జిల్లా ప్రజాపరిషత్తులు అంటున్నామే - అప్పుడవి జిల్లా బోర్డులన్న మాట. జిల్లాబోర్డు ఎన్నికలలో గూడా అంబేద్కర్ లేబర్ పార్టీ గణనీయంగా విజయం సాధించింది.

చూసారా! అంబేద్కర్ ఒక్కడే స్వతంత్రంగా పార్టీపెట్టి - ఆనాడు దేశంలో పెద్ద పార్టీయైన కాంగ్రెస్‌కు గట్టిపోటీ యిచ్చాడంటే ఆయనయొక్క వ్యక్తిత్వం, పలుకుబడి, యెంతగా ప్రజలలో పెరిగి పోయిందో మనం వూహించుకోవచ్చు.

## బొంబాయి లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యుడిగా

బొంబాయి శాససభలో ప్రతి విషయంలో జరిగే చర్చలలో వామపక్షనాయకుడిగా అంబేద్కర్ చురుకుగా పాల్గొనేవాడు. వ్యవసాయ కూలీల సమస్యల మీద కార్మికుల సమస్యలమీద బాగా శ్రద్ధ తీసుకునేవాడు. పోలీసు చట్టం సవరణ విషయంలో ఆయన చాలా శ్రద్ధ తీసుకున్నాడు.

మన రాష్ట్రం మాదిరిగా మహారాష్ట్రగూడా ప్రధానంగా వ్యవసాయక రాష్ట్రం. పెద్ద పెద్ద భూస్వాములు, చిన్న చిన్న కౌలుదార్లను,

(ఆసామీల భూములను కౌలుకు పండించేవారు). వ్యవసాయ కూలీలను ఎప్పుడూ పీక్కుతింటుంటారని మనం వింటుంటాం. మహారాష్ట్రలోగూడా చిన్న చిన్న కౌలుదార్లు శాశ్వతంగా కౌలుదార్లుగానే వ్యవసాయ కూలీలుగానే ఉండి పెద్ద భూస్వాముల దోపిడీ దౌర్జన్యాలకు గురి అవుతూ వుండే వారు. ఇట్టి నిర్బంధకౌలుదారీ వ్యవసాయ కూలీవిధానాన్ని మహారాష్ట్రలో "ఖోటీ (కోటి)" పద్ధతి అంటారు. ఈ ఖోటీ పద్ధతి పోవాలని, చిన్న కౌలుదార్లకు రక్షణ చేకూర్చాలని అంబేద్కార్ అసెంబ్లీలోనూ, బయటా గట్టి కృషిచేసాడు. తాను పెట్టిన తన లేబర్ పార్టీ ఆశయంకూడా అదే కదా! ఈ కోటీ పద్ధతి నిర్మూలించాలని అంబేద్కార్ అసెంబ్లీలో ఒక బిల్లు కూడా ప్రవేశపెట్టాడు. మహారాష్ట్ర అంతటా తిరిగి కోటి పద్ధతికి వ్యతిరేకంగా ప్రచారం చేసాడు. చిన్న రైతుల్ని సమీకరించాడు. ఈ కోటీ పద్ధతి తర్వాత యొప్పుడో నిషేధింపబడింది!

అలాగే మహారాష్ట్రలో "వతన్‌దారీ" విధానం అమలులో ఉండేది. గ్రామాధికారుల నిర్బంధ వెట్టిచాకిరీ పద్ధతినే 'వతన్‌దారీ విధానం' అంటారు. ఈ వతన్లలో సవర్ణ హిందువుల వతన్లకు - నిమ్న జాతీయుల వతన్లకు చాలా భేదముండేది. మహారాష్ట్రలోని నిమ్న జాతీయుల లోని ముఖ్యమైన వర్గాలు - మహర్‌లు వెట్టీలు, మాాంగ్‌లు, సవర్ణులైన "పటేల్, కులకర్ణి, తలాతీ, దేశ్‌ముఖ్‌లు, దేశ్‌పాండేలు" వంటి గ్రామో ద్యోగులు పదవి విరమణ చేసిన తర్వాత కూడా వంశపారంపర్యంగా ప్రభుత్వ భూములు అనుభవించేవారు! వారికి పన్నులు నామమాత్రంగా ఉండేవి. అయితే నిమ్నజాతీయులు ముఖ్యంగా మహర్ వతన్లలకు పదవీ విరమణ చేయడం తోటే భూములను అనుభవించే హక్కు పోయేది. పైగా వారిపై పన్నులు అధికంగా ఉండేవి. ఈ 'వతన్' విధానాన్ని అంబేద్కార్ తీవ్రంగా ఖండించాడు. ఈ వతన్ విధానాన్ని నిర్మూలించాలని బొంబాయి అసెంబ్లీలో ఒక బిల్లు కూడా ప్రవేశపెట్టాడు. నిమ్న జాతీయుల వతన్లపై పెంచిన పన్నులకు వ్యతిరేకంగా అంబేద్కార్ ఆందోళన లేవదీసాడు. రాష్ట్రంలో పలు ప్రాంతాలు అంబేద్కార్ పర్యటించి - నిమ్న

జాతీయుల వతన్లను సమీకరించుటకు గట్టి కృషి చేసాడు. ప్రభుత్వానికి అంబేద్కర్ చాలాసార్లు విజ్ఞప్తులు చేసాడు. రాష్ట్ర గవర్నరును ఆయన స్వయంగా కలుసుకున్నాడు! చివరకు గవర్నరు జనరల్ జోక్యం చేసుకోవడంతో మహర్ వతన్ల పై పెంచిన పన్నుల ఉత్తర్వులను మహారాష్ట్ర ప్రభుత్వం ఉపసంహరించుకున్నది.

అలానే మహర్లని నిమ్న జాతీయుల్ని సైన్యంలోనికి తీసుకునేటట్లు చేయడానికి ఆయన గట్టి కృషి చేసాడు. ఇదివరలో మహర్లు సైన్యంలో పనిచేసారు. దరిమిలా వారిని సైన్యంలో చేర్చుకొంటానికి బ్రిటీష్‌వారు కారణాంతరాలవల్ల నిరాకరించారు. నిమ్న జాతీయులు పెద్దగా చదువుకునే స్థితిలో ఉండేవారుకాదు. సైన్యంలో చేరితే - ధైర్య సాహసాలు యినుమడిస్తాయి. పైగా గౌరవప్రదమైన జీవితం గడపొచ్చు. పైగా ఆయన బ్రిటీషువారికి అనుకూలంగా వుండేవాడు. కనుక నిమ్న జాతీయుల్ని సైన్యంలో చేరేటట్లు చేయడంలో ఆయన గట్టి కృషి చేసాడు. బొంబాయి శాసనసభలో ప్రవేశపెట్టిన కార్మిక వివాద సవరణ చట్టం బిల్లుకు వ్యతిరేకంగా బొంబాయిలో కార్మికులు సమ్మె చేసారు. కార్మిక నాయకుడు డాంగే - జమ్నాదాస్ మెహతాలతో చేయి కలిపి అంబేద్కర్ సమ్మెకు నాయకత్వం వహించాడు.

1936 లో పంజాబ్‌లోని లాహోర్‌లో వున్న జాత్‌పాట్‌తోడక్ మండలివారు తమ సంస్థవార్షికోత్సవంలో అంబేద్కర్‌ని "కులనిర్మూలన" అనే అంశంపై మాట్లాడమన్నారు. అయితే ఆయన ఉపన్యాసం చూచి వారు అక్కడక్కడా మార్చమన్నారు. ఆయన ఒప్పుకోలేదు. చివరకు మండలి వార్షికోత్సవం జరగనే లేదు. అయితే ఆయన తన ఉపన్యాసాన్ని దరిమిలా పుస్తకరూపంలో ప్రచురించాడు. దీనిని గురించి చివరలో తెలుసుకుందాం.

1940లో దేశ విభజన జరిగి పాకిస్థాన్ అవతరిస్తుందన్న పుకార్లు బయలుదేరాయి. పాకిస్థాన్ యిచ్చినందువల్ల కలగబోయే మంచిచెడ్డల్ని వివరిస్తూ అంబేద్కర్ "పాకిస్థాన్‌పై (నా) ఆలోచనలు" అనే పుస్తకం రాసాడు. దీనిని గురించి చివరిలో వివరంగా తెలుసుకుందాం.

## వైశ్రాయ్ కౌన్సిలు సభ్యుడిగా

1942 జూన్ నెలలో - బ్రిటీష్ - ఇండియా వైశ్రాయ్ తనకు పరిపాలనలో సలహాయిచ్చేందుకు ఒక నూతన కార్యనిర్వాహక వర్గాన్ని యేర్పాటు చేసాడు. అందులోనికి అంబేద్కర్‌ని సభ్యునిగా తీసుకున్నాడు వైశ్రాయ్. ఆయన్ని కార్మిక సభ్యుడిగా తీసుకోవడం విశేషం. అందులో సర్వశ్రీ యం.యన్. రాయ్ - శ్రీ వాత్సవ - సి.పి. రామస్వామి అయ్యర్ ప్రభృతులు సభ్యులు. ఆయనకు కార్మికుల సమస్యలు బాగా తెలుసు. ఇదివరలో ఆయన "ఇండిపెండెంట్ లేబర్ పార్టీ"ని స్వయంగా పెట్టియున్నాడు. వ్యవసాయ కూలీల సమస్యలు, పారిశ్రామిక కార్మికుల సమస్యలపై ఆయనకు బాగా అవగాహన ఉంది. బొంబాయి అసెంబ్లీ సభ్యుడిగా, వ్యవసాయ కూలీల సమస్యల మీద, కార్మికుల సమస్యల మీద చాలా శ్రద్ధతీసుకుని మాట్లాడేవాడు. ఈ కారణాలవల్ల ఆయన్ని వైశ్రాయ్ కౌన్సిల్లో కార్మిక సభ్యుడిగా తీసుకోవడం గొప్ప విషయం. అంబేద్కర్ రాజనీతిజ్ఞతను కార్మిక విషయాలలో ఆయనకున్న పరిజ్ఞానాన్ని బ్రిటీష్ ప్రభుత్వం గుర్తించిందన్నమాట. గాంధీజీకి - కాంగ్రెస్ వారికి అంబేద్కర్ వైశ్రాయ్ కౌన్సిల్ సభ్యుడవడం యిష్టం లేదట. అది వారికి మింగుడు పడని విషయమైనది.

వైశ్రాయ్ కౌన్సిల్ సభ్యుడిగా ఆయన కనీస వేతనాలచట్టాన్ని, బోనస్ చట్టాన్ని ఆధునీకరణ చేసేందుకు కృషిచేసాడు. సెలవు దినాలలో సహితం కార్మికులకు జీతాలు చెల్లించే విధంగా ఒక బిల్లును గూడా తయారు చేసాడు. కార్మికుడు, యజమాని, ప్రభుత్వం, యీ మూడు పక్షాలు సామరస్య పూర్వకంగా మెలగాలనేవాడు. పరస్పర అవగాహనతో సమస్యలు పరిష్కరించుకోవాలనేవాడు. అప్పుడే - ఉత్పత్తి పెరుగుతుంది. కార్మికుల జీవితాలు మెరుగుపడతాయి. యాజమాన్యాలు లాభాలు గడిస్తాయి. దేశం పురోభివృద్ధి చెందుతుందని ఆయన ఆలోచన. కనుకనే దేశంలో "త్రైపాక్షిక సంఘాలు" (Tripartite Committees) యేర్పాటుకు ఆయన గట్టి కృషి చేసాడు. ఈ కమిటీలలో కార్మికులు యజమానులు,

ప్రభుత్వ ప్రతినిధులు సభ్యులుగా ఉంటారు. కార్మికులకు, ఆహారం, గృహ వసతి, విద్య, ఆరోగ్యం ముఖ్యమైనవని ఆయన నొక్కి చెప్పేవాడు. కార్మికుల సమస్యలలో రాజకీయ ప్రమేయం ఆయన వ్యతిరేకించాడు. కులతత్వం గూడా ఉండకూడదని అన్నాడు. కార్మికుల ఎంపికకై "ఉపాధికల్పనా కేంద్రాలు" (Employment Exchanges) ప్రభుత్వం నెలకొల్పాలని ఆయన గట్టిగా నొక్కి చెప్పాడు. అలానే పరిశ్రమలు ఆరోగ్యవంతంగా పనిచేయటానికి సంయుక్త యాజమాన్య కార్మిక సంఘాన్ని యేర్పాటు చేయాలన్నాడు.

పాఠకులారా! చూసారా! ఇప్పటికి దాదాపు యాభై సంవత్సరాః క్రితం అంబేద్కర్ వంటి కార్మిక శ్రేయోభిలాషులైన నాయకులు కార్మికుల సమస్యలపై శ్రద్ధ తీసుకొనబట్టే ప్రభుత్వం వారుకూడా నిర్మాణాత్మకమైన చర్యలవల్లను శ్రీ శ్రీ వంటి అభ్యుదయ కవులు కలలుగన్న "కార్మిక లోకపు కల్యాణం, శ్రామికలోకపు సౌభాగ్యం" పండి - ఈనాడు వ్యవసాయ కూలీలు, కార్మికుల జీవన పరిమాణాలు మెరుగైనాయి. మీలో చాలా మంది కార్మికులు గూడా ఉంటారుగదా! వారికి తెలుసు ఈూ విషయం!.

## అఖిల భారత నిమ్న జాతుల సమాఖ్య

అంబేద్కర్‌కు గాంధీజీ కాంగ్రెస్ వారికి మధ్య రోజురోజుకు విభేదాలు ఎక్కువైనాయి. అన్నికులాలలోని శ్రామికుల్ని రాజకీయంగా ఒక గొడుగు క్రిందకు తీసుకుని రావాలనుకుని 1936 లో అంబేద్కర్ "ఇండిపెండెంట్ లేబర్ పార్టీ"ని స్థాపించాడు. అందులో గూడా కులతత్వం - సవర్ణ హిందువులు పెత్తనం చెలాయించాలన్న ధోరణి ఎక్కువ అవడంతో ఆపార్టీ తెరమరుగైనది. తన స్వంత గొంతు విప్పటానికి రాజకీయ వేదిక అంటూ లేకపోవడం అంబేద్కర్‌కు మనస్సులో బాధకలిగిస్తోంది. దేశంలో బలీయమైన పెద్ద కాంగ్రెస్ పార్టీని యెదుర్కొనవలసి ఉన్నది. దళిత జాతుల వారి హక్కులకై ఉద్యమమింకా కొనసాగించవలసి ఉన్నది. కుల సమస్యపై పోరాటం మరింకా సాగించవలసి ఉంది. కనుక దళిత

జాతీయుల నందరినీ రాజకీయంగా ఒక త్రాటి మీదికి ఒకగొడుగు క్రిందికి తీసుకునివచ్చి ఒక కొత్త రాజకీయ వేదిక తయారు చేసుకోవాలనుకున్నాడు. 1942 జూలై మాసంలో "అఖిల భారత నిమ్న జాతుల సమాఖ్య" (All India Scheduled Castes Federation) అనే ఒక రాజకీయ పార్టీని స్థాపించాడు. దేశంలో జరుగనున్న సాధారణ ఎన్నికలను దృష్టిలో పెట్టుకున్నాడు - దేశంలోని దళిత జాతులవారి నందరిని రాజకీయంగా సంఘటితపరచాలనుకున్నాడు, దేశంనలుమూలాల పర్యటించాడు. మహమ్మదీయుల కోరికలన్నిటినీ అంగీకరిస్తున్న గాంధీజీ, కాంగ్రెస్ వారు దళిత జాతుల వారి రాజకీయ హక్కుల పట్ల "వ్యతిరేక భావం"తో ఉండడం పట్ల అంబేద్కర్ ప్రతిచోటా విమర్శించేవాడు. కనుక దళిత జాతుల వారంతా సంఘటితపడి తమ రాజకీయ హక్కులకై పోరాడవలసి ఉందని హెచ్చరించేవాడు.

ఇదిలా వుండగా - రెండవ ప్రపంచ యుద్ధం తీవ్రరూపం దాల్చింది. జపాన్ - జర్మనీ వారిది పైచేయిగా వుంది. బ్రిటీషు వారికి ప్రాణసంకటంగా వుంది. ఇండియాలో స్వాతంత్ర్యపోరాటం ముమ్మరమైనది. ఈ తరుణంలో బ్రిటీషు ప్రభుత్వం సర్‌స్టాఫర్డ్ క్రిప్స్ రాయబార సంఘాన్ని భారతదేశం పంపారు. యుద్ధ సమయంలో చేయూత నివ్వమని - యుద్ధం ముగిసిన తర్వాత అందరికి ఆమోద యోగ్యమైన విధంగా స్వాతంత్ర్యం ఇస్తామని రాయబారంలోని సారాంశం. గాంధీజీ - కాంగ్రెస్‌వారు క్రిప్స్ ప్రతిపాదనలు తిరస్కరించారు. నిమ్నజాతీయుల ప్రత్యేక హక్కులు విషయం క్రిప్స్ రాయబారం ప్రస్తావించలేదు. కనుక అంబేద్కర్ దానిని బహిష్కరించాడు. పాకిస్థాన్ ప్రస్తావన లేదని జిన్నా దానిని బహిష్కరించాడు. తమ సంస్థానాల "పరిస్థితి" తేల్చి లేదు కనుక సంస్థాన అధిపతులు దానిని తిరస్కరించారు. "రేపటి తారీఖు వేసిన చెక్" వంటిది క్రిప్స్ ప్రతిపాదన అని గాంధీజీ అన్నాడు. నీళ్ళని చిల్కి వెన్న తీసుకోమని చెప్పినట్లున్నదని సర్దార్ పటేల్ అన్నాడు. స్వరాజ్య ఉద్యమం - సత్యాగ్రహం ముమ్మరం చేయాలని కాంగ్రెస్ వారు నిర్ణయించారు.

## రెనడే - గాంధీ - జిన్నా

1943 జనవరిలో మహదేవ గోవిందరెనడే నూట ఒకటవ జయంతి జరిగింది. పూనాలోని దక్కన్‌సభవారు సభ నేర్పాటుచేసి అంబేద్కర్‌ని ముఖ్య అతిధిగా ఆహ్వానించారు. గాంధీజీ - జిన్నాలు పేరుకోసం రాజకీయ లబ్ధికోసం "ప్రజాసేవ" చేసారని అంబేద్కరంటాడు. పత్రికలు వారి అనుచరులు వారికి ఎక్కువ ప్రచారం చేసారంటాడు. రెనడే అట్లా కాదు. ఏ స్వార్థం లేకుండా ప్రజాసేవ చేశాడని అంబేద్కర్ అభిప్రాయం. పేరు కోసం ప్రాకులాడలేదు. అస్పృశ్యత నివారణ కొరకు, స్త్రీల విద్య, స్వాతంత్ర్యాలకోసం, వితంతువివాహాల కోసం రెనడేపాటు పడ్డాడని వివరించాడు. సభలు పెట్టాడు. పత్రికలు నడిపాడు, సంఘసంస్కరణల ద్వారా రెనడే ప్రజాసేవ చేసాడని అంబేద్కర్ అన్నాడు. కనుక గాంధీజీ - జిన్నాలకంటే రెనడే గొప్పవాడని అంబేద్కర్ అభిప్రాయపడతాడు.

## దక్షిణ భారతదేశ పర్యటన

అంబేద్కర్ నిమ్న జాతీయుల ఉద్ధరణకు ఉద్యమం చేపట్టిన నాటి నుండి ఆయనకు అభిమానులు - అనుచరులు దేశమంతటా బయలుదేరారు. సహజంగా మన ఆంధ్రాలో కూడా ఉన్నారు. మన ఆంధ్ర ప్రాంతం అప్పుడు మద్రాస్ రాష్ట్రంలో ఉండేది. తెలంగాణా నైజాం సంస్థానంలో ఉండేది. ఉత్తర భారతం - ఢిల్లీ, కలకత్తా, నాగపూర్, లక్నో మొదలగు ప్రాంతాలు ఆయన పర్యటించి వున్నాడు. దక్షిణ భారత దేశంలోనే ఆయన అంతవరకు ఒక్కసారి అయినా పర్యటించి ఉండలేదు. రౌండు టేబుల్ సమావేశాలు ముగిసాక-ఆయన ఒకసారి మాత్రం మదరాస్ వచ్చిపోయాడు. ఆంధ్ర ప్రాంతం అసలు రాలేదు. ఆయనిప్పుడు నిమ్న జాతీయుల సమాఖ్య పార్టీపెట్టి యున్నాడు. ఇంకో సంవత్సరంలో దేశంలో ఎన్నికలు జరుగనున్నాయి అని ఆయన పసికట్టాడు. దక్షిణ భారతదేశంలో ఒకసారి తాను స్వయంగా పర్యటిస్తే అన్ని విధాల మంచిదని ఆలోచించాడు.

మొదట 1944 సెప్టెంబర్‌లో హైదరాబాదు పర్యటించాడు. ఆనాడు హైదరాబాదు నైజాం సంస్థానంలో ఉండేది. ఇప్పుడు మహారాష్ట్రలోని

నాందేడ్, ఔరంగాబాద్ ప్రాంతాలు గూడా ఆనాడు నైజాం సంస్థానంలో ఉండేవి. హైదరాబాద్ సంస్థానంతో ఆయనకు మొదట నుండి సంబంధా లుండేవి. ఆనాటి కేంద్ర అసెంబ్లీ సభ్యుడు సుబ్బయ్య, హైదరాబాద్ అంబేద్కర్‌గా పేరుపొందిన బి.యస్. వేంకటరావులు. బి. శ్యామ్‌సుం దర్, ఎస్. నాగప్ప, పి.ఆర్. వీరాస్వామి, జె.హెచ్. కృష్ణమూర్తి, బి. శంకర్‌దేవ్ - బి. మచ్చేంద్రరావు ఆయనకు సన్నిహితులు మద్దెల మల్కయ్య మనోహర్ మాదిరి ఆదయ్య కాంబ్లే జాదవ్ శ్రీమతి రాజ మణిదేవి, ఈశ్వరీబాయి మొదలగు వారుగూడా ఆయన అనుచరులు. హైదరాబాద్ సికింద్రాబాదులలో అంబేద్కర్‌కు ఘన స్వాగతం లభించింది. ఆయన పాల్గొన్న ప్రతి సభలోను, నిమ్న జాతీయులేకాదు, క్రైస్తవులు, మహమ్మదీయులు పెద్ద సంఖ్యలో పాల్గొన్నారు. మహమ్మదీయుల హక్కు లకు అంగీకరించిన గాంధీజీ, కాంగ్రెస్ వారు, నిమ్న జాతీయుల ప్రత్యేక హక్కుల్ని వ్యతిరేకించడం దురదృష్టకరమైన విషయమని ఆయన విమ ర్శించాడు.

హైదరాబాద్ నుండి మద్రాస్ వెళ్ళాడు. అంబేద్కర్ మద్రాస్ పర్య టనలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొని ఘనంగా యేర్పాట్లు చేసినవారు-సర్వశ్రీ బాలసుబ్రహ్మణ్య మొదలియార్-రాజా ముత్తయ్య చెట్టియార్ ప్రభృతులు ముఖ్యులు. అక్కడా ఆయనకు ఘన స్వాగతం లభించింది. చాంబర్ ఆఫ్ కామర్స్ వారు, పెరంబూర్ రైల్వే యూనియన్ వారు తదితర సంస్థలు యేర్పాటు చేసిన సభల్లో ఆయన మాట్లాడాడు. మద్రాస్ పురపాలక సంఘం వారు ఆయనకు "పౌరసన్మానం" చేశారు. మద్రాస్‌లో ఆయన పాల్గొన్న ప్రతిసభలోను ఆయన హిందూ శాస్త్రాల్ని, బ్రాహ్మణ ఆధిక్య తను తీవ్రంగా విమర్శించాడు. అందుకు సనాతన హిందువులు, పత్రికలు ఆయన్ని విమర్శించాయి.

తర్వాత ఆయన ఆంధ్రప్రాంతంలో పర్యటించాడు. గూడూరు, నెల్లూరు, విజయవాడ, గుడివాడ, ఏలూరు, పాలకొల్లు, రాజమండ్రి, కాకినాడ, రామచంద్రపురం, అనకాపల్లి, విశాఖపట్నం మొదలగు పట్ట

ణాలలో ఆయనకు అఖండ స్వాగతం లభించింది. అనకాపల్లిలో జొన్నల మోహనరావు నాయకత్వంలో అంబేద్కర్‌కు లభించిన అఖండ స్వాగతం ఆంధ్రలోనే అది అపూర్వమైనది. నిమ్నజాతీయులే కాదు. అన్ని కులాలు వారు ముఖ్యంగా వ్యాపారస్తులు అందుకు కారణం. ఆయన్ని చూడాలని, ఆయన ఉపన్యాసాలు వినాలని ప్రతి చోటా వేలాది మంది హాజరయ్యారు. కృష్ణాజిల్లాలో కోదాడ సూర్యప్రకాశరావు, రావూరి ఏకాంబరం, పశ్చిమ గోదావరి జిల్లాలో సర్వశ్రీ రాయుడు, గంగయ్య, గంటా అరుణకుమార్, తూర్పు గోదావరి జిల్లాలో సర్వశ్రీ బయ్యాపుల్లయ్య, ఈలివాడపల్లి, బి. వి. రమణయ్య, అంబేద్కర్‌కు ప్రియమైన వారు. నందనార్ హరి, పాము రామ్మూర్తి, గొల్లచంద్రయ్య, బొజ్జా అప్పలస్వామి అంబేద్కర్‌కు శిష్యులు, సన్నిహితులు. జయభేరి పత్రిక సంపాదకుడు కుసుమ ధర్మన్న స్వయంగా కవిగూడా కనుక "మాకొద్దీ నల్లదొరతనం" అనే గీతాలు రాసి-పత్రికలో వేసి-స్వయంగా పాడి కాంగ్రెస్‌వారు చేసిన ప్రచారానికి వ్యతిరేకంగా ఆయన ప్రచారం చేసాడు. నల్లదొరతనం అంటే ఆయన వుద్దేశంలో "మా కొద్దీ తెల్లదొరతనం" అని కాంగ్రెస్ వారి ప్రచారానికి వ్యతిరేకంగా ఆయన ప్రచారం చేసాడు. "అగ్రపర్ణాలవారి పెత్తన" మన్నమాట. గోదావరి మండలాలలో అంబేద్కర్‌కు ఘనస్వాగతం యేర్పాట్లు చేసిన వారిలో కుసుమ వేంకటరామయ్య-గొల్లపల్లి గనిరాజు-గొల్ల చంద్రయ్య ప్రభృతులు గూడా వున్నారు. అయితే దురదృష్టకరమైన విషయం ఏమిటంటే, జాతీయ స్థాయిలో అంబేద్కర్‌కు ఆంధ్ర ప్రాంతంలో అనుయాయులులేరు! ఆంధ్రప్రాంతంలో గోదావరి మండలంలో ముఖ్యంగా తూర్పుగోదావరి జిల్లాలో అంబేద్కర్‌కు అధిక సంఖ్యలో అభిమానులు, అనుచరులున్నారు. గాంధీజీ, జిన్నాలు పాల్గొనే సభల్లో వందలు, వేలు, బంగారు నగదు విరాళాలు వస్తాయి. కాని తాను పాల్గొనే సభల్లో బక్కచిక్కిన, డొక్క లెండిన, దీనవదనాలతో, నిమ్న జాతులు, బడుగు వర్గాలవారు కన్నీరు కారుస్తారని అంబేద్కర్ ఆవేదన పడేవాడు. ఆయన మాట్లాడిన ప్రతి చోటా కాంగ్రెస్ వారిని, గాంధీజీని విమర్శించేవాడు. నిమ్న జాతుల వారు సంఘటితపడి తమ కాళ్ళపై తాము నిలబడి హక్కుల కొరకు పోరాటం సాగించాలని

అంబేద్కర్ హెచ్చరించేవాడు. అనకాపల్లినుండి విశాఖపట్నం కారులో పోతూ షెర్రీ దాటేసమయంలో అంబేద్కర్‌కు పెద్ద ప్రాణాపాయం తప్పింది.

## స్వాతంత్ర్య ఉద్యమం - హరిజన ఉద్ధరణ

గాంధీజీ దక్షిణాఫ్రికా నుండి భారతదేశానికి వచ్చి స్వాతంత్ర్య ఉద్యమానికి నాయకత్వం వహించాడు. 1920 నుండి గాంధీజీ నాయకత్వంలో స్వరాజ్య ఉద్యమం ఊపందుకుంది. దేశంలో కాంగ్రెస్ వారు విభేదాలు మరిచి ఒకటైనారు. ముస్లింలు, కమ్యూనిష్టులు అందరూ గాంధీజీ నాయకత్వాన సాగుతున్న స్వరాజ్య ఉద్యమానికి చేయూత నివ్వసాగారు. స్వరాజ్య మహో ఉద్యమంలో భాగంగా - గాంధీజీ నాయకత్వంలో - సహాయనిరాకరణ, విదేశీ వస్తు బహిష్కరణ, పన్నుల నిరాకరణ, శాసన ఉల్లంఘన, కోర్టుల బహిష్కరణ, ఉప్పుసత్యాగ్రహం, క్విట్ ఇండియా ఉద్యమం, జైల్ భరో, సామూహిక సత్యాగ్రహాలు, ఇలా ఎన్నో ఉద్యమాలు సాగాయి. కాని అంబేద్కర్ యీ ఉద్యమంలో చురుకుగా పాల్గొనలేదు. అయితే దేశానికి స్వాతంత్ర్యం వద్దనికాదు ఆయన భావన. ఆయనకు తన మాతృదేశం పట్ల అభిమానం లేదనికాదు. గాంధీజీతో, కాంగ్రెస్‌తో చేతులు కలిపి ఉద్యమంలో చేరడం ఆయనకు ఇష్టంలేదు. స్వరాజ్య సాధనకంటే కుల నిర్మూలన ముఖ్యమాయనకు-తన నిమ్నజాతుల దాస్య విముక్తి ప్రధానమాయనకు!

దేశవిముక్తి కంటే వేలాది సంవత్సరాల నుండి తరతరాలుగా "దాస్యంలో మ్రగ్గుతున్న కోట్లాది నా నిమ్న జాతియుల దాస్యవిముక్తి నాకు ముఖ్య"మని అంబేద్కర్ అంటూండేవాడు. అదే సమయంలో గాంధీజీ, కాంగ్రెస్ వారు చేపట్టిన "హరిజన" ఉద్ధరణ కార్యక్రమాల్ని అంబేద్కర్ విమర్శించేవాడు. కులవ్యవస్థను నిర్మూలించటానికి గాంధీజీ అంగీకరించడంలేదని ఆయన విమర్శించేవాడు. కేవలం అస్పృశ్యతను నిర్మూలించాలనుకోవడం వలన హిందూ సమాజం బాగుపడదని ఆయన అభిప్రాయం. పైగా నిమ్న జాతియులకు ప్రత్యేక హక్కుల్ని గాంధీజీ సమర్థించక పోవడంపట్ల కూడా ఆయన అభ్యంతరం చెప్పేవాడు. రాజకీయ లబ్ధికోసం, ఓట్లకోసం కాంగ్రెస్

వారు, "హరిజన" సేవ అంటున్నారుకాని, నిజంగా సవర్ణ హిందూ కాంగ్రెస్ వారికి నిమ్న జాతీయుల పట్ల నిజమైన ప్రేమలేదని ఆయన విమర్శించేవాడు.

ఇదే కాలంలో రెండవ ప్రపంచ యుద్ధం (1939-45) జరుగుతోంది. జర్మనీ-జపాన్ దేశాలు ఒక ప్రక్క బ్రిటన్, ఫ్రాన్స్, అమెరికా, రష్యా మరొక ప్రక్క. మొదట్లో జర్మనీ హిట్లర్‌దే పైచేయిగా ఉంది. ఆసియా లోని, ఐరోపాలోని చిన్న చిన్న రాజ్యాల్ని హిట్లర్ వశపరుచుకొనసాగాడు. ఇండియాను పాలిస్తున్న బ్రిటీష్ వారు భారతీయుల సహాయం కోరారు. గాంధీజీ కాంగ్రెస్‌వారు అందుకు నిరాకరించారు. ముందు స్వాతంత్ర్యాన్ని యివ్వమని పట్టుబట్టారు. 1942 ఆగష్టులో "క్విట్ ఇండియా" పిలుపుని చ్చాడు గాంధీజీ. బొంబాయిలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభలో ఆయన మాట్లాడుతూ-వెంటనే-ఆరోజు రాత్రికే స్వాతంత్ర్యం కావాలన్నాడు విజయమో వీర స్వర్గమో (కర్తవ్యపాలనమో-కాటికి పోవడమో) తేల్చు కోమని ఆయన దేశీయుల్ని హెచ్చరించాడు. దేశమంతా పెద్ద యెత్తున అల్లర్లు-అలజడులు చెలరేగాయి. ప్రజలు రెచ్చిపోయి ప్రభుత్వ ఆస్తుల్ని విశేషంగా ధ్వంసం చేసారు. నాయకుల్ని జైళ్ళలో బంధించారు. బ్రిటీషు ప్రభుత్వానికి ప్రాణ సంకట పరిస్థితి అయ్యింది. అటు యుద్ధంలో జర్మనీ-జపాన్‌లు విజృంభిస్తున్నాయి. ఇటు భారతదేశంలో స్వాతంత్ర ఉద్యమం తీవ్ర రూపం దాల్చింది. గాంధీజీ- కాంగ్రెస్‌వారు 'సహాయనిరాకరణ' చేస్తు న్నారు. అప్పుడు అంబేద్కర్ గాంధీజీ కాంగ్రెస్ వారి మొండి పట్టును విమర్శించాడు. నియంత నాజీ హిట్లర్‌గాని యుద్ధంలో గెలిస్తే, భారతదే శానికి స్వాతంత్ర్యం రావడం కష్టం. హిట్లర్ కన్న బ్రిటీష్ వారు నయం. కనుక బ్రిటీష్ వారికి యుద్ధ సమయంలో భారతీయులు సహాయపడాలని అంబేద్కర్ గాంధీజీ కాంగ్రెస్ వారికి పదేపదే విజ్ఞప్తి చేసాడు. పైగా - నిమ్న జాతీయ యువకుల్ని బ్రిటీష్ సైన్యంలో చేరి, యుద్ధంలో బ్రిటీష్ వారికి అండగా వుండాల్సిందిగా అంబేద్కర్ మరీ మరీ ప్రోత్సహించేవాడు.

స్వాతంత్ర్యం విషయంలో - అంబేద్కర్ బ్రిటీష్ వారు దేశానికి తప్పక స్వాతంత్ర్యం యిచ్చి తీరాలనేవాడు. స్వతంత్ర దేశంలోనే మా

సమస్యలు మేం పరిష్కరించు కొనగలమని చెప్పేవాడు. స్వతంత్ర భారతదేశంలోనే మా నిమ్న జాతుల హక్కులు సాధించుకొన గలమనేవాడు. స్వాతంత్ర్యం అంటే అధికారం బ్రిటీ షు వాళ్ళ నుండి అగ్రవర్ణాల వారి చేతుల్లోనికి బదలాయింపుకాదు. అది దేశంలోని అన్ని కులాల వారికి, మతాల వారికి, వర్గాల వారికి గౌరవమైన స్వేచ్ఛాయుతమైన సుఖజీవనం యిచ్చేదిగా ఉండాలని నొక్కి చెప్పేవాడు. స్వతంత్ర భారత దేశంలో నిమ్న జాతీయులు పాలకులుగా ఉండగోర్తారు గాని పాలించబడేవారుగా ఉండేందుకు ఎంత మాత్రం అంగీకరించరని కరాకండిగా చెప్పేవాడు.

పాఠకులారా! చూసారా! అంబేద్కర్ వాదనలో బలం ఉంది. నిజం ఉంది. తరతరాలుగా దాస్యంలో మగ్గినవారికి దాస్య విముక్తి జరిగి తీరవలసిందే. పశువులకన్న హీనంగా-నీచంగా "కుష్టురోగులుగా" చూడబడే వారికి స్వాతంత్ర్యం ఉన్నా ఒకటే లేకపోయినా ఒకటే! అందుకే ఆయన స్వరాజ్య సాధన కంటె కుల నిర్మూలన ముఖ్యమని దేశ దాస్య విముక్తి కంటె తన నిమ్నజాతీయుల దాస్య విముక్తి ముఖ్యమని ఆయన వాదించాడు. స్వాతంత్ర్యం యివ్వమన్నాడేగాని వద్దనలేదు. స్వాతంత్ర్యం వద్దని ఆయన బ్రిటీషువారితో లాలూచీ పడలేదు. స్వాతంత్ర్యానికి వ్యతిరేకంగా ప్రచారం చేయలేదు. రౌండు టేబుల్ సమావేశాల్లో సామ్రాజ్య పాలనా వ్యవస్థ పోవాలన్నాడు. స్వాతంత్ర్యం రావాలన్నాడు. దేశద్రోహి-స్వాతంత్ర్య వ్యతిరేకి-బ్రిటీషు వారి తొత్తు అని అంబేద్కర్‌పై కాంగ్రెస్ వారు-హిందూ తత్వవాదులు చేసిన దుష్ప్రచారంలో అర్థంలేదు. గాంధీజీ నాయకత్వం క్రింద కాంగ్రెస్ వారితో అంబేద్కర్ చేతులు కలపలేదనే వారికి ఆయనమీద ద్వేషం! ఆక్రోశం! అయితే ఆయన మాతృదేశాభిమాని కనుక-జాతీయవాది కనుక ఆయన గూడా దేశ స్వాతంత్ర్య ఉద్యమంలో 'ఉడతాభక్తి' గా పాల్గొని వుంటే ఆయన ఉన్నత వ్యక్తిత్వానికి యింకా రాణింపు వచ్చి వుండేది! అయితే-అదృష్టవశాత్తు దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక-నూతన రాజ్యాంగం రచనలో ఆయన యెంతో శ్రద్ధ తీసుకున్నాడు. ఆరోగ్యం బాగుండకపోయినా-ఇతర పరిషత్తు సభ్యులు అందుబాటులో లేకపోయినా

ఎంతో శ్రమకోర్చి రాజ్యాంగాన్ని రాసాడు. ఆయన దేశభక్తిని-జాతీయతను రుజువు చేసుకున్నాడు.

1945లో అంబేద్కర్ "వాట్ కాంగ్రెస్ అండ్ గాంధీ హేవ్ డన్ టు ది అన్ టచబుల్స్" "కాంగ్రెస్ వారు, గాంధీజీ అస్పృశ్యులకు చేసిం దేమిటి" అనే పెద్ద గ్రంథం రాసాడు. ఆయన ఉద్దేశ్యంలో గాంధీజీ గాని కాంగ్రెస్‌గాని అస్పృశ్యులకు వాస్తవంగా చెప్పుకోదగినసేవ ఏమీచేయలేదనే! ఈ గ్రంథం గురించి చివరలో కాస్త వివరంగా తెలుసుకుందాం!

## పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ

విద్య అనేది మనిషికి ఎంతో ముఖ్యమైనది. విద్య వలననే మనిషికి విజ్ఞానం వస్తుందని అంబేద్కర్ స్వానుభవంతో బాగా గ్రహించిన పరమ సత్యం. విద్య లేకపోవడంవల్లనే నిమ్న జాతీయులు అజ్ఞానంలో కొట్టుమిట్టా డుతున్నారని ఆయన తెలుసుకున్నాడు. అగ్ర వర్ణాల వారు విద్యాధికులు కావడం వల్లనే తమ తెలివితేటలతో అమాయకులైన నిమ్నజాతీయుల్ని, శూద్రుల్ని నానాహింసలు పెడుతూ, నీచంగా చూస్తున్నారు. చదువుకుని విద్యావంతులైతే, నిమ్నజాతులవారు వివేకవంతులై తమకు జరుగుతున్న అన్యాయాలు గుర్తించగలరు. ఐక్యంగా తమ న్యాయమైన హక్కులకై పోరా డగలరు. తమ కాళ్ళపై తాము నిలబడి, ఆత్మ గౌరవంతో, స్వతంత్రంగా జీవించగలరు! ఇదీ అంబేద్కర్ ఆలోచనా విధానం. అందుకే అంబేద్కర్ ఉపన్యసించిన ప్రతి చోటా "చదువుకోండి సంఘటితపడండి, ఆందోళన చేయండి." (Educate, Organise and agitate) అని నొక్కి వక్కాణిస్తూ ఉండేవాడు. విద్య యొక్క ప్రాముఖ్యం గుర్తించిన అంబేద్కర్ 1946 సెప్టెంబర్‌లో "పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ (ప్రజావిద్యాసంఘం)" అను ఒక సంస్థను స్థాపించాడు. గజేంద్రగడ్కర్ - ఆచార్య డోండే - బోలే - జాదవ్ - చిత్రే - సోలంకి - శంకర్ శాయన్న పర్శి - యీ సొసైటీ కార్య నిర్వాహక కమిటీ సభ్యులు. లక్షలాది ధనం వసూలు చేసి బొంబాయిలో సిద్ధార్థ కళాశాలనొకటి స్థాపించాడు! దరిమిలా ఔరంగాబాదు సమీపంలో

"మిళింద మహావిద్యాలయ"ను స్థాపించాడు. మహారాష్ట్రలో ఆయన చాలా కళాశాలలు, హాస్టళ్ళు స్థాపించాడు. ఈ విధంగా అంబేద్కర్ నిమ్న జాతీయులలో విద్యా వ్యాప్తికి ఎంతో కృషిచేసాడు.

పాఠకులారా! విద్యయొక్క ప్రాముఖ్యతను అంబేద్కర్ ఎలా గుర్తించాడో చూసారా! అందుకే విద్యలేని వాడు వింత పశువు అన్నారు. ఈ సంవత్సరం (1992) భారత ప్రభుత్వం-దేశంలో నిరక్షరాస్యతను పూర్తిగా నిర్మూలించటానికి "సాక్షరతా" ఉద్యమాన్ని ప్రారంభించింది! అంబేద్కర్ ఔరంగాబాద్‌లో స్థాపించిన కాలేజి నేడు మహారాష్ట్ర ప్రభుత్వం మరాఠా విశ్వ విద్యాలయంగా చేసింది! ఆ విద్యాలయాలు నేడు మూడు పూలు ఆరుకాయలుగా విరాజిల్లుతున్నాయి! దానికిప్పుడు అంబేద్కర్ పేరు పెట్టాలని ఆలోచన!

## బ్రిటీషు ఇండియాలో సాధారణ ఎన్నికలు

1945 సంవత్సరం జులైలో ఇంగ్లండులో సాధారణ ఎన్నికలు (General Elections) జరిగాయి. లేబర్ పార్టీ గెలిచి అధికారంలోనికి వచ్చింది. అట్లీ బ్రిటీష్ ప్రధాన మంత్రి అయ్యాడు. తన చేతుల మీదుగా ఇండియాకు స్వాతంత్ర్యం ఇవ్వనని భీష్మించుకుని కూర్చున్న చర్చిల్ గూడా ఓడిపోయాడు. లేబర్‌పార్టీ నాయకుడు అట్లీ సాధుస్వభావి! మితవాది, ఉదార స్వభావుడు, భారతదేశం పట్ల కాస్త అభిమానమున్నవాడు. బ్రిటన్‌లో ఎన్నికలు జరిగిన తర్వాత బ్రిటీషు ఇండియాలో గూడా త్వరలో సాధారణ ఎన్నికలు జరుపనున్నట్లు ప్రకటించారు. దేశంలో కాంగ్రెస్ వారు, ముస్లింలీగు వారు తమ తమ ఎన్నికల ప్రచారం ప్రారంభించారు. అంబేద్కర్ తన నిమ్నజాతులసమాఖ్య తరుపున ఎన్నికల ప్రచారం మొదలెట్టాడు. ప్రధమంగా 1945 అక్టోబర్‌లో పూనాలో ఎన్నికల ప్రచార కార్యక్రమం ప్రారంభించాడు. నిమ్న జాతీయులు కాంగ్రెస్‌ను నమ్ముకుంటే వాళ్ళకు కులాల రొచ్చులో వెట్టిచాకిరీ తప్పదన్నాడు. నిమ్న జాతీయులంతా సంఘటితపడి ఒక రాజకీయశక్తిగా

రూపుదిద్దుకోవాలని అన్నాడు. తమ రాజకీయ హక్కులు పొందుటకు అందరు కలసికట్టుగా ఎన్నికల్లో కృషిచేయాలని చెప్పాడు. కష్టనష్టాలకోర్చి ఆయన దేశంలోని వివిధ ప్రాంతాలు పర్యటించాడు. అహమ్మదాబాదు, నాగపూర్, అకోలా మొదలగు చోట్ల పర్యటించి ఎన్నికల ప్రచారం సాగించాడు. దాదాపు యీ ప్రచారం మూడునెలలు సాగింది. తిరిగి ఉత్తర భారతంలో ఎన్నికల ప్రచారం ప్రారంభించాడు. షోలాపూర్, ఢిల్లీ, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాష్ట్రాలు పర్యటించి తిరిగివచ్చి మరలా మహారాష్ట్ర, కర్నాటక, రాష్ట్రాలలో బొంబాయి, సతారా, బెల్గాంలలో ఎన్నికలు ప్రచారం సాగించాడు. ఈ ఎన్నికల ప్రచారంలో అంబేద్కర్ ఆరోగ్యం దెబ్బతిన్నది. అయినా ఆయన లెక్కచేయలేదు. ఆయన మాట్లాడిన ప్రతి సభలోను, స్వతంత్ర భారతదేశంలో నిమ్న జాతీయులు స్వతంత్ర పౌరులుగా ఉంటారన్నాడు. పరిపాలకులుగా ఉంటారే తప్ప పాలితులుగా (పాలించబడేవారు) రెండవ తరగతి పౌరులుగా జీవించటానికి అంగీకరించరని కరాఖండిగా చెప్పాడు. ముస్లింలకు కాంగ్రెస్ పెద్దలు అన్ని కోర్కెలు తీరుస్తారు. నిమ్న జాతీయులకు న్యాయమైన రాజకీయ హక్కులు, రక్షణలు కల్పించటానికి కాంగ్రెస్ వారు అంగీకరించక పోవటాన్ని ఆయన తీవ్రంగా విమర్శించాడు. గాంధీజీని, కాంగ్రెస్ పార్టీని ఆయన దుయ్యబట్టాడు. ఇంతలో బ్రిటీష్ పార్లమెంటరీ రాయబారవర్గం ఇండియాకు వచ్చింది. దీనినే బ్రిటీష్ కాబినెట్‌మిషన్ అంటారు. కాంగ్రెస్ పార్టీ తరపున జవహర్‌లాల్ నెహ్రూ, ముస్లింలీగ్ తరుపున మహమ్మదాలీ జిన్నా, నిమ్నజాతుల సమాఖ్య తరుపున అంబేద్కర్ విడివిడిగా బ్రిటిష్ రాయబార వర్గాన్ని కలుసుకున్నారు. తమ తమ రాజకీయపార్టీల ప్రతిపాదనలు వివరించారు. నిమ్నజాతీయులకు న్యాయమైన ప్రత్యేక రాజకీయ హక్కుల గురించి అంబేద్కర్ నొక్కి వివరించాడు.

1946 జూలైలో ఎన్నికలు జరిగి ఫలితాలు ప్రకటించారు. కాంగ్రెస్ ఘన విజయం సాధించింది. అంబేద్కర్ పార్టీ చిత్తుగా ఓడిపోయింది. అంబేద్కర్ పార్టీకి సహకరించిన కమ్యూనిష్టుపార్టీ, హిందూ మహాసభలు

కూడా తుక్కు తుక్కుగా ఓడిపోయాయి. ముస్లింలీగ్ మాత్రం కొన్ని సీట్లు గెల్చుకుంది. దురదృష్టకరమైన విషయం ఏమిటంటే అంబేద్కర్ కూడా ఓడిపోయాడు. కాంగ్రెస్ వారికి అంగబలం ఉంది. అర్థబలం వుంది. కులబలం వుంది! సంయుక్త నియోజక వర్గాలలో సవర్ణ హిందువుల ఓట్లు ఎక్కువ కావడం వల్లను, నిమ్నజాతీయుల ఓట్లు చీలి, కాంగ్రెస్ హరిజన అభ్యర్థులకు వేయడం వలనను, అంబేద్కర్ పార్టీ బాగా దెబ్బతిన్నది! అంబేద్కర్ ఆశలు అడియాశలయ్యాయి! ఆయన మానసికంగా క్రుంగిపోయాడు!

పాఠకులారా! చూసారా! అంబేద్కర్ ఒంటరిగా ఎన్నికలలో పోరాడాడు. నిమ్న జాతీయుల ఓట్లే చీలిపోయాయి! కాంగ్రెస్ పార్టీ నిలబెట్టిన హరిజన కాంగ్రెస్ అభ్యర్థులు గెలిచారు. గాంధీజీని, కాంగ్రెస్ పార్టీని అంబేద్కర్ తిట్టిపోసేవాడు. ఆయన పార్టీ ఓడిపోవటానికి అదొక ముఖ్యకారణం. ఆయన గూడా ఓడిపోవడం విచారకరంగదా!

## నిమ్నజాతుల సమాఖ్య సత్యాగ్రహం

1946లో మే నెలలో బ్రిటీషు వారు విడుదల చేసిన రాజపత్రంలో నిమ్నజాతుల రాజకీయ హక్కుల ప్రస్తావన లేదు. నిమ్నజాతుల రాజకీయ హక్కులు ఇటు కాంగ్రెస్ అంగీకరించలేదు. అటు బ్రిటీషు ప్రభుత్వం అంగీకరించలేదు. సంయుక్త నియోజక వర్గాలకు బదులు ప్రత్యేక రిజర్వుడు నియోజక వర్గాలు కావాలన్నది అంబేద్కర్ ముఖ్యమైన డిమాండ్! సంయుక్త నియోజక వర్గాలు నిమ్నజాతీయులకు ఏ విధంగా చూచినా నష్టదాయకంగా వున్నాయన్నది అనుభవపూర్వకంగా తెలిసి వచ్చింది. వాళ్ళ భవిష్యత్తు అయోమయంగా తయారైంది. అంబేద్కరుకు ఆగ్రహం వచ్చింది. నిమ్నజాతుల సమాఖ్య తరుపున ఎన్నికల్లో ఓడిపోయినా, మరలా పోరాటం సాగించాలని నిర్ణయించాడు! అంబేద్కర్‌కు ప్రియమైన అనుచరుడు రాజ్ భోజ్, గాంధీజీని, కాంగ్రెస్ నాయకుల్ని కలుసుకున్నాడు. అయినా లాభం లేక పోయింది. దేశవ్యాప్తంగా నిరసనలు, సత్యాగ్రహాలు చేయటానికి నిమ్న

జాతుల సమాఖ్య సిద్ధమైంది. మొదట యీ నిరసన పూనాలో ప్రారంభమైంది! తర్వాత కాన్పూర్, లక్నోలలో కూడా సత్యాగ్రహ ఉద్యమాలు ప్రారంభించారు. నిమ్న జాతీయులకు ప్రత్యేక రాజకీయ ప్రాతినిధ్యం ఇవ్వాలని సమాఖ్య వారి ముఖ్యమైన డిమాండు. ఇటు కాంగ్రెస్ వారిపైనా, అటు బ్రిటీషు ప్రభుత్వంపైన ఒత్తిడి తేవడం అంబేద్కర్ ముఖ్య ఉద్దేశం! 1946 సెప్టెంబరులో నిమ్నజాతుల సమాఖ్య నాగపూర్‌లో నిర్వహించిన నిరసన, సమ్మెలు, సత్యాగ్రహం ఉధృతంగా సాగాయి. అయినా ఫలితం లేకపోయింది. అంబేద్కర్ లండన్ వెళ్ళి బ్రిటీష్ నాయకుల్ని కలుసుకున్నాడు. స్వాతంత్ర్యం వచ్చాక రాజ్యాంగ రచన చేసేటప్పుడు నిమ్న జాతీయుల ప్రత్యేక హక్కుల విషయంలో జాగ్రత్త పడవలసిందిగా సలహా ఇచ్చారు. ఇదే సమయంలో - భారతదేశంలో కాంగ్రెస్ వారు తాత్కాలిక ప్రభుత్వాన్ని నెహ్రూ నాయకత్వాన ఏర్పాటు చేసారు. రాజాజీ, వల్లభాయ్ పటేల్, హరిజన కాంగ్రెస్ నాయకుడు జగజ్జీవనరామ్ మొదలగువారు మంత్రి మండలిలో చేరారు.

* * *

ధర్మ వీరము బోధ చేసి
దళితులకు గమ్యమును చూపి
సర్వసమతారాజ్యరమకై
శక్తియుక్తులు పిండి పోసి
నీవు చేయని త్యాగమేదయ్యా
అంబేద్కరయ్యా
నీవు వ్రాయని జ్ఞాన మేదయ్యా

— పద్మశ్రీ బోయి భీమన్న

# రాజ్యాంగపరిషత్తు

రాజ్యాంగపరిషత్తును (Constituent Assembly) రాజ్యాంగ చట్టసభ అని కూడా అంటారు. దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక మన ప్రజల శ్రేయస్సు, మన దేశ రక్షణ మనమే చూచుకోవాల్సి ఉంటుంది. అందుకు ఒక రాజ్యాంగ చట్టసభ ఉండాలి. స్వాతంత్ర్యం వచ్చాక మనం చూసు కోవాల్సిన విషయాలు ఎన్నో ఉంటాయి. అవన్నీ ఆలోచించుకోవటానికి, చట్టరూపం చేయటానికి ఏర్పాటు అయిన సభనే "రాజ్యాంగ పరిషత్తు" అంటారు. ఈ పరిషత్తు సభ్యులు రాష్ట్రాల శాసన సభల నుండి ఎన్ను కోబడతారు. అంబేద్కర్‌కి బొంబాయి రాష్ట్ర శాసన సభలో అవసరమైన మద్దతు లభించలేదు. స్వంత రాష్ట్రంలోనే ఆయనకు మద్దత్తు లేక పోవడం దురదృష్టకరం. చివరకు బెంగాల్ శాసన సభ ద్వారా, అక్కడి మహమ్మదీ యుల మద్దత్తుతో ఆయన రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికయ్యాడు. ఈసభకు డాక్టర్ రాజేంద్రప్రసాద్ అధ్యక్షుడు. ఈయనే దరిమిలా స్వాతంత్ర్యం వచ్చాక దేశానికి ప్రథమ అధ్యక్షుడయ్యాడు. ఈ పరిషత్తు రెండు మూడుసార్లు సమావేశమయింది. మొదటి సమావేశం రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన 1946 డిశంబరులో జరిగింది. ఆ సమావేశంలో అంబేద్కర్ మాట్లాడుతూ - మనలో మనకు ఎన్ని విభేదాలున్నా - మనమందరం కలిసి "ఒకే దేశం ఒకే ప్రజ" అన్న జాతీయ భావంతో మెలగవలసిన అవసరం యీనాడు మనందరిపైనా వుందని అన్నాడు. ఈనాడు మన నుండి మన సోదరులైన ముస్లింలు విడిపోతున్నా తర్వాతనైనా తమ తొందరపాటును - తమ తప్పిదాన్ని తెలుసుకొని - పశ్చాత్తాపం చెందుతా రని అన్నాడు. అంబేద్కర్ హృదయం నుండి వెల్లుబికి మాటల రూపంలో బయలువడిన జాతీయ దృక్పథం - విశాల హృదయంనకు సభలోని వారంతా ఆశ్చర్యపడ్డారు. ఆనందపడ్డారు.

1947 జులై మాసంలో జరిగిన పరిషత్తు సమావేశంలో జాతీయ పతాకం రూపురేఖలు గురించి చర్చ జరిగింది. నెహ్రూ, సర్దార్ వల్లభాయి పటేల్, అంబేద్కర్‌లు యీ విషయమై ప్రత్యేకంగా చర్చించారు. భారత

దేశ చరిత్రలో అందరి రాజుల పాలనలో కంటే, అశోకచక్రవర్తి పాలనలో దేశం, శాంతి సౌభాగ్యాలతో తులతూగింది. కనుక అశోక ధర్మచక్రాన్ని జాతీయ పతాకచిహ్నంగా తీసుకుంటే సముచితంగా ఉంటుందని అంబేద్కర్ సూచించాడు. గుండ్రంగా ఉన్న ధర్మచక్రం అందులోని రేఖలు హిందూ ధర్మానికి, భారతీయ సంస్కృతికి చిహ్నమని అందులోని రేఖలు కాబట్టి ధర్మ చక్రం భారతీయులందరికీ ఆమోదయోగ్యం కాగలదని నెహ్రూ, పటేల్‌లు అభిప్రాయపడ్డారు. ఆకుపచ్చ, తెలుపు, కాషాయం, మూడు రంగులలో మధ్య రాట్నం ఉండేది కాంగ్రెస్ పార్టీ జెండా. రాట్నం స్థానంలో ధర్మచక్రం వచ్చి మన జాతీయ పతాకమైనది.

ఇంతలో బ్రిటీష్ ప్రభుత్వం భారతదేశానికి స్వాతంత్ర్యాన్ని, సంపూర్ణ స్వరాజ్యం యిస్తున్నట్లు ప్రకటించింది. దేశాన్ని విభజించి పాకిస్థాన్ యిస్తామని ప్రకటించింది.

అయితే దురదృష్టం ఏమంటే బెంగాల్‌లో కొంత భాగం తూర్పు పాకిస్థాన్‌లోనికి వెళ్ళింది. (ఈ తూర్పు పాకిస్థాన్ దరిమిలా స్వతంత్ర బంగ్లాదేశమైనది). అంబేద్కర్ ఎన్నికైన బెంగాల్ ప్రాంతం పాకిస్థాన్‌కి పోయింది. కనుక ఆయన పరిషత్తు సభ్యత్వం రద్దు అయ్యింది. అయితే న్యాయశాస్త్రవేత్త, రాజకీయ శాస్త్రవేత్త అయిన ఆయన సేవలు ప్రస్తుత పరిస్థితుల్లో దేశానికి చాలా అవసరమని కాంగ్రెస్ వారు గుర్తించారు. కనుక బొంబాయి రాష్ట్రం నుండి సభ్యుడైన జయకర్ చేత రాజీనామా చేయించారు. ఆస్థానంలో అంబేద్కర్‌ని పరిషత్తులో సభ్యునిగా ఎన్నుకోనేటట్లు చేసారు.

రాజ్యాంగ పరిషత్తు సభ్యుడిగా ఉంటూనే, యింకోప్రక్క పీపుల్సు ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించి నిమ్న జాతీయుల విద్యాభివృద్ధికి కాలేజీలు స్థాపించాడు. ఇంత 'బిజీ'గా ఉంటూనే (తీరికలేకుండా) శూద్రులెవరు? అన్న గ్రంథాన్ని రచించాడు. బ్రాహ్మణ ఆధిక్యతను ధిక్కరించి వైదిక మత సంప్రదాయాల్ని వ్యతిరేకించిన క్షత్రియులు, బ్రాహ్మణులకు లొంగిపోయి "దాస్యం" చేసారు. వారే శూద్రులని అంబేద్కర్ వాదన. దీనిని

1946లో రచించాడు. దీనిని గురించి చివరలో కాస్త విపులంగా తెలుసుకుందాం.

## కేంద్రన్యాయ శాఖా మంత్రిగా

1947 జులై 5వ తారీఖున బ్రిటీషు పార్లమెంటు, భారతదేశానికి సంపూర్ణ స్వరాజ్యం ఇస్తున్న చట్టాన్ని ఆమోదించింది. భారతదేశానికి స్వరాజ్యంతోపాటు దేశవిభజన జరిగి పాకిస్థాన్ స్వతంత్ర రాజ్యంగా అవతరించింది. ముస్లింలు అధికంగా నివసించే దేశవాయువ్య ప్రాంతం లోని, పంజాబ్, సరిహద్దు రాష్ట్రాల్నిచీల్చి, తూర్పున బెంగాల్, అస్సాం, ప్రాంతాలలో అధికంగా ముస్లింలు నివసించే భాగాల్ని చీల్చి పాకిస్థాన్ అవతరించిందన్నమాట. తూర్పు పాకిస్థాన్ దరిమిలా స్వతంత్ర రాజ్యంగా "బంగ్లాదేశ్"గా రూపుదిద్దుకుంది. అది వేరే సంగతి. కేంద్ర మంత్రి వర్గం కూడా పునర్నిర్మాణం అయింది. అంబేద్కర్‌ను న్యాయశాస్త్రవేత్తగా, రాజకీయ శాస్త్రవేత్తగానే కాదు నిమ్న జాతుల నాయకుడిగా కాంగ్రెస్ గుర్తించింది. నెహ్రూ, పటేలు దృష్టి అంబేద్కర్‌పై పడింది.. నూతన మంత్రి వర్గంలో ఆయన్ని తీసుకుంటే ఆయన సేవలు దేశానికి ఉపయోగ పడతాయని ఆలోచించారు. గాంధీజీతో సంప్రదించారు. తప్పకుండా అంబేద్కర్‌ని మంత్రివర్గంలో చేర్చుకోమని గాంధీజీ సలహాయిచ్చాడు. అసలు - గాంధీజీయే నెహ్రూని పిలిచి అంబేద్కర్‌ని మంత్రివర్గంలోనికి తీసుకోమని మొదట సలహాఇచ్చినట్లు కొందరు చెబుతారు. మొత్తంమీద తమకు రాజకీయ ప్రత్యర్ధిగా ఉన్న అంబేద్కర్‌ను కాంగ్రెస్ వారు మంత్రివర్గంలో చేర్చుకోవడం జరిగింది. ఆయన స్వతంత్ర భారతదేశంలో ప్రథమ న్యాయశాఖా మంత్రి అయ్యాడు. ఆయన కాంగ్రెస్ మంత్రివర్గంలో చేరినందుకు కొందరు ఆయన్ని విమర్శించారు. మంత్రివర్గంలో చేరాను కాని కాంగ్రెస్‌లో చేరలేదని ఆయన సమాధానమిచ్చాడు.

రాజకీయ అధికారం చేజిక్కించుకుంటేగాని నిమ్నజాతీయులు బాగుపడరన్నది అంబేద్కర్ దృఢవిశ్వాసంగదా! కనుక కాంగ్రెస్‌వారు తమంతట

తాము పిలిచి బొట్టు పెట్టి మంత్రి పదవి ఇస్తామంటే ఆయన మాత్రం ఎలా కాదంటాడు! పదవుల కోసం పైరవీలు చేసే రోజులాయె! ఇంతకీ ఆయన మనస్సులో, అధికారం చేతిలో ఉంటే, ప్రజలకు, ముఖ్యంగా నిమ్న జాతీయులకు ఏమైనా కాస్త మంచి చేయటానికి అవకాశం వుంటుందని! నిన్న మొన్నటి వరకు గాంధీజీ, కాంగ్రెస్‌వారు అంటే అంబేద్కర్‌కు అరి కాలిలో మంట! అలానే 'అంబేద్కరంటే' కాంగ్రెస్ వారికి బద్ధవైరం. అయినా కాంగ్రెస్ వారు ఆయన ప్రతిభను గుర్తించి మంత్రిగా తీసుకొనడం గొప్ప విశేషం! రాజకీయ న్యాయశాస్త్రాలలో అంబేద్కర్‌కున్న అసాధారణ మైన పాండితీ ప్రతిభను కాంగ్రెస్ వారు మరిచిపోలేదు. అవసరాన్ని బట్టి ఆయన్ని మంత్రి వర్గంలోనికి తీసుకొనక తప్పలేదు. అంతటి రాజకీయ శాస్త్ర పండితుడు అంతటి రాజ్యాంగ నిపుణుడు అంబేద్కరుని మించి మరొకడు దేశంలో లేడన్నది గాంధీ నెహ్రూ పటేల్ తదితర అగ్రశ్రేణి దేశ నాయకులు గుర్తెరిగిన పచ్చి నిజం!

ఇంతకీ అంబేద్కర్‌ని మంత్రిగా తీసుకున్నందుకు చాటుగా విమర్శిం చిన కాంగ్రెస్‌వారు లేకపోలేదట!

పాఠకులారా! అనామకుడిగా, నిరుపేద అంటరానివాడిగా పుట్టిన అంబేద్కర్ స్వతంత్ర భారత దేశ ప్రథమ న్యాయశాఖా మంత్రిగా ఎద గడం, కలయో, వైష్ణవమాయయోగా అనిపిస్తుంది! ఆయన అదృష్టం! ఆయన ప్రతిభకు గుర్తింపు. కాంగ్రెస్ గాంధీజీల సహృదయత! నిజంగా అది దైవఘటన!

## రాజ్యాంగ చట్ట రచనా సంఘ అధ్యక్షుడిగా

1947 ఆగస్టు 15వ తేదీన భారతదేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. మరోప్రక్క దేశ విభజన జరిగి స్వతంత్ర పాకిస్థాన్ అవతరించింది. ఆగస్టు 15వ తారీఖు మీకు బాగా తెలుసుగదా! స్కూళ్ళలో, కాలేజీలలో జాతీయ పతాకాలు ఎగరవేసి. స్వీట్సు మిఠాయిలు పంచిపెడతారు కదా! ప్రతి జిల్లాలో దేశ రాష్ట్ర రాజధాని పట్టణాలలో జాతీయ జెండాలు ఎగ

రవేస్తారు. ఢిల్లీలో ఎర్రకోటపై జాతీయ పతాకం ఎగరవేసి ప్రధానమంత్రి ఉపన్యసిస్తారు. రాష్ట్ర రాజధానుల్లో ముఖ్య మంత్రులు జాతీయపతాకాలు ఎగురవేస్తారు. జిల్లా కేంద్రాలలో జిల్లా కలెక్టర్లు జాతీయ పతాకాలు ఎగురవేస్తారు. కొన్నిచోట్ల రాజకీయ పార్టీలు ప్రైవేటు సంస్థలు గూడా జాతీయ జెండాలు ఎగురవేస్తాయి!

సరే. ఆ విషయం అలా వుంచండి. స్వాతంత్ర్యం రాగానే రాజ్యాంగ పరిషత్తు సర్వ స్వతంత్రమైనది. దేశంలో సుస్థిరమైన పాలన ప్రజాశ్రేయస్సుకోసం కేంద్ర రాష్ట్రాల చట్ట సభల నిర్మాణం వాటి విధులు న్యాయ వ్యవస్థ ప్రభుత్వ యంత్రాంగం మొదలగు వ్యవస్థలనేర్పాటు చేసుకొంటానికి రాజ్యాంగ చట్టం తయారుచేసుకోవలసి వచ్చింది. 1947 ఆగష్టు29వ తేదీన రాజ్యాంగ చట్ట రచనా సంఘాన్ని యేర్పాటు చేసారు. అంబేద్కర్ కున్న రాజకీయ, న్యాయశాస్త్రాల పాండిత్యం గుర్తించి ఆ సంఘానికి అంబేద్కర్‌ని అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. సర్వశ్రీ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్, గోపాలస్వామి అయ్యర్, కె.ఎం. మున్షీ, సయ్యద్ మహమ్మద్‌సాదుల్లా, బి.ఎల్. మిత్రా, డి.పి. షేతాన్లు, బెనగల నరసింగరావు యీ రాజ్యాంగ రచనా సంఘంలో సభ్యులు. అందరూ రాజకీయ న్యాయశాస్త్ర కోవిదులే!

చూసారా! అంబేద్కర్‌కి కాంగ్రెస్ వారికి పడదు. అయినా ఆయనకు రాజ్యాంగ చట్టం రచించే బాధ్యత నప్పగించారు. అది వారి పెద్ద మనస్సునకు సహృదయతకు చిహ్నం. అది ఆయన ప్రతిభకు గుర్తింపు. ఆయనకే ఆశ్చర్యాన్ని కలిగించింది. అది తన అదృష్టమని తలంచాడు. తనకిచ్చిన బాధ్యతను సంతోషంగా అంగీకరించాడు. ఆరోగ్యం సరిలేదు. అయినా గొప్ప పనిచేయడం ముఖ్యం. పదిమందికి మంచి చేయడం ముఖ్యం. జీవితం శాశ్వతమైనది కాదు. మనిషి చేసే మంచిపని శాశ్వతం. రాజ్యాంగ చట్టం శాశ్వతం కనుక అంగీకరించానని ఆయనే చెప్పాడు.

# రాజ్యాంగ చట్ట రచన

1947 ఆగష్టు 30వ తారీఖున రాజ్యాంగ చట్ట రచనా సంఘం తొలి సమావేశం జరిగింది. రాజ్యాంగ రచన వెంటనే చేపట్టాలని నిర్ణయించారు. సెప్టెంబర్ నుండి రాజ్యాంగ రచన ప్రారంభమైనది. దురదృష్టవశాత్తు మిగిలిన సభ్యులు అంబేద్కర్‌కు అందుబాటులో ఉండేవారుకాదు. ఆయన ఆరోగ్యం బాగుండ లేదు. న్యాయశాఖామంత్రి పదవీ బాధ్యతలతో తీరిక లేదు. అంబేద్కర్ రాజ్యాంగ చట్ట రచనకు పూనుకొన్నాడు. తన వ్యక్తిగత కార్యదర్శి ఆయనకు కొండంత అండగా నిలిచాడు. దేశదేశాల రాజ్యాంగాలు ఒకసారి తిరగేసాడు. వాటిలో మంచిని తీసుకున్నాడు. ముఖ్యంగా అమెరికా, ఆస్ట్రేలియా, బ్రిటన్, స్విట్జర్లాండ్, గ్రీస్ దేశాల రాజ్యాంగ చట్టాలను దృష్టిలో పెట్టుకున్నాడు. అమెరికా స్వాతంత్ర్య నేతలు అబ్రహాంలింకన్ - బూకర్ వాషింగ్‌టన్‌ల్ని ఫ్రెంచి రచయితలు వాల్టేరు రూసోలను గుర్తు చేసుకున్నాడు. మనదేశంలో ఎన్నో కులాలు, ఎన్నో మతాలు, ఎన్నో భాషలు, ఎన్నో ఉపజాతులు ఉన్నాయి. మనదేశ సంస్కృతిని కాపాడవ లసి వుంది. మనదేశ సమగ్రతను కాపాడవలసి వుంది. విభిన్న జాతులను ప్రజలను భావ సమైక్యపరచవలసి వున్నది. ఏ కులాన్నీ, ఏ మతాన్ని, ఏ భాషనూ, ఏ ప్రాంతాన్నీ నిర్లక్ష్యం చేయకూడదు. చులకన చేయకూడదు. అందరికీ న్యాయం చేకూరాలి, అందరికీ సమాన గౌరవం చేకూర్చాలి. అట్టడుగున పడివున్న నిమ్నజాతీయులు బడుగువర్గాల శ్రేయస్సు చూడాలి. దేశస్థులందరూ సోదరులమన్న భావంతో ప్రజలు బ్రతకాలి. ఈ విషయా లన్నీ దృష్టిలో పెట్టుకున్నాడు. వివిధ కులాల వారికి - వివిధ మతాల వారికి - వివిధ వర్గాల వారికి - వివిధ భాషల వారికి వివిధ ఉప జాతుల వారికి - అందరికీ ఆమోదకరమైన - సంతృప్తికరమైన అందరి గౌరవం - శ్రేయస్సు గూర్చే విధంగా రాజ్యాంగం రాయటం కష్టమ. అది కత్తిమీద సాములాంటిది. అయినా ఆయన అందరి శ్రేయస్సు కోరి రాజ్యాంగం రాస్తాడు. యావత్తు భారతదేశ ప్రజలకు సాంఘికంగా ఆర్థికంగా, రాజకీయంగా సమాన న్యాయం జరిగేటట్లు జాగ్రత్తపడ్డాడు. ప్రజాస్వామ్య విధానానికి నాలుగు స్థంభాలు వంటి న్యాయం (Justice) సమానత్వం (Equality) స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు (Liberty) సౌభ్రాతృత్వం (Fraternity)



రాష్ట్రపతి డా. రాజేంద్రప్రసాద్ డా. అంబేద్కర్‌చే కేంద్ర
న్యాయశాఖామంత్రిగా ప్రమాణ స్వీకారంచేయించుట.
ప్రధాని పండిట్ జవ్హార్‌లాల్ నెహ్రూ గూడా చిత్రంలో ఉన్నాడు.



రాజ్యాంగ రచనా సంఘ అధ్యక్షులు డా. అంబేద్కర్
ఇతర సంఘ సభ్యులు (ఎడమ నుండి కూర్చున్నవారు) సర్వశ్రీ ఎన్.మాధవరావు,
సయ్యద్ సాదుల్లా, అల్లాడి కృష్ణస్వామి అయ్యర్,
సర్. బెనిగల్ నరసింగరావు (నిల్చున్నవారు ఎడమ నుండి)
సర్వశ్రీ ఎస్. ఎన్. ముఖర్జీ, జుగల్ కిశోర్ కన్న, కేవల్ కృష్ణన్.



రెండవభార్య డాక్టర్ సవితా కబీర్‌తో డా. అంబేద్కర్



కుశినార బౌద్ధభిక్షు మహాస్థ వీర చంద్రమణిచే
సతీ సమేతంగా డా. అంబేద్కర్ బౌద్ధధర్మదీక్ష స్వీకరింపచేయుట.
బౌద్ధ భిక్షువలిసింహను గూడ చూడవచ్చు.



రాజకీయ నాయకుడిగా
డా. అంబేద్కర్



వృద్యాప్యంలో డా. అంబేద్కర్
(ఆంతరంగిక కార్యదర్శి రత్తూతో)



డా. అంబేద్కర్ నిర్యాణం



బొంబాయి - దాదార్ - చైత్య భూమిలో డా. అంబేద్కర్ సమాధి



పార్లమెంటు భవనం ఎదుట డా. అంబేద్కర్ విగ్రహం

సోదరభావం అందరికీ అన్ని విషయాలలో ఉండేటట్లు చూసాడు. దేశమంతటికీ ఒకే విధమైన న్యాయవ్యవస్థ ఉండేటట్లు జాగ్రత్తపడ్డాడు. అందరికీ ఒకేవిధమైన న్యాయం జరిగేలా చూసాడు. భావ ప్రకటన, వాక్‌స్వాతంత్ర్యం, మతస్వేచ్ఛ దేశంలో ఎక్కడైనా జీవించే హక్కు కల్పించాడు. ఏ ప్రాంతం వారైనా, ఏ భాష మాట్లాడే వారైనా, ఏ ఉప జాతివారైనా, ఏ మతం వారైనా, ఏ కులంవారైనా అందరికీ సమాజంలో సమాన గౌరవం ఉండేలా చూసాడు. అందరూ భారతీయ సోదరులమేనన్న భావన కలిగేటట్లు రాజ్యాంగం రూపొందించాడు. అందరికీ ఒకేవిధమైన సమానమైన దేశ పౌరహక్కు కల్పించాడు.

తరతరాలుగా సామాజికంగా, ఆర్థికంగా, రాజకీయంగా అణచివేయబడిన నిమ్న జాతుల వారికి కొన్ని ప్రత్యేక రక్షణలు రాజ్యాంగంలో పొందుపరచగలిగాడు. రాజ్యాంగరీత్యా అస్పృశ్యత నిర్మూలించబడింది. అది చట్టం దృష్టిలో నేరం! దళిత జాతుల అభ్యున్నతికి కేంద్ర రాష్ట్ర సభలలో కొన్ని ప్రత్యేక స్థానాలు కేటాయించబడేటట్లు జాగ్రత్తపడ్డాడు. కొన్ని ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పాటు చేయడంలో కృతకృత్యుడైనాడు. దళితుల జీవన ప్రమాణం మెరుగుపరచడానికి వారికి విద్య ఉద్యోగ విషయాలలో కొన్ని ప్రత్యేక కేటాయింపులు కల్పించడంలో కూడా ఆయన కృతకృత్యుడయ్యాడు. అలానే అల్పసంఖ్యాక వర్గాలకు ఆదిమ జాతులకు రాజకీయ రక్షణలు కల్పించగలిగాడు. బలహీనుడైన రోగికి వైద్యులు మంచి మందులు, టానిక్కులు ఇస్తారు. మంచివారికి కాదుగదా! అలానే సామాజికంగా అణచివేయబడిన దళితులకు కొన్ని హక్కులు-రక్షణలు కల్పించడం, ప్రజాస్వామిక పద్ధతి కనుక నిమ్న జాతులకు అల్ప సంఖ్యాక వర్గాల వారికి రాజ్యాంగంలో కొన్ని ప్రత్యేక హక్కులు-రక్షణలు కల్పించడంలో జాగ్రత్త పడ్డాడు.

మన రాజ్యాంగం ప్రకారం మనది పార్లమెంటరీ ప్రజాస్వామం. అంటే మనది ప్రజాప్రభుత్వం. కేంద్రంలోని పార్లమెంటు సభ్యులను రాష్ట్రాలలోని చట్ట సభల సభ్యులను ప్రజలు ఎన్నుకుంటారు. ఒకే ఓటు -

ఓటుకు ఒకే విలువగా వయోజన ఓటింగు పద్ధతి ప్రవేశ పెట్టాడు. ప్రజా స్వామ్యంలో అందరూ పాలుపంచుకోవాలన్నది ఆయన ఆశయం. కేంద్ర రాష్ట్ర చట్టసభల ప్రతినిధులు రాష్ట్రపతిని ఎన్నుకుంటారు. ప్రజల శ్రేయస్సు, సుస్థిరపాలన దృష్టిలో పెట్టుకుని కేంద్ర రాష్ట్ర చట్టసభలు చట్టాలు చేస్తాయి. ఆ చట్టాల్ని ప్రభుత్వ యంత్రాంగం అమలు పరుస్తుంది. అన్యాయం జరిగిన సందర్భాలలో న్యాయం చేయటానికి న్యాయ వ్యవస్థ వుంది! (కోర్టులుంటాయి) ఈ విధంగా మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం అమలుపరచటానికి చట్టసభలు, ప్రభుత్వ యంత్రాంగం, న్యాయ వ్యవస్థ యీ మూడూ కలసి పనిచేస్తాయి. మన పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రభుత్వానికి యీ మూడు వ్యవస్థలు "త్రిమూర్తులు" వంటివి.

మనది శ్రేయోరాజ్యం (వెల్ ఫేర్ స్టేట్ Welfare State) అన్ని వర్గాల వారి, అన్ని కులాల వారి, అన్ని మతాల వారి, అన్ని భాషల వారి, అన్ని ప్రాంతాల వారి "శ్రేయస్సు" కోసం పనిచేస్తుంది కనుక మనది శ్రేయోరాజ్యమన్నారు. అలానే మనది లౌకిక రాజ్యం (సెక్యులర్ స్టేట్ Secular State) అన్ని మతాల వారికి సమాన గౌరవం యివ్వడం జరిగిందన్నమాట. మనది సర్వ స్వతంత్ర దేశం, సర్వగణతంత్ర రాజ్యం. కనుక మనది సర్వ స్వతంత్ర సర్వసత్తాక (సార్వభౌమిక) గణతంత్ర (ప్రజాస్వామిక) దేశం (Soverign Democratic Republic)

మన రాజ్యాంగం కేవలం అటు కేంద్రీకృతమైనది (యూనిటరీ) కాదు.ఇటు కేవలం సమాఖ్య ఫెడరల్ తరహాదికాదు. అంటే అధికారా లన్నీ కేంద్రం చేతిలో "కేంద్రీకృతమై" వుండలేదు. ఇటు రాష్ట్రాలకు మితిమీరిన అధికారులు ఇచ్చి యుండలేదు. కేంద్రీకృతమైతే- రాష్ట్రాలకు స్వేచ్ఛవుండదు. అలాకాక రాష్ట్రాలకు ఎక్కువ అధికారాలిస్తే కేంద్రం బల హీనపడుతుంది. కనుక మన రాజ్యాంగం మధ్యే మార్గంలో వున్నది. అలానే మన రాజ్యాంగం కేవలం దృఢమైనది (కఠినమైనది) (రిజిడ్) కాదు. అంటే మారటానికి వీలులేకుండా లేదు. తప్పనిసరి పరిస్థితుల్లో మార్చుకోవచ్చు. పైగా అది మరీ సున్నితమైన (ఉదారమైనది (లిబరల్))కాదు. అంటే

తలచినప్పుడల్లా మార్చుకోవటానికి వీలులేదు. మధ్యే మార్గంలో వుంది. అంటే దేశ సుస్థిరత - భద్రత - ప్రజాశ్రేయస్సు దృష్టిలో పెట్టుకొని రాసాడాయన!

మన రాజ్యంగంలో పొందు పరచిన ప్రాథమిక హక్కులు (ఫండమెంటల్ రైట్స్) మన పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రభుత్వ విధానానికి పట్టుగొమ్మలు. వ్యక్తి యొక్క మనుగడకు వ్యక్తిత్వానికి అవి జీవగర్రలు! అలానే రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలు (డైరెక్టివ్ ప్రిన్సిపుల్స్) రాజ్యాంగం అమలు పరచటానికి మారదర్శక సూత్రాలు వంటివి. దేశ రక్షణ సైన్యం విదేశీయ విధానం - రవాణా - ప్రసార విషయాలు (రైలు - విమాన - రేడియో - టీవీలు) ద్రవ్య - ఆర్థిక విధానాలు (కరెన్సీ - బ్యాంకులు ఫైనాన్సు) కేంద్రం ఆధీనంలో వుంటాయి. ప్రత్యక్ష పన్నులు గూడా కేంద్రం వేస్తుంది. పరోక్ష పన్నులు రాష్ట్రాలు చూసుకొంటాయి. రాష్ట్రాలలో శాంతి భద్రతలు - పాడిపంటలు - స్థానిక సంస్థలు పంచాయితీరాజ్ - ప్రజాశ్రేయస్సు రాష్ట్రాలు చూసుకొంటాయి. ప్రజాహిత కార్యక్రమాలు కేంద్రం గూడా అజమాషీ చేస్తుంది. రాష్ట్రాలకు అండగా వుంటుంది. విద్య - ఆరోగ్యం - అటుకేంద్రం - యిటు రాష్ట్రాలు చూసుకొంటాడు. అత్యవసర పరిస్థితుల్లో రాష్ట్రపతిదే అధికారం! ఇవీ మన రాజ్యాంగంలోని ముఖ్యాంశాలు.

రాజ్యాంగ ముసాయిదాను (చిత్తుప్రతి) ప్రజల అభిప్రాయాల కోసం బహిరంగంగా ప్రకటించారు. మేధావుల నుండి ప్రజలనుండి సలహాలు తీసుకున్నారు. రాజ్యాంగ పరిషత్తులో ముసాయిదాను "మూడుసార్లు" పఠనం జరిగింది. మొదట ముసాయిదాలో 315 అధికరణాలు (Articles) 8 షెడ్యూళ్ళు వుండేవి. ప్రజల అభిప్రాయాలు దృష్టిలో పెట్టుకొని మూడు సార్లు "పఠనం" పూర్తిచేసిన తర్వాత తుది (శుద్ధ) రాజ్యాంగచట్టంలో 395 అధికరణాలు 9 షెడ్యూళ్ళు ఖరారు చేయడం జరిగింది.

శుద్ధ రాజ్యాంగచట్టాన్ని రాజ్యాంగ పరిషత్తు ఆమోదించిన సందర్భంలో అంబేద్కర్ మాట్లాడుతూ యిలా హెచ్చరించాడు. గతంలో మాదిరిగా

మనమంతా కులమత భేదాలతో ద్వేషంతో తగవులాడుకొంటూ వుంటే వచ్చిన స్వాతంత్ర్యాన్ని నిలుపుకోవడం కష్టసాధ్యం. ఎన్ని కష్టాలు వచ్చినా రక్తం ఆఖరిబొట్టు వరకు చిందించి అయినా సాధించిన స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకోవాలి. మనకిప్పుడు లభించింది రాజకీయ పరమైన స్వాతంత్ర్యం. మనం దానితో తృప్తి పడరాదు. సాంఘికంగా, ఆర్థికంగా గూడా మనం స్వాతంత్ర్యం సాధించాలి. లేకపోతే సాంఘిక, ఆర్థిక అసమానతలతో అష్ట కష్టాలు పడుతున్న తాడిత-పీడిత బడుగువర్గాల వారు సహనం కోల్పోయి తిరుగుబాటు చేయడం తప్పదు అంటూ అంబేద్కర్ హెచ్చరించాడు. అంబే ద్కర్ కృషిని అందరూ మెచ్చుకున్నారు. రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షుడు రాజేంద్రప్రసాద్ - మిగిలిన పరిషత్తు సభ్యులు అంబేద్కర్‌ని శ్లాఘించారు. భారతీయ సంస్కృతికి జీవం పోసే విధంగా - భారతీయులందరి గౌరవం - శ్రేయస్సు కోరి - యావత్ భారతదేశ సమగ్రత - భద్రత - కాపాడగల - సుస్థిర పరిపాలన ప్రసాదించిన పార్లమెంటరీ ప్రజాస్వామ్య రాజ్యాంగ మన స్వతంత్ర భారతదేశాన్ని రూపుదిద్దుకొన్న రాజ్యాంగాన్ని రచించినందు లకు అంబేద్కర్‌ని దేశవిదేశీయులు ప్రశంసించారు. భారతీయ "జఫర్‌సన్" అన్నారు! అభినవమనువన్నారు. నవభారత రాజ్యాంగ నిర్మాత అన్నారు.

నూతన రాజ్యాంగచట్టం 1950 జనవరి 26వ తారీఖునుండి అను లులోనికి వచ్చింది. వాస్తవానికి మనకు స్వాతంత్ర్యం 1947 ఆగష్టు 15న వచ్చింది. 1950 జనవరి వరకు బ్రిటీషు వారు అమలుపరచిన చట్టాల ప్రకారం పాలన జరిగిందన్నమాట. జనవరి 25వ తారీఖు రాత్రి రాష్ట్రపతి ప్రజలనుద్దేశించి టీ.వీ లో రేడియోలో ప్రసంగిస్తాడు. జనవరి 26న ఢిల్లీలో రాష్ట్రపతి రోడ్డులో రాష్ట్రపతి జాతీయ పతాకాన్ని ఎగుర వేస్తాడు. వివిధ దళాల సైనిక విన్యాసాల్ని తిలకిస్తాడు. ప్రజలు గూడా చూస్తారు. రాష్ట్రాలలో గవర్నర్లు, జిల్లాలలో కలెక్టర్లు జాతీయ పతాకాలు ఎగురవేస్తారు. ఆగష్టు 15వ తారీఖు మాదిరిగా జనవరి 26వ తారీఖు ప్రభుత్వం జాతీయ సెలవులుగా ప్రకటించింది. ఇదంతా మీకు తెలుసు.

పాఠకులారా! చూసారా! అంటరానికులంలో నిరుపేద అనామకు డిగా పుట్టిన అంబేద్కర్ నవ భారత రాజ్యాంగ నిర్మాత అయ్యాడు. హిందూ సమాజంలో కుల ఆధిక్యతకు, అసమానతలకు కారకుడు మనువు. అందుకే ఆనాడు అంబేద్కర్ మనుస్మృతిని బహిరంగంగా తగలబెట్టాడు. మనుస్మృతిని తగలబెట్టిన అంబేద్కర్ నవభారత రాజ్యాంగ నిర్మాత కావడం విచిత్రం. మనుస్మృతిని తగులబెట్టిన చేతితోనే నవభారత రాజ్యాంగం రాయటం నిజంగా విచిత్రం! అది కాకతాళీయమైనా అది దైవ సంఘటన. దైవ ఘటన అంటే అంబేద్కర్ ఒప్పుకోడు. ఆయన అనుయాయులు ఒప్పుకోరు. మనం అనుకొంటున్నాం అది దైవ ఘటన అని.

ఇంకో విషయం - నిన్నటివరకు "నేను- నా నిమ్నజాతులు" అన్నది అంబేద్కర్ నినాదం. రాజ్యాంగ చట్టరచనా బాధ్యత మీద పడేసరికి "నాదేశం-నాప్రజ" అన్న జాతీయభావంతో మెలిగాడు. అంద రికోసం ఒకరు-ఒకరికోసం అందరన్నాడు. నిన్నటివరకు హిందూమతాన్ని తెగ తిట్టిపోసాడు. రాజ్యాంగంలో హిందూమతంతోపాటు అన్ని మతాలకు సమాన ప్రతిపత్తినిచ్చాడు. మతస్వేచ్ఛ కల్పించాడు. జాతీయ భావన-భా రతీయత ఆయనలో వెల్లుబికాయి. హృదయ విశాలత మానవతాదృక్పథం ఆయనలో తాండవించాయి. సమతకు స్వేచ్ఛకు, న్యాయానికి, సౌభ్రాతృ త్వానికి ఆయన మన రాజ్యాంగంలో పట్టం కట్టాడు. ప్రజాస్వామ్యవాదిగా సమతా మానవతావాదిగా ఋజువు చేసుకున్నాడు.

అసలు విషయమేమంటే ఆయన జీవితమంతా నిమ్నజాతులవారి రాజ కీయ హక్కులకోసం వారి విద్యా ఉద్యోగ సదుపాయాల కోసం పోరాడాడు. గాంధీజీ కాంగ్రెస్ వారు చివరకు బ్రిటీషు పాలకులు నిమ్నజాతీయులకు "ప్రత్యేక నియోజక వర్గాలు" ప్రత్యేక రక్షణలు అంగీకరించలేదు. రాజ్యాంగ రచనా కాలంలో వాటి విషయంలో శ్రద్ధ తీసుకోమని చర్చిల్ తదితర బ్రిటీష్ నాయకులు అంబేద్కర్‌కు సలహా యిచ్చారు. అంబేద్కర్ అది మరచిపోలేదు. రాజ్యాంగ చట్ట రచనా బాధ్యత తన చేతికి వచ్చింది. ఇంటి తాళం చెవులు తన చేతికి వచ్చాయి. కనుక తన నిమ్నజాతీయుల

కొరకు ప్రత్యేక హక్కులు - రక్షణలు కల్పించడానికి జాగ్రత్త పడ్డాడు! పెత్తనం తనకు వచ్చింది. స్వార్థంతో దానిని దుర్వినియోగ పరచలేదు అందరి శ్రేయస్సు చూసాడు. తనవారి శ్రేయస్సూ చూసుకొన్నాడు. వచ్చిన అవకాశాన్ని వదిలిపెట్టలేదు. నిమ్నజాతులకు రాజకీయ రక్షణలు, విద్యా ఉద్యోగ సదుపాయాలు రాజ్యాంగంలో పొందుపరిచాడు. రాజ్యాంగ పరిషత్తులో గూడా అవి అందరికీ ఆమోదయోగ్యం అయ్యేటట్లుగా జాగ్రత్త పడ్డాడు. ఆయన ఆనందానికి మేరలేదు. ఆయన మనస్సుకెంతో ప్రశాంతత గల్గింది. ఎంతో సంతృప్తి పడ్డాడు. తాను కోరింది సాధించాడు. తాను చేయగలిగింది చేసాడు తన జాతులవారికి. అదీ ఆయన ఆనందానికి సంతృప్తికి కారణం!

## అనారోగ్యం

రాజ్యాంగ రచనా బాధ్యతలు స్వీకరించి అంబేద్కర్ ఒంటరిగా రాత్రింబవళ్ళు పనిచేయడం వలన 1948 జనవరిలో ఆయన తీవ్ర అస్వస్థతకు గురి అయ్యాడు. మోకాలి చిప్పల్లోను ఎముకల్లోను బాధ యెక్కువైంది. రక్తహీనతతో పాటు నరాల బలహీనత ఆయన్ని చాలా బాధపెట్టసాగాయి. దీనికితోడు మధుమేహ వ్యాధి బాధ. రాజ్యాంగ రచన సాగుతున్నా గత్యంతరం లేక ఆస్పత్రిలో చేరక తప్పలేదు. వైద్యులు ఆయనకు ప్రత్యేక వైద్య సేవలు అందించారు. డా. శారదా కబీర్ అనే లేడీ డాక్టర్ని అంబేద్కర్ దగ్గర వైద్య సేవలందించేందుకు ప్రత్యేకంగా నియమించారు. ఆమె నిజంగా రాత్రింబవళ్ళు అంబేద్కర్‌ని కనిపెట్టుకొని కంటికి రెప్పలా కాపాడింది. మొత్తం మీద డాక్టర్ల ప్రత్యేక వైద్య సేవల వలన ముఖ్యంగా డా. శారదా కబీరు ప్రత్యేక శ్రద్ధ వలన అంబేద్కర్ ఆరోగ్యం కాస్త కుదుటబడింది. ఆస్పత్రినుండి "డిస్‌చార్జి" అయ్యాడు.

ఇక్కడొకమాట మనం చెప్పుకోవాలి. అంబేద్కర్ పైకి దృఢంగా, గంభీరంగా కనిపించేవాడు. కాని మొదటినుండి ఆయన ఆరోగ్యం సరిగ్గా వుండేదికాదు. కాలేజిలో చదివినప్పుడు గూడా జబ్బు పడ్డాడు. అప్ప

డొక సంవత్సరం కాలేజీ చదువులకు దెబ్బ తగిలింది. తర్వాత ఎన్నోసార్లు ఆయన అనారోగ్యానికి గురి అయ్యాడు. వేళకు అన్నం తినక, తిన్నా కడుపునిండా తినక, కంటినిండా నిద్రలేక ఆరోగ్యం చెడిపోయేది. రాత్రిం బవళ్ళు నిమ్నజాతుల ఉద్దరణ కార్యక్రమాలతో ఒక క్షణం తీరిక లేకుండా వుండేవాడు. పైగా యెప్పుడూ ఏదో చోటికి గ్రామాంతరం వెళ్ళి సభలలో మాట్లాడేవాడు. దానికితోడు ఆయన పుస్తక ప్రియుడుగదా. తీరిక దొరికిన ప్పుడు చదువుతూ రచనలు చేస్తుండేవాడు. నిద్రాహారాలు లెక్క చేసేవాడు కాదు. తరుచుగ ఆయన కంటి జబ్బుతో బాధపడేవాడు. ఒకానొక దశలో ఆయనకు కంటిచూపే అసలు పోతుందేమోనని ఆయనకూ- వైద్యులకు సందేహం వచ్చింది. అదృష్టవశాత్తు కంటిచూపు మాత్రం పోలేదు. ఆయన మధు మేహవ్యాధితో బాధపడేవాడు. కాళ్ళు కీళ్ళు నొప్పులు (రొమాటిక్ పెయిన్సు) మితిమీరిన ఆవేశం ఉద్రేకం వుండేవి. ఇవి ఆరోగ్యానికి మంచిది కాదని ఆధునిక వైద్యశాస్త్రం స్పష్టంగా చెబుతొంది. ఆయన ఆరోగ్యం దెబ్బ తినటానికి ఉద్రేకం "టెన్షన్" ఒక ముఖ్యకారణం. 1933 ప్రాంతంలో ఆయన తీవ్ర అస్వస్థతకు గురి అయ్యాడు. వైద్యంతో పాటు శారీరక మైన, మానసికమైన పూర్తి విశ్రాంతి తప్పనిసరి అని వైద్యులు సలహా యిచ్చారు. "బోర్టి" లో కొన్నాళ్ళు, మహాబలేశ్వర్‌లో కొన్నాళ్ళు ప్రజలకు దూరంగా ఆయన విశ్రాంతి తీసుకొన్నాడు. ఈ విశ్రాంతి సమయంలోనే బొంబాయిలో స్వగృహం నిర్మించటానికి ప్లాను తాను స్వయంగా తయా రుచేసుకున్నాడు.

## రెండవ వివాహం

అస్పత్రినుండి కొంత స్వస్థతతో అంబేద్కర్ ఇంటికి వచ్చాడు. ఇంటికి వచ్చిన దగ్గరనుండీ మరలా ఆయన తీరికలేని కార్యక్రమాలలో పాల్గొ నసాగాడు. రోజూ వైద్యుల సంప్రదింపులు ఆయనకి అవసరమౌతుండేవి. కుటుంబ వైద్యుడు డాక్టర్ మాల్‌వంకర్ వచ్చి చూచిపోతూ వుండేవాడు. అయినా ఆయనకు అస్పత్రిలో ప్రత్యేక శ్రద్ధ తీసుకొని వైద్యం చేసిన డా.

శారదా కబీర్ మనసులోనే మెదలుతోంది. ఆమె చాలా కలుపుగోలు డాక్టర్. సరదామనిషి. ఆమె అయితే ప్రతినిత్యం తనను కనిపెట్టుకొని అవసరమైన వైద్యం చేయగలదు. భార్య రమాబాయి మరణించి పది సంవత్సరాలైనది. అయినా తనకు మరలా పెండ్లి చేసుకోవాలన్న తలంపే కలగలేదు. ఆమె చనిపోయిన మొదట్లో ఆయన కొంత మనోవ్యధకు గురి అయ్యాడు. అయితే తర్వాత నిమ్నజాతీయుల ఉద్ధరణ కార్యక్రమాలతో క్షణం తీరిక లేకుండా కాలం గడుపుతున్నాడు.

అయినా అప్పుడప్పుడూ ఆయన ఒంటరితనంతో బాధపడేవాడు. ముఖ్యంగా ఆయనకు అనారోగ్యం చేసినప్పుడు తనను ఇరవై నాల్గుగంటలు కనిపెట్టుకొని ప్రేమతో చూచే ఆప్తులు లేరే అని బాధపడేవాడు. ఉన్నది ఒకే ఒక కుమారుడు. అతని ఆరోగ్యమూ అంతంత మాత్రమే. వ్యక్తిగత కార్యదర్శి రత్తూ మంచివాడే. ఇంటి పనివాళ్ళు ఆయన్ని కనిపెట్టుకొని వుండేవాళ్ళు. అయినా డా. శారదా కబీర్‌లో తాను మనస్సులో ఆశించిన ఆప్తురాల్ని చూస్తున్నాడు. ఆమెని రెండవ వివాహం చేసుకొంటే?

తనకిప్పుడు యాభది ఆరు సంవత్సరాలు. డా. శారదా తనకంటే చాల చిన్నది. ఆమె ఏ కారణాల వల్లనో వివాహం చేసుకోలేదు. ఆమె తండ్రి ఆదర్శభావాలు ఉన్నవాడట. ఆమె అక్క చెల్లెళ్ళు వర్ణాంతర వివాహాలు చేసుకున్నారట. ఆమె బాగా చదువుకొన్నది. సంస్కారమున్నది. అభ్యుదయ భావాలున్న స్త్రీ, ఆమె సారస్వత బ్రాహ్మణ కుటుంబానికి చెందినది. ఆయన బ్రాహ్మణ ద్వేషి. అయినా ఆమెతో పరిచయం క్రమంగా స్నేహంగా మారింది. ఏది ఏమైనా ఆమెను రెండో వివాహం చేసుకోవాలని మనస్సులో ఆరాటపడసాగాడు. పెండ్లి చేసుకుంటే ఆయన కోరుకునేది సంసార సుఖంకాదు. అనారోగ్యంగా ఉన్న తనను కంటికి రెప్పలా కనిపెట్టుకొని వుండే ఆప్యాయత సహాయత ఆమెలో వున్నాయి. తన ఒంటరి తనాన్ని పోగొట్టటానికి ఆమె సాన్నిహిత్యం యెంతో పనికివస్తుంది! సన్నిహిత మిత్రులు గయక్వాడ్-చిత్రేలతో సంప్రదించాడు. ఆప్త మిత్రులతో చెప్పాడు. శ్రేయోభిలాషులతో చెప్పాడు. కాని కుమారుడు యశ్వంత్ అంగీ

కరించలేదు. తన తల్లి స్థానంలో ఇంకో స్త్రీ రావడం అతనికి ఇష్టంలేదు. ఆయన మాత్రం చిన్నప్పుడు తండ్రి రెండో పెళ్ళి చేసుకుంటే. ఎంత బాదపడలేదు? కొందరు మిత్రులు కూడా ఆయన రెండో వివాహం విషయంలో పొరపాటు చేస్తున్నాడేమోనని అనుకొన్నారు. అయినా ఆయన ఆమెను వివాహం చేసుకోవాలని నిశ్చియించుకొన్నాడు. 1948 ఏప్రియల్ 15న ఢిల్లీలోని అంబేద్కర్ నివాసంలో కొద్దిమంది సన్నిహిత మిత్రుల మధ్య అంబేద్కర్-శారదా కబీర్‌ల వివాహం నిరాడంబరంగా జరిగింది. వారి వివాహం సివిల్ మారేజెస్ చట్టం ప్రకారం రిజిష్టరు చేసారు. శారదా కబీర్-సవితా కబీరైనది. ఆమె తోడి జీవితం అంబేద్కర్‌కు ఎంతో సాంత్వనం కలిగించింది. తనతో యీ వివాహం విషయంలో విభేదించిన కుమారుడికి కొంత సొమ్ము, ఒక గృహం కొనిచ్చాడు. కుమారుడు తాత్కాలికంగా వేరే కాపురం పెట్టాడు. కులనిర్మూలనకు వర్ణాంతర వివాహాలు ఒక ముఖ్యమైన మార్గంగా ఆయన యెప్పుడూ చెబుతూండేవాడు. బహూశా అందుకేనేమో - ఆయన కులాంతర వివాహం చేసుకున్నాడు! రెండో పెండ్లి చేసుకున్నాక అంబేద్కర్ దగ్గరకు ఆయనకు అత్యంత సన్నిహితులు కొందరు రావడం తగ్గించిపేసారు.

ఇదే సమయంలోనే 1948లో "అస్పృశ్యులు" (ది అన్‌టచ్‌బుల్స్) అనే పరిశోధనా గ్రంధం వెలువరించాడు. తాను "అస్పృశ్యకులం" లో పుట్టాడు. అస్పృశ్యుడిగా పడరాని బాధలు, అవమానాలు పడ్డాడు. జిజ్ఞాస, పరిశోదనాదృష్టి ఉన్నవాడు. ఏపిల్ పండు కింద పడడం చూసిన శాస్త్రజ్ఞుడు సర్ ఐజక్ న్యూటన్ ఆ పండు క్రిందనే పడింది పైకెందుకు పోలేదు అని జిజ్ఞాసతో పరిశోధనలు చేసాడు. భూమికి ఆకర్షణ శక్తి ఉండడం వలన పండు క్రింద పడింది అని "గురుత్వాకర్షణ" సిద్ధాంతాన్ని కనిపెట్టాడు. అలానే అస్పృశ్యుడుగా పుట్టి బాధలు పడ్డ అంబేద్కర్ జిజ్ఞాసతో తానూ అందరివంటి మనిషే అయినా యీ అస్పృశ్యత ఏమిటి అని పరిశోధనలు చేసాడు. కుల వ్యవస్థనుండి అస్పృశ్యత యెలా పుట్టిందో క్షుణ్ణంగా పరిశోధించాడు, గ్రంధం రాసాడు. దీనిని గురించి చివరలో కాస్త

విపులంగా తెలుసుకుందాం.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. రాజ్యాంగ పరిషత్తు ఏర్పాటైనది. అప్పటికింకా ఆయన రాజ్యాంగం రాయలేదు. అల్ప సంఖ్యాక వర్గాలకు, బడుగు వర్గాలకు, నిమ్నజాతులకు అన్యాయం జరగకుండా వారి ప్రయోజనాల్ని కాపాడవలసిన బాధ్యత ప్రభుత్వానికుంది. అల్ప సంఖ్యాకుల నిమ్నజాతుల ప్రయోజనాలకై "స్టేట్స్ అండ్ మైనారిటీస్" అనే అంశంపై 1947లో ఒక "బ్రోచర్" తయారుచేసి రాజ్యాంగ పరిషత్తుకు సమర్పించాడు. దీనిని గురించి చివరలో తెలుసుకుందాం.

భాషా ప్రాతిపదికమీద రాష్ట్రాలను పునర్ విభజించాలన్న విషయంపై విచారించటానికి జాన్ మత్తయ్ కమిషన్ యేర్పాటైనది. భాషా ప్రాతిపదికమీద రాష్ట్రాలు ఏర్పడితే రాబోయే లాభనష్టాల్ని అంచనావేసి ఒక నివేదిక తయారుచేసి 1948లో మత్తయ్ సంఘానికి సమర్పించాడు. దీనిని గురించి చివరలో తెలుసుకుందాం.

## హిందూకోడ్ బిల్లు

రాజ్యాంగ రచన పూర్తి అయిన తర్వాత అంబేద్కర్ హిందూ కోడ్ బిల్లుమీద దృష్టి మరల్చాడు. స్త్రీల హక్కుల విషయం పరిశీలించేందుకు ప్రభుత్వం యిదివరకే బెనగల నరసింగరావు అధ్యక్షతన ఒక కమిటీనేర్పాటు చేసింది. ఆ కమిటీ దేశం వివిధ ప్రాంతాలలో పర్యటించి మేధావుల సామాన్య ప్రజల అభిప్రాయాలు సేకరించింది. కాని దాని విషయమై ఎవరూ పట్టించుకోలేదు. మరలా యిప్పుడు అంబేద్కర్ ఆ బిల్లు చేపట్టాడు. హిందూ సమాజంలో అమానుషమైన జీవితం గడిపేవారు దళితులు. వాళ్ళ హక్కులు రక్షణలు రాజ్యాంగంలో పొందుపరిచాడు. దళితుల తర్వాత సమాజంలో పురుషులకు బానిసలుగా బ్రతుకుతున్నవారు స్త్రీలని ఆయన అభిప్రాయం. మనుస్మృతి కారణంగా హిందూస్త్రీలకు స్వేచ్ఛ లేకుండా పోయింది. ఆస్తిలో హక్కులేదు. విద్య నేర్చుకుంటానికి వీలులేదు. పురుషునికి బానిసగా పడివుండాల్సిందే! స్త్రీ వంటయింటి బానిస! బాల్యంలో

తండ్రి పోషణ క్రింద వుండాలి. పెళ్ళి అయిన తర్వాత భర్త పోషణ క్రింద బ్రతకాలి. ముసలితనంలో కుమారుని దగ్గర పడివుండాలి. ఇదీ స్త్రీకి మనుస్మృతి శాసించిన నిత్యజీవిత విధానం.

అంబేద్కర్ నెహ్రూను సంప్రదించాడు. నెహ్రూ సలహా తీసుకున్నాడు. హిందూ కోడ్ బిల్లు తయారుచేసాడు. స్త్రీలకు పురుషులతో సమానంగా ఆస్తిలో హక్కు, విద్యావకాశం, సమాజంలో పురుషునితోపాటు సమానగౌరవం, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు బిల్లులో పొందుపరిచాడు. పిల్లలను దత్తు తీసుకొనే హక్కు కల్పించాడు. భార్యాభర్తలు విడాకులు తీసుకొనే వీలు కల్పించాడు. స్త్రీ పునర్వివాహం చేసుకొనే హక్కు కల్పించాడు. 1951 ఫిబ్రవరిలో యీ బిల్లు పార్లమెంటులో ప్రవేశపెట్టాడు.

దుర్గాబాయి దేశ్‌ముఖ్, గాడ్గిల్, కామత్, కృపాలినీ వంటి అభ్యుదయ కాముకులంతా అంబేద్కర్ కృషిని మెచ్చుకున్నారు. ఆయన్ని మహర్షిగా, స్త్రీ దాస్య విమోచకుడిగా, అభినవ మనువుగా అభివర్ణించారు. దుర్గాబాయి దేశ్‌ముఖ్ వంటి అభ్యుదయ భావాలుగల మహిళామణులు అంబేద్కర్ తీసుకున్న చొరవను, స్త్రీల అభ్యుదయం పట్ల ఆయనకున్న శ్రద్ధను బహుధా కొనియాడారు.

కాంగ్రెస్ పార్టీవారే చాలామంది యీ బిల్లును వ్యతిరేకించారు. బిల్లు పార్లమెంటులో చర్చకు వచ్చినపుడు రాజాజీ - వల్లభాయ్ పటేల్ వంటి అగ్రనాయకులే వ్యతిరేకించారు. ఆస్తిహక్కు, విడాకులు వంటి విషయాలలో అధిక సభ్యులు వ్యతిరేకించారు. శ్యామ్‌ప్రసాద్‌ముఖర్జీ వంటి సనాతన హిందూ మహాసభ నాయకులు మరీ పేచీ పెట్టారు. మొదట అంబేద్కర్‌ని సమర్థించాడు నెహ్రూ. పార్లమెంటులో తీవ్రమైన వ్యతిరేకత రాగానే నెహ్రూ మెల్లగా జారుకున్నాడు. అంబేద్కర్ ఏకాకి అయ్యాడు. మానసికంగా క్రుంగిపోయాడు. నైతికంగా ఓడిపోయానన్న మనోవేదన చెందాడు. తన స్వాభిమానం దెబ్బతిన్నదని వాపోయాడు.

తన న్యాయశాఖా మంత్రి పదవికి 1951 సెప్టెంబరులో రాజీనామా యిచ్చాడు అంబేద్కర్. అయితే దానిని అక్టోబరులో ఆమోదించారు.

పాఠకులారా! చూసారా! అంబేద్కర్ కేవలం నిమ్నజాతీయుల శ్రేయస్సు మాత్రమే కోరేవాడని అంటారు. స్త్రీ హక్కుల విషయంలో ఆయన కష్టపడి హిందూకోడ్ బిల్లు తయారుచేసాడు. పార్లమెంటులో బిల్లు ఓడిపోయింది. వాస్తవానికి బిల్లు మొత్తం వీగిపోలేదు. అంబేద్కర్ ప్రతిపాదించిన ముఖ్యమైన స్త్రీల హక్కులను బిల్లు నుండి తొలగించారు. నామమాత్రంగా బిల్లు పాసయినది. తాను ప్రవేశపెట్టిన సంస్కరణల బిల్లు ఆమోదింపబడలేదు కనుక రాజీనామా చేసాడు. ఇటువంటి సందర్భాలలో మంత్రులు రాజీనామా చేయడం జరుగలేదు. ఇది అరుదైన సంఘటన.

దరిమిలా కేంద్రంలోను రాష్ట్రాలలోను స్త్రీల హక్కులకు సంబంధించిన చట్టాలు వచ్చాయి. స్త్రీలు యీనాడు విద్యాధికులౌతున్నారు. ఉద్యోగాలు చేస్తున్నారు. ఆస్తిలో హక్కు పొందగలుగుతున్నారు. స్వతంత్రంగా సమాజంలో గౌరవప్రదంగా జీవిస్తున్నారు. స్త్రీల అభ్యున్నతికి ఎందరో మహనీయులు ఎంతగానో కృషిచేసారు. అందులో అంబేద్కర్ ఒకరని మాత్రం మనం తప్పక గుర్తుంచుకోవాలి.

* * *

సిద్ధార్థుడి కంటె నీ
సిద్ధి గొప్ప దయ్యా -
దళిత జనులనుద్ధరించి
దారి చూపిన ప్రవక్తవు --

పద్మశ్రీ బోయి భీమన్న

# 1952 సాధారణ ఎన్నికలు

దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక 1952లో మొట్టమొదటిసారి దేశంలో సాధారణ ఎన్నికలు జరిగాయి. వయోజన ఓటింగ్ పద్ధతిమీద ఎన్నికలు జరిగాయి. షెడ్యూల్డు కులాల వారికి, తెగలవారికి ప్రత్యేక నియోజక వర్గాలు వచ్చాయి. (రిజర్వుడు స్థానాలు) అంబేద్కర్ తన నిమ్నజాతుల సమాఖ్య పార్టీ తరపున అభ్యర్థుల్ని రంగంలోనికి దింపాడు. వృద్ధాప్యం వల్ల పూర్వం లాగా ఆయన ఎన్నికల ప్రచారంలో చురుకుగా పాల్గొనలేకపోయాడు. కాంగ్రెస్ అంటే ఆయనకు గిట్టదు. కమ్యూనిష్టులన్నా ఆయనకు సరిపడదు. ఇప్పుడు కాంగ్రెస్ కమ్యూనిష్టులు ఎన్నికల్లో ఏకమైనారు. ఆరెండూ పెద్దపార్టీలే! మద్యపాన నిషేదం ఎత్తివేయాలని ప్రచారం చేసారు. అంబేద్కర్ కాశ్మీరుని విభజిస్తే మంచిదని అన్నాడు. భీమా వ్యాపారాన్ని జాతీయం చేయాలన్నాడు (Life Insurance అప్పటికి అది జాతీయం కాలేదు గాని దరిమిలా అయ్యింది) కాంగ్రెస్ కమ్యూనిష్టులు ఏకమైతే అంబేద్కర్ సమాఖ్య సోషలిష్టులతో పొత్తు పెట్టుకున్నారు. కాంగ్రెస్, కమ్యూనిష్టుపార్టీలు అంబేద్కర్‌కు వ్యతిరేకంగా ప్రచారం చేసాయి. చివరకు ఎన్నికలలో అంబేద్కర్ పార్టీ ఘోరంగా ఓడిపోయింది. మరీ విషాదకరమైన విషయం ఏమిటంటే అంబేద్కర్ గూడా ఓడిపోయాడు. ఆయన రాజ్యాంగాన్ని రచించి యున్నాడు. నిన్నమొన్నటి వరకు కేంద్ర న్యాయశాఖా మంత్రిగా వున్నాడు. హిందూకోడ్ బిల్లు ప్రవేశపెట్టాడు. ఆయనకు దేశంలోనేకాదు ప్రపంచంలోనేమంచిపేరు వచ్చింది. అయినా ఎన్నికలలో ఆయన వ్యక్తిగత పలుకుబడి పేరు ప్రతిష్ఠలు పని చేయలేదు. కాంగ్రెస్ కమ్యూనిష్టుల బలం ముందు ఆయన పార్టీ బలమెంత? నిమ్నజాతులలోనే హరిజన కాంగ్రెస్ అభ్యర్థులు కొన్ని ఓట్లు చీల్చుకున్నారు. మరి అంబేద్కర్ సమాఖ్య సోదిలోనికి రాకుండా పోయింది.

## రాజ్యసభ సభ్యుడిగా

1952లో దేశంలో జరిగిన సాధారణ ఎన్నికలలో అంబేద్కర్ నిమ్న జాతుల సమాఖ్య పార్టీ ఓడిపోయిందని తెలుసుకున్నాం. అంబేద్కర్ గూడా

పార్లమెంటుకు పోటీచేసి ఓడిపోయాడని తెలుసుకున్నాం. అయితే అదృష్ట వశాత్తు 1952లోనే బొంబాయినుండి రాజ్యసభకు ఎన్నికైనాడు. అంతటి రాజ్యాంగ నిర్మాతకు యీ గెలుపు "గుడ్డిలో మెల్ల" వంటిది.

ఆయన రాజ్యసభ సమావేశాల్లో చురుకుగా పాల్గొనేవాడు. నెహ్రూ విదేశాంగ విధానాన్ని తీవ్రంగా విమర్శించేవాడు. కమ్యూనిష్టు సోవియట్ రష్యా సామ్రాజ్యతత్వాన్ని నిశితంగా విమర్శించేవాడు. నెహ్రూ ప్రభుత్వం సోవియట్ రష్యా వైపు మొగ్గడం పట్ల గూడా విమర్శించేవాడు. నెహ్రూ 'అలీన' విధానాన్ని విమర్శించేవాడు. అమెరికాతో శతృత్వం దేశానికి మంచి దికాదని హెచ్చరించేవాడు.

కాశ్మీర్ సమస్యను సాగదీయడం మంచిదికాదని సాధ్యమైనంత త్వరలో దానిని తేల్చడం మంచిదని అనేవాడు. రాజ్యాంగాన్ని తరచుగా మార్చడం మంచిదికాదని ఆయన వాదించేవాడు. న్యాయచట్టాన్ని మార్చినట్లు రాజ్యాం గాన్ని మార్చకూడదని అనేవాడు.

1952 జూన్‌లో అమెరికా వెళ్ళాడు. ఆయన చదివిన కొలంబియా విశ్వవిద్యాలయం ఆయనకు "డాక్టర్ ఆఫ్ లాస్" గౌరవ పట్టా (LLD) ప్రదానం చేసింది. అలా ఆయన సేవల్ని మొదటగా గుర్తించి గౌరవించింది విదేశీ విశ్వవిద్యాలయమే. 1953 జనవరిలో నైజాం, హైదరాబాద్ విశ్వ విద్యాలయం "డాక్టర్ ఆఫ్ లిటరేచర్" గౌరవ పట్టా (DLIT) ప్రదానం చేసింది. మనదేశంలో ఆయన్ని యిలా గౌరవించింది ఈ విశ్వ విద్యా లయం ఒక్కటే.

వృద్ధాప్యమునకు తోడు అనారోగ్యం ఆయన్ని మనోవ్యధకు గురిచే యసాగాయి. క్రియాశీల రాజకీయాలలో అంతగా పాల్గొనేవాడు కాదు. నిర్మాణాత్మక కార్యక్రమాలు పెద్దగా చేపట్టేవాడు కాదు. అయితే నిమ్నజా తుల సమస్యల్ని అనుచరులతో చర్చిస్తూ వుండేవాడు. సూచనలిస్తూండేవాడు. తాను కల్పించిన రిజర్వేషన్ల వలన విద్యాధికులైన వారు ఉద్యోగాలు చేసు కుంటూ తమ సుఖం తాము చూసుకొంటున్నారు. "స్వజాతి" సంగతి పట్టించుకోవడంలేదు. అందుకు బాధపడేవాడు. అనుచరులు తనను సరిగ్గా

అర్థం చేసుకోలేదు. యం.సి. రాజా వంటి వాళ్ళు తనను మోసం చేసారని నమ్మకద్రోహం చేసారని ఆవేదన చెందేవాడు. కంటతడి పెట్టుకొనేవాడు. నిమ్నజాతీయుల అభ్యున్నతికి తనలా పాటుపడగల నాయకుడెవరూ తనకు తన కనుచూపుమేర కనపడడంలేదని బాధపడేవాడు. తాను మాత్రం తాను చేయగల్గినంతసేవ తన స్వజాతికి చేసానని అప్పుడప్పుడు తృప్తిపడేవాడు. అయితే గ్రామసీమలలో దయనీయంగా బ్రతుకుతున్న నిమ్నజాతీయుల ప్రగతికి యింకా చేయవలసింది ఎంతో వుందని బాధపడేవాడు.

అవసానదశలో తనకు నమ్మినబంటు వంటి కార్యదర్శి రత్తూతో ఒకసారి ఆయన యిలా అన్నాడు. ఎన్నో కష్టనష్టాలకోర్చి నా ప్రత్యర్థులెన్ని అడ్డంకులు పెట్టినా నా సర్వస్వం ధారపోసి ఈ నిమ్నజాతుల అభ్యుదయ (చైతన్య) ఉద్యమ రధాన్ని యింతవరకు లాక్కొచ్చాను. నా అనుచరుల్ని చేతనైతే దీన్ని ముందుకు తీసుకొని పొమ్మని చెప్పండి. చేతకాకపోతే దాన్ని యిక్కడనే వుండనీయమనండి. యెట్టి పరిస్థితుల్లోను దయచేసి దాన్ని వెనక్కు మాత్రం నెట్టవద్దని చెప్పండి అని ఎంతో బాధతో గద్గద స్వరంతో అన్నాడు. చూడండి! నిమ్నజాతీయుల శ్రేయస్సు ఆయన జీవితంలో అనుక్షణం, శరీరంలో అణువణువునా, నరనరాన జీర్ణించుకొని పోయిందని దీనిని బట్టి తెలుసుకోవచ్చు.

అంబేద్కర్ ఆవేదనలో అర్థం వుంది. రాజకీయ హక్కులు కల్పిస్తే నిమ్నజాతులు బాగు పడతారని ఆయన తీయని కలలు కన్నాడు. అందుకు పోరాడాడు. రాజ్యాంగంలో ప్రత్యేక రక్షణలు కల్పించగలిగాడు. బాధాకరమైన విషయమేమంటే రాజకీయ ప్రత్యేక హక్కులద్వారా చట్టసభల సభ్యులు మంత్రులు అయిన వారు తమ "జాతి" శ్రేయస్సు పట్ల పెద్దగా శ్రద్ధ చూపించడంలేదు. విద్యాధికులై ఉద్యోగాలు చేస్తున్నవారు తమ "జాతి" శ్రేయస్సు పట్ల ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాలలోని నిమ్నజాతీయుల పట్ల శ్రద్ధ చూపడంలేదు. ప్రభుత్వపరంగా గ్రామీణ ప్రాంతాలలో గృహాలు నిర్మించడం - స్వయం ఉపాధి కల్పనలు సమకూర్చుడం తప్ప "అస్పృశ్యతా" నివారణకు ఆనాడు జరిగిన కృషి యీనాడు జరగడం లేదనే

చెప్పాలి. గాంధీజీ స్థాపించిన హరిజన సేవక్ సంఘం ఆయన అస్తమయంతో "మూలన" పడుకొంది! హరిజనులకు "రిజర్వేషన్లు" వచ్చాయి గదా అని కాంగ్రెస్ పార్టీ గ్రామసీమల్లో "అస్పృశ్యులు" అలానే వున్నారు!

## బౌద్ధమత స్వీకారం

హిందువుడిగా పుట్టినా హిందువుడిగా మాత్రం చావనని 1935లోనే అంబేద్కర్ శపథం చేసాడని చెప్పుకొన్నాం. అలా శపథం చేసి యిరవై సంవత్సరాలు గడిచిపోయింది. ఇన్నాళ్ళూ నిమ్నజాతుల ఉద్ధరణ ఉద్యమంలో క్షణం తీరికలేకుండా వుండిపోయాడు. దరిమిలా రాజ్యాంగ రచనలో మునిగిపోయాడు. నిమ్నజాతీయులకు రాజ్యాంగ పరంగా రాజకీయ హక్కులు విద్య వుద్యోగ సదుపాయాలు కల్పించగల్గినందుకు కొంత తృప్తి నిచ్చింది.

ఇపుడు ఆరోగ్యం రోజు రోజుకు చెడిపోతోంది. వృద్ధాప్యం ముంచుకొస్తోంది. ఏపూటకేమి జరుగుతుందో యెవరూవూహించలేరు. హిందువుడిగా మాత్రం చావకూడదు. కనుక మతం మార్పిడి విషయంపై మరలా దృష్టి మరల్చాడు. అన్ని మతాలలోకి ఆయనకు బౌద్ధ మతం నచ్చింది. బుద్ధుని పంచశీల సూత్రాలు ఆయనకు నచ్చాయి. పంచశీల అంటే ఐదు సుగుణాలు - 1. జీవహింస చేయకుండుట (కరుణ-భూత దయ) 2. దొంగతనం చేయకుండుట (పరవస్తువ్యామోహం లేకుండుట) 3. వ్యభిచారం చేయకుండుట ( శారీరక కోరికలు లేకుండుట) 4. మద్యం సేవించకుండుట (దుర్ వ్యసనం లేకుండుట) 5. అబద్ధమాడకుండుట (నిజాయితీగా మెలగుట) అలానే ఆయనకు బౌద్ధమతంలోని అష్టాంగమార్గాలు గూడా బాగా నచ్చాయి. అష్టాంగమార్గాలు అంటే ఎనిమిది సన్మార్గాలు 1. సమ్యక్ దృష్టి (సమతాభావం) 2. సత్ సంకల్పం (మంచి నిర్ణయం) 3. సత్ వచనం (సత్య వాక్కు) 4. సత్ కర్మ (మంచిపని) 5. సత్ జీవనం (మంచిగా జీవించుట) 6. సత్ ప్రయత్నం (మంచి ప్రయత్నం) 7. సత్ స్మృతి (మంచిని స్మరించుట) 8. సత్ సమాధి (మంచిని ధ్యానించుట.) బౌద్ధమతంలో ఈ పంచశీల సూత్రాలు

- అష్టాంగ మార్గాలు చాలా ముఖ్యమైనవి. ఇవన్నీ మనిషి శీలాన్ని సత్ ప్రవర్తనని పెంపొందిస్తానికి దోహదపడతాయి. అంబేద్కర్ శీలానికి - సత్ ప్రవర్తనకు అధిక ప్రాధాన్యతనిస్తాడు గదా. ఈ రెండు లేని మనిషి పశుప్రాయుడని అంటాడు. అందువలన ఆయనకు బౌద్ధమతం బాగా నచ్చింది. బౌద్ధమతంలో హేతువాదం కరుణ-సమత-ప్రజ్ఞ (విజ్ఞానం) ప్రముఖ స్థానం వహిస్తాయి. అందులో కులాలులేవు. విగ్రహారాధన లేదు. దేవుడు ఆత్మ కర్మకాండ పునర్జన్మ గొడవలు లేవు. బౌద్ధ మతం మనిషికి గౌరవప్రదమైన జీవిత మార్గం చూపిస్తుంది. ఇతర మతాలు దేవుని అవతారాల్ని సమర్థిస్తాయి. బౌద్ధ మతంలో అవతారాల ప్రాసులేదు. ఇతర మతాలలో ప్రవక్తలు మోక్షప్రదాతలుగా కనిపిస్తారు. బుద్ధుడు మోక్షమార్గదర్శిగా కనిపిస్తాడు. బౌద్ధ మతం ఒక మతంగా కాక ఒక సాంఘిక ధర్మంగా కనిపిస్తుంది అంబేద్కర్‌కి. సిక్కుమతం దేశీయమైనది. కాని ప్రాంతీయమైనది. ఇస్లాం విదేశయమైనది. విశ్వవ్యాప్తమైనది. ఈ రెండుమతాలు సోదరభావాన్ని చెబుతాయి. కానిక హింసావాదాన్ని నమ్ముతాయి కనుక యీరెండూ నచ్చలేదు. కరుణ ప్రేమను చెబుతుంది క్రైస్తవం. విశ్వవ్యాప్తమైనది. కాని అది విదేశీయమైనది. కనుక క్రీస్తు మతం నచ్చలేదు. జైనమతం కన్నబౌద్ధం నచ్చింది. బౌద్ధమత మూల ధర్మాలకు హిందూ మత ముఖ్య ధర్మాలకు తేడా లేదు. అయితే హిందూమతంలో కులాలున్నాయి. బౌద్ధమతంలో అవిలేవు. హిందూ మత సంస్కృతికి బౌద్ధ మత సంస్కృతికి చాలా దగ్గర సంబంధం వుంది. బౌద్ధం నచ్చింది ఆయనకు. బౌద్ధమతం స్వీకరిస్తున్నట్లు ఆయన బహిరంగ ప్రకటన చేసాడు. తన అనుచరులనుగూడా బౌద్ధ మతం స్వీకరించమని విజ్ఞప్తి చేసాడు. నాగపూర్ పూర్వం బౌద్ధమత కేంద్రంగా వుండేది. అచట ధర్మ దీక్ష చేపడతానని చెప్పాడు. 1956 అక్టోబరు 14వ తేదీ విజయదశమి. ఆరోజే బుద్ధ జయంతి. ఆరోజు బౌద్ధ మతం స్వీకరిస్తానని ప్రకటించాడు. నాగపూర్‌లో అన్ని యేర్పాట్లు జరిగాయి. మహారాష్ట్ర యిరుగు పొరుగు రాష్ట్రాల నుండి లక్షలాది మంది నాగపూర్ చేరుకున్నారు.

విజయదశమి నాడు అంబేద్కర్ తెల్లని సిల్కు పంచె తెల్లని లాల్చీ ధరించాడు. ఆయన సతీమణి సవితా కబీర్ కుమారుడు యశ్వంత్‌రావు, అన్న కుమారుడు ముకుందరావ్ ధర్మ దీక్ష వేదిక మీదికి వచ్చారు. బౌద్ధమత గురువులు వలిసిన్హ సంగరత్న థేరా - సద్ధాతిస్సా థేరా పన్నా నంద్ తేరా గూడా వేదిక మీద ఆసీనులైనరావు. వృద్ధ భిక్షువు మహాస్థ వీర చంద్రమణి అంబేద్కర్ దంపతుల చేత బౌద్ధ ధర్మదీక్ష చేయించాడు. వారితోపాటు కుమారులు దీక్ష తీసుకున్నారు. వేదిక మీద ప్రక్కగా అమర్చిన నిలువెత్తు బుద్ధుని కాంస్య విగ్రహం ముందు అంబేద్కర్ సతీసమేతంగా మోకరిల్లి తెల్లని లోహ పద్మాలను బుద్ధునికి పూజా పుష్పా లుగా సమర్పించాడు. లక్షలాది సభికులు భగవాన్ బుద్ధ్‌కి జై బాబా సాహెబ్ అంబేద్కర్‌కి జై అంటూ పెద్దగా నినాదాలు చేసారు. ఆయన దీక్ష తీసుకొన్న తర్వాత సభా స్థలిలో వేచియున్న షుమారు మూడు లక్షలమంది తన అనుచరుల చేత దీక్ష చేయించాడు. అంబేద్కర్ త్రిచర ణాలు అంటే 1) బుద్ధం శరణం గచ్ఛామి, 2) ధర్మం శరణం గచ్ఛామి 3) సంఘం శరణం గచ్ఛామి అన్న త్రిచరణాల్ని అందరిచేతా పలికించాడు. అలానే పంచశీల సూత్రాలను - అష్టాంగ మార్గ సూత్రాలను అందరి చేత పలికించాడు. ఇవికాక అంబేద్కర్ స్వంతంగా తయారుచేసిన (బౌద్ధ మతంలో లేనివి) కొన్ని సూత్రాలను గూడా అందరిచేత పలికించాడు. అందులో ముఖ్యమైనవి 1. బుద్ధుని అవతార పురుషునిగా నమ్మను 2. త్రిమూర్తుల్ని - రాముడు - కృష్ణులను - గణపతి - గౌరీలను దేవు ళ్ళుగా నమ్మను వారివి అవతారాలుగా నమ్మను. 3. దేవుడికి పూజలు చేయను. నైవేద్యం పెట్టను. 4. శ్రాద్ధకర్మలు చేయను 5. బ్రాహ్మణ పూజారులచేత యే శుభకార్యం చేయించను. 6. అందరి మానవుల్ని సమాన గౌరవంగా చూస్తాను. 7. హిందూ మతాన్ని యీనాటితో విడిచి పెడుతున్నాను. 8. బౌద్ధ మతాన్ని హృదయ పూర్వకంగా స్వీక రిస్తున్నాను. బౌద్ధమతధర్మాల్ని త్రికరణ శుద్ధిగా పాటిస్తాను. దీనిని బట్టి అంబేద్కర్ అవతార సిద్ధాంతాన్ని కర్మకాండ సిద్ధాంతాన్ని - బ్రాహ్మణ పూజారి విధానాన్ని వ్యతిరేకిస్తున్నాడని చెప్పవచ్చు. రెండవ రోజు నాగ

పూర్‌లోనే షుమారు ఐదు లక్షలమంది చేత అంబేద్కర్ బౌద్ధ ధర్మదీక్ష చేయించాడు.

బౌద్ధమతం స్వీకరించిన తర్వాత అంబేద్కర్ ఎంతో ఆనందంతో పొంగిపోయాడు. ఎంతో ఆత్మ సంతృప్తి చెందాడు. రాజ్యాంగంలో నిమ్న జాతీయులకు ప్రత్యేక హక్కులు కల్పించిన నాడు ఎంతో సంతోషించాడు. మరలా యీనాడు అంతకంటే ఎక్కువగా సంతోషించాడు. హిందువుడిగా పుట్టినా హిందువుడిగా చావనని చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాడు. తానొక జన్మ మెత్తినంతటి పరమానందాన్ని పొందాడు.

పాఠకులారా! హిందూమతంలో కులాలు వుండడం వల్ల అంబేద్కర్ హిందూ మతాన్ని ద్వేషించాడు. అస్పృశ్యతను పాటించడం వలన ఆ మతాన్ని విడిచిపెట్టాడు. ఇంతకూ హిందూ మతంలోని మంచి ధర్మాల్ని మంచి సంప్రదాయాన్ని ఆయన అప్పుడప్పుడు మెచ్చుకొనేవాడు. ఇన్ని కులాలు ఉన్నా భారతీయ సంస్కృతి అవిచ్ఛనంగా విరాజిల్లడం పట్ల ఆయన మెచ్చుకునేవాడు. హిందూ మతంలోని మంచి విషయాలు దృష్టాంతాలుగా చెప్పేవాడు.ద్రోణాచార్యుల వారి ఆత్మ గౌరవం గురించి ఉదాహరించేవాడు. అయితే హిందూ మతంలోని లోపాల్ని తీవ్రంగా విమర్శించేవాడు. హిందూ మత మూలసూత్రాలకు బౌద్ధ మత మూల సూత్రాలకు పెద్దగా తేడా లేదు. కనుకనే బౌద్ధమతాన్ని స్వీకరించాడు. హిందూ సంస్కృతికి దెబ్బ తగలకుండా బౌద్ధమతాన్ని స్వీకరించినట్లు ఆయనే చెప్పాడు. ఆలోచిస్తే చేసిన శపథం నిలబెట్టుకోవటానికి బౌద్ధమతం పుచ్చుకున్నట్లు కనిపిస్తుంది!

మతం మార్పిడి ఆయన వ్యక్తిగత విషయం - ఆయనిష్టం ఆయన్ని ఎవరు కాదనగలరు! కాని దానికి కారణం హిందూ మతంలో అసమా నతలున్నాయి. కులాలున్నాయి. ఉచ్చనీచాలున్నాయి. అదే అంబేద్కర్‌కి కోపం. హిందూశాస్త్రాలలోని లోపాలన్నీ ఆయనకు బాగా తెలుసు. అవన్నీ క్షుణ్ణంగా పరిశీలించి యున్నాడు. అయితే హిందూమతంలో మంచి గూడా ఉందన్న వాస్తవాన్ని ఆయన మరిచిపోలేదు. హిందూ మతమూలసూత్రా లకు - బౌద్ధమతమూలసూత్రాలకు పెద్దగా తేడా గూడా లేదన్న సత్య

సత్యాన్ని ఆయన గుర్తించాడు. హిందూమతాన్ని హేతువాద దృష్టితో - శాస్త్రీయదృక్పథంతో సంస్కరించాల్సిన అవసరం వుందని గూడా ఆయన నొక్కి చేప్పేవాడు. కులవ్యవస్థను - అస్పృశ్యతను సమూలంగా నిర్మూలించాలన్నది ఆయన ఆశయం! నిమ్నజాతీయులు అందరూ బౌద్ధమతం స్వీకరించటానికి అంతగా యిష్టపడలేదు. ఈ పరిస్థితుల్లో ఆయనంతటి గొప్ప సంస్కర్త - మేధావి - ధీరోదాత్తుడు - హిందూవుడిగానే వుండి హిందూమతాన్ని సంస్కరించివుంటే బాగుండేదేమో! హిందూ శాస్త్రాల్ని సంస్కరించివుంటే బాగుండేదేమో! కులనిర్మూలనకు ఉద్యమం నడివుంటే బాగుండేదేమో! ఆయన వంటి గొప్ప మేధావులో హిందూమతాన్ని సంస్కరించకపోతే - కుల నిర్మూలన చేయకపోతే - హిందూ సమాజం మరింకెప్పుడు బాగుపడుతుంది? ఎవరు బాగుచేస్తారు? ఎప్పుడు బాగుచేస్తారు?

బౌద్ధమతం స్వీకరించిన తర్వాత నేపాల్ దేశంలో ప్రపంచ బౌద్ధమత మహాసభల్లో 1956 నవంబర్‌లో పాల్గొన్నాడు. నేపాల్‌రాజు కోరిక పై బుద్ధుడు కారల్ మార్క్స్ అన్న అంశంపై ఆ మహాసభల్లో ఉపన్యసించాడు. మార్క్స్ సిద్ధాంతం కన్న బుద్ధుని సిద్ధాంతం అన్ని విధాల ఉత్తమమైనదని ఆయన నొక్కి చెప్పాడు. దీనిని గురించి చివరలో తెలుసుకుందాం.

## నిర్యాణం

ఖాట్మండు నుండి ఢిల్లీ తిరిగి వచ్చాక తన పుస్తకాలు బుద్ధ అండ్ హిజ్ దమ్మా, రిడిల్స్ ఇన్ హిందూయిజం "రెవెల్యూషన్ కౌంటర్ రెవెల్యూషన్ ఇన్ ఇండియా" బుద్ధ అండ్ కారల్ మార్క్స్ రచనల్ని పూర్తి చేయడంలో మునిగిపోయాడు. మొదటి రెండు పూర్తి చేసాడు. మూడవదాన్ని పూర్తి చేయనేలేదు. నాల్గవది అసలు కనిపించకుండానే పోయింది.

1956 డిశంబర్ 2వ తారీఖున ఢిల్లీలో టిబెట్ దేశ బౌద్ధ మత గురువు దలైలామా గౌరవార్థం జరిగిన విందులో పాల్గన్నాడు. తాను

స్థాపించదలపెట్టిన రిపబ్లికన్ పార్టీ విషయం అనుచరులతో ముచ్చటిం చాడు. డిశంబరు 16వ తారీఖున బొంబాయిలో మరికొందర్ని బౌద్ధ మత ధర్మ దీక్ష చేయించే కార్యక్రమం గురించి మిత్రులకు ఉత్తరాలు గూడా రాసాడు.

డిశంబరు 5వ తారీఖున భార్య సవితాదేవి తమ కుటుంబ వైద్యుడు డాక్టర్ మాల్ వంకర్‌తో కలిసి బజారుకెళ్ళింది. సాయంత్రం వరకు తిరిగి రాలేదు. వచ్చిన తర్వాత భార్యమీద మండి పడ్డాడు. ఆరోజెందుకో ఆయన చిరాకుగా అసహనంగా అశాంతిగా కనిపించాడు. ఆ సాయంత్రం రత్తూ చేత తలకు నూనె పట్టించుకున్నాడు. కాళ్ళు గూడా వత్తించుకున్నాడు. మనస్సుకు హాయిగాతోస్తే బుద్ధుని త్రిచరణాలు కబీర్ కీర్తనలు మెల్లగా ఆలాపించాడు. రత్తూ సహాయంతోనే అయిష్టంగానే డైనింగ్ టేబుల్ దగ్గరకు మెల్లగా వెళ్ళి కాస్త భోజనం చేసాడు. తిరిగి వస్తూ తన లైబ్ర రీలోని పుస్తకాల వంక కలయజూసాడు. ఒకటిరెండు పుస్తకాలు తీసుకొని రత్తూకిచ్చాడు. రెండవ రోజు ఉదయాన్నే రమ్మని రత్తుకు చెప్పాడు. పడకమీద నడుం వాల్చాడు.

డిశంబర్ 6వ తారీఖు ఉదయం షుమారు 6.30 గం.లకు భార్య సవిత నిద్రలేచి బయట తోటలోనికి పోయి తిరిగి వచ్చి భర్త వంక చూసింది. ఆయన అచేతనంగా పడిఉన్నట్లు ఆమెకు అనిపించింది. ఆయన్ని మెల్లగా పిలిచింది. చేతితో తట్టింది కదిపింది. పెద్దగా పిలిచింది. ఉహూ ఆయన పలకలేదు. కదలలేదు. కంగారుగా ఆమె వైద్యురాలు కనుక స్టైతోస్కోప్ తెచ్చి ఆయన హృదయ స్పందన (హార్ట్ బీటింగ్) చూసింది. ఆయనకు కృత్రిమ శ్వాస కల్పించటానికి ప్రయత్నించింది. అయినా లాభంలే కపోయింది. తన భర్త నిద్రలోనే శాశ్వతంగా నిద్రపోయాడని గ్రహించింది. పెద్దగా కేకవేసి మూర్ఛపోయి సోఫాలో కూలబడిపోయింది. ఆమె తండ్రి - ఆమె సోదరుడు- ఇంటిపనివాడు - వంటవాడు తోటమాలి అందరూ ఆయన గది దగ్గరకు పరుగు పరుగున వచ్చారు. ఇంటి యజమాని మర ణించాడని గ్రహించారు. ఇంటి డాక్టర్ మాల్ వంకర్‌కి కబురు చేసారు.

రత్తూకి కబురుచేసారు. డాక్టర్ వచ్చి అంబేద్కర్‌ని పరీక్షించాడు.

ఆరాత్రి తెల్లవారుజామున 3.30గంటల ప్రాంతంలో (అంటే 5వ తారీఖు రాత్రి తెల్లవారు జామున తెల్లవారితే 6వ తారీఖున) అంబేద్కర్ గుండెపోటుతో మరణించినట్లు డాక్టర్లు నిర్ధారించారు. అంబేద్కర్ మరణవార్తను రత్తూ ఢిల్లీలోని అంబేద్కర్ అనుచరులకు మిత్రులకు శ్రేయోభిలాషులకు తెలియజేసాడు. ప్రధాన మంత్రికి కేంద్రమంత్రులకు పార్లమెంటు సభ్యులకు తదితర వివిధ రాజకీయ పార్టీల నాయకులకు యీ మరణవార్త తెలియజేసారు. అంబేద్కర్ మరణవార్త దావానంలా ఢిల్లీలో వ్యాపించింది. ఆలిండియా రేడియో ఆవుదయం ప్రసారంలో ఆయన మరణవార్త ప్రత్యేకంగా ప్రసారంచేసింది. మిత్రులు అనుచరులు వివిధ నాయకులు అంబేద్కర్ గృహానికి వచ్చి ఆయనకు కడసారి శ్రద్ధాంజలి ఘటించారు.

ప్రప్రధంగా ప్రధాని నెహ్రూ వచ్చి శ్రద్ధాంజలి ఘటించాడు. హోమ్ మంత్రి పంత్- జగజ్జీవన్ రామ్ తదితరులు గూడా వచ్చి శ్రద్ధాంజలి ఘటించారు. దహన క్రియలు బొంబాయిలో జరుపుటకు నిశ్చయం అయింది కనుక ఆయన భౌతిక కాయాన్ని ప్రత్యేక విమానంలో పంపించేందుకు యేర్పాట్లు చేయమని ప్రధాని నెహ్రూ జగజ్జీవనరామ్‌ను ఆదేశించాడు. ఢిల్లీలోని ఆలీపూర్ రోడ్డులో ఉన్న అంబేద్కర్ గృహానికి లక్షలాది మంది మిత్రులు శ్రేయోలాభిలాషులు నాయకులు మంత్రులు వచ్చి శ్రద్ధాంజలి ఘటించారు. అంబేద్కర్ అభిమానులు గుండెలు బాదుకుంటూ కన్నీరు మున్నీరుగా రోదించారు. 6వ తారీఖున సాయంత్రం విమానంలో ఢిల్లీ నుండి బొంబాయి ఆయన భౌతిక కాయాన్ని తీసుకొని పోవుటకు యేర్పాట్లు జరిగాయి. ఆయన గృహం నుండి విమానాశ్రయం వరకు దారి కిరుప్రక్కల లక్షలాది మంది నిల్చొని విలపిస్తూ భౌతిక కాయాన్ని కడసారి దర్శనం చేసుకొన్నారు. ఆ రాత్రికే ప్రొద్దుబోయి ఆయన భౌతిక కాయం విమానంలో బొంబాయికి తీసుకెళ్లారు.

బొంబాయి విమానాశ్రయం బయటవేలాది మంది వేచి యున్నారు. విమానాశ్రయం నుండి దాదర్‌లోని రాజగృహం వరకు జనం రోడ్డుకిరుప్ర

క్కల బారులు తీరి విలపిస్తూ నిలుచున్నారు. రాజగృహంలో ఆయన భౌతిక కాయాన్ని ప్రజల అంతిమ దర్శనం చేసుకొంటానికి ప్రత్యేక యేర్పాట్లు చేసారు. 7వ తేదీ ఉదయానికే బొంబాయి నగరంలోని ప్రజలేకాదు, దేశం లోని పలు ప్రాంతాల నుండి ఆయన అభిమానులు అనుచరులు నాయకులు లక్షలాది మంది రాజగృహం వద్దకు చేరుకున్నారు. మధ్యాహ్నం ఆయన భౌతిక కాయం రాజగృహం నుండి బయలు దేరింది. ట్రక్కు మీద యెత్తైన వేదిక మీద ఆయన భౌతిక కాయాన్ని ఉంచారు. రకరకాల పూలతో ట్రక్కును అలంకరించారు. బుద్ధ భగవాన్ చిత్రపటాన్ని అంబేద్కర్ శిరస్సు వైపు ట్రక్కుకు అమర్చారు. దారికిరుప్రక్కల లక్షలాది మంది ఆయన భౌతిక కాయాన్ని అంతిమ దర్శనం చేసుకున్నారు. బాబాసాహెబ్ అంబేద్కర్ అమర్ రహే నినాదాలు మిన్నుముట్టాయి. ఇంటినుండి ఆయన భౌతిక కాయం శ్మశాన వాటిక చేరటానికి నాలుగైదు గంటలు పట్టింది. బౌద్ధ మత ఆచారం ప్రకారం బౌద్ధ బిక్షువు ఆనంద కౌసల్యాయన్ పర్యవేక్షణలో ఆయన కుమారుడు యశ్వంత్‌రావు ఆయన చితికి నిప్పంటించాడు. అంబేద్కర్ భౌతిక కాయం అగ్నిజ్వాలలకు ఆహుతి అయిపోతుంటే అక్కడ చేరిన లక్షలాదిమంది అభిమానులు కన్నీరు మున్నీరుగా రోదించారు.

విశేషమేమంటే శ్మశాన వాటిక దగ్గర చేరిన షుమారు లక్షమంది నిమ్నజాతీయులు బడుగు వర్గాలవారు అక్కడికక్కడే అప్పటికప్పుడే బౌద్ధ మతం స్వీకరించారు.

డిశంబర్ 7వ తారీఖున దేశంలోని పత్రికలన్నీ అంబేద్కర్ జీవితం మీద ఆయన సాధించిన విజయాలు మీద ప్రత్యేక వ్యాసాలుప్రచురించాయి. సంపాదకీయాలు రాసాయి. ఆయన జీవిత విశేషాలను తెలిపే ఫొటోలు ప్రచురించాయి. ది న్యూయార్క్ టైమ్స్ - ది టైమ్స్ లండన్ వంటి దేశవిదేశాల పత్రికలు ఆయనకు ఘనంగా నివాళు లర్పించాయి. బొంబాయి నాగపూర్ మొదలగు పట్టణాలలో హర్తాళ్ జరిపారు. మహారాష్ట్రలో చాలాచోట్ల స్కూళ్ళు కాలేజీలు ఆఫీసులు మూసివేసారు.

ప్రధాని నెహ్రూ లోక్‌సభలో మాట్లాడుతూ "హిందూ సమాజంలోని

పీడించే శక్తులపై పోరాడిన విప్లవ చిహ్నంగా వెలిగిన ధృవతార రాలిపో యింది" అన్నాడు. పార్లమెంటు ఉభయ సభలు ఆరోజు ఏ కార్యక్రమం చేపట్టకుండా వాయిదా పడ్డాయి. రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ అంబేద్కర్‌ని నవభారత రాజ్యాంగ నిర్మాతగా గొనియాడాడు. బర్మా యూనూ ఆయనకు నివాళులర్పించాడు. దేశంలోని వివిధ పార్టీల నాయకులు వివిధ సంస్థలు ప్రపంచంలో బౌద్ధ సంఘాలు అంబేద్కర్‌కు ఘనంగా నివాళుల ర్పించారు.

అట్టడుగు సమాజంలో పుట్టి స్వయం ప్రతిభతో స్వయం కృషితో ఆత్మ విశ్వాసంతో మెట్టుపై మెట్టు అధిరోహిస్తూ ఉన్నత శిఖరాలు సధి ష్ఠించిన అంబేద్కర్ శాశ్వతంగా అదృశ్యమైపోయాడు. నిమ్నజాతులలో పుట్టి నిమ్న జాతుల కొరకు జీవితం అర్పించిన నిమ్నజాతుల మోజెస్ మరణిం చాడు. హిందూ సమాజంలో కుల వివక్షను అసమానతలను కల్పించిన మనుస్మృతిని తగలబెట్టి ప్రజాస్వామిక ప్రాతిపదికపై నవభారతరాజ్యాంగాని రచించిన భారతీయ జఫర్‌సన్ శాశ్వతంగా కన్ను మూసాడు.

కులమత రహిత సమసమాజాన్ని కలలు కన్న సామ్యవాద నాయ కుడు శాశ్వతంగా తనువు చాలించాడు. మనిషి మనిషిగా సమాజంలో గౌరవ ప్రదంగా సుఖ ప్రదంగా మనుగడ సాగించేందుకు కృషిచేసిన మహా మనీషి మానవతా వాది మరణించాడు. ఒక మహా వటవృక్షం నేలకొరిగింది. ఒక ఉజ్వల తార రాలిపోయింది. విశ్రాంతి యెరుగని ఒక మహానాయకుని జీవితానికి శాశ్వతంగా విశ్రాంతి దొరికింది! కంటిపై కునుకు లేకుండా కడజాతుల వారి కష్టాలను కడతేర్చేందుకు జీవితాంతం కడగండ్ల పాలయిన కడజాతుల గొప్ప నాయకుడు శాశ్వతంగా - కంటి నిండా నిద్రకుపక్రమించాడు. అవిశ్రాంతంగా సాగిన పోరాటం అనుకోకుండా నిలిచిపోయింది. ఉధృతంగా నడిచిన ఉద్యమం అర్ధాంతరంగా అసంపూ ర్ణంగా ఆగిపోయింది. ఒక మహానాయకుని జీవితానికి తెరపడింది. ఒక గొప్ప రాజకీయ యోధుని జీవితం పరిసమాప్తమైనది. అంబేద్కర్ శకం ముగిసింది!

# అంబేద్కర్ సాధించిందేమిటి?

పాఠకులారా! అంబేద్కర్ జీవితం గురించి తెలుసుకున్నాం గదా! మీరు ఓపిగ్గా విన్నందుకు (చదివినందుకు) సంతోషం. ఒక గొప్ప నాయకుని జీవితం గురించి తెలుసుకున్నప్పుడు ఆ నాయకుని జీవిత ఆశయం ఏమిటి? ఆయన సాధించిందేమిటి? ఆ నాయకుని జీవితం ద్వారా మనం నేర్చుకొనవలసిందేమిటి? అనే ప్రశ్నలు వస్తాయి. అవి తెలుసుకోవాలి. లేకపోతే ఆ నాయకుని జీవితం తెలుసుకొనడంలో అర్థం వుండదు.

గాంధీజీ పేరు చెప్పగానే ఆయన దేశానికి స్వాతంత్ర్యం సాధించటానికి మూలపురుషుడంటారు. నెహ్రూ పేరెత్తగానే ఆయన నవభారత నిర్మాత అంటారు. అలీన ఉద్యమనేతగా చెప్పుకుంటారు. గురజాడ, కందుకూరి, కవిరాజు త్రిపురనేని పేర్లు చెప్పగానే వారు గొప్ప సంఘసంస్కర్తలంటాం. అట్లాగే అంబేద్కర్ పేరు చెప్పగానే మనకేమి గుర్తుకొస్తుంది. ఆయన జీవిత లక్ష్యమేమిటి? అని మనం ఒకసారి ఆలోచించాలి.

## నిమ్నజాతీయుల ఉద్ధరణ

ప్రప్రథమంగా మనం ఆయన్ని నిమ్నజాతీయుల ఉద్ధారకుడిగా చెప్పుకొని తీరాలి. అస్పృశ్యుడిగా పుట్టడం వలన ఆయన ఎన్నో బాధలు ఎన్నో అవమానాలు స్వయంగా అనుభవించాడు. చదువూ సంస్కారమూ అబ్బిన తర్వాత గూడా ఆయనకు ఆ బాధలు అవమానాలు తప్పలేదు. అజ్ఞానంలో బానిసవృత్తుల్ని చేసుకొంటూ వూరికి దూరంగా పశువుల కన్న హీనంగా బ్రతుకులీడుస్తున్న కోట్లాది నిమ్నజాతీయుల దీనవదనాల్ని కళ్ళారా చూసాడు. వాళ్ళ కన్నీటిగాథల్ని విన్నాడు. నేనే జాతులలోనైతే పుట్టి పెరిగి పెద్ద వాడినయ్యానో ఆ జాతుల ఉద్ధరణకు నాశాయశక్తులా నా జీవితాంతం కృషి చేస్తానని శపథం చేసాడు. "అస్పృశ్యత నిర్మూలించడం - నాజన్మహక్కు" అని కూడా శపథం చేసాడు. దేశ దాస్య విముక్తి కంటే నా నిమ్నజాతుల దాస్య విముక్తి నాకు ముఖ్యమ న్నాడు. ఆయన చేపట్టిన నిమ్న జాతీయుల ఉద్ధరణ కార్యక్రమాలు స్థూలంగా

నాల్గు విధాలుగా మనం చెప్పుకోవచ్చు. మొదటిది సంస్కరణ కార్యక్ర మాలు. నిమ్నజాతీయుల్ని జాగృతం చేసి చైతన్య వంతుల్ని చేయటానికి ముందు ప్రయత్నించాడు. మూక్‌నాయక్, సమతా, జనతా వంటి పత్రి కలు స్థాపించాడు. వాటిల్లో వ్యాసాలు రాసాడు. ఊరూరా తిరిగి సభలు పెట్టాడు. ఉపన్యాసాలు ఇచ్చాడు. గ్రంథాలు రాసాడు. నిమ్న జాతీయుల మూఢనమ్మకాల్ని పోగొట్టటానికి కృషి చేసాడు. వాళ్ళ మూఢాచారాలు మాన్పించడానికి కృషి చేసాడు. వారి బానిస మనస్తత్వాన్ని రూపుమా పటానికి కృషిచేసాడు. వాళ్ళ బానిస వృత్తుల్ని మాన్పించటానికి కృషి చేసాడు. శుచి, శుభ్రంగా వుండమని చెప్పాడు. గొడ్డుమాంసం ముఖ్యంగ చచ్చిపోయిన పశువుల కళేబరాల మాంసాన్ని తినవద్దని నచ్చచెప్పాడు. స్వాభిమానంతో, చీమూనెత్తురూ ఉన్న మనుష్యుల్లాగా, స్వయం కృషితో, గౌరవప్రదంగా బ్రతకమని ప్రబోధించాడు. అంటరానితనం రూపుమాపటా నికి సహపంక్తి భోజనాలు ఏర్పాటుచేసాడు. ఇలా వాళ్ళ మానసిక పరివర్తన ద్వారా వారిని సంస్కరింప కృషి చేసాడు. రెండవది. నిమ్నజాతుల వారికి జరుగుతున్న అక్రమాలపై వుద్యమాలు నడపడం - నిమ్నజాతుల వారికి మహద్ చెరువు మంచినీటి హక్కు గురించి ఆయన పెద్ద పోరాటమే చేయవలసి వచ్చింది. నాసిక్ దేవాలయ ప్రవేశం విషయంలో సత్యాగ్రహం చేపట్టాడు. మహద్ వతన్ల విషయంలో బొంబాయి అసెంబ్లీలో ఆయన పెద్ద ఆందోళన చేసాడు. మహర్లను సైన్యంలో చేర్పించే విషయంలో గట్టి కృషి చేసాడు. అస్పృశ్యత నిర్మూలనకై - నిమ్నజాతీయులకు బంజరు భూములకోసం ఆందోళన చేసాడు. ఆయన తుది శ్వాస విడిచే వరకు పోరాటం సాగించాడు!

మూడోది - విద్యావికాస కార్యక్రమాలు - విద్యయొక్క ప్రయో జనం, ప్రాముఖ్యం ఆయనకు స్వీయానుభవంలో తెలుసు. చదువు నేర్చు కుంటే జ్ఞానోదయం అవుతుంది. విద్యవలన మనిషికి వివేకం వివేచన వస్తుంది. తనకు జరుగుతున్న అన్యాయాన్ని తెలుసుకుంటాడు. వాటిని యెదిరించి న్యాయం కోసం పోరాటం సాగిస్తాడు మనిషి. అందుకని

మొదట బహిష్కృత హితకారిణి సభపెట్టాడు. ఆ సభద్వారా షోలాపూర్ మొదలగుచోట్ల హాస్టళ్ళు ఏర్పాటు చేసాడు. నిమ్నజాతీయుల పిల్లలకు ఉచిత విద్యా సదుపాయాలు కల్పించాడు. దరిమిలా పీపుల్స్ ఎడ్యుకేషన్ సొసైటీ స్థాపించాడు. బొంబాయిలో సిద్ధార్థ కాలేజిని స్థాపించాడు. ఆ తర్వాత ఔరంగాబాద్ దగ్గర మిళింద మహావిద్యాలయాన్ని స్థాపించాడాయన. ఒక్క నిమ్న జాతీయ విద్యార్థులేకాదు. అన్ని కులాలకు చెందిన బాలబాలిక విద్యార్థులకు అక్కడ విద్యావకాశం కల్పించాడు.

దరిమిలా ఆయన రాజ్యాంగం రచన చేసినప్పుడు నిమ్న జాతీయులకు విద్యా ఉద్యోగ అవకాశాలకు ప్రత్యేక సదుపాయాలు రాజ్యాంగపరంగా సమకూర్చి పెట్టగల్గాడు.

నాల్గవది : రాజకీయ హక్కులకొరకు పోరాటం చేపట్టుట - నిమ్న జాతీయులకు రాజకీయ పరమైన ప్రత్యేక హక్కులు, రక్షణలు వున్నప్పుడే వారు పురోభివృద్ధి చెందుతారని ఆయన దృఢ విశ్వాసం. లండన్‌లో రౌండు టేబుల్ సమావేశాల్లో అదే వాదించాడు. సైమన్ కమిషన్ ముందు అదే వాదించాడు. గాంధీజీతో పూనా ఒడంబడిక చేసుకున్నప్పుడు కూడా నిమ్న జాతీయుల ప్రత్యేక హక్కుల పరిరక్షణ విషయంలో అంబేద్కర్ పట్టువదల లేదు. నిమ్నజాతీయుల్ని ఒక రాజకీయ శక్తిగా రూపొందించటానికి ఆయన "అఖిల భారత నిమ్న జాతుల సమాఖ్య" పార్టీని స్థాపించాడు.

అదృష్టవశాత్తు ఆయన రాజ్యాంగ రచనా సంఘం అధ్యక్షుడైనాడు. నిమ్న జాతీయులకు రాజకీయంగా ప్రత్యేక నియోజకవర్గాలు, విద్య, ఉద్యోగ సదుపాయాలు రాజ్యాంగంలో పొందుపరచగలిగాడు. రాజ్యాంగంలో ఆనాడు అంబేద్కర్ పొందుపరచిన ప్రత్యేక సదుపాయాలు (రిజర్వేషన్లు) వలననే - యీనాడెందరో విద్యావంతులౌతున్నారు. ఉన్నత అధికారులుగా ఇంజనీర్లుగా, డాక్టర్లుగా, శాసన సభ సభ్యులుగా, మంత్రులుగా, న్యాయమూర్తులుగా ప్రొఫెసర్లగా రాణిస్తున్నారు. అదంతా అంబేద్కర్ పెట్టిన భిక్షేనని మరిచిపోగూడదు. అస్పృశ్యుడిగా పుట్టి - అస్పృశ్యుల అభ్యున్నతికై జాతీయ స్థాయిలో ఉద్యమం నడపిన మహానాయకుడాయన! అందుకే అంబేద్కర్

జీవిత చరిత్ర అంటే - అది నిమ్నజాతీయుల హక్కులకై సాగిన పోరాట చరిత్ర అని మనం ముందుగానే చెప్పకొన్నాం.

## నవభారత రాజ్యాంగ నిర్మాత

మనం అంబేద్కర్‌ని నవభారత రాజ్యాంగనిర్మాతగా గుర్తుపెట్టుకొన వలసివుంది. ఆయన న్యాయశాస్త్ర కోవిదుడు గొప్పన్యాయవాది. రాజకీయ శాస్త్రవేత్త. రాజకీయ నాయకుడు రాజనీతిజ్ఞుడు. కనుక కాంగ్రెస్ వారికి ఆయన పట్ల బద్ధ శత్రుత్వం ఉన్నా ఆయన్ని ఆయన ప్రతిభను గుర్తించి పిలిచి రాజ్యాంగ రచనా సంఘంనకు అధ్యక్షునిచేసారు. ఆయన "నేనూ-నా నిమ్నజాతులు" అన్న నినాదం విడిచిపెట్టాడు. నేను నాదేశం అన్న జాతీయ భావంతో విశాలహృదయంతో రాజ్యాంగం రచించాడు. దేశంలో ఉన్న అన్ని కులాల వారికి అన్ని మతాలవారికి అన్ని బాషలవారికి అన్ని ఉపజాతులవారికి సమానమైన న్యాయం-గౌరవప్రదమైన జీవన విధానం స్వేచ్ఛ కల్పిస్తూ ప్రజాస్వామిక పద్ధతిలో రాజ్యాంగం రచించాడు. అందరి శ్రేయస్సుకోరి "శ్రేయోరాజ్యం" (Welfare State)గా మనదేశం వర్ధిల్లేటట్లు రాజ్యాంగం రచించాడు. అలానే ఆయన ప్రముఖంగా హిందూమత ద్వేషి అయినా హిందూమతంతో సహా అన్ని మతాలకు సమాన గౌరవం కల్పిస్తూ మతస్వేచ్ఛ కల్పిస్తూ లౌకిక రాజ్యాం (Secular State) గా మనదేశాన్ని రూపుదిద్దుటకు రాజ్యాంగం రాసాడు. మన దేశం సర్వతంత్ర స్వతంత్ర ప్రజాస్వామిక దేశంగా (Independent Sovereign Republic) అంబేద్కర్ రూపొందించాడు. రాజ్యాంగం 1950లో అమలులోనికివచ్చింది. ఇప్పటి వరకు రాజ్యాంగానికి డెబ్బైకిపైగా సవరణలు చేయవలసివచ్చింది. అయినా భిన్న భిన్న ఉపజాతులతో - భిన్న భిన్న భాషలతో - భిన్న భిన్న కులాలతో - భిన్న భిన్న మతాలతో ఉన్న మనదేశం చిన్నాభిన్నం కాకుండా దేశం ముక్క చెక్కలు కాకుండా ప్రపంచంలో పెద్దప్రజాస్వామిక దేశంగా విరాజిల్లటానికి డాక్టర్ అంబేద్కర్ రాసిన రాజ్యాంగ బలమే అందుకు ముఖ్యకారణమని మనం మరిచిపోగూడదు. అందుకే ఆయన నవభారత

రాజ్యాంగ నిర్మాత మాత్రమే కాదు నవభారత నిర్మాతల్లో (One of the Builders of Modern India) ఒకరని గుర్తుంచుకోవాలి.

## శ్రామికవర్గాల బాంధవుడిగా

మనం అంబేద్కర్ని శ్రామికవర్గాల బాంధవుడిగా కూడా గుర్తుంచుకోవాలి. ఆయన నిరుపేదగా పుట్టాడు. నిమ్నజాతీయులు నూటికి తొంభైమంది వ్యవసాయ కూలీలు - కార్మికులు - కనుక శ్రామికవర్గాల బాధలు ఆయనకు తెలుసు. వారి సమస్యలు తెలుసు. వ్యవసాయ కూలీలకు పారిశ్రామిక కార్మికులకు - న్యాయమైన పనిగంటలు - గిట్టుబాటు కూలీరేటు-వేతనాలు-సెలవు దినాల్లోగూడా కార్మికులకు వేతనాలు బోనస్ చెల్లింపులు - కార్మికులకు గృహవసతి - విద్యా ఆరోగ్య సదుపాయాలు - సక్రమంగా సమకూర్చటానికి అంబేద్కర్ కృషిచేసాడు. నిర్బంధ కౌలుదారీ విధానం (కోటీపద్ధతి) నిర్మూలించటానికి కృషి చేసాడు. వెట్టిచాకిరి (వతన్దారీ విధానం) పోవటానికి కృషిచేసాడు. అన్నికులాల కార్మికులను ఒక రాజకీయ గొడుగు క్రిందకు తీసుకురావటానికి ఆయన ఇండిపెండెంట్ లేబర్ పార్టీని స్థాపించాడు. బొంబాయి అసెంబ్లీ ఎన్నికల్లో ఆపార్టీ చాలా స్థానాలు గెలుచుకుంది. అంబేద్కర్ బొంబాయి అసెంబ్లీలో వామపక్షనాయకుడిగా కార్మికుల సమస్యల మీద గట్టిగా వాదించేవాడు. కార్మిక వివాదచట్టం సవరణకు వ్యతిరేకంగా డాంగేతో చేతులు కలిపిమిల్లు కార్మికుల సమ్మెకు నాయకత్వం వహించాడు. దరిమిలా ఆయన వైశ్రాయ్ కౌన్సిల్లో కార్మిక సభ్యు డైనాడు. కార్మికుడు-యజమాని-ప్రభుత్వం యీ మూడు పక్షాలు కలిసి సదవగాహనతో పనిచేస్తే అటు ప్రభుత్వానికి మంచిదని - యాజమాన్యానికి లాభం వుంటుందని - కార్మికుని జీవన ప్రమాణం మెరుగు అవుతుందని ఆయన గట్టిగా చెప్పేవాడు. అందుకే త్రైపాక్షిక సంఘాలు (Tripartite Committees) ఏర్పాటు చేయించగలిగాడు. కార్మిక శ్రేయస్సుకు ఆయన నిరంతరం కృషిచేసాడు.

మహాకవి శ్రీ శ్రీ కలలు కన్న కార్మిక లోకపు కల్యాణానికి శ్రామి

కలోకపు సౌభాగ్యానికి అంబేద్కర్ వంటి మహనీయులే అర్థశతాబ్దానికి పూర్వమే మనదేశంలో పునాదులు వేసారన్న సత్యం మనం మరిచిపో కూడదు.

## స్త్రీజనశ్రేయోభిలాషిగా

అంబేద్కర్ని మనం స్త్రీ జన శ్రేయోభిలాషిగా గూడా గుర్తుంచుకో వాలి. హిందూసమాజంలో అణచివేయబడ్డవారు నిమ్నజాతీయులు. అలాగే మనుధర్మశాస్త్రం హైందవస్త్రీని పురుషునికి బానిసగా చేసింది. అబల అబల కాదు సబల అని అంబేద్కర్ వాదన. స్త్రీకి పురుషునితోపాటు సంఘంలో సమానమైన గౌరవం స్వేచ్ఛ - విద్యావకాశం - ఆస్తిలో సమాన హక్కువుండి తీరాలని అంబేద్కర్ పట్టుదల. స్త్రీలకు ఈ హక్కులు రక్షణలు పొందుపరచి ఆయన కేంద్రంలో న్యాయ శాఖామంత్రిగా వున్నప్పుడు హిందూకోడ్ బిల్లు తయారుచేసాడు. దురదృష్టవశాత్తు ఆబిల్లు పార్లమెంటులో పూర్తిగా పాస్ కాలేదు. ఆబిల్లు వీగిపోవడం తన ఓటమిగా భావించాడు ఆయన. మంత్రి పదవికే రాజీనామాచేసాడు. అంతకు ముందు ఆయన స్థాపించిన విద్యాల యాలలో బాలికలకు గూడా విద్యావకాశాలు కల్పించాడు. వారికి ప్రత్యేక వసతి గృహాలు ఏర్పాటుచేయించాడు. ఆనాడు హిందూకోడ్ బిల్లు పాస్ కాకపోయినా దరిమిలా కేంద్రంలో రాష్ట్రాలలో స్త్రీల హక్కుల మీద ఏన్నో చట్టాలు వచ్చాయి. ఈనాడు దేశంలో స్త్రీలు విద్యాధికులై ఉద్యోగాలు చేస్తున్నారు. స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు అనుభవిస్తున్నారు. ఆస్తిలో హక్కు పొంది సంఘంలో గౌరవప్రదమైన జీవితంగడుపుతున్నారు. ఈనాటి స్త్రీ అభ్యున్నతికి నలభై సంవత్సరాలకుపూర్వమే అంబేద్కర్ శాసనపరంగా వేసిన పునాదులే మూలకారణమని మనం గుర్తుకుతెచ్చుకోవాలి. అంబే ద్కర్ వంటి స్త్రీజన శ్రేయోభిలాషులందరి కృషి వల్లనే స్త్రీ జనాభ్యు దయం జరుగుతోందని మనం మరిచిపోరాదు.

## బహుగ్రంథకర్తగా

అంబేద్కర్ గొప్ప గ్రంథకర్త అని మనం గుర్తుంచుకోవాలి. ఆయన గొప్ప విద్యావేత్త. అధ్యాపకుడిగా మంచి అనుభవంవుంది. గొప్ప న్యాయ శాస్త్రవేత్త-. గొప్ప రాజకీయ శాస్త్రవేత్త. గొప్ప రాజనీతిజ్ఞుడు. గొప్ప రాజకీయనాయకుడు. అన్నిటికీమించి గొప్పరచయిత. ఆయన యెన్నో గ్రంథాలు వ్యాసాలు రాసాడు. రాజకీయ నాయకుడుగా వుండే ఆయన రాసి నన్ని గ్రంథాలు మరే నాయకుడు ఆనాటి నుండి యీనాటివరకు రాయలేదు. ఆయన ఉపన్యాసంచేసినా - వ్యాసం వ్రాసినా - గ్రంథం వ్రాసినా ఎంతో హేతువాద దృష్టితో - శాస్త్రీయ దృక్పథంతో వాదనా పటిమతో విషయ పరిజ్ఞానంతో చక్కని శైలిలో చేసేవాడు. ఆయన రాసిన గ్రంథాలన్నీ కులవ్యవస్థపై సమకాలీన సామాజిక-ఆర్థిక రాజకీయ సమస్యలపై రాసినవే. హిందూమతంలోని లోపాలు ఎత్తిచూపాడు. ఆయన కలంపదునైనది. భాష సరళమైనశక్తిగలది. చెప్పదలచుకొన్నది సూటిగా నిక్కచ్చిగా నిష్కర్షగా నిర్మొహమోటంగా నిర్భయంగా చెప్పేవాడు. అమె రికాలో ఇంగ్లండ్‌లో విద్యార్థిగా ఆయన డాక్టరేట్ కోసం రాసిన సిద్ధాంత వ్యాసాలు ఆయాదేశాల విద్యావేత్తల ప్రశంసలనందుకొన్నాయి. దరిమిలా రాజకీయనాయకుడిగా ఉన్నత శిఖరాలకు ఎదిగిన తర్వాత ఆయన రాసిన "పాకిస్తాన్", "శూద్రులెవరు", "అస్పృశ్యులు", "కులనిర్మూలన" - అల్ప సంఖ్యాకవర్గాలు - భాషాప్రయుక్తరాష్ట్రాలు - బుద్ధా అండ్ హిజ్ ధమ్మా మొదలగు గ్రంథాలు అంబేద్కర్ ప్రతిభకు పాండిత్యానికీ ప్రతిరూపాలు.

రాజకీయ నాయకులలో ఆయనంతటి మేధావి బహుశా మరొకరు లేరేమో! దేశంలోనే కాదు - ప్రపంచంలోనే బహుకొద్ది "మేధావు" లలో ఆయనొకడని విజ్ఞుల అభిప్రాయం. ఆయన్ని మనం నడిచే విజ్ఞాన సర్వస్వం (వాకింగ్ ఎన్‌సైక్లోపీడియా) అని చెప్పుకోవచ్చు. ఆయన గొప్ప రచయితే కాదు. గొప్ప జర్నలిస్టు! మూక్ నాయక్ - బహిష్కృత్ భారతి. జనత మొదలగు పత్రికలు స్వయంగా నడిపాడు. జన సామాన్యం నాడి తెలిసిన వాడాయన! కనుక వారికి అర్థమయ్యే సరళమైన భాషలో వ్యాసాలు రాసేవాడు. ప్రజలను ఆకట్టుకొంటానికి - వారిని జాగృతం చేయుటానికి

పత్రికలు ముఖ్య సాధనమని ఆనాడే గుర్తించిన వాడాయన.

ఇకపోతే అంబేద్కర్ జీవితం విశ్లేషిస్తే ఆయన 65 సంవత్సరాలు జీవించాడు. అందులో మూడు దశకాలు ఆయన జీవితంలో చాలా ముఖ్యమైనవి. 1912 నుండి 1922 వరకు ఆయన జీవితంలో ఒక ముఖ్య ఘట్టం. ఈ దశకంలో ఆయన విదేశాలలో ఉన్నత విద్యలనభ్యసించి ప్రజ్ఞాపాటవాలు సముపార్జించిన గొప్పవిద్యావేత్తగా మహామేధావిగా రూపుదిద్దు కొన్నాడు. తర్వాత 1927 నుండి 1937 వరకు ఆయన జీవితంలో మరో ముఖ్యమైన దశకం. ఆకాలంలో ఆయన ఉద్యమనాయకుడిగా నిమ్నజాతీయుల ఉద్ధరణకై పోరాటం సాగించాడు. మంచినీటికోసం మహద్‌పోరాటం సాగించాడు. మనుస్మృతి దహనంచేసాడు. నాసిక్ కాలా రామ్ దేవాలయ ప్రవేశ ఉద్యమం నడిపాడు. లండన్‌లో రౌండ్‌టేబుల్ సమావేశాల్లో నిమ్నజాతీయుల రాజకీయ ప్రత్యేక హక్కులకోసం పోరాటం సాగించాడు. పత్రికలు స్థాపించాడు - నిమ్నజాతీయుల్ని చైతన్యవంతుల్ని చేయుటానికి వ్యాసాలు రాసాడు. ఊరూరా సభలు పెట్టి ఉపన్యాసాలిచ్చాడు. ఇండిపెండెంట్ లేబర్ పార్టీని పెట్టి బొంబాయి అసెంబ్లీ ఎన్నికలలో నెగ్గి అసెంబ్లీలో వామపక్ష రాజకీయనాయకుడిగా రూపుదిద్దుకొన్నాడు. ఈ దశకంలోనే ఆయన ఒక రాజకీయశక్తిగా ఎదిగాడు!

మూడోదశకం 1946 నుండి 1956 వరకు ఆయన జీవితంలో చాలా ముఖ్యమైన దశకమిది. రాజ్యాంగ పరిషత్తు సభ్యుడైనాడు. కేంద్ర న్యాయశాఖ మంత్రి అయినాడు. రాజ్యాంగ రచనా సంఘం అధ్యక్షుడైనాడు. రాజ్యాంగాన్ని రచించాడు. హిందూకోడ్‌బిల్లు తయారుచేసాడు. ఈ కాలంలోనే భాషా ప్రయుక్త రాష్ట్రాలు మీద అల్పసంఖ్యాక వర్గాల మీద రచనలు చేసాడు. శూద్రులెవరు అస్పృశ్యులెవరు అన్న గొప్పగ్రంధాలు రాసాడు. బుద్ధ అండ్ హిజ్ ధమ్మా అన్న గొప్ప గ్రంధం రాసాడు. బుద్ధుడు కారల్‌మార్క్స్ అనేరచన రిడిల్సు ఇన్ హిందూయిజం అనే గ్రంధం గూడా యీ కాలంలోనే రచించాడు. పీపుల్సు ఎడ్యుకేషన్ సొసైటీ స్థాపించాడు. బొంబాయిలో సిద్దార్ధకళాశాల - ఔరంగాబాదులో

మిళింద మహా విద్యాలయ పేరున ఒక కళాశాల స్థాపించాడు. రాజ్యసభ సభ్యుడైనాడు. అవసానదశలో బౌద్ధమతం స్వీకరించినాడు. ఇలా మొత్తం మీద యీ దశకమే అంబేద్కర్ జీవితం చాలా ప్రాముఖ్యత సంతరించు కొన్నది. 1946 నుండి అంబేద్కర్‌లో ఎంతో మార్పువచ్చింది. 1947 లో కేంద్రన్యాయశాఖమంత్రి అయినాడు. రాజ్యాంగ రచనా సంఘం అధ్య క్షుడైనాడు. పరిణతిచెందిన ప్రజాస్వామిక వాదిగా - జాతీయవాదిగా - విశాలదృక్పథం కల్గిన సమతామానవతా వాదిగా రూపొందినట్లు ప్రస్ఫుటంగా కనిపిస్తాడు.

## అంబేద్కర్ మహోన్నత ఆశయాలు

పాఠకులారా! అంబేద్కర్ గురించి తెలుసుకున్నాం. ఆయన జీవి తంలో సాధించిందేమిటో స్థూలంగా తెలుసుకున్నాం. ఇంతకు ఆయన ఆశయాలేమిటి? అని ఆలోచిస్తే ఆయన ఆశయాలు మహోన్నతమైనవిగా కనిపిస్తాయి. స్థూలంగా 'వాటిగురించి తెలుసుకుందాం.

ప్రతి వ్యక్తి సమాజంలో గౌరవప్రదంగా జీవించాలన్నది ఆయన ముఖ్య ఆశయం. హిందూ సమాజంలో కులవ్యవస్థ పోవాలంటాడు. అప్పుడే అసమానతలు తొలిగి పోతాయంటాడు. అస్పృశ్యత అప్పుడే పోతుందం టాడు. అందుకు కులాంతర వివాహాలు ఒక ముఖ్యమైన మార్గమంటాడు. పైగా హిందూమతాన్నే సంస్కరించాలంటాడు. అందరికీ ఆమోదయోగ్య మైన ఒకే ఒక హిందూధర్మశాస్త్రం రూపొందించాలంటాడు. అది శాస్త్రీయ దృష్టితో హేతువాద దృష్టితో వుండాలంటాడు. వారసత్వపు పూజారి విధానాన్ని నిర్మూలించాలంటాడు. కులమతరహితంగా ప్రతి హిందువుడు ప్రతి భారతీయుడు గౌరవంగా జీవించాలంటాడు. హిందూ సమాజంలో కులవిభేదాలు వున్నాయి కనుక, అస్పృశ్యత వుంది కనుక అవి నిర్మూలించేటంతవరకు, నిమ్న జాతీయులకు బడుగు వర్గాలవారికి అల్ప సంఖ్యాకవర్గాల వారికి కొన్ని ప్రత్యేక హక్కులు రక్షణలు తప్పనిస రిగా కల్పించాలంటాడు. ఆయన రాజ్యాంగం రచించినప్పుడు సాధ్యమైనంత

వరకు పైన చెప్పిన హక్కులు రక్షణలు కల్పించాడు. నిమ్నజాతీయులకు సమాజంలో జరుగుతున్న అన్యాయాల్ని బట్టి మొదటిదశలో దగ్గరదగ్గరలో నున్న గ్రామాలలోని నిమ్నజాతీయులనందరికి కలిపి ప్రత్యేకమైన ఆవాసా లను అంటే వారికే ప్రత్యేకమైన గ్రామపంచాయితీలను (సపరేట్ సెటిల్ మెంట్స్) యేర్పాటుచేయాలంటాడు. వారి సమస్యలు వారేచర్చించుకొని వారి శ్రేయస్సు అభివృద్ధి వారే చూచుకొంటానికి వీలు కలుగుతుందని ఆయన అభిప్రాయం. అస్పృశ్యత నిర్మూలించటానికి యిదొక మార్గ మంటాడు. వాళ్ళు గౌరవప్రదమైన స్వేచ్ఛాయుత సుఖజీవనం చేయటానికి వీలుకలుగుతుందని అంటాడు. అలానే గ్రామస్థాయి ప్రజాసంస్థల్లో గూడా నిమ్నజాతీయులకు ప్రత్యేకనియోజకవర్గ పద్ధతి అమలుచేయాలంటాడు.

రాజకీయంగా దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామ్యం నెలకొనాలం టాడు. స్వేచ్ఛ - సమానత్వం - సౌభ్రాతృత్వం - న్యాయం ప్రాతిపదిక మీద ప్రజాస్వామ్య ముండాలంటాడు. రాజకీయ స్వాతంత్ర్యమేకాదు. ఆర్థికంగా, సామాజికంగా ప్రతి వ్యక్తికి స్వేచ్ఛ సమాన ప్రతిపత్తి వుండాలంటాడు. ప్రతి సమస్యను ప్రజాస్వామ్య పద్ధతిలోనే పరిష్కరించుకోవాలంటాడు. రక్త పాతంతో కూడిన విప్లవపంథాకు ఆయన బద్ధవిరోధి. పార్లమెంటరీ ప్రజా స్వామ్యమైనా వారసత్వపు (రాచరికపు) ప్రజాస్వామ్యమైనా ప్రజాక్షేమం ముఖ్యమంటాడు. ప్రజాస్వామ్యంలో రాజ్యాంగంపట్ల గౌరవముండాలని దాని ఆచరణలో చిత్తశుద్ధి వుండాలంటాడు. శక్తివంతమైన ప్రతిపక్షం కూడా వుండాలంటారు. "కళ్ళెం"లాగా ప్రతిపక్షం ప్రభుత్వాన్ని "విచ్చలవిడిస్వేచ్ఛ" నుండి అదుపు చేస్తుందంటాడు. అంకిత భావంగల సమర్థవంతమైన "అధికార యంత్రాంగం" వుంటే ప్రభుత్వ పనితీరు బాగుంటుందని అంటాడు.

వ్యక్తి ప్రజాస్వామ్యంలో అందరికీ గౌరవ ప్రదమైన జీవితం ప్రభుత్వం సమకూర్చాలంటాడు. ప్రజాస్వామ్యంలో ప్రతిపౌరుడికి సమానన్యాయం సమ తాస్థాయి స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు - సహోదర జాతీయతాదృక్పథం వుండితీరా లంటాడు. స్త్రీలకు కూడా సమాజంలో పురుషులతో సమానమైన ఆస్తి

హక్కు గౌరవప్రతిపత్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలుండాలంటాడు. ఆయన రాజ్యాంగం రచన చేసినప్పుడు పైనచెప్పిన ఆశయాలన్నీ అందులో పొందు పరచటానికి ఆయన వంతు కృషి ఆయన చేసాడు.

ఆర్థిక పరంగా అందరికీ కూడు, గూడు, గుడ్డ, విద్య, ఆరోగ్యం, ప్రభుత్వం తప్పక కల్పించాలంటాడు. అంటే రాష్ట్రీయ సామ్యవాద విధానమన్నమాట (స్టేట్ సోషలిజం). కీలకమైన పరిశ్రమల్ని, వ్యవసా యాన్ని జాతీయం చేయాలంటాడు. సోషలిస్టు దేశాల్లో మాదిరి సమష్టి సహకార వ్యవసాయ పద్ధతి మన దేశంలో కూడా అమలుపరచాలంటాడు. వ్యవసాయ కూలీలకు, పారిశ్రామిక కార్మికులకు న్యాయమైన గిట్టుబాటు గల్గిన కూలీరేటు, రోజువారీ (నెలవారీ) జీతబత్తేలుండాలంటాడు. శ్రామి కులకు సాంకేతిక శిక్షణ ఇవ్వాలంటాడు. అప్పుడే ఉత్పత్తి పెరుగుతుం దంటాడు. అటు ప్రభుత్వం, ఇటు శ్రామిక జీవన పరిమాణం ఆర్థికంగా మెరుగవుతుందని అంటాడు. గాంధీజీ చెప్పిన కుటీరపరిశ్రమల్ని ఆయన వ్యతిరేకించాడు. మారిపోతున్న కాలంలో, ఆధునిక, యాంత్రిక యుగంలో దేశాన్ని పారిశ్రామికీకరణ చేయాలంటాడు. అవిద్య - అజ్ఞానం - పేదరికం - ఆకలి సమూలంగా నశించాలన్నది ఆయన ఆశయం.

గాంధీజీ నొక్కిచెప్పిన గ్రామ (రామ) స్వరాజ్యం అంటే అంబేద్కర్‌కు గిట్టదు. సంకుచిత భావాలకు మూఢాచారాలకు - కులతత్వభావనకు అసలు గ్రామాలే పుట్టినిళ్ళని అంబేద్కర్ అభిప్రాయం! గ్రామాలు సహితం పారిశ్రా మికీకరణ జరగాలంటాడు. అప్పుడే దేశం ప్రగతి చెందుతుందని అంటాడు. ప్రజల జీవన పరిమాణం మెరుగుపడుతుందని అభిప్రాయపడతాడు.

వ్యక్తిగతంగా మనిషి శీలవంతుడిగా ఆత్మగౌరవంతో స్వయం కృషితో ఆత్మవిశ్వాసంతో గౌరవప్రదంగా జీవించాలంటాడు. వ్యక్తి పూజ (నాయక ఆరాధన)ను ఆయన వ్యతిరేకించాడు. మనిషి మనిషిగా జీవించాలంటాడు. అలానే మనిషికి విద్యాభ్యాసం ముఖ్యమంటాడు. మతం మనిషి నైతిక జీవితానికి తోడు పడాలంటాడు. మతం మనిషి కోసం గాని, మనిషి మతం కోసం కాదంటాడు. ప్రభుత్వంగాని సమాజంగాని, మతంగాని ప్రతిమనిషికి

గౌరవప్రదమైన సుఖప్రదమైన జీవితాన్ని అందించాలంటాడు. కులమత రహిత సమసమాజ స్థాపన ఆయన జీవిత ముఖ్య ఆశయం! పార్లమెంటరీ ప్రజాస్వామ్యం దేశంలో పరిఢవిల్లాలంటాడు.

## గాంధీ - అంబేద్కర్ల విభిన్నదృక్పథాలు

అంబేద్కర్ జీవితాశయం - నిమ్నజాతుల ఉద్ధరణ అని తెలుసుకున్నాం. అది ప్రధానంగా రెండు విధానాలుగా సాగింది. మొదటిది - అసమానతలకు మూలమైన కులవ్యవస్థ మీద అమానుషమైన అస్పృశ్యత మీద సమర శంఖారావం పూరించడం - అంటే కులవ్యవస్థకు - అస్పృస్యతకు మూలకారణమైన బ్రాహ్మణ ఆధిక్యత మీద - హిందూ శాస్త్రాలు మీద దాడిచేయడం - ఇక రెండవది నిమ్నజాతీయుల రాజకీయ హక్కుల కోసం - రక్షణలకోసం ఉద్యమించడం. ఈ రెండు విధాలుగా ఆయన సాగించిన పోరాటానికి అడ్డు తగిలిన వారు గాంధీజీ - ఆయనకు అండగానున్న కాంగ్రెస్ పార్టీ నాయకులు. ఆనాడు గాంధీజీ అంటే కాంగ్రెస్. కాంగ్రెస్ అంటే గాంధీజీ అని అర్థం.

స్వాతంత్ర్యం కోసం దేశంలో సాగుతున్న ఉద్యమానికి గాంధీ తిరుగులేని నాయకుడు. భారతీయులకానాడు గాంధీజీ మహాత్ముడు - అవతార పురుషుడు! ఆయన చేపట్టిన శాంతియుత సత్యాగ్రహవిధానం ప్రపంచాన్నే ఆకట్టుకొన్నది. ఆయన మాటలకు యెదురులేదు! అటువంటి గాంధీజీ నుండే అంబేద్కర్ ఉద్యమానికి అడ్డంకులు వచ్చాయి. అది చిత్రంగా వుండవచ్చుకాని అదియధార్థం! అంతటి గాంధీజీని ఎదుర్కొన్నవాడు అంబేద్కర్.

కాంగ్రెస్ పార్టీధ్యేయం అసలు రాజకీయ పరమైనది స్వాతంత్ర్యం సంపాదించడం ఆనాడుదాని ముఖ్యోద్దేశం. దానికి గాంధీజీ యేకైక నాయకుడు! యెదురులేని నాయకుడు. సాంఘిక సంస్కరణలద్వారా "హరిజన" సేవ కాంగ్రెస్‌పార్టీ - గాంధీజీ దరిమిలా చేపట్టిన కార్యక్రమం. దేశానికి స్వాతంత్ర్యంరావాలని అంబేద్కర్ యెంతనొక్కి చెప్పినా ఆయన ముఖ్య

లక్ష్యం నిమ్నజాతుల ఉద్ధరణ.

కేవలం "అస్పృశ్యత" పోవాలని ప్రచారంచేసినంత మాత్రాన అది పోదు! ఇది వరకు యెందరెందరో సంస్కరణాభిలాషులైన మహనీయులు సాధుపుంగవులు బ్రహ్మసమాజంవారు - ఆర్యసమాజంవారు - యిలా యెందరో మానవతావాదులు - కులవ్యవస్థను ఖండించారు. అస్పృశ్యతాని వారణకు కృషిచేసారు. అయినా పెద్దగా ఫలితం లేకపోయింది. అంబేద్కర్ దృష్టిలో కులవ్యవస్థ కూకటివేళ్ళతో బాగా నాటుకుపోయిన విషవృక్షం వంటిది. దాని ఆకుల్ని - కొమ్మల్ని నరికేస్తే సరిపోదు. కూకటివేళ్ళతోనే దాన్ని పెకలించాలి. అలానే యీ కులవ్యవస్థ శిధిలావస్థలో కూలిపోవటా నికి సిద్ధంగా వున్న గృహం వంటిది. పైకి అది బాగానే కనిపించవచ్చు. అది బాగా బాధుబడ్డ యిల్లు! దానికి పైపైన తెల్లని సున్నం పూస్తే సరిపోదు. పైపైన రంగులు వేస్తే లాభంలేదు. ఆపాదుపడ్డ యింటిని కూల్చివేయాలి. పునాదులనుండి మళ్ళీ కొత్త గృహాన్ని కట్టాలి. అదేవి ధంగా కులవ్యవస్థను సమూలంగా నిర్మూలించనిదే - అస్పృశ్యతపోదనీ - హిందూ సమాజం బాగుపడదని అంబేద్కర్ నొక్కిచెప్పేవాడు. అంటే - హిందూశాస్త్రాల్ని - హిందూమతాన్ని హిందూ సమాజాన్ని పూర్తిగా సంస్కరించాలని అంబేద్కర్ ఉద్దేశం.

అయితే గాంధీజీ కులనిర్మూలన చేయాలనలేదు. అస్పృశ్యతను పాటిం చడం మహాపాపమనేవాడు. అస్పృశ్యత హిందూ సమాజానికి మాయని మచ్చని గూడా అనేవాడు. కనుక అస్పృశ్యతానివారణ కొరకు గాంధీజీ కృషిచేసాడని చెప్పవచ్చు. ఆయన స్థాపించిన హరిజన సేవక్‌సంఘ్ ద్వారా - హరిజన సేవాకార్యక్రమాలు చేయించే వాడు గాంధీజీ. ఆయన దృష్టిలో వర్ణాశ్రమధర్మాలకు - కులవ్యవస్థకు తేడావుంది. వర్ణాశ్రమ ధర్మాల్ని హిందూ ధర్మశాస్త్రాలు నిర్దేశించాయి. శాస్త్ర సమ్మతమైనవి కనుక అవి వుండాలంటాడు. గాంధీజీపైగా వర్ణాశ్రమధర్మాలు - జీవనోపాధికి అవస రమైన (కుల) వృత్తుల్ని కల్పించిపెట్టాయి కనుక అవి మంచివేనంటాడు. హిందూధర్మ శాస్త్రాలు - వేదవేదాంగాలు - ఉపనిషత్తులు - మనకు

ఆధ్యాత్మిక చింతనను కలిగిస్తాయి. ముక్తి మార్గంచూపెడతాయి. కనుక హిందూ శాస్త్రాలు గాంధీజీ దృష్టిలో చాలా పవిత్రమైనవి. ప్రామాణిక మైనవి. గాంధీజీదృష్టిలో హిందూ సమాజంలో "ఉచ్ఛనీచాలు" లేవు! హిందువులందరూ సోదరులే! ఎవరి వృత్తి వారుచేసుకున్నా అందరూ భారతీయసోదరులే! - అయితే గాంధీజీ నాల్గవ దశకంలో మాత్రం - కులాలుపోవడం మంచిదని అన్నాడు. వర్ణాంతర వివాహాలు - సహపంక్తిభోజనాలు తప్పులేదన్నాడు. ముందు అస్పృశ్యతా నివారణకు అధిక ప్రాధాన్యతనిచ్చాడు. భారతదేశంలో సమసమాజం స్థాపించాలంటే కమ్యూనిస్టులు కులవ్యవస్థ నిర్మూలన కన్న సామాజిక ఆర్థిక సమస్యలను పరిష్కరించటానికి ముందు కృషిచేయాలంటారు. వారిదృష్టిలో కులసమస్య ఉపరితల (పైపైని) సమస్య - మూలసమస్య ఆర్థిక సమస్య. అది పరిష్కారమైతే కులవ్యవస్థ దానంతటదే నశించిపోతుంది! కమ్యూనిస్టులు యీవిషయంలో అంబేద్కర్‌ని తప్పుపడతారు. అయితే ఒక ముఖ్య విషయం గుర్తుంచుకోవాల్సివుంది అది ఏమిటంటే - భారతదేశంలో కమ్యూనిస్టుపార్టీ రాజ్యమేలాలంటే - సోషలిస్టు సమాజం స్థాపించబడాలంటే ముందు కులవ్యవస్థ అనబడే మదపుటేనుగు కుంభస్థలాన్ని బ్రద్దలు కొట్టాలని చైనా మహానాయకుడు "మావో" ఏనాడో చెప్పాడంటారు. కులవ్యవస్థ పాతుకుపోయిన మనదేశంలో మావో చెప్పింది నిజమేగదా! అదే అంబేద్కర్‌వాదన. ఇకపోతే అంబేద్కర్ దృష్టిలోను వర్ణాలకూ - కులాలకు తేడా వుంది. వర్ణం సామర్థ్యాన్ని అర్హతను కల్పిస్తుంది. కులం - పుట్టుకనుండి వచ్చేది. పైగా - హిందూ సమాజం కులాల సమాఖ్య! కులవ్యవస్థ హిందూసమాజానికి శాపం వంటిది. కులాలలో కొన్ని అగ్రకులాలు! కొన్నినీచకులాలు! హిందూసమాజం నిమ్నోన్నతాలున్న ప్రదేశంవంటిది. హిందూ సమాజం అమానుషమైన అసమానతలతో నిండివుంది.

అందులో అస్పృశ్యత మరీఘోరమైనది! క్రూరమైనది! వేదవేదాంగాలు శ్రుతిస్మృతులు స్వార్థానికి అసమానతలకు అమానుషత్వానికి బ్రాహ్మణ ఆధిక్యతకు పుట్టినిళ్ళు! కనుక ప్రస్తుతమున్న హిందూధర్మశాస్త్రాల్ని

సమూలంగా సంస్కరించాలి! హేతువాద దృష్టితో శాస్త్రీయదృక్పథంతో ప్రతి మనిషికి గౌరవప్రదమైన స్థానాన్ని సుఖప్రదమైన జీవన విధానాన్ని ప్రసాదించేరీతిలో వాటిని తిరగరాయాలి. అంబేద్కర్ కుల నిర్మూలన రచన ప్రచురించినప్పుడు గాంధీజీ దానిని విమర్శించాడు. అంబేద్కర్ హిందూమత వ్యతిరేకి అన్నాడు. హిందూయిజానికి అంబేద్కరొక సవాలు అన్నాడు గాంధీజీ. హిందూ ధర్మశాస్త్రాలు చాలా ఉత్కృష్టమైనవన్నాడు. వాటిని అంబేద్కర్ సరిగ్గా అర్థంచేసుకోలేదని - తప్పుగా అర్థంచేసుకున్నాడని విమర్శించాడు. ఈ విధంగా గాంధీజీ - అంబేద్కర్‌లు - "అస్పృశ్యత"ను "దురాచారం"గా హిందూసమాజానికి మాయని మచ్చగా గుర్తించినా - కులవ్యవస్థవిషయంలో యిద్దరికీ యెంతో భేదాభిప్రాయాలున్నవి. పైగా గాందీజీ - "అస్పృశ్యత" హిందువుల సమ్మతిమీద - వారి హృదయపరివర్తన ద్వారా నెమ్మదిగా పోవాల్సిందే తప్ప అందుకు మరొక మార్గం లేదంటాడు. గాంధీజీ - కాంగ్రెస్ వారు చేపట్టిన "హరిజనసేవ" నామమాత్రమైనదనీ - చేతలలో కన్నా మాటలలో ప్రచారంలో యెక్కువని విమర్శించేవాడు అంబేద్కర్. స్వార్థంతో రాజకీయ లబ్ధికోసం కాంగ్రెస్‌వారు "హరిజన" సేవచేస్తున్నారని అంబేద్కర్ ఆరోపణ! గాంధీజీకి -కాంగ్రెస్ వారికి "హరిజనసేవ" విషయంలో చిత్తశుద్ధిలేదని అంతా "సవతితల్లి ప్రేమ", "కపటనాటకమని " అంటాడు అంబేద్కర్ నిమ్నజాతులవారి మంచినీటికోసం మహద్‌పోరాటం సాగిస్తే గాంధీజీగాని కాంగ్రెస్‌కాని నోరు మెదపలేదని అంబేద్కర్ విమర్శించాడు. నాసిక్‌లో కాలారామ్ దేవాలయ నిమ్నజాతీయుల ప్రవేశ ఉద్యమం సాగిస్తే గాంధీజీ-కాంగ్రెస్ వారు సహకరించకపోతే పోయారు సానుభూతి అయినా ప్రకటించలేదని అంబేద్కర్ విరుచుకొని పడ్డారు. అది నిజమేగదా మరి! కాంగ్రెస్‌వారు కల్పించిన రాజకీయ - విద్యా ఉద్యోగ సదుపాయాలు అనుభవిస్తూ హరిజనులు 'అంబేద్కరనే' కలవరిస్తారేమిటని కాంగ్రెస్ వారంటే - అందుకు అంబేద్కర్ భీష్ముడు కౌరవుల 'వుప్పు' తింటూ పాండవుల పక్షాన వుండలేదా అంటాడు.

అంబేద్కర్ హిందూ మతాన్ని విడిచిపెట్టి వేరే మతం తీసుకుంటే సనాతన హిందువులు - కాంగ్రెస్‌వారు ఆయన్ని విమర్శించారు. గాంధీజీ అంబేద్కర్ ఆవేదనని ఆగ్రహాన్ని అర్థంచేసుకోగలనన్నాడు. అయితే విద్యాగంధంలేక గ్రామసీమల్లో హిందువులుగానే జీవిస్తున్న హరిజనులు మతం మార్పిడి వలన ఏమిలాభం పొందుతారని గాంధీజీ అన్నాడు. అంబేద్కర్ ఏమి సాధించగలననుకున్నాడో తనకు అర్థంకావడం లేదంటాడు గాంధీజీ.

ఇకపోతే నిమ్నజాతీయుల హక్కులు - రక్షణల కొరకు అంబేద్కర్ సాగించిన పోరాటం విషయానికివస్తే - అంబేద్కర్‌కు గాంధీజీకి అసలు బద్ధవైరమే వచ్చిందని చెప్పొచ్చు. 1931లో లండన్‌లో రౌండ్ టేబుల్ సమావేశాల్లో యిద్దరిమధ్య యుద్ధం మొదలైనది. హరిజనులు హిందూ సోదరులలో కనుక వారి అభ్యున్నతి విషయం స్వతంత్ర భారతదేశంలో మేమే చూసుకుంటామని గాంధీజీ వాదన. నిమ్నజాతీయులు భారతదేశంలో పేరుకుమాత్రం హిందువులుకాని వాస్తవంగా వాళ్ళు పశువులకన్నహీనంగా సంఘబాహ్యులుగా- "అంటరానివారుగా" చూడబడుతున్నారు. కనుక వారిని అల్పసంఖ్యాక వర్గాలుగా పరిగణించి - వారికి ప్రత్యేక రాజకీయహక్కులు - రక్షణలు కల్పించి తీరాలని అంబేద్కర్ పట్టుదల.

సిక్కులు మహమ్మదీయులు హిందువులు కారు కనుక వారికి ప్రత్యేక హక్కులకు తాను అంగీకరిస్తానని గాంధీజీ. హరిజనులు హిందువులలో ఒక భాగమే కనుక వారికి ప్రత్యేకహక్కులు రక్షణలు అక్కరలేదన్నది గాంధీజీ వాదన. ఇద్దరికీ అసలు యిక్కడే - యీవిషయంలోనే తీవ్రమైన విభేదాలు యేర్పడ్డాయి. ఇంతకు యీ విభేదాలు రెండవరౌండు టేబుల్ సమావేశాలకు ముందు యిద్దరిమధ్య యిండియాలో 1931 ఆగష్టులో బొంబాయిలో జరిగిన సమావేశంలోనే 'బీజాంకురం' యేర్పడింది.

అంబేద్కర్ గాంధీజీనాయకత్వాన్ని అంగీకరించి కాంగ్రెస్ వారి చెప్పు చేతల్లో నడుచు కోవాలని కాంగ్రెస్ నాయకుల పట్టుదల. అంబేద్కర్ అందుకు ఏమాత్రం అంగీకరించలేదు. అంబేద్కరేకాదు, చాలా మంది భారతీయులుగూడా గాంధీజీ విధానాన్ని వ్యక్తిత్వాన్ని నాయకత్వాన్ని అంగీ

కరించలేదు.

రౌండ్ టేబుల్ సమావేశాల్లోనే అటు సంస్థానాధీశ్వరులని - యిటు మహమ్మదీయులను కూడగట్టుకొని అంబేద్కర్‌ని ఏకాకి చేయాలని గాంధీజీ విఫల ప్రయత్నంచేసాడు. అంబేద్కర్ చేసిన ప్రతి ప్రతిపాదనను గాంధీజీ వ్యతిరేకించాడు. దానితో అంబేద్కర్‌కు గాంధీజీ పట్ల దురభిమానం - ద్వేషం యేర్పడ్డాయి. గాంధీజీని నిమ్నజాతియుల ప్రధమశత్రువుగా విమర్శించేదాకా వెళ్ళాడు అంబేద్కర్.

దరిమిలా అంబేద్కర్ ఆశించినట్లు నిమ్నజాతియులకు ప్రత్యేక నియోజక వర్గాలనిస్తూ బ్రిటీష్ ప్రభుత్వం కమ్యూనల్ అవార్డు ప్రకటించినప్పుడు గాంధీజీ ఆమరణ దీక్ష పూనాడు. హరిజనుల పట్ల ప్రేమ నటించే గాంధీజీ వారి ప్రత్యేక హక్కులకు వ్యతిరేకంగా ఆమరణ దీక్ష భూనడం విడ్డూరంగా వుందని అంబేద్కర్ ఆవేదన వ్యక్తంచేసాడు. గాంధీజీకి ప్రాణాపాయ స్థితి యేర్పడింది. అటు గాంధీజీ ప్రాణాలు కాపాడాలి. ఇటు తన జాతీయులకు హక్కులు కాపాడాలి! అంబేద్కర్‌కది అగ్ని పరీక్ష! గాంధీజీ ప్రాణాలకు ముప్పుయేర్పడితే - యింకేమన్నా వుందా! అయితే యిరుపక్షాల నాయకులుచేసిన ప్రయత్నాల ఫలితంగా - గాంధీజీ "ప్రాణాలు" కాపాడటానికి అంబేద్కర్ నిమ్నజాతియులకు ప్రత్యేకనియోజకవర్గాల సదుపాయాన్ని వదలు కొన్నాడు. సంయుక్తనియోజక వర్గాలను ఆయన అంగీకరించవలసి వచ్చింది! ప్రత్యేకనియోజక వర్గాలలో అయితే నిమ్నజాతియులకు రెండు ఓట్లు ఉంటాయి! ఒకటి తమ నిమ్నజాతి అభ్యర్ధికొరకు రెండవది (జనరల్) యితర కులాల అభ్యర్ధిని యెన్నుకొంటానికి. సంయుక్త నియోజకవర్గాలలో ఒక్కొక్కస్థానానికి నల్గురు అభ్యర్ధులు ఒకే ఓటు - ప్రైమరీ - సెకండరీ (ఫైనల్) ఎన్నిక విధానం! అంటే ప్రత్యేకనియోజక వర్గాల విధానమే నిమ్నజాతీయులకు ఎక్కువప్రయోజన కరం! అంటే గాంధీజీ ప్రాణాలు నిలబెట్టటానికి అంబేద్కర్ దిగివచ్చికొంత త్యాగం చేసాడన్నమాట! అంటే నిమ్నజాతీయుల ప్రయోజనాన్ని కొంత వరకు వదులు కున్నాడన్న మాట! అది అంబేద్కర్ సహృదయత - మానవతా దృక్పధం!

వైశ్రాయ్ కౌన్సిల్లో అంబేద్కర్ సభ్యుడిగా నియమింపబడడం గూడా గాంధీజీకి - కాంగ్రెస్‌వారికి యిష్టంలేదట! ఆయన్ని తొలగించమని గాంధీజీ బ్రిటీష్ సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కి రహస్యంగా ఉత్తరం వ్రాసాడని కొందరం టారు. మధ్యపరగణాల రాష్ట్రంలో ఆ రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీకరే ఒక హరిజనుణ్ణి తన మంత్రివర్గంలో చేర్చుకొంటానంటే గాంధీజీ - కాంగ్రెస్ నాయకులు అంగీకరించలేదట! కేంద్రంలో అంబేద్కర్‌ని మంత్రిగా తీసు కొనటానికి కాంగ్రెస్ వారు - గాంధీజీ అంగీకరించడం మాత్రం పెద్ద విశేషమే! పైగా అంబేద్కర్‌ని రాజ్యాంగ రచనా సంఘానికి అధ్యక్షునిగా చేయడంగూడా పెద్దవిశేషమే. అంబేద్కర్ గొప్పరాజకీయ శాస్త్రవేత్త - న్యాయ శాస్త్రవేత్త. గొప్పరాజ్యాంగ నిపుణుడు కావడంవల్ల - ఆయన అవసరం వచ్చింది కనుక తప్పనిసరి పరిస్థితుల్లో ఆయన్ని తీసుకొనకతప్ప లేదు కాంగ్రెస్ వారికి! అందుకే ఒకానొక సందర్భంలో అంబేద్కరంటాడు గదా - వేదాలు కావాల్సివస్తే కులహీనుడైన వ్యాసుణ్ణి వెతుక్కున్నారు. పురాణంకావలసి వస్తే కులహీనుడైన వాల్మీకిని ఆశ్రయించారు. రాజ్యాంగం రాయటానికి అస్పృశ్యుడైన తనను ఎన్నుకున్నారని!

అంబేద్కర్ రాజ్యాంగ రచనా సంఘానికి అధ్యక్షుడు అవడం ఒకం దుకు మంచిదే అయ్యింది. నిమ్నజాతీయులకు ప్రత్యేక హక్కులు - రక్షణల విషయంలో మొండిచేయి చూపిస్తూ వచ్చారు అటు బ్రిటీష్ పాలకులు, ఇటు కాంగ్రెస్‌నాయకులు. రాజ్యాంగం రచించేటప్పుడు తెలివిగా - మెల్లగా - నిమ్నజాతీయులకు - యితర అల్పసంఖ్యాక వర్గాలవారికి రాజ్యాంగ పరంగా ప్రత్యేక నియోజకవర్గాలు - విద్యాఉద్యోగ సదుపాయాలు యేర్పాటు చేయగలి గాడు. రాజ్యాంగం తుదిరూపం దిద్దేటప్పుడు - రాజ్యాంగ పరిషత్తులో సభ్యుల నుండి వ్యతిరేకత రాకుండ వారిని ఒప్పించగలిగినాడు. వారూ సహృదయ తతో అస్పృశ్యులకు హక్కులు యివ్వడం న్యాయమని తలంచారు. గాంధీజీ కాదన్న హక్కుల్ని తుదకు రాజ్యాంగ బద్ధంగా సాధించాడు అంబేద్కర్.

ఈ విధంగా గాంధీజీ హరిజనసేవ అంటూనే నిమ్నజాతీయుల అభ్యు న్నతికోసం అంబేద్కర్ చేపట్టిన ప్రతి ఉద్యమానికి గూడా - కాంగ్రెస్‌వారి

నడ్డంపెట్టుకొని అద్భుతగిలాడు. స్వాతంత్ర్య పోరాటంలో గాంధీజీ నిర్వహించిన పాత్రను గాంధీజీ నాయకత్వాన్ని అంబేద్కర్ గుర్తించాడు. అయితే హరిజన ఉద్ధరణ విషయంలో గాంధీజీ అనుసరించిన విధానాన్ని ఆయన నాయకత్వాన్ని అంబేద్కర్ వ్యతిరేకించాడు. గాంధీజీ చేపట్టిన అస్పృశ్యతా నివారణ కార్యక్రమాలు కొంత సత్ఫలితాన్నివ్వడం గూడా అంబేద్కర్ గుర్తించాడు. నిమ్నజాతీయుడిగా నిమ్నజాతీయులకు తానే యేకైక నాయకుడనని అంబేద్కర్ ధీమా! నిమ్నజాతీయుల ఉద్ధరణ విషయంలో తాను చేసిందే సరియైనదని ఆయన భావన! నిమ్నజాతీయుల ఉద్ధరణ అసలు తానే చేయాలని ఆయన ఆకాంక్ష! మనమిక్కడ ఒక ముఖ్య విషయాన్ని మరిచిపోగూడదు. గాంధీజీ కాంగ్రెస్ పార్టీ "హరిజన "సేవ చేపట్టటానికి వెనక ఒక రహస్యముంది! అసలు అంబేద్కర్ మూలాననేవారు హరిజన సేవా కార్యక్రమాల పట్ల ఆసక్తి చూపారు. కార్య క్రమాల్ని ముమ్మరంచేసారు. అంబేద్కర్ మొదట నుండీ నిమ్నజాతీయులకు జరుగుతున్న అన్యాయాల గురించి - వారి హక్కుల గురించి పోరాటం చేస్తున్నాడు. పత్రికలు పెట్టి నిమ్నజాతీయుల సమస్యల్ని లోకానికి చెప్పడం మొదలెట్టాడు. మహద్ చెరువు నీటిపోరాటం, కాలారామ్‌దేవాలయ ప్రవేశ ఉద్యమం పెద్ద అలజడిని సృష్టించాయి. నిమ్నజాతీయులు అంబేద్కర్‌ని నాయకుడిగా పరిగణింపసాగారు. అందరూ అంబేద్కర్‌ని ప్రశంసించడం మొదలుపెట్టారు. నిమ్నజాతీయులందరూ అంబేద్కర్ మాటవింటే - కాంగ్రెస్ బలహీనబడుతుందని - గాంధీజీ కాంగ్రెస్‌వారు "హరిజనసేవ" చేపట్టారు. దక్షిణాఫ్రికాలో తన భారతీయ సోదరులతోపాటు - తానూ "అంటరానివారి" లాగా హీనంగా చూడబడడం గూడా గాంధీజీ మరిచిపోలేదు!

అంబేద్కర్ దేవాలయ ప్రవేశమంటే కాంగ్రెస్ వారు దేవాలయ ప్రవేశాన్ని ముమ్మరం చేసారు. ఆయన స్కూళ్ళు హాస్టళ్ళు పెడితే - వారు హరిజన సేవక సంఘం పెట్టారు! అంబేద్కర్ సహపంక్తి భోజనాలు, వర్ణాంతర వివాహాలు అంటే వాళ్ళూ అన్నారు. అంబేద్కర్‌కి కాంగ్రెస్ వారికి ప్రతి కార్యక్రమంలోనూ యిలా "పోటీ" యేర్పడింది!

రాజ్యాంగంలో నిమ్న జాతియులకు ప్రత్యేక హక్కులు పొందుపరిచే నాటికి గాంధీజీ లేడు! బ్రతికుంటే ఏమనేవాడో! బహుశా ఒప్పుకొనేవాడే! అంబేద్కర్‌కి న్యాయశాఖ మంత్రిపదవికి గాంధీజీ ఒప్పుకున్నాడుగదా! ఇంతకీ అంబేద్కర్ నిమ్నజాతియులకు "రిజర్వేషన్లు" కొంతకాలం మాత్రమే అడి గాడు. వారు పైకి వచ్చేదాకా అవి వుండాలన్నాడు. వేలాది సంవత్సరాలు పశువులకన్న హీనంగా చూడబడ్డవారికి కొంతకాలం "ప్రత్యేక సదుపాయాలు" తప్పా! అన్యాయమా! రోగికి నయమయ్యే ధాకా వైద్యుడు మందివ్వడా!

అంబేద్కర్ ప్రతిభాపాటవాల్ని - ఆయన బహుముఖ శాస్త్రపాం డిత్యాన్ని - ధైర్య సాహసాల్ని వాక్‌చాతుర్యాన్ని గాంధీజీ - కాంగ్రెస్ వారు పైపైకి మెచ్చుకొనే వారు. అంబేద్కర్ హిందూ సమాజానికి ఒక గట్టిసవాలు అని గుర్తించాడు గాంధీజీ. ఆయన నిజంగా "దేశభక్తుడని" గూడా గాంధీజీ అంగీకరించాడు. అయితే ఆయన చేపట్టిన పనులకు - విధానాలకు అడ్డు తగులుతుండేవాడు. గాంధీజీ గొప్పతెలివిగల వాడుకదా! గొప్పలౌక్యం యెరిగిన వాడుకదా! తానేమైన అంబేద్కర్‌ని వ్యతిరేకిస్తే తనను అంబేద్కర్ బహిరంగంగా తీవ్రంగా విమర్శిస్తాడని గాంధీజీకి తెలుసు కనుక ఆయనేమీ అంబేద్కర్‌ని అనేవాడుకాదు. కాంగ్రెస్ వారు అంబే ద్కర్‌ని బహిరంగంగా తీవ్రంగా విమర్శించేవారు. గాంధీజీకిమ్మనకుండా వుండిపోయే వాడు. ఇదంతా గాంధీజీపని అని అంబేద్కర్ గాంధీజీ మీదనే విరుచుకొని పడేవాడు! కాంగ్రెస్ నాయకులంటే అంబేద్కర్‌కు అసలు లెక్కలేదు. మొత్తం మీద హరిజనుల ఉద్ధారకుడిగా గాంధీజీకి పేరు రావా లని అటుగాంధీజీకి యిటు కాంగ్రెస్ వారికి తాపత్రయం కనుక అంబేద్కర్ హరిజన నాయకుడిగా ఎదగడం వారికిష్టం లేదు. నిమ్నజాతియుల ఉద్ధరణ విషయంలో అంతా తనదేనన్నది అంబేద్కర్ ధీమా.

కాంగ్రెస్‌వారు అంబేద్కర్‌కు పోటీగా జగ్జీవన్‌రామ్‌ని రంగంలోనికి తీసుకొచ్చారు. బాలూ రాజా వంటి ఆయన అనుచరుల్ని గూడా మెల్లగా లొంగదీసుకున్నారు. హరిజనుల్ని ఆకట్టుకొంటానికి - హరిజనుల్ని చీల్చటానికి గాంధేయులు పన్నిన కుట్ర అది. గాంధీజీకి - కాంగ్రెస్‌కు

అంగబలముంది - అర్థబలముంది. అంబేద్కర్‌కు కొంత అంగబలమున్నా అర్థబలం లేదుకదా. అయితే మనోబలం మాత్రము బాగా వుంది. ఈ విధంగా అంతటి గాంధీజీ - అంతటి కాంగ్రెస్ నాయకులు ఏకమై తన ఉద్యమానికి అడ్డంకులు సృష్టిస్తున్నా - తన లక్ష్యానికి అడ్డుపడుతున్నా - ఒక్కడే ఒంటరిగా మొక్కవోని మనోనిబ్బరంతో చెక్కుచెదరని గుండె ధైర్యంతో - అచంచల ఆత్మవిశ్వాసంతో - అసదృశ దీక్షతో - ముందుకు సాగాడు - ఉద్యమాల్ని నడిపాడు. విజయం సాధించాడు! అదీ అంబేద్కర్ ఘనత! అదీ అంబేద్కర్ ప్రత్యేకత! అదే అంబేద్కర్ ధీరత! అంబేద్కర్ "సూపర్" రాజకీయ నాయకుడు కాంగ్రెస్‌వారు అంబేద్కర్‌ని దేశద్రోహిగా - స్వాతంత్ర్య వ్యతిరేకిగా బ్రిటీషు వారితొత్తుగా చిత్రించి దుష్ప్రచారం చేసేవారు. ఈ ప్రచారమంతా ఆయన ఎదగకుండా చేయుటానికే. స్వతంత్ర భారతదేశంలోనే మా నిమ్నజాతీయుల సమస్యలు - హక్కులు పరిష్కరించుకొనగలమని అంబేద్కర్ నిర్ద్వంద్వంగా ప్రకటించాడు. ముందుగా డొమినియన్ స్టేటస్ యివ్వమన్నాడు. ఇన్నేళ్ళుగా దేశాన్ని పరిపాలిస్తున్నా బ్రిటీషు పాలకులు నిమ్నజాతీయులకు చేసిందేమీ లేదని గూడా నిర్భయంగా అడిగాడు. స్వరాజ్యం యివ్వవద్దని ఆయన బ్రిటీషు వారినెప్పుడూ కోరలేదు. స్వరాజ్యానికి వ్యతిరేకంగా గూడా ఆయన ప్రచారం చేయలేదు. స్వరాజ్య సాధన కంటే ముందు కుల నిర్మూలన ముఖ్యమన్నాడు. దేశ దాస్య విముక్తి కన్న తన నిమ్నజాతీయుల దాస్యవిముక్తి తనకు ముఖ్యమన్నాడు. తరతరాలుగా పశువులకన్న హీనంగా - నీచంగా - వెట్టిచాకిరి చేస్తూ - బ్రతుకులీడుస్తున్న తన జాతికి దాస్య విముక్తిలేనినాడు వారికి స్వాతంత్ర్యం ఉన్నా ఒకటే - లేకపోయినా ఒకటే! ఆ దృష్టితో ఆయన స్వరాజ్యం విషయంలో తటస్థంగా వుండిపోయాడు.

అంబేద్కర్‌ను కులతత్వవాదిగా గూడా విమర్శించేవారు. ఎప్పుడూ తన నిమ్నజాతుల వారి గొడవ - ఆయనకు యింకొకటిలేదని ఆయన పత్యర్థులు విమర్శించేవారు. నిజానికి యీ విమర్శలో అర్థంలేదు. వేలాది సంవత్సరాల నుండి తన నిమ్నజాతుల వారికి జరుగుతున్న అన్యాయాల్ని

గూర్చి చెప్పడం వారి వుద్ధరణకు ఆయన పూనుకోవడం తప్పా? కడు పుకాలుతున్నవాడు - "అయ్యా ఆకలి" అని అరుస్తుంటే వాడు వట్టి తిండిబోతు అని తిట్టినట్లుందీ వరస. కడుపు నొప్పితో బాధపడేరోగి - యేడుస్తుంటే - నీకేం రోగం లేదు నోరు మూసుకో అన్నట్లు వుందీవరస! ఇంతకీ ఉన్న రహస్యమేమంటే అగ్రకులాలవారు యీ కులాలెందుకు అని పైకి అంటారు. తమ కులం పదిలంగా వుండేందుకు జాగ్రత్తపడుతుంటారు. తక్కువ కులం వాడు యీ కులాల గొడవయెత్తితే వాడికి కులపిచ్చి అంటారు.

అయితే దేశ చరిత్రలో యీ యిరవయ్యో శతాబ్దం ప్రథమార్థంలో - స్వాతంత్ర్య ఉద్యమం ఒక ఉజ్జ్వల ఘట్టం. ప్రధాన ఘట్టం. దేశ చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించబడే పోరాటమది. అందులో ఆసేతు హిమాచల పర్యంతం చిన్నా పెద్దా పాల్గొన్నారు. ఆడా మగా పాల్గొన్నారు. కుల మత విభేదాలు మరిచి పాల్గొన్నారు. కమ్యూనిష్టులతో సహా అన్ని పార్టీలు పాల్గొన్నాయి. అనిబిసెంటు వంటి విదేశీయులు మనస్ఫూర్తిగా - చురుకుగా పాల్గొన్నారు. ఎందరెందరో సర్వస్వం త్యాగం చేసారు. ప్రాణాలు పోగొట్టుకున్నారు. ఈ స్వాతంత్ర్య పోరాట చరిత్రలో యెందరెందరో నాయకులు - యువక వీరుల పేర్లు వింటుంటాం. చదువు కొంటాం. మరి గొప్ప దేశభక్తుడు - జాతీయవాది, గొప్ప రాజకీయ నాయకుడు అయిన అంబేద్కర్ పేరు త్యాగధనులైన ఆ నాయకుల సరసన - ఆ వీరుల జాబితాలో కనిపించక పోయేసరికి ఆయన పేరు వినిపించక పోయేసరికి కాస్త బాధ వేస్తుంది. స్వాతంత్ర్యం యావత్ దేశానికి సంబంధించిన సమస్య కనుక స్వాతంత్ర్య పోరాటంలో అంబేద్కర్ గూడా అందరిలాగా పాల్గొని ఉడతాభక్తితో చేయూతనిచ్చి వుంటే ఆయన వ్యక్తిత్వం మరింతగా రాణించి వుండేదనిపిస్తుంది! అయితే యిప్పుడింకొకందుకు మాత్రం మహా సంతోషం వేస్తుంది! భారతీయుల అదృష్టం కొద్దీ - అంబేద్కర్ రాజ్యాంగ నిర్మాత అయ్యాడు. అందరి శ్రేయస్సు దృష్టిలో పెట్టుకొని - మన దేశాన్ని శ్రేయోరాజ్యంగా - లౌకిక రాజ్యంగా

- పార్లమెంటరీ ప్రజాస్వామ్య దేశంగా రూపుదిద్దాడు. ఆయన దేశభక్తిని - జాతీయతా భావాన్ని - లోకానికి రుజువుపరుచుచున్నాడు. దేశ చరిత్రలో తన పేరు సుస్థిరం చేసుకున్నాడు!

హరిజనులకు "సంరక్షకుడనని" చెప్పుకొనే గాంధీజీ - హరిజనుల ఉద్ధరణ చేస్తున్నామని చెప్పుకొనే కాంగ్రెస్ వారు - అంబేద్కర్ చేపట్టిన నిమ్నజాతుల ఉద్ధరణ ఉద్యమ కార్యక్రమాలకు చేయూత నివ్వకపోవడం దురదృష్టకరం. నిమ్నజాతీయులకు త్రాగటానికి మంచినీటికై మహద్ చెరువు విషయంలో - నిమ్నజాతీయులకు కాలారాయ్ దేవాలయ ప్రవేశ విషయంలో - నిమ్నజాతీయులకు ప్రత్యేక హక్కులు - రక్షణల విషయంలో అంబేద్కర్ చేపట్టిన ఉద్యమాలకు గాంధీజీగాని - కాంగ్రెస్ వారుగాని చేయూత నివ్వకపోగా - సానుభూతి ప్రకటించలేదు సరికదా! అడ్డు పడుతూ వచ్చారు. ఇది దురదృష్టకరమైన విషయం! బాధాకరమైన విషయం.!

ఆనాడు గాంధీజీయే కాదు. కాంగ్రెస్‌వారే కాదు - అంబేద్కర్ చేపట్టిన ప్రతి పనికి అడ్డు తగిలింది! ఈనాడు గూడా అంబేద్కర్‌ని విమర్శించేవారు, కొన్ని కులాల వారికి "రిజర్వేషన్లు" యెందుకని ప్రశ్నించేవారు వున్నారు! ఈ అంశాన్ని ఆవేశంతో - ద్వేషంతో - స్వార్థంతో కాదు సహృదయంతో - మానవతా దృక్పథంతో ఆలోచించాలి. ఈ దేశంలో పుట్టినవారందరూ సమానులే! కొందరు సుఖంగా - మరికొందరు నికృష్టంగా బ్రతకరాదు. దేశమాతకు అందరూ సమానులైన ముద్దుబిడ్డలే! పైగా సామ్యవాద సిద్ధాంతం ప్రకారం - ప్రజాస్వామ్య విధానంలో - అందరూ సమానులే! సంపన్నుల దగ్గర పన్నుల రూపంలో సొమ్ము వసూలు చేసి పేదల సంక్షేమం చూడాలి! "నేను కష్టపడి సంపాదించిన సొమ్ము పన్నులని నా దగ్గర వసూలు చేసి - వాడెవడో దిక్కుమాలిన పేదవాడికి ఖర్చు పెట్టడం న్యాయం కాదని" వాదిస్తే లాభంలేదు. అందరూ - ధనవంతుడూ - పేదవాడూ అన్న భేదం లేకుండా అందరూ గౌరవప్రదంగా సుఖంగా జీవించాలన్నదే సామ్యవాద సిద్ధాంతం, ప్రజాస్వామ్య

పద్ధతి! అందుకే అంబేద్కర్ అంటాడు - "రాజకీయ స్వాతంత్ర్యంతో పాటు సాంఘిక - ఆర్థిక రంగాలలో సమానత్వం నెలకొనకపోతే - యీ అసమానతలతో క్రుంగిపోతున్నవారు - సహనం నశించిపోయి తిరుగుబాటు చేసి తీరుతారు" అని హెచ్చరిస్తాడు. ప్రజాస్వామ్యం వర్ధిల్లాలంటే - అందరూ సుఖంగా బ్రతకాలి! వేలాది సంవత్సరాలనుండి అణగారిన దళితులకు కొంతకాలం "రిజర్వేషన్లు వుండాలి" అని గుర్తించాలి.

ఇంకో విషయం - గాంధీజీ -నెహ్రూలు తమతమ ఆత్మకథలు రాసుకున్నారు. అంబేద్కర్ తన ఆత్మకథ రాసుకోలేదు. ఆయన ఉపన్యాసాలు వ్యాసాలు-గ్రంథాలు రాయడంతోనే సరిపోయింది. ఏది ఏమైనా - గాంధీజీ నెహ్రూజీల జీవితాలు సాఫీగానే సాగాయి! వాళ్ళు ఆగర్భ శ్రీమంతులు. అంబేద్కర్ పుట్టు దరిద్రుడు. ఆయన జీవితం సాఫీగా సాగలేదు. అన్నీ బాధలే అన్నీ అవమానాలే! ఆయన ఎంచుకొన్నబాట ముళ్ళబాట - ఆ ముళ్ళబాటలోనే ఒంటరిగానే పయనించాడు. కష్టాల మెట్లపై నడిచాడు. అవమానాల సోపానాలపై అధిరోహించాడు! వీరునిలా విజయ శిఖరం అధిరోహించాడు. ఆయన జీవితం - ఆయన వుద్యమం అసాధారణమైనది. అరుదైనది.

అంబేద్కర్ బహుశాస్త్ర పండితుడు. బహుముఖ ప్రజ్ఞాశాలి. మరి గాంధీజీని బహుశాస్త్ర పండితుడు అనలేం. ఇద్దరూ బారిస్టర్లే! ఇద్దరూ న్యాయవాదులే. ఇద్దరూ శాంతిప్రియులే. సత్య సంధులే! త్రికరణ శుద్ధి కలవారు! ఆనాడు గాంధీజీయే కాదు. కాంగ్రెస్‌వారే కాదు- అంబేద్కర్ చేపట్టిన ప్రతి పనికి అడ్డు తగిలింది! ఈనాడు గూడా అంబేద్కర్‌ని విమర్శించేవారు. కొన్ని కులాల వారికి "రిజర్వేషన్లు" యెందుకని ప్రశ్నించేవారు వున్నారు! ఈ అంశాన్ని ఆవేశంతో - ద్వేషంతో - స్వార్థంతో ఆలోచించకూడదు. సావధానంగా - సానుభూతితో - సహృదయతతో - మానవతా దృక్పథంతో ఆలోచించాలి. ఈ దేశంలో పుట్టిన వారందరూ సమానులే! కొందరు సుఖంగా - మరికొందరు నికృష్టంగా బ్రతకరాదు. దేశమాతకు అందరూ సమానులైన ముద్దు బిడ్డలే! పైగా సామ్యవాద సిద్ధాంత ప్రకారం

- ప్రజాస్వామ్య విధానంలో - అందరూ సమానులే! సంపన్నుల దగ్గర పన్నుల రూపంలో సొమ్ము వసూలు చేసి పేదల సంక్షేమం చూడాలి! "నేను కష్టపడి సంపాదించిన సొమ్ము పన్నులని నా దగ్గర వసూలు చేసి- వాడెవడో దిక్కుమాలిన పేద వాడికి ఖర్చుపెట్టడం న్యాయం కాదని" వాదిస్తే లాభం లేదు. అందరూ - ధనవంతుడూ- పేదవాడూ అన్న భేదం లేకుండా అందరూ గౌరవప్రదంగా సుఖంగా జీవించాలన్నదే సామ్య వాద సిద్ధాంతం ప్రజాస్వామ్య పద్ధతి! అందుకే అంబేద్కర్ అంటాడు "రాజకీయ స్వాతంత్ర్యంతోపాటు సాంఘిక - ఆర్థికంగాలలో అసమానతలు నెలకొంటే - యీ అసమానతలతో క్రుగ్గిపోతున్నవారు - సహనం నశించి పోయి తిరుగుబాటు చేసి తీరుతారు" అని హెచ్చరిస్తాడు. ప్రజాస్వామ్యం వర్థిల్లాలంటే -అందరూ సుఖంగా బ్రతకాలి! వేలాది సంవత్సరాల నుండి అణగారిన దళితులకు కొంతకాలం "రిజర్వేషన్లు వుండాలి" అని గుర్తించాలి.

గాంధీజీ లౌక్యమున్నవాడు. అంబేద్కర్ అన్యాయాన్ని చూచి ఆవేశపడేవాడు! గాంధీజీ హిందువులకు - ముఖ్యంగా కాంగ్రెస్ వారికి ఏకైక నాయకుడు! అంబేద్కర్ నిమ్నజాతీయులకు యెదురులేని నాయ కుడు. ఇద్దరూ స్వాతంత్ర్యం కోరారు. ఇద్దరూ అస్పృశ్యుల ఉద్ధరణ కోరారు. ఇద్దరి ఆశయాలు ఒకటే - లక్ష్యాలు ఒకటే. అయితే- వారి ఆలోచనలు - అనుసరించిన మార్గాలు వేరు! స్వాతంత్ర్య సముపార్జన గాంధీజీ లక్ష్యం - తన నిమ్నజాతీయుల ఉద్ధరణ అంబేద్కర్ జీవిత ధ్యేయం! దేశ స్వాతంత్ర్య సముపార్జనకై గాంధీజీ నడిపిన ఉద్యమం అందులో ఆయన నిర్వహించిన పాత్ర నభూతో నభవిష్యతి! నిమ్నజాతీ యుల హక్కులకై అంబేద్కర్ నడిపిన ఉద్యమం - అందులో ఆయన నిర్వహించిన పాత్ర అనితర సాధ్యమైనది! గాంధీజీ భారత జాతిపిత! అంబేద్కర్ దళిత జాతిపిత. ఒకరు దేశ స్వాతంత్ర్య విజేత! మరొకరు దళిత జాతుల దాస్యం విముక్తి ప్రదాత. ఇద్దరూ భారతజాతి రత్నాలే! ఇద్దరూ అగ్రశ్రేణి నాయకులే! స్వాతంత్ర్యం విషయంలో బ్రిటీషు ప్రభు త్వాన్ని నీళ్ళు తాగించాడు గాంధీజీ! నిమ్నజాతుల హక్కుల విషయంలో

గాంధీజీని - కాంగ్రెస్‌ని బ్రిటీష్ వారిని నిద్రపోనీయలేదు అంబేద్కర్. గాంధీజీ రాజకీయాల్ని మతంతో ముడిపెట్టాడు. అంబేద్కర్ రాజకీయాలు సాంఘిక సమస్యలతో ముడిపడివున్నాయి!

అంబేద్కర్ అస్పృశ్యుడుగా పుట్టాడు. నిమ్నజాతుల దాస్య విముక్తికి పోరాడాడు. అగ్రకులంలో పుట్టిన గాంధీ అస్పృశ్యులకు "సంరక్షకుడ" నని (గార్డియన్) చెప్పుకున్నాడు. అంబేద్కర్ అస్పృశ్యుడుగా పుడితే - అస్పృశ్యతకు దత్తత పోయానంటాడు గాంధీజీ. ఇంకో జన్మ అనేది వుంటే హరిజనుడుగా పుట్టాలని కోరుకుంటున్నానని గాంధీజీ అంటాడు. హరిజనులకు ప్రత్యేక హక్కులు కల్పిస్తే ప్రాణ త్యాగం చేస్తానన్నాడు గాంధీజీ - కమ్యూనల్ అవార్డు ప్రకటించినప్పుడు ఆమరణ దీక్షగూడా చేసాడు ఆయన. "హరిజనులు" అని పేరు పెట్టినందుకే అంబేద్కర్ అభ్యంతరం లేవదీసాడు. భారతీయులందరూ దేవుని బిడ్డలేకదా! ఒక్క అస్పృశ్యులే దేవుని బిడ్డలా! అయితే వారినెందుకు ముట్టుకోరు - ఊళ్ళోకి రానీయరు అని అంబేద్కర్ నిలదీసాడు.

ఇద్దరూ దేశ సౌభాగ్యం - ప్రజాశ్రేయస్సు కోరినవారే. అయితే గాంధీజీ గ్రామాలు ముందు బాగుపడాలన్నాడు. కుటీర పరిశ్రమలు నెలకొల్పాలన్నాడు. ఆయన గ్రామ స్వరాజ్యాన్ని - రామ రాజ్యాన్ని గూర్చి చెప్పేవాడు. అంబేద్కర్ దీనిని వ్యతిరేకించాడు. గ్రామాలు కులతత్వంతో మూఢాచారులతో - భూస్వామ్య పెత్తందారీ విధానంతో కుళ్ళిపోయాని అంబేద్కర్ వాదన. దేశం పారిశ్రామికీకరణ జరిగినప్పుడే దేశం ప్రగతి బాటలో పయనిస్తుందని - ప్రజల జీవన ప్రమాణాలు మెరుగౌతాయని అంటాడు అంబేద్కర్.

ఇద్దరూ ఆస్తికులే - ఇద్దరూ మతవాదులే. అయితే గాంధీజీ సనాతన హిందూ ధర్మవాది. హిందూ మతాచార సంపన్నుడు. అంబేద్కర్ హిందూ మతాన్ని వ్యతిరేకించాడు. హిందూ శాస్త్రాల్ని విమర్శించాడు. హిందువుడిగా మరణించనని శపథం చేసాడు. బౌద్ధ మతం స్వీకరించాడు. ఆయన హేతువాది - మతవాది అయినా - దేవుడూ దయ్యాన్ని నమ్మ

లేదు. విగ్రహారాధనను - పూజా కర్మకాండను వ్యతిరేకించాడు.

ఇద్దరూ శీలవంతులే - ఇద్దరూ నిజాయితీ పరులే. ఇద్దరూ పట్టుదల కలవారే. దీక్షాదక్షులే! కార్యశూరులే! పట్టుదలలో ఒకరికి మించి మరొకరు. పట్టువిడుపులు విషయంలో అంబేద్కర్‌కన్న కాస్త గాంధీజీ నయం. పట్టుదల కలవాడు కనుకనే గాంధీజీ నాయకత్వాన స్వాతంత్ర్యం వచ్చింది. పట్టుదల కలవాడు కాబట్టే అంబేద్కర్ - గాంధీజీని - కాంగ్రెస్‌వారిని విమర్శించి - వారు ఎన్ని అడ్డంకులు పెట్టినా - ఒంటరిగా పోరాడి - నిమ్నజాతీయులకు హక్కులు - రక్షణలు సాధించి పెట్టాడు. ఆయన శీల వంతుడు శాస్త్రాలన్నీ బాగా చదివివున్నాడు కనుక గాంధీజీ గాని - కాంగ్రెస్ వారు గాని ఆయన్ని ఏమీ అనలేకపోయారు. ఏమి చేయలేకపోయారు. తరతరాలుగా అణగారిన తన జాతీయుల పట్ల ఆయనకున్న అభిమానం - వారి నుద్ధరించాలని ఆయనకున్న ప్రగాఢమైన ఆకాంక్ష - అందుకు ఆయనలో వున్న అచంచల ఆత్మ విశ్వాసం - మొక్కవోని ధైర్యం - చెక్కుచెదరని పట్టుదల స్వీయానుభవాల ఆవేదన - ఆవేశం - మొండి తనం - నిమ్నజాతీయుల ఉద్ధరణలో అంబేద్కర్ విజయం సాధించటానికి దోహదపడ్డాయి.

గాంధీజీని అంబేద్కర్ స్వయంగా కలుసుకున్న సన్నివేశాలు ఆయన జీవితంలో చాలా తక్కువ! వాటినివేళ్ళ మీదనే లెక్కపెట్టవచ్చు. రౌండు టేబులు సమావేశాలకు ముందు - రెండవ రౌండుటేబుల్ సమావేశ సమయంలో - సమావేశాలు ముగిసిన తర్వాత అల్పసంఖ్యాక వర్గాల హక్కుల విషయంలో - అస్పృశ్యుల దేవాలయ ప్రవేశ విషయంలో రంగయ్యర్ కేంద్ర శాసన సభలో ప్రవేశపెట్టిన బిల్లు విషయంలో గాంధీజీ ఆమరణ దీక్షబూనిన సందర్భంలో - పూనా ఒడంబడిక సందర్భంలో రాజ్‌కోట్ సంస్థాన వివాద పరిష్కార విషయంలో గాంధీజీ కోరిక మేరకే అంబేద్కర్ గాంధీజీని కలుసుకున్నాడు. గాంధీజీతో ఎంతగా భేదాభిప్రాయాలున్నా ఆయనతో ఆయా విషయాలు సవివరంగా చర్చించాడు. తన అభిప్రాయాలు - గాంధీజీకి నచ్చకపోయినా - ఆయన అంగీకరించకపోయినా - అంబేద్కర్

నిర్భయంగా విస్పష్టంగా - నిర్మొహమాటంగా గాంధీజీకి విశదపరిచాడు. అందుకే అంబేద్కర్ అంటే గాంధీజీకి అభిమానం! జవహర్‌లాల్ నెహ్రూ - సుభాష్ చంద్రబోస్ - రాజాజీ - పటేల్ వంటి హేమాహేమీలైన నాయకులు అంబేద్కర్‌ని కలుసుకున్నారు కాని ఆయన యెవరి చుట్టూ తిరగలేదు.

అంబేద్కర్ జీవిత చరిత్ర రాసిన ధనుంజయకేర్ - గాంధీజీ - ఈ అంబేద్కర్‌లను వసిష్ట- విశ్వామిత్రులతో పోల్చాడు. ఈ పోలిక సమంజసం. వశిష్టుడు అగ్రకులం వాడు (అస్పృశ్యకులస్థురాలైన అరుంధతిని వివాహ మాడాడనుకొండి). విశ్వామిత్రుడు శూద్రక్షత్రియుడు. వారిద్దరికీ బద్ధవైరం. బ్రహ్మర్షి పదవికోసం ఎన్నోసార్లు ఘోరతపస్సు చేసాడు విశ్వామిత్రుడు. వసిష్టుడు - ఆతనికి అనుకూలమైన దేవతాగణం విశ్వామిత్రుని తపస్సుకు భంగం కలిగించారు. అయితే పట్టుబట్టి ఘోర తపస్సు చేసి చివరకు బ్రహ్మర్షిపదవి సాధించేడనుకొండి! అలానే గాంధీజీ అగ్రకులజుడు - అంబేద్కర్ అస్పృశ్యుడు. నిమ్నజాతుల హక్కుల సాధన అంబేద్కర్ జీవితాశయము. ఇదివరలో మనం చెప్పుకున్నట్లు - గాంధీజీ - ఆయన చెప్పు చేతల క్రింద నడిచే కాంగ్రెస్ నాయకులు అంబేద్కర్ ఉద్యమానికి అడుగడుగున అడ్డు తగిలారు. పట్టుదలతో ఒక్కడే ఉద్యమాలు నడిపాడు. చివరకు అదృష్టవశాత్తు రాజ్యాంగ రచనా సంఘాధ్యక్షుడైనపుడు ఆయన ఆశించిన హక్కులు సాధించగలిగాడు. వసిష్టుడులాగా గాంధీజీ తెలివిగలవాడే కాదు లౌక్యమెరిగినవాడు. విశ్వామిత్రునిలా అంబేద్కర్ క్షణకాల ఆవేశపరుడు. దీక్షాదక్షుడు.

విచిత్రమైన సంఘటన ఏమిటంటే - అంబేద్కరుకు - కాంగ్రెస్ వారికి అసలు పడేది కాదుగదా! అంబేద్కర్‌కు భారత రత్న గౌరవ పురస్కారం 1990లో అంబేద్కర్ శత జయంతి ఉత్సవాల సందర్భంగా - కేంద్రంలో వున్న కాంగ్రేసేతర "నేషనల్ ఫ్రంట్" ప్రభుత్వం ఆయన మరణానంతరం అవార్డు ప్రదానం చేసింది. ఇది విచిత్రమైనా - దైవ సంఘటన! ఇంకో విషయం - చనిపోయిన వారు వేరే దేవలోకంలో

వుంటారన్నది హిందువుల నమ్మకం (అంబేద్కర్ దీనిని నమ్మలేదనుకొండి) ఒకవేళ ఆ దేవలోకంలో అంబేద్కర్ దివ్యాత్మ వుండివుంటే - యెవరైనాపోయి ఆయనకు భారతదేశ ప్రభుత్వం "భారత రత్న" గౌరవ పురస్కారం యిచ్చిందని చెప్పేరనుకొంటే గౌరవ బిరుదులు కాదు "నా నిమ్నజాతీయులకు భారత ప్రభుత్వం ఏమైనా మేలు చేసిందా! కులవ్యవస్థ కూలిపోలేదా! అస్పృశ్యత యింకా అట్లానే వుందా" అని మాత్రం ఆతురతతో అడుగుతాడని నాకనిపిస్తుంది.

ఈ సందర్భంలో చివరగా గాంధీజీ - కాంగ్రెస్ పార్టీవారు చేపట్టిన "హరిజన సేవ" గురించి ఒకటి రెండు మాటలు గూడా చెప్పుకోవాలి. గాంధీజీ - కాంగ్రెస్ వారి హరిజనసేవ - వాళ్ళు పేరుకోసం ప్రచారం తప్ప నిజంగా హరిజనులపై వాళ్ళకు ప్రేమ వుండికాదు అన్నది అంబేద్కర్ విమర్శ. అయితే అది పూర్తిగా నిజం కాదని చెప్పాలి. గాంధీజీ - కాంగ్రెస్ వారు అంబేద్కర్ ఆశించినంతగా హరిజన సేవ చేయకపోవచ్చు. అంబేద్కర్ కొన్ని సందర్భాలలో గాంధీజీ హరిజన సేవను మెచ్చుకొన్నాడు గూడా!

గాంధీజీ - కాంగ్రెస్ వారు తలపెట్టిన "హరిజన సేవ" చేయటానికి 'హరిజనసేవక్' సంఘంను స్థాపించారు. దానికీ జాతీయ స్థాయిలో థక్కర్ బాబా అధ్యక్షుడు. మన రాష్ట్ర సంఘానికి మాగంటి బాపినీడు అధ్యక్షుడు. ఈ సంఘం యొక్క ఉపసంఘాలు ప్రతిజిల్లాలోను పెట్టారు. హరిజనులను "అగ్రకులస్థుల" బావులలోని నీరు వాడుకొనే టట్లు చేయడం - గుళ్ళలోనికి ప్రవేశం గురించి శ్రద్ధ తీసుకొనడం- హరిజనవాడలు శుభ్రం చేయడం - హరిజనులకు "ఇళ్ళు" నిర్మించి యివ్వడం - స్కూళ్ళు పెట్టి హరిజన బాలబాలికలకు అక్షరాభ్యాసం చేయించడం ముఖ్య కార్యక్రమాలు. సనాతన అగ్రకులాల వారికి హరిజనులు మన సోదరులే అని నచ్చజెప్పడం గూడా ఒక ముఖ్య కార్యక్రమం. గాంధీజీ పిలుపు విని - హరిజన సేవక సంఘం వారు చేపట్టిన కార్యక్రమాల వల్ల - సనాతన హిందువులలో - అగ్రకులాల వారిలో కొంత చైతన్యం వచ్చిందని చెప్పవచ్చు.

మొదట్లో వారి కార్యక్రమాలకు అడ్డు తగిలిన సనాతన హిందువులు లేకపో లేదు. హరిజన సేవాకార్యక్రమాల్లో పాల్గొన్న అగ్రవర్ణాల వారిని - నానా బాధలు పెట్టిన సంఘటనలు లేకపోలేదు. స్వకులస్థులే. అట్టి సేవాకార్యక ర్తల్ని వెలివేసిన సంఘటనలు లేకపోలేదు. ఘర్షణలు జరిగిన సంఘటనలు లేకపోలేదు. గాంధీజీ తలపెట్టిన హరిజన సేవ విషయంలో గాంధీజీ ఆశించి నదానికంటే ఆయనకంటే గూడా అంకిత భావంతో ఆయన అంచనాలకు మించి కొందరు అగ్రవర్ణాలవారు - హృదయ పరివర్తనతో - విశాల భావంతో - బాధలకోర్చి "హరిజన" సేవ చేసారు.

ఆంధ్రా కోస్తా జిల్లాలలో గాందీజీ పిలుపు మేరకు కార్యక్రమాల్ని చేపట్టిన వారు - ఉత్తరాంధ్రలో సర్దార్ గౌతులచ్చన్న - సర్వశ్రీ కావలి నారాయణ - కొత్తపల్లి సోదరులు - నరసయ్య పున్నయ్యలు సాకేటి గురు వులు వసుమర్తి వీరభద్ర స్వామి ప్రముఖులు - గోదావరి మండలాలలో - ప్రముఖ కవి బోయి భీమన్న (వ్యవసాయ కూలీ పత్రిక) ఉంద్రు సుబ్బా రావు (హరిజన పత్రిక) బ్రహ్మ జోస్యుల సుబ్రహ్మణ్యం (గౌతమి ఆశ్రమం) మూర్తిరాజు, బి.యస్. మూర్తి టి.వి. రాఘవులు ముఖ్యులు - కృష్ణా గుంటూరు మండలాలలో సర్వశ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులు, వేముల కూర్మయ్య - ఆచార్య రంగా - వావిలాల గోపాలకృష్ణయ్య, నల్ల పాటి హనుమంతరావు (కృష్ణాశ్రమం) స్వామి సీతారాం, (వినయాశ్రమం) వడ్లమూడి ముక్తేశ్వర ప్రసాద్ - మంతెన వేంకటరాజు దాట్ల గురవరాజు అళ్ళ చెలమాదాసు - కొండా వేంకటప్పయ్య - ఆత్మకూరి గోవిందా చారి కావూరి వెంకయ్య, రాయలసీమ ప్రాంతంలో పొట్టి శ్రీరాములు - శాంతప్ప (మంత్రి లక్ష్మీదేవి తండ్రి) ఓరుగంటి వేంకట సుబ్బయ్య - లెదుకల్లు సదాశివన్ - నాగప్ప ముఖ్యులు - తెలంగాణా ప్రాంతంలో - బి.యస్. వేంకటరావు - అరిగేరామస్వామి - నములకంటి జగన్నాధం (ప్రముఖ రచయిత) యం.ఆర్. కృష్ణ - సుమిత్రాదేవి ప్రముఖులు. హరిజ నుల విద్యాభివృద్ధికి విశేషంగా కృషి చేసినవారు - విజయనగరం రాజావారు - పిఠాపురం రాజావారు రఘుపతి వెంకటరత్నం నాయుడు - రాంజీ

పంతులు - త్రిపురనేని సాధువమ్మ - ఏనుగు పట్టన్న (పట్టాభిరామిరెడ్డి) తిక్కవరపు రామిరెడ్డి గొట్టి ముక్కల వెంకన్న భాగ్యరెడ్డివర్మ ప్రభృతులు. ఇట్టి మానవతా మూర్తుల ద్వారా హరిజన సేవ కొంత నిజంగానే జరిగిందని చెప్పవచ్చు. వీరంతా ఎన్నో కష్టనష్టాలకోర్చి - అవాంతరాల నెన్నో అధిగమించి - అవమానాలు భరించి - తమ వంతుగా హరిజనసేవా కార్యక్రమాలు కొంత అంకిత భావంతో చేపట్టేరని చెప్పవచ్చు. అంబేద్కర్‌ని వ్యతిరేకించిన కాంగ్రెస్‌వారు తమ పాలనలో ఆయన యేర్పరచిన "రిజర్వేషన్లు" అమలుచేస్తూనే వచ్చారు. కాంగ్రేసేతర ప్రభుత్వాలు గూడా అమలు చేస్తున్నాయి. కేంద్రంలో జగజ్జీవనరామ్ "రైల్వే" మంత్రిగా వున్నప్పుడు ఉద్యోగాల విషయంలో "రిజర్వేషన్లు" అమలుపరచడంలో "నాంది" పలికాడు.

పైగా రాజ్యాంగబద్ధంగా లభించిన ప్రత్యేక సౌకర్యాలకు తోడు - యీనాడు అంబేద్కర్ ఆశయాల మేరకు -కేంద్రంలోగాని - రాష్ట్రాలలోగాని పాలన చేసిన చేస్తున్న - కాంగ్రెస్ కాంగ్రేసేతర ప్రభుత్వాలు - షెడ్యూల్డు కులాలు - తదితర బడుగు వర్గాల (ఎస్.టి.-బి.సి) వారి సర్వతోముఖాభివృద్ధి కొరకు - గృహవసతి - స్వయం ఉపాధి కల్పన వంటి వివిధ "సంక్షేమ" పథకాలు అమలు చేస్తున్న సత్యాన్ని గూడా మనం మరిచిపోగూడదు.

ఇకపోతే - 1948 జనవరి 30వ తారీఖున మహాత్మ గాంధీని - నాధూరామ్ గోడ్సే అనే ఆర్.యస్.యస్. కార్యకర్త పట్టపగలు పిస్తోలుతో కాల్చి చంపాడు. గాంధీజీ హత్య - దేశాన్నేకాదు. యావత్ ప్రపంచాన్ని ఆశ్చర్యంలో, దుఃఖ సాగరంలో ముంచివేసింది. డాక్టర్ అంబేద్కర్ స్వయంగా బిర్లాభవనానికి వెళ్ళి బాపూజీ భౌతికాయానికి శ్రద్ధాంజలి ఘటించాడు. ఆరోగ్యం బాగుండనందున - కాళ్ళనొప్పుల వలన - గాంధీజీ భౌతికకాయం వెంట కొంత దూరం మాత్రమే వెళ్ళి తిరిగి వచ్చాడు. రాజ్‌ఘాట్‌లో బాపూజీ అంత్య క్రియలకు బాబాసాహెబ్ అంబేద్కర్ స్వయంగా హాజరు కాలేకపోయాడు. బాపూజీ హత్య పట్ల తన ప్రగాఢ

సంతాపాన్ని సానుభూతిని ప్రకటించాడు.

## మహోన్నతవ్యక్తిత్వం

అంబేద్కర్‌ది నిండు విగ్రహం. గంభీరమైన ఆకారం. గుండ్రని ముఖం. విశాలమైన పాలభాగం (నొసలు) 5 అడుగుల 7 అంగుళాల ఎత్తైన మనిషి. ఎత్తుకు తగ్గలావు. శరీరపు రంగు బంగారపు ఛాయ అనలేముకాని ఛామనఛాయలో మెరుగు. గంభీరమైన ప్రశాంతమైన ముఖంలో కళ్ళు దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు కనిపిస్తాయి. మహారాష్ట్రీయుడు కనుక సహజంగా ధైర్యశాలి. పౌరుషవంతుడు. పైగా యిటు తండ్రి, తాత (తండ్రి తండ్రి) మిలిటరీ ఉద్యోగస్తులు. అటు తల్లి తరపువారు (తల్లి తండ్రి) మిలిటరీలో ఉద్యోగులు. క్రమశిక్షణతోపాటు స్వాభిమానం పట్టుదల ఆత్మవిశ్వాసం, ధైర్యసాహసాలు అంబేద్కర్‌కు జన్మతః అబ్బాయి. కనుకనే అంటరాని వాడిగా బాల్యంలో ఆయన పడ్డబాధలు మనోవ్యధలు అవమానాలు ఆయన్ని పిరికిపందను చేయలేకపోయాయి. ఆయన పరిస్థితులకు భయపడిలొంగిపో లేదు. రెట్టించిన స్వాభిమానం పట్టుదల ఆయన్ని మరింత ధైర్యవంతుణ్ణి చేసాయి. పరిస్థితులకు రొమ్మిచ్చి ఎదురొడ్డి ఆత్మవిశ్వాసంతో మనో నిబ్బ రంతో నిలువగల సత్తాశక్తి యిచ్చాయి. ఆయన ఆకారంలో పైకి డాంబికంగా - గంభీరంగా కనిపించేవాడు. అనారోగ్యంతో బాధపడుతూవుండేవాడు. కాని ఆయన మనోబలంగొప్పది. ఈ మనోబలంవల్లనే ఆయన ఎక్కువకాలం జీవించాడు. ఉద్యమాలు నడిపి విజయాలు సాధించాడు. పట్టుదలతో పెద్ద చదువులు చదవగలిగాడు. జీవితంలో అడుగడుగున తనను మనోవేద నకు గురిచేసినా అవమానాలతో క్రుంగదీసినా అస్పృశ్యతాదురాచారంమీద సమరం సాగించాడు. అసమానతలకు నిలయమైన హిందూమతం మీద హిందూ సమాజంమీద వీటికి మూలకారణమైన కులవ్యవస్థమీద బ్రాహ్మణా ధిక్యత మీద రాజీలేని పోరాటం సాగించాడు. నిమ్నజాతీయులు సమాజంలో గౌరవంగా సుఖంగా బ్రతికేందుకు జీవితాంతం పోరాటం సాగించాడు.

పట్టుదల జిజ్ఞాసవున్న వాడుకనుకనే యీ కులవ్యవస్థకు మూలకార

ణమేమిటని పరిశోధనలు చేసాడు. అస్పృశ్యతా దురాచారం ఎలావచ్చిందో పరిశోధనచేసాడు. శాస్త్రాలు- వేదాలు-పురాణాలు నిశితంగ పరిశీలించాడు. కులవ్యవస్థగుట్టు రట్టుచేస్తూ ఉపన్యాసాలు చేసాడు. వ్యాసాలు రాసాడు. గ్రంథాలు రాసాడు. ఆయన వ్యాసాలు - గ్రంథాలు - హేతువాద దృష్టితో - శాస్త్రీయ దృక్పథంతో - పరిశీలనా ధోరణిలో - విషయ పరిపుష్టితో నిండివుండేవి. ఆయన గ్రంథం వెలువడితే - తుఫాను వచ్చినట్లే! "హాట్ కేకుల్లా" అమ్ముడు పోయేవి - విమర్శలు - ప్రశంసలు కురిసేవి! దళితుల్ని తన రచనలు ద్వారా - తన ఉపన్యాసాల ద్వారా చైతన్యవంతుల్ని చేసాడు. సనాతన హిందువులకు కనువిప్పు కలిగించాడు.

భయమన్నది ఆయన జీవిత నిఘంటువులో లేదు. మొక్కవోని ధైర్యం చెక్కుచెదరని దీక్ష ఆయనకు వరసుగుణాలు. దానికి తోడు నిర్మొహమాటం - నిష్కర్ష, ఆయన సహజగుణాలైనాయి. మహాత్మాగాంధీ అంటే ఆరోజుల్లో భారతీయులకు ఆరాధ్యదైవం. నిమ్నజాతీయుల హక్కుల విషయంలో అంతటి గాంధీజీనే తీవ్రంగా విమర్శించాడు, ఎదిరించాడు. కాంగ్రెస్‌ను తీవ్రంగా విమర్శించాడు. నిమ్నజాతీయుల అభ్యున్నతికై ఒంటరిపోరాటం సాగించాడు. ఎన్నికష్టాలు వచ్చినా ఎన్ని అడ్డంకులు వచ్చినా తనను చంపుతామని సనాతన హిందువుల నుండి రోజూ బెదరింపులు వచ్చినా లెక్కచేయలేదు. మొక్కవోని ధైర్యంతో - ముందుకు సాగాడు. విజయం సాధించాడు. మనిషిని మనిషిగా గుర్తించని హిందూ మతస్థుడిగా పుట్టినా హిందూవుడిగా చావనని శపథం చేసాడు. శపథంచేసినట్లుగానే హిందూ మతం వదిలిపెట్టాడు. బౌద్ధమతం స్వీకరించాడు. అంబేద్కర్ స్వాభిమానం దీక్ష అంతటిగొప్పవన్నమాట.

ఆయన గొప్ప విద్యావేత్త. గొప్ప విద్యాప్రదాత! విద్యయొక్క విలువతెలిసిన వాడు కనుక విద్యాలయాలు నెలకొల్పాడు. ఆయనస్త్రీజన శ్రేయోభిలాషి - శ్రామికవర్గాల శ్రేయోభిలాషి బడుగువర్గాల బాంధవుడు.

ఆయనకు స్నేహితులు తక్కువ - నిమ్నజాతుల సమస్యలతో - రాజకీయాలతో క్షణం తీరికలేకుండా సమతమతమయ్యేవాడు. తీరిక చేసు

కొని పుస్తకాలు చదివేవాడు. ఏవో రచనలు చేసేవాడు. మరి స్నేహితులెలా వుంటారు. మనం గాంధీజీని త్రికరణ శుద్ధిగల నిజాయితీపరుడైన నాయ కుడిగా చెప్పుకొంటారు. మనసా వాచా కర్మణా నిజాయితీగా వుండడం త్రికరణ శుద్ధి అంటారు. ఆలోచించేది చెప్పేది చేసేది ఒకేవిధంగా వుండ డమే త్రికరణ శుద్ధి అంటారు. ఈ త్రికరణ శుద్ధి విషయంలో గాంధీజీకి అంబేద్కర్ ఏమాత్రం తీసిపోడు. గాంధీజీని శాంతిప్రియునిగా, అహిం సావాదిగా, సత్యశీలునిగా చెప్పుకొంటారు. ఈ గుణాలలోను అంబేత్కర్ గాంధీజీని ఏమాత్రం తీసిపోడు. కనుకనే అంబేద్కర్‌కు కమ్యూనిష్టు విప్ల వపంధా నచ్చలేదు. ముస్లింల-సిక్కుల హింసాధోరణి నచ్చలేదు. బుద్ధుని అహింసావిధానం సచ్ఛీలం ఆయనకు బాగానచ్చాయి. అందుకే చనిపోయే ముందు బౌద్ధమతం స్వీకరించాడు. ఆయనకు ఏ దురభ్యాసాలు లేవు. పొగత్రాగేవాడు కాదు. మద్యంసేవించేవాడు కాదు. ఆయనకు వంచన మోసం అంటే గిట్టేవికావు. కల్లాకపటంలేని మనిషి. నిర్మొహమోటంగా నికచ్చితంగా-నిర్భయంగా మాట్లాడడం ఆయన స్వభావం. వ్రాసినా అంతే

ఆయన నిజాయితీని నిస్వార్థపరత్వాన్ని ఆయన ప్రత్యర్థులు గూడా మెచ్చుకొనేవారు. ఆయనకు దేవుళ్ళమీద విగ్రహారాధన మీద కర్మసిద్ధాంతం మీద నమ్మకంలేదు. అయితే ఏదో మానవాతీత దివ్యశక్తి (అలౌకిక శక్తి) ఒకటున్నదన్న నమ్మకమున్నవాడు. ఆయనకు రెండు మూడు సార్లు ప్రాణాపాయస్థితి ఏర్పడింది. ఆరోగ్యం బాగుండేది కాదు. ఆయన్ని చంపు తామని రోజూ బెదిరింపులు వచ్చేవి. ఆయన వాటిని లెక్కచేయలేదు. ఏదో అలౌకికశక్తి తనను కాపాడుతున్నదన్న నమ్మకం వుండేది. మతం అనేది మనిషిని సహృదయునిగా శీలవంతునిగా చేస్తుందని ఆయన దృఢవిశ్వాసం. ఆయన మతవాది. నాస్తికుడు కాదు. ఆస్తికుడు. హేతువాది. కనుకనే బౌద్ధమతం స్వీకరించాడు.

అంబేద్కర్ దూరదృష్టికలవాడు. పాకిస్థాన్ విభజన గురించి, దేశవి భజన జరిగిన తర్వాత రెండు దేశాలమధ్య తలయెత్తనున్న సంఘర్షణల గురించి భాషా ప్రయుక్త రాష్ట్రాల గురించి - సంస్థానాలు రద్దుచేసి సంస్థా

నాధీశ్వరులకు చెల్లించే నష్టపరిహారం (పెన్షన్ - రాజభరణాలు) గురించి అంబేద్కర్ యెంతో ముందుగానే వూహించి చెప్పాడు. ఆయన వూహాలు దరిమిలా నిజమయ్యాయి.

తనకు గురువులు ముగ్గురని అంబేద్కర్ తరచుగా తన మిత్రులతో చెబుతూండేవాడు - బుద్ధుడు - భక్తకబీరు - జోతిబాపూలే - హేతువాద దృక్పథం - సత్ప్రవర్తన - భూతదయ - యీ మూడు గుణాలకు అధి కప్రాధాన్యత యిస్తుంది బౌద్ధం. కనుక బుద్ధడంటే ఆయనకు భక్తిభావం! పోతే అంబేద్కర్ తండ్రి కబీర్‌పంథీ. కబీరు గూడా మానవులంతా ఒకటే అందరూదేవుని బిడ్డలు అందరూ సమానమే అని బోధిస్తాడు. కనుక కబీర్ అంటే గురుభావం. జ్యోతిబాపూలే గొప్ప సంఘసంస్కర్త. అనాధలకు అస్పృశ్యులకు - సేవచేసినవాడు పూలే. కనుక యీ ముగ్గురు అంబే ద్కర్‌కు గురువులయ్యారు. కనుకనే హేతువాద దృక్పథం, మత విశ్వాసం మానవతా దృక్పథం అహింసావిధానం దీన జనసేవ అంబేద్కర్ జీవితంలో పెనవేసుకొనిపోయాయి.

అలాగే - విద్య - స్వాభిమానం - శీలం - యీ మూడు తనకు ఆరాధ్య విషయాలని చెప్పేవాడు. విద్య మనిషికి జ్ఞానోదయం గలిగిస్తుంది. వెలుగుబాటలో నడిపిస్తుంది. విద్యయొక్క విలువ తెలిసినవాడు కనుకనే ఆయన ఉన్నత విద్యనభ్యసించాడు. కనబడిన ప్రతి మంచిపుస్తకం కొని చదివేవాడు. గ్రంధపఠనం ఆయన నిత్యకార్యక్రమం. గ్రంథరచన ఆయన నిత్య కృత్యం. ఆత్మాభిమానం-శీలం ఆయనకు రెండు కండ్లు వంటివి. ఈ రెండూ లేకపోతే - మనిషికి - పశువుకు తేడా లేదని ఆయన నమ్మకం. స్వాభిమానం - శీలం సత్‌ప్రవర్తన గురించి తన జాతివారికి తన సహచరులకు ఎప్పుడూచెబుతూవుండేవాడు. ఆయన స్వాభిమానంతో-శీలవంతుడిగానే జీవితాంతం మెలిగాడు. కనుక ఆయన ప్రత్యర్థులు గూడా ఆయన శీలాన్ని ఏనాడూ శంకించలేదు.

అలానే ఫ్రెంచి విప్లవానికి స్ఫూర్తినిచ్చిన వాల్తేరు - రూసోలు - నీగ్రోల హక్కుల గురించి పోరాడిన బూకర్ వాషింగ్‌టన్ - అబ్రహాం

లింకన్‌లు - కమ్యూనిష్టు సిద్ధాంతకర్త కారల్‌మార్క్స్, ఫ్రెంచినేత నెపోలియన్ - బ్రిటన్ రాజకీయ చతురుడు చర్చిల్- ప్రముఖ బ్రిటీషు రచయిత - బెర్నాడ్‌షా - తత్వవేత్త రాబర్ట్‌యింగ్‌ర్సాల్ - వీరందరి ప్రభావం అంబేద్కర్ మీద వుంది. రెనడే తిలక్‌ల ప్రభావం గూడా ఆయనమీద వుంది!

ఆయన గొప్పవక్త! ఆయన మాట్లాడితే సభికులు మంత్రముగ్ధులై వినేవారు. కుల వ్యవస్థనకు - హిందూ శాస్త్రాల్ని విమర్శిస్తే - వడగళ్ళ వాన పడ్డట్టుండేది! శాసనసభలో - పార్లమెంటులో ఆయన మాట్లాడితే - ఆయన వాక్ చాతుర్యానికి - వాదనా పటిమకు - విషయ పరిజ్ఞానానికి అందరూ మెచ్చుకొనేవారు.

ఆయన శాంతి ప్రియుడేకాదు. దయార్ద్రహృదయుడు. దయనీయ స్థితిలో పేదవారు, దళితులు ఆయన దగ్గరకు వచ్చివారి కన్నీటి కష్టాలుచెబుతూవుంటే ఆయన గుండె కరిగిపోయేది. కంటతడిపెట్టుకొనేవాడు. కష్టంలోవున్నవారిని ఆదుకొనేవాడు. మొదట్లోకాలేజి అధ్యాపకుడిగా జీతంలో కొంతభాగం నిమ్నజాతుల వారికోసం పత్రికలు నడపడానికి ఖర్చుపెట్టేవాడు. న్యాయవాదిగా - నిరుపేద వారికి తన నిమ్నజాతులవారికి ఉచితంగా కేసులు కోర్టుల్లో వాదించేవాడు. కాలం విలువ-డబ్బు విలువ తెలిసిన వాడు అంబేద్కర్. కాలం వృధాచేయని వాడు. వృధాగా డబ్బు ఖర్చుచేసేవాడు కాదు. గతించిన కాలంమరలా రాదుగదా! డబ్బు సంపాదన ఎంతకష్టం! కనుక కాలాన్ని-డబ్బును సద్వినియోగం చేయడంలో గాంధీజీతో పోల్చవచ్చు. గాంధీజీ గూడా కాలం విలువ డబ్బువిలువ యెరిగి మెలిగేవాడు. అంబేద్కర్ గొప్ప సంఘ సంస్కర్త. సమాజంలోని మూఢ నమ్మకాలపై ధ్వజమెత్తాడు. మత ఆచారాన్ని గుడ్డిగా ఆచరించవద్దని పదేపదే చెప్పేవాడు. విగ్రహారాధనని ఆయన ఖండించాడు. పునర్జన్మ - కర్మకాండ సిద్ధాంతాన్ని ఆయన వ్యతిరేకించాడు. అవతార సిద్ధాంతాన్ని నిరసించాడు. హేతువాదాన్ని ప్రోత్సహించాడు. మనిషి మనిషిగా గౌరవప్రదంగా జీవించాలని యెప్పుడూ నొక్కి చెప్పేవాడు.

ఎంతటి విశిష్ట గుణసంపన్నుడైనా అంబేద్కర్‌లో కొన్ని విలక్షణాలు

లేకపోలేదు. చల్లనివెన్నెలనిచ్చే చందమామలో నల్లని మచ్చల్లా గొప్పగొప్ప నాయకులందరిలోను ఏవేవో చిన్న చిన్నలోపాలు వుంటూనే వుంటాయి. ఒకనాయకుని మంచి గురించి చెప్పుకొన్నప్పుడు ఆయనలోని చెడునిగూడా చెప్పుకోవాలి. అది నిష్పక్షపాతమైన పద్ధతి. అంబేద్కర్ శాంతి ప్రియుడు, అయినా మహాఆవేశపరుడు. గాంధీజీ హరిజన సేవవిషయంలో కులవ్యవస్థ విషయంలో బ్రాహ్మణాధిక్యత విషయంలో నిమ్నజాతీయులకు జరుగుచున్న అన్యాయాల విషయంలో ఆయన ఆవేశపడేవాడు. ఉద్రేకపడేవాడు. ఊగిపోయేవాడు! పుస్తకం కనిపించకపోయినా చెప్పిన పని కాకపోయినా మహాచెడ్డకోపం వచ్చేది. ఈ ఆవేశం! యీ ముక్కోపం ఒక్క క్షణకాలం పాటే! నెహ్రూ గూడా యిలానే ముక్కోపి! ఆవేశపరుడు! అలానే ఆయన అహంభావి అని గర్విష్టి అని ఆయన అనుచరులే అనేవారట.

కారల్‌మార్క్స్ అంటే అంబేద్కర్‌కు వల్లమాలిన అభిమానం! అయితే కమ్యూనిష్టు సిద్ధాంతానికి హింసావాదానికి ఆయన వ్యతిరేకి! సనాతన హిందూమతం అంటే ఆయనకు ద్వేషం! బ్రాహ్మణాధిక్యత అంటే ఆయనకు ఒళ్ళుమంట. హిందూమహాసభనాయకులు ముంజేఅంటే వీరసావర్కర్ అంటే ఆయనకు అభిమానం. సావర్కర్ మంచివాడే. మూంజే ఆయన్ని మోసం చేసాడు. ఆయన్ని ప్రోత్సహించి మాస్టార్లు బ్రాహ్మణులు. ఆయనకు సలహాదారులు కొందరు బ్రాహ్మణమిత్రులు.

విగ్రహారాధన ఆయన వ్యతిరేకించాడు. కాని బుద్ధుని విగ్రహం ముందు కూర్చొని గంటల తరబడి ధ్యానంలో మునిగి పోయేవాడు. బ్రాహ్మణ ద్వేషి అయిన అంబేద్కర్ బ్రాహ్మణ స్త్రీని రెండవపెండ్లి చేసుకున్నాడు. సన్నిహిత సహచరులు అందుకు అంగీకరించక దూరమయ్యారు. చివరకు కుమారుడు గూడా అలిగిపోయాడు.

ఆయన సంగీత ప్రియుడు. వయోలిన్ వాయించడం గూడా నేర్చుకున్నాడు. కబీర్ పాటలు బుద్ధుని త్రిచరణాలు మెల్లగా పాడేవాడు. ఆయన పాడితే గంధర్వగానంలా వుండేదట. ఆయనకు చిత్రకళ అంటేగూడా సరదా! చర్చిల్ లాగా! కొన్ని చిత్రాలు గూడా గీసాడు. శిల్పకళాప్రియుడు.

మంచి కళాఖండాల్ని, వేలాది గ్రంధాలు సేకరించాడు. ఆయన గృహమే ఒకపెద్దగ్రంథాలయం! ఇంట్లో ఉన్నంతసేపూ చదవడం రాయడం ఆయన నిత్యకృత్యం. భార్యాబిడ్డల కన్న పుస్తకాలే తనకు ప్రాణప్రదమని ఆయనచెప్పేవాడు. గ్రంథపఠనంలో మునిగిపోయి నపుడు ఏదైనాగ్రాసుకొనేటప్పుడు చుట్టూవున్న ప్రపంచాన్ని మరిచిపోయేవాడు. నిద్రాహారాలు పట్టించుకొనేవాడు కాదు. ఆయన దగ్గరున్న వెలకట్టటానికి వీలులేని పుస్తకాల్ని కొంటామని మదనమోహన మాలవ్య - బిర్లా వంటివారు వచ్చి హెచ్చుమొత్తం ధనం యివ్వజూపారు. కాని ప్రాణం కన్న మిన్నగా పుస్తకాల్ని చూచుకొనే అంబేద్కర్ వాటిని అమ్మటానికి నిరాకరించాడు. దరిమిలా తన పుస్తకాల్ని తాను స్థాపించిన కళాశాలలకు ఉచితంగా యిచ్చివేశాడు. ఆయన కథలు రాయకపోవచ్చు. కవిత్వం రాయకపోవచ్చు. నవలలు రాయకపోవచ్చు. కవి కాకపోవచ్చు. సాహిత్యవేత్తకాకపోవచ్చు. అయినా సమకాలీన సామాజిక రాజకీయ ఆర్థిక సమస్యలపై పెద్దగ్రంథాలు రాసాడు. ఎన్నోవ్యాసాలురాసాడు. ఆయన రాజకీయ నాయకుడే కాదు. రాజనీతిజ్ఞుడు. ఆయన గొప్పన్యాయవాది మాత్రమేకాదు. గొప్పన్యాయశాస్త్రవేత్త! గొప్ప రాజ్యాంగనిపుణుడు. ఆయన గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త. సామాజిక శాస్త్రవేత్త. గొప్పవిద్యావేత్త. విద్యాప్రదాత! బహుగ్రంథకర్త! గొప్ప వక్త! వ్యక్తిపూజను నియంతృత్వపాలనను వ్యతిరేకించిన ప్రజాస్వామికవాది. ప్రతిదాన్ని గుడ్డిగా నమ్మవద్దనే హేతువాది! హిందూ మతాన్ని హిందూసమాజాన్ని సంస్కరించటానికి కృషిచేసిన సంస్కరణ వాది. మనిషి మనిషిగా బ్రతకాలనేమానవతావాది! మహామేధావి. బహుముఖ ప్రజ్ఞాశాలి. సూక్ష్మగ్రాహి, దూరదృష్టికలవాడు. జిజ్ఞాసువు. విజ్ఞాననిధి-నిత్యపరిశోధకుడు-నిరంతర కృషీవలుడు. క్రియాశీలి. కార్యదక్షుడు. ఉద్యమనేత-ప్రజాసేవకుడు-ప్రజానాయకుడు. గొప్ప జర్నలిస్టు దేశంలోనేకాదు - ప్రపంచంలోనే వేళ్ళమీద లెక్కపెట్ట దగ్గ బహు కొద్ది మంది మహామేధావులలో అంబేద్కరొకడు! ఆయన్ని నడిచే విజ్ఞాన సర్వస్వంగా గూడా చెప్పకోవచ్చు. ఆయన మట్టిలో మాణిక్యం! మురికి మడుగులో పుట్టిన పంకజం (పద్మం) ఆయన ఆదర్శప్రాయుడు మార్గదర్శి! శాంత విప్లవ జ్యోతి! ఆయన ఒక వ్యక్తికాదు. ఆయన ఒక మహా శక్తి!! ఒక

సంస్థ! ఒక పెద్ద వ్యవస్థ! ఆయన మానవతకు మరోపేరు! తాడిత పీడిత ప్రజాశ్రేయస్సు ఆయనకు ప్రాణం! ఉద్యమం ఆయునకు ఊపిరి! ఆయున "సూపర్" రాజకీయనాయకుడు.

మనమిక్కడ పదేపదే చెప్పుకున్నట్లు తరతరాల నుండి సమాజం నుండి వెలివేయబడి అంటరాని వారిగా దాస్యవృత్తులు చేసుకుంటూ పశువులకన్నా హీనంగా - నీచంగా దయనీయంగా - బ్రతుకు లీడుస్తున్న తన స్వజాతీయుల ఉద్ధరణకే అంబేద్కర్ ప్రాధాన్యతనిచ్చి వుండవచ్చు. అందుకు పోరాటం సాగించియుండవచ్చు. కులవ్యవస్థ అస్పృశ్యతల కారణంగా ఆయున హిందూ సమాజాన్ని - హిందూ ధర్మ శాస్త్రాల్ని విమర్శించి యుండ వచ్చు. వాస్తవానికి ఆయన కుల మత రహిత సమ సమాజాన్ని గూర్చి కలలు కన్నాడు. అన్ని కులాల వారికి అన్ని భాషల వారికి అన్ని వర్గాల వారికి అన్ని మతాల వారికి - నిమ్నజాతుల వారికి - బడుగు వర్గాల వారికి - అల్పసంఖ్యాక వర్గాల వారికి - స్త్రీలతో సహా శ్రామికులతో సహా - అందరికీ సమాజంలో సమానమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు గౌరవప్రదమైన స్థానం, సుఖప్రదమైన జీవితాలు ఆకాంక్షించియున్నాడు. అదే విధంగా రాజ్యాంగాన్ని రూపొందించియున్నాడు. సర్వేజనాః సుఖినోభవంతు అన్న ధర్మసూత్రానికనుగుణంగా ఆయన విచక్షత లేకుండా అందరి సుఖం ఆశించాడు. భారతీయులందరూ భరత మాతకు సమానమైన ముద్దుబిడ్డలేనన్న భావంతో ఆయన రాజ్యాంగాన్ని రాసాడు. ఒకే ప్రజ - ఒకే దేశం - ఒకే న్యాయం అన్న ధ్యేయంతో దేశస్థులందరు ఒకే ఒక విధమైన న్యాయం - సమానత్వం - స్వేచ్ఛ - సౌభ్రాతృత్వం - కలిగి జీవించేలా మనదేశాన్ని పార్లమెంటరీ ప్రజాస్వామ్యంగా రూపుదిద్దాడు. హిందూ సమాజంలో ఉచ్ఛనీచాలు ఉన్నాయి. కనుకనే వాటిని తొలిగించటానికి కృషి చేశాడు. మన భారతీయ సంస్కృతికి విఘాతం కలగకుండా మన హిందూ శాస్త్రాల మూలధర్మాలకు దెబ్బతగలకుండా వుండటానికే ఆయున కృషి చేసాడు. కనుకనే ఆయన మతం మార్చుకున్నా ఏ యితర మతం కాకుండా హిందూ మత సంస్కృతికి సన్నిహిత సంబంధం వున్న బౌద్ధ

మతాన్నే స్వీకరించాడు. మన దేశం ప్రపంచంలోనే అతి పెద్ద సుస్థిర ప్రజాస్వామ్య దేశంగా రూపుదిద్దాడు. ఆయన కేవలం దళిత జాతుల నాయకుడేకాదు. దళిత జాతి రత్నమేకాదు. భరతమాత చూచి మురిసిపోయి గర్వించిన ముద్దుబిడ్డ! భారతీయులు గర్వించదగ్గ అగ్రశ్రేణి నాయకుడాయన ఆయన నవభారత రాజ్యాంగ నిర్మాత మాత్రమే కాదు ఆయన నవభారత నిర్మాతలలో (One of the Builders of Modern India) ఒకరు. కనుకనే ఆయన్ని భారత ప్రభుత్వం 'భారతరత్న' గా గౌరవించింది. అంబేద్కర్ నిజంగా - ముమ్మాటికి "భారత జాతిరత్నం."

సనాతన హిందువులు అంబేద్కర్‌ని "హిందూమత ద్వేషి"గా చిత్రించారు. కాంగ్రెస్ వారు ఆయన్ని "దేశ ద్రోహి"గా స్వాతంత్ర్య వ్యతిరేకిగా బ్రిటీష్ ప్రభుత్వపు తొత్తుగా చిత్రించారు! కాని ఆయన్ని అందరూ "అభినవమనువు" అని "నవభారత రాజ్యాంగ నిర్మాత " అని "దళిత జాతుల విమోచకుడు రక్షకుడు" అని "దళిత జాతుల ఆశాజ్యోతి" అని శ్లాఘించారు. భారతీయ జఫర్‌సన్ అని కొందరన్నారు. స్త్రీ దాస్య విమోచకుడని కొందరన్నారు. కార్మిక శ్రేయోభిలాషి అని కొందరన్నారు. "నా మంత్రి వర్గంలో మేలిముత్యం" అని నెహ్రూ ఆయన్ని అందరికీ పరిచయం చేసేవాడు. సరోజినీనాయుడు ఆయన్ని "మొస్సాలినీ"గా అభివర్ణించేది! మహారాష్ట్ర ప్రభుత్వం ఆయన్ని "జస్టిస్ ఆఫ్ పీస్" (శాంతి సంరక్షకుడు) గా 1931లోనే సన్మానించింది! కొందరాయన్ని జమదగ్ని మహర్షితో పోల్చారు. బౌద్ధమతం పునరుద్ధరించడంలో ఆయన అశోక చక్రవర్తిని తలపింప చేస్తాడని కొందరభిమానులు అనేవారు. ఇస్రాయేలీయులను ఈజిప్టు నుండి పాలస్తీనాకు నడిపించిన 'మోజెస్' లా తాను తన నిమ్నజాతి వారిని దాస్య జీవితం నుండి గౌరవ ప్రదమైన జీవితంలోనికి తీసుకొచ్చానని అంబేద్కర్ స్వయంగా చెప్పుకున్నాడు. ధనంజయ కేర్ ఆయన్ని మహోత్ముడిగా - భారత్ భూషణ్‌గా - విశ్వభూషణ్‌గా రమాబాయి - రాంజీ సక్పాల్‌ల పద్నాల్గవ పుత్రరత్నం (చౌదావె రత్న) దళితజాతిరత్నగా వెలుగొందాడు. భారతరత్నగా గౌరవింపబడ్డాడు. భారత

జాతిరత్నగా భాసిల్లుతున్నాడు. మనం మొదట చెప్పుకున్నట్లు ఆయన గొప్ప వాడుగా పుట్టలేదు. ఆయన్ని యెవరూ గొప్పవాడిగా చేయలేదు! ఆయనే స్వయం ప్రతిభతో స్వయం కృషితో ఆత్మవిశ్వాసంతో దీక్షతో, తలవంచని రాజకీయ యోధుడిలా, జీవితాంతం పోరాడాడు. అనుకున్నది సాధించాడు. గొప్పవాడయ్యాడు. ఆయన జీవితం భారతదేశ చరిత్రలో సువర్ణఅక్షరాలతో లిఖింపబడుతుంది. ఆయన జీవితం ఆదర్శవంతమైనది. ఆయన ధన్యుడు. నిమ్న జాతీయులు అదృష్టవంతులు. ఆయన్ని కన్న భారతభూమి ధన్యత చెందింది.

## అంబేద్కర్ జీవితం నుండి నేర్చుకొనదగిందేమిటి?

పాఠకులారా! మనం అంబేద్కర్ జీవితం గురించి తెలుసుకున్నాం. ఆయన జీవిత ఆశయమేమిటో, ఆయన సాధించిందేమిటో తెలుసుకున్నాం. ఆయన విశిష్ట వ్యక్తిత్వం గురించి గూడా తెలుసుకున్నాం. ఇకపోతే, ఆఖరుగా అంబేద్కర్ జీవితం నుండి మనం ముఖ్యంగా విద్యార్థులు, యువతరం నేర్చుకొనదగిందేమిటి? అని తెలుసుకోవలసిన అవసరం ఏంతేని వుంది! ఆయన జీవితం నుండి ఎవరైనా బోలెడంత నేర్చుకోవలసింది వుంది. ఏమిటది అంటారా -

అంటరాని ఒక అనామకుడు కేంద్రంలో అమాత్యవర్యుడైనా డంటే మాటలా! ఒక నిరుపేదవాడు నవ భారతరాజ్యాంగ నిర్మాత అవటం మాటలా! మరికారణం! విద్య - దీక్ష - ఆత్మవిశ్వాసం - లక్ష్యసాధనకై నిరంతర పోరాటం!

ఎన్నో కష్టాలు పడి ఉన్నతవిద్యనేర్చాడు. విద్య పూర్తి చేసిందాక రాజకీయాల జోలికి పోలేదు. కనుక నేటి విద్యార్థులు కూడా విద్య యొక్క విలువ, ప్రాముఖ్యత గుర్తించాలి. బాగా చదువుకోవాలి! భర్తృహరి ఏమన్నాడు - "విద్య నిగూఢ గుప్తమగువిత్తము.... విద్య నృపాల పూజితము. విద్య నెరుంగనివాడు మర్త్యుడే" అన్నాడుకదా! విద్య వుంటే గొప్పనిధి వున్నట్లే. విద్యాధికుడు రాజపూజితుడు. కనుక అంబేద్కర్

లాగా ప్రతివారూ ముందు విద్యావంతులు కావాలి. ఆయన నిరుపేద వాడైనా, వాళ్ళ నాన్న పట్టుదల వలన, ఆయనకు చదువులందు ఉన్న శ్రద్ధ వలన బాగా చదువుకున్నాడు. బరోడా మహారాజావారు ఆయనకు సహాయ పడ్డాడనుకోండి. ఆనాడు ప్రభుత్వం వారి "ఉపకారవేతనాలు" లేవు. కాని యీనాడు - దళితులకు (ఎస్.సిలకు) (యస్. టీలకు) బడుగు వర్గాల వారికి (బి.సీ.లకు) ప్రభుత్వం ఉపకారవేతనాల నిస్తుంది. పేదవారైన అగ్రవర్ణాల పిల్లలకు (ఓ.సి.లకు) కూడా ప్రభుత్వం సహాయం చేస్తుంది. ప్రతిభగల విద్యార్థులకు "ప్రతిభ ఉపకారవేతనాలు" (Merit Scholar Ship) (మెరిట్ స్కాలర్‌షిప్) ఇస్తుంది. స్కూళ్ళు, కాలేజీలు కూడా యిప్పుడు ప్రతిచిన్న పట్టణంలోను వున్నాయి. కనుక ముందు ప్రతియువకుడు విద్యావంతుడు కావాలి. ఈనాడు విద్యార్థులు "రాజకీయాలలో" తలదూర్చి చదువులు చెడగొట్టుకుంటున్నారు. వారి భవిష్యత్తు పాడుచేసుకుంటున్నారు. లాలాలజపతిరాయ్ వంటి వారు ఆయన అమెరికాలో విద్యార్థిగా ఉన్నప్పుడు, దేశస్వాతంత్ర్యం కోసం అంబేద్కర్‌ని రాజకీయాలలోనికి రమ్మన్నాడు. విద్య పూర్తి అయ్యే వరకు తాను రాజకీయాలలోనికి రానని కరాఖండీగా చెప్పాడాయన. కనుక విద్యార్థులుగూడ రాజకీయాల జోలికి పోకుండా ముందు చదువులపై ధ్యాస పెట్టి బాగా చదువుకొనాలి.

అంబేద్కర్ పట్టుదల గురించి, ధైర్యం గురించి, ఆత్మ విశ్వాసం గురించి చెప్పకున్నాం. పట్టుదల వుండబట్టే ఆయనంత గొప్పవాడయ్యాడు. ప్రతివాడు ముఖ్యంగా యువతరం పట్టుదల, ధైర్యం, ఆత్మవిశ్వాసం అలవరుచు కోవాలి! భర్తృహరి పద్యం గుర్తులేదా! "తనిసిరే వేల్పులు దధి రత్నములచేత - వెరచిరే ఘోర కాకోల విషముచేత, విడిచిరే యత్నమమృతంబు వొడయు దనుక నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు" అని చెప్పాడు. దేవదానవులు అమృతంకోసం సముద్రాన్ని మధించినప్పుడు, కాలకూట విషం పుట్టింది! రత్నరాసులు (లక్ష్మి) పుట్టుకొచ్చాయి. దేవతలు రత్నరాసులకోసం ప్రాకులాడలేదు. కాలకూట విషం చూచి భయపడలేదు.

అమరత్వాన్నిచ్చే అమృతం పుట్టేదాకా సముద్రాన్ని మథించారు. అట్లాగే భర్తృహరి యింకో పద్యం "ఆరంభింపరు.... ప్రజ్ఞానిధుల్ కావునన్" గుర్తు కురావడం లేదా! ఎన్ని కష్టాలొచ్చినా వెరవక, రెట్టించిన ఉత్సాహంతో "ధీరులు" తాము ప్రారంభించిన కార్యం విజయవంతంగా పూర్తిచేస్తారని ఆ పద్యంలోని అర్థం. అంబేద్కర్ కూడా, తాను ప్రారంభించిన ఉద్యమం, పోరాటం, చేపట్టిన కార్యక్రమం ఎన్ని కష్టాలొచ్చినా జంకక పట్టుదలతో ధైర్యంతో ఒంటరిగా ముందుకు సాగి విజయం సాధించాడు. అలాగే ప్రతి యువకుడు, పట్టుదల, ఆత్మవిశ్వాసం, ధైర్యం, సాహసం అలవరుచుకోవాలి. అప్పుడే ప్రతివారు ఎంత కష్టమైన పని అయినా చేయగలరు! గొప్పవారు కాగలరు!

అంబేద్కర్ శీలానికి, సత్ప్రవర్తనకు, క్రమశిక్షణకు, నిజాయితీకి స్వాభిమానానికి ఎంతో ప్రాముఖ్యం యిచ్చాడు. శీలం, స్వాభిమానంలేని మనిషి జీవచ్ఛవం అన్నాడు. మనిషికి, పశువుకి తేడా శీలం ఒక్కటే! "శీలము తలదన్ను సిరిసంపదలు లేవు. శీలమును జయించు క్షితిపణిలేదు. నరుని శీలమొకటె నరశేఖరుని చేయు" అని వార్లవారన్నారు. అంబేద్కర్ శీలవంతుడు కనుకనే, అంత ధైర్యంగా, గాంధీజీని తీవ్రంగా విమర్శించ గలిగాడు. గాంధీజీ, క్రీస్తు, బుద్ధుడు, రామకృష్ణ పరమహంస, - వీరంతా శీలవంతులే! కనుకనే గొప్పవారయ్యారు. కనుక ప్రతియువకుడు కూడా శీలవంతుడుగా, సత్ప్రవర్తన గల్గిన నిజాయితీపరుడుగా రూపుదిద్దుకోవాలి. అప్పుడే ఎవరికైనా సంఘంలో గౌరవం వుంటుంది. గొప్పవారు కావచ్చు. కాలం విలువ, డబ్బువిలువ యెరిగిన వాడు అంబేద్కర్. సద్వినియోగ పరి చినవాడు. చాలామంది ముఖ్యంగా విద్యార్థులు-యువకులు పనీపాట లేకుండా స్నేహితులతో రోడ్లవెంట తిరుగుతుంటారు. సినిమాలకు, హోటళ్ళకు డబ్బు తగలేస్తారు. కాలం, డబ్బు మరలారాదు. అంబేద్కర్‌లా కాలాన్ని, డబ్బుని సద్వినియోగం చేసుకోవాలి. అట్టడుగు సమాజంలో పుట్టి-అష్టకష్టా లుపడి-అవమానాలు పొంది ఆ కష్టాలు-ఆ అవమానాలు-మెట్లుగా- సోపానా లుగా చేసుకొని-ఆత్మవిశ్వాసంతో-పట్టుదలతో కీర్తి శిఖరాలకు అధిరోహించిన

అంబేద్కర్ జీవితం-నేటి యువతరానికి ఆదర్శవంతమై మార్గదర్శకమైన స్ఫూర్తినిస్తుందనడంలో ఎట్టి అనుమానంలేదు.

అంబేద్కర్‌ని ఎవరైనా ఆదర్శంగా తీసుకుని, విద్యావంతులైతే, పట్టుదల, స్వాభిమానం, ధైర్యం, సత్ ప్రవర్తనగల్గి మెలిగితే గొప్ప దేశనాయకులు కావచ్చు. జీవితంలో స్థిరపడిన ఆయారంగాలలో ప్రతివారు మంచివారుగా, గొప్పవారుగా పేరు పొందవచ్చు. ఈ విధంగా ఉడుతాభక్తి దేశసేవ చేయవచ్చు. దేశానికి తమ వంశానికి కీర్తితేవచ్చు.

ఈ గ్రంథం విన్న వారిలో, చదివినవారిలో కొందరైనా అంబేద్కర్‌ని ఆదర్శంగా తీసుకుని జీవించి గొప్పవారైతే నాయీ కృషికి అర్థం వుంటుందని, నా కృషి ఫలిస్తుందని హృదయపూర్వకంగా ఆశిస్తున్నాను. నే చెప్పిన (వ్రాసిన) అంబేద్కర్ జీవితం ఓపికగా విన్నందుకు (చదివినందుకు) శ్రోతల్ని (పాఠకుల్ని) మనసారా అభినందిస్తున్నాను! శుభం.

మూఢవిశ్వాసాలు - ఆచారాల్ని వ్యతిరేకించుట-కుల నిర్మూలన-ప్రతిమనిషికీ సమాజంలో గౌరవప్రదమైన స్థానం-సుఖదాయకమైన జీవితం-ప్రజాస్వామ్య విలువలు-యివి మనం డా. అంబేద్కర్ నుండి నేర్చుకొనవలసిన ముఖ్య విషయాలు.

పంచముల ముక్తికై
పంచాననమై గర్జించాడు
పిడుగువలె రాపిడి చేసాడు
భావిదిగంతాల మెరుపై మెరిశాడు
అంబేద్కర్ దళిత శోషిత వర్గాలకు
ఆశావాణిగా నిలిచాడు

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి

# అనుబంధం-I

## అంబేద్కర్ రచనలు

నిమ్నజాతీయుల ఉద్ధరణ ఉద్యమాల్లోను, రాజకీయాల్లోనూ క్షణం తీరికలేకుండా ఉన్నా, అంబేద్కర్‌కు రోజూ చదవడం, రాయటం చాలా యిష్టమైన పని అని తెలుసుకున్నాం. ఆయన చాలా గ్రంధాలు రాసా డని తెలుసుకున్నాం. ఆయన వాటిని ప్రచురించాడు కూడా. వీటికితోడు ఆయా విషయాలపై, ఆయా బహిరంగ సభల్లో, పార్లమెంటులో ఆయన చేసిన ఉపన్యాసాలు, మొత్తం కలిపి మహారాష్ట్ర ప్రభుత్వం వారు యిప్ప టికి పది, పదకొండు సంపుటాలుగా ప్రచురించారు. అందుకు మహారాష్ట్ర ప్రభుత్వాన్ని తప్పక అభినందించవలసి వుంది.

ఆయన హిందూ మతం మీద, కులవ్యవస్థమీద, అస్పృశ్యతమీద, సమకాలీన సామాజిక సమస్యలమీద, దేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక, సమస్యలమీద రచనలు చేసాడు. ఆయన చేసిన రచనల్లో కొన్ని ముఖ్యమైన వాటి గురించి మనమిప్పుడు క్లుప్తంగా తెలుసుకుందాం! నేటి విద్యార్థులు విద్యాబుద్ధులు నేర్చి, పెరిగి పెద్దయిన తర్వాత, ఆయన రచనలలో మంచి చెడ్డల్ని తెలుసుకోవచ్చు. ఆయన భావాలు, ఆలోచనలు, తమ సమకాలీన సమాజానికి యెంత వరకు ఉపయోగపడతాయో ఆలోచించుకుని, వాటిని ఆచరణలో పెట్టటానికి వారప్పుడు కృషి చేయవచ్చు. విద్యాధికులైన పెద్దవారు-ఆసక్తి కలవారు ఆయన రచనల్ని చదివి వాటిలోని మంచిచెడ్డల్ని నిగ్గుతేల్చవచ్చు. మంచిని ఆచరించవచ్చు.

### ఏన్నిహిలేషన్ ఆఫ్ కాస్ట్ (Annihilation of Caste)

దీనిని మనం తెలుగులో కులనిర్మూలన అని అనవచ్చు. పంజాబ్‌లోని లాహోరులో జాత్‌పాత్ తోడక్ మండల్ (కులనిర్మూలనా సంఘం) అనే సంస్థ ఒకటి ఉండేది. హిందూ సమాజంలోని కులమత విభేదాలను నిర్మూలించాలని ఈ మండలివారి ముఖ్యమైన ఆశయం. సదరు మండలి

వార్షికోత్సవ మహాసభలకు అధ్యక్షత వహించి ఉపన్యసించవలసిందిగా అంబే ద్కర్‌ను మండలివారు కోరారు. అయిష్టంగా అంగీకరించి తన ప్రసంగ వ్యాసాన్ని నెలరోజులు చాలా కష్టపడి తయారు చేసుకున్నాడు. ఆయన భావాలు తీవ్రంగా వుంటాయని అందరికీ తెలుసు కనుక ఆయన వ్యాసాన్ని ముందుగా చూడాలని మండలివారు అంబేద్కర్‌ని కోరారు. తన ప్రసంగ వ్రాత ప్రతిని మండలి వారికి పంపేడు అంబేద్కర్. హిందూమతాన్ని, హిందూ సమాజాన్ని, కులవ్యవస్థని అంబేద్కర్ తీవ్రంగా విమర్శించడం మండలి సభ్యులలో చాలామందికి నచ్చలేదు. ప్రసంగ వ్యాసంలోని కొన్ని భాగాలు మార్చమని ఆయన్ని కోరారు. ససేమిరా అని అందుకాయన ఒప్పుకోలేదు. ఒక కామాగూడా తీసివేయనన్నాడు. తమ సంస్థ వార్షికో త్సవాన్ని నిరవధికంగా వాయిదా వేసుకున్నారు మండలివారు. అంబేద్కర్ స్వయంగా 1936లో దీనిని మరింత పెంచి గ్రంథ రూపంలో ప్రచరించాడు. భారతదేశంలోని వర్ణ (కుల) వ్యవస్థపై ఇది గొప్ప పరిశోధక రచనగా పేరుపొందింది. బహుళ ప్రచారం పొందిన గ్రంథమిది. అనేక భారతీయ భాషలలోనికి తర్జుమా చేయబడిన గ్రంథం. "హరిజన" పత్రికలో గాంధీజీ దీనిని విమర్శించాడు. అంబేద్కర్ గాంధీజీ విమర్శకు తగిన విధంగా సమా ధానమిచ్చాడు. అంబేద్కర్ యీ గ్రంథంలో హిందూ సమాజాన్ని నిశి తంగా విమర్శించాడు. హిందూ సమాజంలోని ఉన్నత స్థాయిలో నున్న కొంతమంది తెలివిగల వారు, క్రింది స్థాయిలో నున్న అజ్ఞానవంతులు, అమాయకులైన వారిని తమ ఇష్టానుసారం అణచిపెట్టి, వారిచేత ఊడిగం చేయించుకొంటానికి స్వార్ధ దృష్టితో యీ కుల వ్యవస్థను కల్పించారని అంబేద్కర్ వాదన. భగవద్గీతలో చెప్పినట్లు రక్తస్వచ్ఛతను నిలబెట్టటానికి కులవ్యవస్థ అవసరమని అనడం సబబు కాదంటాడు. పంజాబులోని బ్రాహ్మ ణుడికి మద్రాస్‌లోని బ్రాహ్మణుడికి రక్త సంబంధమేమిటని ప్రశ్నిస్తాడు. అలాగే పంజాబులోని బ్రాహ్మణుడికి పంజాబులోని దళితుడికి జాతి భేద మెక్కడని అడుగుతాడు. కుల వ్యవస్థను శ్రమ విభజనతో (వృత్తి విభజన) ముడిపెట్టడం సరికాదంటాడు. చేసే పనిని (వృత్తి)ని బట్టి శ్రమ విభజన, కులవ్యవస్థ ఏర్పడితే, మరి పుట్టుక నుండి కులం పేరుతో విడదీసి,

ఉచ్ఛనీచ భావం చూపడమెందుకని నిలదీస్తాడు అంబేద్కర్. బ్రాహ్మణా ధిక్యతను, హిందూశాస్త్రాల్ని తీవ్రంగా విమర్శిస్తాడు. హిందూ సమాజం కులాల సముదాయం అంటాడు. కులం హిందువుడికి (సవర్ణ హిందువుడికి) ఒక అమూల్యసంపద, ప్రాణప్రదం అని విమర్శిస్తాడు. కుల వ్యవస్థ వ్యక్తి స్వేచ్ఛను, హేతువాదాన్ని, నైతికశక్తి, వ్యక్తి శక్తి సామర్థ్యాల్ని నాశనం చేస్తుందంటాడు. జాతిని నిర్వీర్యం చేస్తుందని, దేశాన్ని అనైక్యం చేస్తుందని ఆయన అంటాడు. వర్ణాంతర వివాహాలే కులవ్యవస్థ నిర్మూలనకు సరైన ఒకే ఒక మార్గమని అంబేద్కర్ నిర్ద్వంద్వంగా చెపుతాడు.

అంబేద్కర్ భగవద్గీతను "తప్పులతడక" గా విమర్శిస్తాడు. హిందువులకు గీత పరమ పవిత్రమైనది. ప్రామాణికమైనది. ఆదిశంకరాచార్యులు వంటివారు దీనికి భాష్యం రాసారు. ఎందరో విదేశీయులు గీతను మెచ్చుకున్నారు. గాంధీజీ "గీత నాకు మాత" అన్నాడు. మనువును ఒక సాంఘిక వ్యతిరేక-సాంఘిక విధ్వంసకవ్యక్తిగా అంబేద్కర్ విమర్శిస్తాడు. వేద వేదాంగాల్ని- ఉపనిషత్తుల్ని-శ్రుతి స్మృతుల్ని ఇతిహాసాల్ని విమర్శిస్తాడు. హేతవాదం-నైతిక విలువలు లేని హిందూశాస్త్రాల్ని సమూలంగా సంస్కరించినప్పుడే కుల వ్యవస్థ నిర్మూలింపబడుతుందంటాడు. కుల వ్యవస్థ శ్రమ విభజన (వృత్తి) మాత్రమే కాదు. అది శ్రామికుల విభజన (కులాలు) గూడా అని అంటూ-శ్రమ విభజన మంచిదైనా శ్రామికుల విభజన వ్యక్తి అభిరుచి-శక్తి సామర్థ్యాలు దెబ్బతింటాయని అంటాడు. అంటే నిర్బంధవృత్తి విధానం వలన-కుటుంబ ఆర్థిక పరిస్థితి - సామాజిక ఆర్థిక పరిస్థితి దెబ్బతింటుందని అంటాడు. చివరకు స్వరాజ్య సాధనకంటే కుల నిర్మూలన ముఖ్యమంటాడు అంబేద్కర్ గీతను మనువును విమర్శించడం సాహసోపేతమైనదని చెప్పవచ్చు. కులం పునాదుల మీద మీరు దేన్నీ నిర్మించలేరు. ఒక జాతిని నిర్మించలేరు. ఒక నీతిని నిర్మించలేరు. హిందూ మతంలో కులాలు నిలిచి ఉన్నంత కాలం హిందూమతం ప్రచారక మతం ఎన్నటికీ కాజాలదు.... హిందూ సమాజం కుల రహిత సమాజం అయినప్పుడు మాత్రమే అది తనను తాను రక్షించుకునే శక్తినీ, సామ

ర్యాన్ని సంతరించుకోగల దంటాడు అంబేద్కర్. అంబేద్కర్ ఉద్దేశ్యంలో స్వరాజ్య సాధన కంటే కుల నిర్మూలన ఎక్కువ ముఖ్యం. తన "కుల నిర్మూలన" గ్రంథంలో అంబేద్కర్ ఆలోచనలు ఇలా సాగుతాయి!

## థాట్స్ ఆన్ పాకిస్థాన్

దేశ స్వాతంత్ర్యం కోసం గాంధీజీ నాయకత్వంలో కాంగ్రెస్ వారు దేశవ్యాప్తంగా పెద్ద ఉద్యమాన్ని లేవ దీసారు. చివరకు దేశానికి స్వాతంత్ర్యం ఇచ్చేందుకు బ్రిటీషు వారు సూత్రప్రాయంగా అంగీకరించారు. దేశస్వాతంత్ర్యం కోసం గాంధీజీకి, కాంగ్రెస్ వారికి అండగా నిలిచిన ముస్లిం లీగు వారు ఉన్నట్టుండి జిన్నా నాయకత్వంలో ముస్లింలకు ప్రత్యేక దేశం కావాలని భారతదేశాన్ని చీల్చి పాకిస్థాన్ స్వతంత్ర దేశాన్ని గుర్తించాలని ఆందోళన లేవదీసారు. దేశ విభజన రాజకీయ నాయకులు, రాజకీయ పండితులు రకరకాల అభిప్రాయాలు వ్యక్తం చేసారు. దేశ విభజనమో-దేశ వినాశనమో తేల్చుకోవాలంటాడు జిన్నా. దేశాన్ని విభజించేముందు నా శరీరాన్ని రెండు ముక్కలుగా కోసినా అంగీకరిస్తాను. కాని దేశాన్ని మాత్రం విభజించటానికి నా గొంతులో వూపిరుండగా నేనేమాత్రం అంగీ కరించనని గాంధీజీ ప్రకటించాడు. చివరకు దేశ విభజనకు గాంధీజీయే ముఖ్యకారకుడని అంబేద్కరంటాడు. స్వాతంత్ర్య ఉద్యమంకన్న దేశ విభజన ఉద్యమం తీవ్రతరమైనది. కాంగ్రెస్ వారికిది తలనొప్పిగా తయారైనది. నెహ్రూ పటేల్‌లు పాకిస్థాన్ యివ్వమంటారు.

అంబేద్కర్ కూడా 1940లోనే కానున్న దేశవిభజనపై పాకిస్థాన్ అవతరణపై, దేశవిభజన వలన మంచి చెడులపై ఈ గ్రంథం రచించాడు. దీనిని తన మొదటి భార్య రమాబాయికి అంకితం యిచ్చాడు. సమకా లీన దేశపరిస్థితులు ఇందులో చర్చించాడు. దేశ విభజన జరిగితే దేశ భవిష్యత్తు గురించి తన అభిప్రాయాలు నిర్భయంగా నిర్ద్వంద్వంగా వెలి బుచ్చాడు. కాంగ్రెస్, ముస్లింలీగు వారి మధ్య జరిగిన చర్చల గురించి గాంధీజీ, జిన్నాల మధ్య జరిగిన సంభాషణల మంచి చెడ్డల గురించి యీ

గ్రంథంలో చర్చించాడు. కాంగ్రెస్ పార్టీలోని అంతర్గత విభేదాలు కాంగ్రెస్ నాయకుల పెత్తందారీ ధోరణి కాంగ్రెస్ పార్టీ ఒంటెద్దు పోకడలు- మహమ్మదీయులను సంఘటిత పరిచాయని ఆయన వివరించాడు. ముస్లింలలో ఉన్న ఐక్యతా భావం అందుకు దోహదపడిందని ఆయన చెప్పాడు. నెహ్రూ-పటేల్-రాజాజీ వంటి కాంగ్రెస్ నాయకులు జిన్నాను లెక్కచేయ లేదు. అందువల్లనే-జిన్నా కాంగ్రెస్ వారిని యెదిరించాడు. ముస్లింలు అధికంగా వుండే దేశ వాయవ్య ప్రాంతాన్ని-ఈశాన్య ప్రాంతాన్ని విడదీసి స్వతంత్ర దేశం కావాలని జిన్నా పట్టుబట్టాడు. మహమ్మదీయులలో "ఇస్లాం" మతాభిమానం స్వజాతి అభిమానం చాలా యెక్కువ కనుక జిన్నా నాయకత్వంలో "పాకిస్తాన్" ఉద్యమం ఉధృతరూపం దాల్చింది. దానితో గాంధీజీ నాయకత్వాన సాగుతున్న దేశ స్వాతంత్ర్య పోరాటానికి యెదురు దెబ్బ తగిలింది. దేశవిభజన (పాకిస్తాన్) ఉద్యమంలో బ్రిటీషు పాలకుల అదృశ్య హస్తం గూడా వుంది. "విభజించి పాలించు" అన్నది బ్రిటీషు వారి యెత్తుగడకదా!

మహమ్మదీయులు జాతిపరంగా వేరు. మతపరంగా వేరు! వారి ఆచార వ్యవహారాలు వేరు. కనుకవారు పాకిస్థాన్ కోరుతున్నారని అంబేద్కర్ అన్నాడు. తమ మత విశ్వాసాలవల్ల మహమ్మదీయులు భారతదేశాన్ని తమ మాతృ భూమిగా భావించరని అంటాడు. దేశ విభజన జరిగినా రెండుదేశాల మధ్య సరిహద్దు గొడవలు తలయెత్తుతూనే వుంటాయి. రక్తపాతానికి దారితీసే సమస్యలు ఉత్పన్నమౌతూ ఉంటాయి. దేశ విభజన జరిగిన కొంత కాలానికి ఉభయ షక్షాలు పశ్చాత్తాపం చెందుతాయి. మహమ్మదీయుల కోరిక ప్రకారం పాకిస్థాన్ యివ్వడం మంచిదంటాడు. లేకపోతే రక్తపాతం తప్పదంటాడు.

హిందువుల్ని, కాంగ్రెస్ వారిని, ముస్లింవారిని, వారి నాయకుల్ని అంబేద్కర్ నిశితంగా విమర్శించాడు. దేశంలో యీ గ్రంథం పెద్ద తుఫాను లేవదీసింది. కొందరు అంబేద్కర్ వెలిబుచ్చిన భావాలను మెచ్చుకుంటే, మరికొందరు విమర్శించారు. హిందూ, ముస్లింల మధ్య నలిగి

పోతున్న దళిత జాతుల దయనీయ స్థితిని అంబేద్కర్ చక్కగా వివరించాడు. మహమ్మదీయుల కోరికల్ని కాంగ్రెస్ వారు గాంధీజీ తీరుస్తారు కాని నిమ్నజాతీయుల హక్కుల్ని మాత్రం కాదంటారు అని విమర్శించాడు.ఈ గ్రంథాన్ని సవాలు చేస్తూ డాక్టర్ రాజేంద్రప్రసాద్ "ఇండియా డివైడెడ్" (India Divided) అనే ఒక గ్రంథం వ్రాసాడు. ఇతరులు గూడా రాసారు.

## వాట్ కాంగ్రెస్ అండ్ గాంధీ హేవ్ డన్ టు ది అన్‌టచబుల్స్

దీనిని మనం "కాంగ్రెస్ - గాంధీ అస్పృశ్యులకు చేసిందేమిటి?" అని తెలుగులో చెప్పకోవచ్చు. ఇది 1945లో ప్రచురించబడింది. కాంగ్రెస్ వారు, గాంధీజీ అస్పృశ్యులకు చెప్పకోదగిన సేవ ఏమీ చేయలేదనే అంబేద్కర్ వాదన. ఇందులో కాంగ్రెస్ పార్టీవారు మొదట నుండి నిమ్నజాతుల పట్ల చూపుతూ వచ్చిన సవతి ప్రేమను సోదహరణంగా వివరించాడు. రెనడే చేపట్టిన నిమ్నజాతుల సంస్కరణలను తిలక్ ఆయన అనుచరులు వ్యతిరేకించారని విమర్శించాడు. అగ్రవర్ణాల వారికి అధికారం కట్టబెట్టటానికి స్వాతంత్ర్యం అడుగుతున్నారు కాంగ్రెస్‌వారు కాని వారి హరిజన సేవ ఒక బూటకమంటాడు. గాంధీజీకి ముందు అసలు కాంగ్రెస్ వారు హరిజనుల సమస్యలే పట్టలేదన్నాడు. గాంధీజీ వచ్చి హరిజన సేవ పేరిట హరిజనుల్ని పైకి రాకుండా అణగదొక్కేందుకు ప్రయత్నించారంటాడు. ఖద్దరు తప్పక కట్టితీరాలని ప్రతి కాంగ్రెస్ కార్యకర్తకు నియమం పెట్టింది కాంగ్రెస్. అలానే ప్రతి కాంగ్రెస్ కార్యకర్త అస్పృశ్యతను టించనని నియమమెందుకు పెట్టలేదంటాడు. గాంధీజీ హరిజనులతో కలసిమెలసి తిరిగాడు. మరుగు దొడ్లు శుభ్రం చేసాడు. హరిజన వాడల్లో (భంగీలు) బస చేసాడు. అస్పృశ్యత పోవాలని కాంగ్రెస్‌వారు, గాంధీజీ, హరిజన సేవా సంఘల ద్వారా పెద్ద ప్రచారం చేసారు. గాంధీజీ కులనిర్మూలన కోరలేదని, వర్ణాశ్రమ ధర్మాల్ని సమర్ధించాడని అంబేద్కర్ విమర్శించాడు. దళితులకు ప్రత్యేక రాజకీయ హక్కులను ప్రత్యేక నియోజక వర్గాలను గాంధీజీ,

కాంగ్రెస్ వారు వ్యతిరేకించారని విమర్శించాడు. మహమ్మదీయులు కోరిన కోర్కెలన్నీ గాంధీజీగాని, కాంగ్రెస్ వారుగాని కాదనలేదు. చివరకు దేశాన్ని విభజించి పాకిస్థాన్ యిస్తానికి కూడా సిద్ధపడ్డారు. కాని నిమ్నజాతుల వారికి ప్రత్యేక హక్కులు, రక్షణలు కల్పించటానికి గాంధీజీ కాంగ్రెస్ వారు వ్యతిరేకిస్తున్నారు అని విమర్శించాడు అంబేద్కర్. హరిజనుల పట్ల గాంధీజీది - కాంగ్రెస్ వారిది "కపట ప్రేమ" అని అభిప్రాయ పడతాడు. గాంధీజీ దళితులకు నిజమైన ప్రధమ విరోధి అని అన్నాడు. దళితుల ఓట్లకోసం రాజకీయ లబ్ధి కోసం వారిని కాంగ్రెస్ వారు బుట్టలో వేసుకుంటానికి ప్రయత్నిస్తున్నారని విమర్శించాడు. హిందూ సమాజంలో దళితులు సవర్ణ హిందువులతోపాటు సమాన గౌరవంగా సాటి సోదరులుగా జీవించడం కాంగ్రెస్ వారికి, గాంధీజీకి నిజంగా యిష్టంలేదని విమర్శించాడు. అస్పృశ్యుల సాంఘిక, రాజకీయ హక్కుల కోసం తన నాయకత్వంలో నిమ్న జాతీయులు చేపట్టిన ఉద్యమాలు, పోరాటాలు, అంబేద్కర్ యీ గ్రంథంలో వివరించాడు. గాంధీజీ ఆశయం ప్రకారం, ప్రజలంతా గ్రామ ప్రాంతాలకు తరలివెళ్ళి ఎవరి వృత్తులు - వారు చేసుకోవాలి. అంటే గాంధీజీ కుల వృత్తుల్ని, కుటీర పరిశ్రమల్ని, ప్రోత్సహించాడు. కాని ఆధునిక యాంత్రిక యుగంలో పరిశ్రమల్ని ప్రోత్సహించక పోవడం పెద్ద తప్పిదమని అంబేద్కర్ అభిప్రాయపడ్డాడు. అంటే గాంధీజీ హిందూ సమాజాన్ని - ఆటవిక - అనాగరిక దశకు వెనక్కు నెట్టటానికి చూస్తున్నాడని అంబేద్కర్ అంటాడు. పైగా గ్రామ చేతివృత్తుల్ని గాంధీజీ ప్రోత్సహించడం వలన - ఆయన హిందూ సమాజంలో కులవ్యవస్థను - వర్ణాశ్రమ ధర్మాలను ప్రోత్సహిస్తున్నాడని అంబేద్కర్ విమర్శించాడు. రాజాజీ - సంతానం వంటి వారు ఆయన పుస్తకాన్ని విమర్శిస్తూ రాసారు గ్రంథాలు. అవి అంబేద్కర్ గ్రంథంలో చేసిన విమర్శల్ని త్రిప్పికొట్టలేకపోయాయి.

1946లో "గాంధీజీ - అస్పృశ్యుల దాస్య విమోచన" అనే పెద్ద వ్యాసం గూడా వ్రాసాడు. అలానే "వాట్ హిందూస్ హేవ్ డన్ టు ది అన్ టచబుల్స్" అనే రచన 'అసంపూర్ణం'గా చేసాడు. ఈ రెండిం

టిలోని విషయానికి పైన చెప్పుకున్న గ్రంథంలోని విషయానికి పెద్దగా తేడా లేదని చెప్పవచ్చును.

పాఠకులారా! మనమింకొక విషయం యిక్కడ తప్పక గుర్తు చేసుకోవాలి. స్వాతంత్ర్య ఉద్యమంతోపాటు గాంధీజీ "హరిజన ఉద్ధరణ" ఉద్యమం చేపట్టి దేశ ప్రజలకు "పిలుపు" నిచ్చినప్పుడు - యెందరెందరో అగ్రవర్ణాల వారు స్పందించారు. బాపూజీ పిలుపు వారిని ఆలోచింప చేసింది. అగ్రర్ణాలవారు చాలామంది - గాంధీజీ ఆశించినదానికంటే - ఆ మాటకొస్తే (అనరాదుకాని) - గాంధీజీకంటే యెక్కువ అంకిత భావంతో మనస్ఫూర్తిగా 'హరిజన' సేవకుపక్రమించారు. వారిలో కొందరు హృదయ పరివర్తనతో సహృదయతతో సహకరించారు. మడి నిష్ఠగల సనాతన బ్రాహ్మణులు సహితం సవర్ణ హిందువులు హరిజనులతో కలిసి మెలిసి తిరిగారు. హరిజనులతో సహ పంక్తి భోజనాలు చేసారు. హరిజనుల్ని తమ వూళ్ళోనికే కాదు తమ యిళ్ళల్లోనికి కూడా రానిచ్చారు. గుళ్ళల్లోనికి, బళ్ళల్లోనికి రానిచ్చారు. కొందరు హరిజన పిల్లల్ని పెంచుకున్నారు. గాంధీజీయే పెంచుకున్నాడు. ఎందరో హరిజనుల విద్యాభివృద్ధికి కృషిచేసారు. తమ బిడ్డల్ని చదువూసంస్కారం ఉన్న హరిజనులకిచ్చి వివాహం చేసారు. అట్టి వారిని ఆనాడు స్వకులస్థులు "వెలి" వేసారు. నానా బాధలు పెట్టారు. మరి అట్టి సహృదయ సంస్కరణ మూర్తుల మానవతాదృక్పథాన్ని, త్యాగాన్ని మనం తప్పక గుర్తు చేసుకోవాలిగదా. కనుక గాంధీజీ, కాంగ్రెస్ వారి హరిజన సేవ 'సవతి తల్లి ప్రేమ' వంటిదని అంబేద్కర్ చేసిన విమర్శ పూర్తిగా నిజంకాదని మనం గుర్తుంచుకోవాలి. ఈ గ్రంథం చదివితే గాంధీజీ - కాంగ్రెస్ వారు చేసిన హరిజన సేవపై అనుమానాలు వస్తాయి. వారిపై వుండే సదభిప్రాయం సన్నగిల్లుతుంది.

## శూద్రులెవరు (హూ ఆర్ శూద్రాస్)

1946లో "శూద్రులెవరు" అన్న గ్రంథం రాసాడు. దీనిని ప్రముఖ సంఘ సంస్కర్త - అంబేద్కర్‌కు గురుతుల్యుడైన "మహాత్మా జోతి బా

ఫూలే"కు అంకితం ఇచ్చాడు.

శూద్రులెవరు? వారెలా - హిందూ - ఆర్య సమ్మిశ్రిత సమాజంలో నాల్గవ వర్ణంగా యెంచబడ్డారు! అన్న అంశంపై విపులంగా పరిశోధన చేసి రాసిన గ్రంధమిది ఆయన సిద్ధాంతం ప్రకారం ఆర్య ద్రావిడ - సంఘర్షణల తర్వాత - ద్రావిడ - ఆర్య సమ్మిశ్రిత నూతన సమాజం ఆవిర్భవించింది. వైదిక మత వ్యాప్తి చెందింది. నిర్బంధ వృత్తి విధానం నుండి వర్ణవ్యవస్థ నెలకొన్నది. మొదట మూడు వర్ణాలే (కులాలు) - బ్రాహ్మణ - క్షత్రియ - వైశ్య కులాలు. కాలం గడిచే కొద్దీ బ్రాహ్మణుల పెత్తనం పెరిగిపోయింది. వైదిక మత సంప్రదాయాల అమలు నిర్బంధం చేయబడింది. స్వాభిమానం - శౌర్య ప్రతాపాలు గల కొందరు క్షత్రియులు బ్రాహ్మణుల ఆధిక్యతను ధిక్కరించారు. వైదిక సంప్రదాయాన్ని వ్యతిరేకించారు. ఈ దశలో తెలివిగల బ్రాహ్మణ గణం - యెదిరించిన క్షత్రియుల్ని లొంగదీసుకున్నారు. వారి చేత "ఊడిగం" "దాస్యం" చేయించుకున్నారు. వారికి ఉపనయనాది వైదిక కర్మలు లేకుండా చేసారు. వేదాధ్యయనం - సంస్కృత పఠనం - చేయటానికి వీరిని అనర్హుల్ని చేసారు. బ్రాహ్మణులకు లొంగిపోయి దాస్యం చేసిన క్షత్రియులే "శూద్రులైనారని" అంబేద్కర్ అంటారు! హిందూ సమాజంలో వర్ణవ్యవస్థలో యీ శూద్రులు నాల్గవ వర్ణం వారైనారు. అయినా వీరు పై మూడు అగ్రవర్ణాలకంటే "హీనమైన వర్ణం" వారుగా పరిగణింప బడ్డారు. మహా భారత యుద్ధ కాలంలో క్షత్రియ వంశం నాశనం అయిపోయింది. నాగులుగా వ్యవహరింపబడిన ఆదిమ జాతుల వారు "విలువిద్య" మొదలగు విద్యలు నేర్చుకొని క్షత్రియులుగా మారారు. నాగ జాతుల వారు బౌద్ధ మతం స్వీకరించారు. బ్రాహ్మణులు వీరిని వెలివేసారు. బౌద్ధ - హిందూ మతాల ఘర్షణల్లో వైదిక మతం విజయం సాధించింది. ఓడిపోయిన బౌద్ధుల్ని బ్రాహ్మణులు లొంగదీసుకున్నారు. వీరే శూద్రులైనారంటాడు. లొంగనివారు అస్పృశ్యులైనారంటాడు. తక్కువ కులం వారిగా చూడబడ్డ శూద్రులు ఒకానొకనాడు ఉన్నత స్థానంలో ఉన్న క్షత్రియులే అని అంబేద్కరంటాడు. పాఠకులారా! అంబేద్కర్ సిద్ధాం

తంలో కొంత బలమున్నదనిపిస్తుంది! చరిత్ర పుటలు తిరగేస్తే యీనాడు శూద్ర కులాలైన కమ్మ-రెడ్డి యాదవ్ మొదలగు కులాలు వారు ఒకప్పుడు రాజ్యాలేలిన క్షత్రియులేనన్న యధార్థం తెలుస్తుంది!

## ది అన్ టచబుల్స్

"అస్పృశ్యులు" గ్రంథం 1948లో ప్రచురించాడు. అస్పృశ్యులెవరు? వారెందుకు అస్పృశ్యులుగా పరిగణింపబడ్డారు అనే ప్రశ్నవేసుకొని రాసిన గ్రంథమిది. అస్పృశ్యుడుగా పుట్టిన అంబేద్కర్ ఎన్నో బాధలు, అవమానాలు పొందాడు. సహజంగానే అసలీ అస్పృశ్యత ఎలావచ్చిందీ అనే జిజ్ఞాసతో, దీక్షతో, పరిశోధన చేసి వ్రాసిన గ్రంథం. ఈ గ్రంథంలోని సారాంశాన్ని క్లుప్తంగా తెలుసుకుందాం. క్రీ.పూ. షుమారు మూడువేల సంవత్సరాల క్రితం మధ్య ఆసియా నుండి ఆర్యులు భారతదేశం వచ్చారు. ద్రావిడులకు - ఆదిమజాతుల వారికి - ఆర్యులకు మధ్య సంఘర్షణలు జరిగాయి.

ఆర్యద్రావిడ ఘర్షణల్లో ఓడిపోయిన కొందరు దక్షిణ భారతానికి తరలిపోయారు. అందుకే దక్షిణ భారతదేశాన్ని ద్రవిడ దేశంగా ఉత్తర భారతాన్ని ఆర్యావర్తంగా చరిత్రకారులు చెపుతారు. ఓడిపోయిన కొందరు ద్రావిడులు, ఆర్యులకు దాస్యం చేసో, వారితో మంచిగా సంబంధ బాంధవ్యాలు పెట్టుకునో వారితో కలిసి పోయారు. నూతన ఆర్యద్రావిడ మిశ్రమ జాతి ఆవిర్భవించింది. వైదిక మత సంప్రదాయం బాగా వ్యాప్తి చెందింది. ఈ దశలో వృత్తి విధానం నిర్బంధం చేయబడింది. వృత్తుల్ని బట్టే కులాలు పుట్టాయి. మొదట మూడు కులాలే. బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ కులాలు! పెత్తనమంతా బ్రాహ్మణ వర్గం వారిదే. రాను రాను వారి పెత్తనం వెర్రితలలు వేసింది. ఈ దశలో కొందరు బ్రాహ్మణ అధికారాన్ని ధిక్కరించారు. వైదిక మత సంప్రదాయాన్ని వ్యతిరేకించారు. ఇలా యెదిరించిన క్షత్రియ వర్గం తర్వాత బ్రాహ్మణ వర్గానికి లొంగిపోయి 'వూడిగం' చేసారు. వారే శూద్రులని అంబేద్కర్ వాదం. బ్రాహ్మణుల

పెత్తనాన్ని ఎదిరించి వైదికమత సంప్రదాయాన్ని కాదన్న మరికొందరు బ్రాహ్మణ వర్గానికి లొంగ లేదు. వారిని సమాజంనుండి 'విడదీసి' వెలి వేసినారు. ఇలా విడదీయబడిన (Broken People). వారు ఊరికెలుపల నీచమైన వృత్తులు చేస్తూ, నీచమైన ఆచారాలతో బ్రతికేవారు. గొడ్డు మాంసం తినేవారు. చచ్చిపోయిన పశువుల కళేబరాల్ని కాల్చుకుని తినే వారు. వీరు ఆనాడు ఉచ్ఛదశలో ఉన్న బౌద్ధమతాన్ని స్వీకరించారు.

సవర్ణ హిందూవులకు - అస్పృశ్యులకు మధ్య జాతిపరమైన భేదం లేదు. అలానే వారికీ వీరికీ వృత్తిపరమైన భేదం గూడా లేదంటాడు. మొదట అన్ని కులాల వారు గోమాంస భక్షణ చేసేవారు. ఆది శంక రాచార్యుల వారు రంగ ప్రవేశం చేసి గోమాత పవిత్రతను ప్రచారం చేసాడు. వైదికులకు - బౌద్ధులకు ఘర్షణలు జరిగాయి. వైదిక మతం విజయం సాధించింది. బౌద్ధం యీ దేశంలో క్షీణించింది. ఈ పరిణామ దశలో మొదట బౌద్ధం స్వీకరించిన కొందరు మరలా హిందూవులైనారు. బ్రాహ్మణులకు లొంగి ఊడిగం చేసారు. వారే శూద్రులంటాడు. బౌద్ధం ఓడిపోయినా బౌద్ధులుగానే వుంటూ గోమాంస భక్షణ చేస్తూండిపోయిన వారు అస్పృశ్యులుగా యెంచబడ్డారు అని అంబేద్కర్ సిద్ధాంతం! వైదిక మతం పునరుజ్జీవనం అయిన తర్వాత యితర కులాల వారు గోమాంసం తినడం మానివేసారు.

పాఠకులారా! అంబేద్కర్ వాదన ప్రకారం - హిందూసమాజంలో యీ అంటరానితనం "క్రీ.శ. నాలుగు లేక అయిదవ శతాబ్దంలో వచ్చింది. చండాలురు (అపవిత్రులు) లేరు అస్పృశ్యులు లేరు అంటాడు. అస్పృశ్యుల్లే - అంత్యజులు అంత్యవాసులు - అంత్యులు - బాహ్యులు అనిగూడ పిలుస్తా రని అంబేద్కర్ వివరిస్తాడు. చరిత్రకారులు సిద్ధాంతం ప్రకారం అస్పృశ్యత క్రీ.పూ.మే వుంది! అలానే వైదికమతం చేతిలో ఓడిపోయిన బౌద్ధమత స్థులుగా వున్నవారే "అస్పృశ్య" లని అంబేద్కరంటాడు గదా! అయితే అస్పశ్యులుగా పిలవబడేవారు దేశంలో హిందువులుగా వున్నారు! ఈ విషయాలు యింకా పరిశోధన చేయాలి.

# స్టేట్స్ అండ్ మైనారిటీస్

దీనిని మనం "రాష్ట్రాలు - అల్పసంఖ్యాక వర్గాలు" అని చెప్పుకో వచ్చు. బ్రిటీషు పాలకులు భారతదేశానికి స్వతంత్ర ప్రతిపత్తి ఇస్తామని ప్రకటించారు. అప్పుడు అంబేద్కర్ అల్పసంఖ్యాక వర్గాల గురించి ఒక విజ్ఞానపత్రం తయారు చేసారు. ఇది 1947లో ప్రచురించాడు. దీనిని రాజ్యాంగపరిషత్తుకు సమర్పించాడు. రాజ్యాంగ చట్టం రచన చేసేటప్పుడు, అల్ప సంఖ్యాక వర్గాల వారి నిమ్నజాతుల వారి హక్కులు రక్షణలకు రాజ్యాంగంలో కల్పించే విషయం పరిశీలించాలని ఆయన విజ్ఞప్తి. వివిధ రాష్ట్రాలలో ఉన్న వివిధ అల్పసంఖ్యాకుల (మైనారిటీస్) గురించి నిమ్న జాతులవారి సాంఘిక ఆర్థిక సమస్యల గురించి, వాటి పరిష్కారమార్గాల్ని గురించి అంబేద్కర్ యీ "బ్రోచర్"లో చర్చించాడు. ప్రజాస్వామ్యం పటిష్టం కావాలంటే సమాజంలోని అన్ని వర్గాల ప్రజల ప్రయోజ నాలు కాపాడాలి. ప్రజల భౌతికపరమైన నిత్య జీవిత అవసరాలకు తోడు, మానసిక వికాసానికి కూడా దోహద పడాలి. కులమతవర్గవిభేదాలు లేని సమాజం రూపొందాలి. ప్రజలు పరస్పరం అభిమానంతో గౌరవంతో కలిసిమెలసి ఉండేటట్లు ప్రభుత్వం చర్యలు తీసుకోవాలి. దేశంలోఎన్నో కులాలు ఉన్నాయి. వివిధ అల్ప సంఖ్యాకవర్గాలవారున్నారు. అణగారిన నిమ్నజాతుల వారున్నారు. అల్ప సంఖ్యాక వర్గాలవారికి, నిమ్నజాతులకు రాజకీయపరంగా ప్రత్యేక నియోజక వర్గాలు ఏర్పాటు చేయాలని ఆయన అభిమతం. అలానే విద్యాఉద్యోగ విషయాలలో ప్రత్యేక కేటాయింపులు ఉండాలని అంబేద్కర్ వాదన. వారి ఆర్థిక సమస్యలు ప్రభుత్వం పరిష్కరించాలి. 1930లోనే రౌండ్ టేబుల్ సమావేశాలప్పుడే ఆయన అల్ప సంఖ్యాక నిమ్నజాతీయుల హక్కులు రక్షణలు గురించి వాదించాడు! నిమ్నజాతీయులను అల్ప సంఖ్యాక వర్గలలో చేర్చమని గూడా వాదించాడు. వారి సాంఘిక కట్టుబాట్లు కూడా దృష్టిలో పెట్టుకుని అల్పసంఖ్యాక వర్గాల ప్రయోజనాల్ని ప్రభుత్వం కాపాడేందుకు కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలి. అల్పసంఖ్యాక వర్గాలపై అంబేద్కర్ అభిప్రాయాలు ఇలా

సాగుతాయి-

దేశంలో కీలకమైన భారీ పరిశ్రమల్ని జాతీయం చేయాలంటాడు. భీమా వ్యాపారాన్ని జాతీయం చేయాలంటాడు. వ్యవసాయం కూడా జాతీయం చేయాలన్నిది ఆయన అభిలాష. ఈ మార్పులన్నీ హింసాయుత పద్ధతులలో కాకుండా, ప్రజాస్వామిక పద్ధతులలో జరగాలని నొక్కి చెప్పాడు. ఇలా ఆయన " స్టేట్ సోషలిజం" గురించి చెబుతాడు.

ప్రతివ్యక్తికి ఒకే ఓటు, ప్రతి ఓటుకు ఒకే విలువ అనే సూత్రాన్ని అనుసరించి వయోజన ఓటింగ్ పద్ధతి ద్వారా పార్లమెంటరీ ప్రజాస్వామ్య ప్రభుత్వం ఏర్పాటు కావాలి. మనిషి నైతిక స్థాయిని పెంచటానికి మతం అవసరం. కనుక మతంలో మూఢత్వం, ఛాందసం, వుండకూడదంటాడు. మతంలో హేతువాదం మనిషికి గౌరవం, వుండాలంటాడు. మతం మనిషికి గౌరవప్రదమైన జీవితం సమకూర్చాలంటాడు.

నిమ్న జాతులవారి సామాజిక దుస్థితిని బట్టి నిమ్న జాతుల వారి నందరిని ఒకేచోట నివసించే ఏర్పాటు చేయాలి. అందుకు వారికి ప్రత్యేకమైన ఆవాసాలను (Separate Settlements) యేర్పాటు చేయాలి. అలాచేస్తే అస్పృశ్యత పోతుందంటాడు. వారికి స్వేచ్ఛ వుంటుందంటాడు. గౌరవప్రదంగా జీవిస్తారంటాడు. ఇలాసాగుతుంది రచన!

పాఠకులారా! దరిమిలా అంబేద్కర్ రాజ్యాంగ రచనలో ముఖ్యమైన పాత్రవహించాడని తెలుసుకున్నాం. నిమ్న జాతులవారికి, అల్పసంఖ్యాక వర్గాలకు రాజకీయ పరమైన ప్రత్యేక నియోజక వర్గాల ఏర్పాటు రాజ్యాంగంలో పొందుపరిచాడు. నిమ్న జాతులవారికి విద్య ఉద్యోగ ప్రత్యేక కేటాయింపుల ఏర్పాటు రాజ్యాంగంలో పొందుపరిచాడు.

## థాట్స్ ఆన్ లింగ్విస్టిక్ స్టేట్స్

దీనిని మనం 'భాషాప్రయుక్త రాష్ట్రాలపై (నా) భావాలు' అని చెప్పుకోవచ్చు. బ్రిటీష్ పాలనలో భారతదేశంలోని రాష్ట్రాలు చాలా పెద్దవిగా ఉండేవి. ఒక్కొక్క రాష్ట్రంలో విభిన్న భాషాప్రాంతాలు చేరివుండేవి.

వివిధ భాషల వారి మధ్య గొడవలు వస్తుండేవి. ఉదాహరణకు మన ఆంధ్ర ప్రాంతం మద్రాస్ రాష్ట్రంలో కలిసి ఉండేది. కొంత కర్ణాటక ప్రాంతం మరికొంత కేరళ ప్రాంతంగూడా మద్రాస్ రాష్ట్రంలోనే చేరి వుండేవి. మద్రాస్ నగరం రాజధానిగా వుండేది. కనుక తమిళులు, తెలుగువారి మీద, కన్నడిగుల మీద, మళయాళీయులమీద పెత్తనం చెలాయించేవారు. దానిపై వివిధ భాషలవారి మధ్య గొడవలొచ్చేవి. ఇలానే దేశంలోని యితర రాష్ట్రాల విషయంలో గూడా. అలానే బృహత్ మహారాష్ట్రలో - మధ్య పరణాలు - బీహారు - కర్ణాటక ప్రాంతాలు కొన్ని చేరి వుండేవి.

భాషా ప్రాతిపదికమీద (అంటే ఒకే భాష మాట్లాడే ప్రాంతమంతటిని ఒకే రాష్ట్రంగా చేయడం) రాష్ట్రాలు విభజించాలని దేశంలో అన్ని ప్రాంతాలలో ఆందోళన బయలుదేరింది. ఇలా ఆందోళన లేవదీసిన వారిలో ఆంధ్రులు మొదటివారు. ఈ విషయం కూలంకషంగా పరిశీలించ డానికి ప్రభుత్వం వారు డాక్టర్ జాన్‌మత్తయ్ సంఘాన్ని నియమించింది. అంబేద్కర్ యీ విషయంపై దీర్ఘంగా ఆలోచించి 1948లో ఒక పెద్ద నివేదికను తయారు చేసి మత్తయ్ సంఘానికి సమర్పించాడు.

భాషా ప్రాతిపదికమీద రాష్ట్రాలు విభజించడం వలన ఆయా ప్రాంతీయ భాషా ప్రజల ప్రయోజనాలు కాపాడవచ్చని ఆయన అభిప్రాయపడ్డాడు. ప్రాంతీయ భాషలు అభివృద్ధి చెందుతాయని గూడా ఆయన అంటాడు. పరిపాలనకూడా సులభతరం అవుతుందని ఆయనంటాడు. ప్రజాస్వామిక విధానం పటిష్టపరిచినట్లు అవుతుందంటాడు. అయితే రాష్ట్రాలు విభజించేటప్పుడు కొన్ని చిన్నవిగా, మరికొన్ని పెద్దవిగా ఉండకూడదంటాడు. భౌగోళికంగా అన్నీ సమతుల్యంగా వుండడం మంచిదంటాడు.

భారతదేశంలో కులాల పుట్టు పూర్వోత్తరాలు (Castes in India, Their Mechanism, Genesis and Develovpment) అనే పెద్ద వ్యాసం ఆయన అమెరికాలో చదువుకొన్నప్పుడే 1916 లోనే రాసాడు. అస్పృశ్యుడుగా పుట్టిన అంబేద్కర్‌కు కుల వ్యవస్థపై విద్యార్థిగా వుండగానే దృష్టిపడిందన్నమాట.

ఆర్యులు - ద్రావిడులు - మంగోలియన్లు - సిథియన్ జాతులయొక్క "మిశ్రమ జాతి" యే భారతీయ జాతి అని ఆయన అంటాడు. భారత జాతి "ఏక రక్త సంబంధితమైనది" కాకపోయినను భారతీయ సంస్కృతి - తరతరాలనుండి భారతీయుల్ని "ఏకజాతి"గా సమైక్య పరుస్తూ వస్తున్నదని అంటాడాయన.

ఒకే తెగలో లేక వర్ణంలోని యువతీ యువకులకు అదే తెగ లేక వర్ణంలోని యువతీ యువకులకు "నిర్బంధ - వివాహబంధం" అమలుచేయడంవల్ల "కులాలు" యేర్పడ్డాయని అభిప్రాయపడ్డాడు. కాదన్న యువతీయువకులకు కఠిన దండనలు, కులంనుండి "వెలి" వంటి శిక్షలు అమలుపరిచారంటాడు. నాగరికత వృద్ధి చెందినా - మానవుని మేధస్సు పెరిగినా - వైదిక మత సంప్రదాయాలు - బ్రాహ్మణ ఆధిక్యత కుల వ్యవస్థను కట్టుదిట్టం చేసారంటాడు. అందుకు "సతీసహగమనాన్ని" "బాల్య వివాహాల్ని" "నిర్బంధ వితంతు విధానాన్ని" శాస్త్రాలలో నిషేధించి - మరీ కట్టుదిట్టంగా అమలుపరిచేడంటాడు.

ఒకే భాష మాట్లాడే ఒకే జాతివారు నివసించే ప్రాంతాన్ని ఒక రాష్ట్రంగా చేస్తే మంచిదంటాడు. రాష్ట్రాలు విభజించేటప్పుడు విశాల దృష్టితో ఆలోచించాలంటాడు. సంకుచిత ప్రాంతీయదృష్టి- రాజకీయ ప్రమేయం వుండకూడదంటాడు. భాషా ప్రాతిపదిక మీద రాష్ట్రాలు విభజిస్తే మంచితోపాటు చెడు ఫలితాలుంటాయంటాడు. ప్రాంతీయతత్వం స్వభాషాభిమానం పెరిగిపోయి వెర్రితలలు వేసే ప్రమాదం లేకపోలేదంటాడు. దీనివలన యిరుగుపొరుగు రాష్ట్రాల మధ్య ఘర్షణలు తలెత్తుతాయని హెచ్చరించాడు. ఇది దేశ భద్రతకు చెరుపు చేయవచ్చని గూడా హెచ్చరించాడు. రాష్ట్రాలలో అధికార భాషగా-ఆయా ప్రాంతీయ భాషలున్నా-జాతీయ భాషగా హిందీ వుండాలంటాడు.

పాఠకులారా! ఈ అంబేద్కర్ నివేదిక మత్తయ్ సంఘానికి ఎంతో ఉపయోగపడింది. భాషా ప్రాతిపదికమీద రాష్ట్రాల్ని పునర్ విభజించినప్పుడు అంబేద్కర్ సూచనలు పాటించడం జరిగింది.

అంబేద్కర్ యింకో రచన గూడా చేసాడు. "మహారాష్ట్ర ఏజ్ ఏ లింగ్విస్టిక్ ప్రోవిన్స్" దానిపేరు. భాషా ప్రయుక్త రాష్ట్రంగా మహా రాష్ట్ర అని మనం చెప్పకోవచ్చు. మధ్య పరగణాలు బీహార్- కర్ణాటక ప్రాంతాలలో మరాఠీ భాషను మాట్లాడే ప్రాంతాల్ని చీల్చి మహా రాష్ట్రగ ఏర్పాటు చేయమంటాడు. నాటి బృహత్ మహారాష్ట్రను నాల్గు రాష్ట్రా లుగా చేయవచ్చంటాడు. బొంబాయి నగరాన్ని రాజధానిగా చేయమంటాడు. ఆయన సూచించినట్లుగానే మహారాష్ట్ర యేర్పడింది. బొంబాయి రాజధాని అయ్యింది.

అలానే మరొక పెద్ద వ్యాసం రాసాడు. "నీడ్ ఫర్ చెక్స్ అండ్ బాలెన్సెస్" అంటే "తనిఖీలు నియంత్రణ సమతుల్యాల ఆవశ్యకత" అని మనం చెప్పకోవచ్చు. పెద్ద రాష్ట్రాలు మంచివి కాదంటూనే ప్రజల అభిప్రాయం పాటించాలంటాడు. పొట్టి శ్రీరాములు ఆత్మ బలిదానంలో ఆంధ్రరాష్ట్రం 1953 లో మద్రాస్ నుండి విడిపోయి ప్రత్యేక రాష్ట్రమై నది. అప్పుడు కర్నూలు మన రాజధాని. తెలుగు మాట్లాడే తెలంగాణాను ఆంధ్ర రాష్ట్రంలో చేర్చ వచ్చంటాడు. ఆనాడు తెలంగాణా వేరే రాష్ట్రంగా ఏర్పాటైనది! ఇష్టపడకపోతే రెండు రాష్ట్రాలుగా వుంచవచ్చంటాడు. 1956 నవంబరులో ఆంధ్రా తెలంగాణాలు కలిపి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర మైనది. మనకు హైదరాబాద్ రాజధాని అయ్యింది. ఇలా అంబేద్కర్ సూచించినట్లు ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది.

## బుద్ధుడు-కారల్ మార్క్స్

నేపాల్ దేశ రాజధాని కాట్మండ్‌లో 1956 నవంబరులో నాల్గవ ప్రపంచ బౌద్ధమహాసభలు జరిగాయి. అంబేద్కర్ ఆ సభల్లో పాల్గొన్నాడు. నేపాల్‌రాజు కోరికపై ఆయన "బుద్ధుడు-కారల్ మార్క్స్" అనే అంశం మీద ఆ మహాసభలో మాట్లాడాడు. ఆయన వుపన్యాసంలోని సారాంశమిది.

అన్నిమత సిద్ధాంతాల కంటె బౌద్ధమత సిద్ధాంతాలు గొప్పవి. బౌద్ధం ఒక గొప్ప మతమేకాదు అది గొప్ప సామాజిక సిద్ధాంతం. కొన్ని

కమ్యూనిస్టు దేశాలలో దురదృష్టవశాత్తు బౌద్ధమతం అభాసుపాలౌతోంది. కారల్ మార్క్స్ వాదన ప్రకారం ఆస్తి అంతా కొందరు ధనిక భూస్వాములు గుత్తాధిపత్యం క్రింద వుంటుంది. కార్మికులను 'దోచుకుని' ధనికులు వ్యక్తి ఆస్తి పెంచుకొంటుంటారు. ఈ దోపిడి కార్మికుల "దుఃఖానికి" కారణమౌతుంది. శ్రామికులు సంఘటితమై ధనవంతులతో 'ఘర్షణలకు' దిగుతారు. కార్మిక నియంతృత్వ పాలకులు ఆస్తిని వ్యక్తుల నుండి ప్రభుత్వపరం చేస్తారు. అవసరమైతే 'హింసామార్గాల' ద్వారా వ్యక్తి ఆస్తిని ప్రభుత్వం స్వాధీనం చేసుకొంటుంది. ప్రజలందరి నిత్యావసరాలు ప్రభుత్వం తీరుస్తుంది. బుద్ధుని సిద్ధాంతం ప్రకారం వస్తువుల మీద వ్యామోహం (కోరికలు Desires డిజైర్స్) సమాజంలో "దుఃఖానికి" కారణం అవుతుంది. మనో నిబ్బరం (నియంత్రణం) ద్వారా కోరికల్ని అదుపుచేసుకొంటే వస్తు వ్యామోహం పోతుంది. కారల్ మార్క్స్ చెప్పిన "దోపిడి" మూలంగా వచ్చిన దుఃఖానికి - బుద్ధుడు ప్రబోధించిన - వస్తు వ్యామోహ కారణమైన "దుఃఖానికి" తేడా లేదు. బౌద్ధమతంలో గూడా వ్యక్తి ఆస్తి ఉండదు. ఆస్తి అంతా సంఘపరమౌతుంది. అందుకే బౌద్ధమతంలో "సంఘం శరణం గచ్ఛామి" అన్నది ఆ మతంలోని ముఖ్యమైన 'త్రిచరణాలలో ఒకటి!' బౌద్ధంలో వ్యక్తి (భిక్షువు) కన్న సంఘం గొప్పది! బౌద్ధ సంఘంలో వ్యక్తి ఆస్తి సహజంగా - శాంతియుతంగా-మానసిక పరివర్తన ద్వారా సంఘం అధీనంలోనికి వస్తుంది. కాని కమ్యూనిష్టు సిద్ధాంతం ప్రకారం వ్యక్తి ఆస్తి హింసాయుత మార్గాల ద్వారా అవసరమైతే రక్తపాత విప్లవం ద్వారా ప్రభుత్వం స్వాధీనం చేసుకొంటుంది. కాని బౌద్ధంలో హింసకు తావులేదు! ఉన్నతందా అహింసా మార్గమే! ఇంకోముఖ్యమైన తేడా-కమ్యూనిష్టు కార్మిక నియంతృత్వ పాలనలో వ్యక్తికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేవు. కాని బౌద్ధంలో సంఘం కట్టుబాట్లు తప్ప ఉన్నదంతా వ్యక్తి స్వాతంత్ర్యం ప్రజాస్వామిక విధానమే. కనుక కారల్ మార్క్స్ కమ్యూనిజం కన్న బుద్ధుని మతమే గొప్పదని ఆయన వాదన. అదే ప్రపంచానికి శరణ్యమంటాడు.

మార్క్స్ చెప్పిన "దోపిడి" కి బుద్ధుడు చెప్పిన "దుఃఖానికి"

తేడా లేదనడం సరియైనది కాదని విజ్ఞులు అంటారు "దోపిడి" ధనిక భూస్వామ్య వర్గం చేసేది మాత్రమే. అది సమాజపరమైనది. అది ఒకవర్గం చేసేది కాని దుఃఖం ప్రతి మానవునికి సహజమైనది. కోరికలు మనిషికి సహజం. అంటే దుఃఖం వ్యక్తిగతమైనది. ఎవరో సన్యాసికి తప్ప! కారల్‌మార్క్స్-బుద్ధుడూ "సమాజ శ్రేయస్సు" కోరి వుండవచ్చు. కాని మార్క్స్ సిద్ధాంతం రాజకీయపరమైనది. బుద్ధునిది మత పరమైనది.

## బుద్ధా అండ్ హిజ్ దమ్మా (Budda and His Dhamma)

"బుద్ధుడు-అతని ధర్మం" అని మనం తెలుగులో చెప్పుకోవచ్చు. ఇది పెద్ద గ్రంథం అంబేద్కర్ చనిపోయేముందు దీనిని రచించి తుదిమెరుగులు దిద్దాడు. ఆయన నిర్యాణం చెందిన తర్వాత 1957 లో యీగ్రంథం ప్రచురింపబడింది. అంబేద్కర్ రచనలలో ఇదొక గొప్ప గ్రంథం. బుద్ధుని జీవితం మీద ఆయన బోధనలమీద వచ్చిన గొప్ప గ్రంథాలలో యీ గ్రంథం అగ్రశ్రేణిలో నిలుస్తుంది. అంబేద్కర్ ఈ గ్రంథాన్ని శాస్త్రీయ దృక్పథంతో హేతువాద దృష్టితో రచించాడు. బుద్ధుడు చెప్పిన కొన్ని బోధనలను (ప్రవచనాల్ని) అంబేద్కర్ శాస్త్రీయ దృష్టితో సామాజిక శ్రేయోదృష్టితో వివరించాడు. సంఘ ధర్మంకోసం, విశ్వ కళ్యాణం కోసం బౌద్ధ ధర్మాలను కొంత సంస్కరణ దృష్టిలో అంబేద్కర్ రచించాడు. ముదుసలిని చూచి, శవాన్ని చూచి విరక్తి కలిగి బుద్ధుడు సన్యసించినట్లు వాడుకలో వుంది. ఈ వాదన బహుళ ప్రచారంలో వుంది. కాని అంబేద్కర్ వాదన ఇందుకు భిన్నమైనది. పొరుగునవున్న "కొలియుల" దేశంతో "రోహిణీ" నదీ జలాల పంపిణీ విషయమై శాక్య పరిషత్తులో (మహాసంఘం-మహాసభ) శత్రువుతో యుద్ధం చేసి నీటి హక్కు సంపాదించుకోవాలని సైన్యాధ్యక్షుడు వాదిస్తాడు. యుద్ధం ద్వారా కాకుండ శాంతియుత సంప్రదింపుల ద్వారా రక్తపాత రహితంగా నీటి తగాదా పరిష్కరించుకోవాలని సిద్ధార్థుడు పట్టుబడతాడు. తన వాదన మహా పరిషత్తులో వీగిపోతే పరివ్రాజకత్వం (సన్యసించడం) స్వీకరిస్తానని బుద్ధుడు శపథం చేస్తాడు. మహా పరిష

త్తులో ఈ అంశంపై ఓటు జరిగినప్పుడు అధికులు సిద్దార్థుని వాదనకు వ్యతిరేకంగా ఓటు చేస్తారు. అంటే ఆయన ఓడిపోయినట్లైనది. మహాస భలో తానుచేసిన శపథం ప్రకారం గౌతముడు పరివ్రాజకుడౌతాడు. ఇంకో ముఖ్యవిషయం. సిద్ధార్థుడు సన్యసించడానికి ఇల్లు విడిచి భరద్వాజ అడ వికి పోయేముందు ఆ రాత్రి తన భార్యతో చెప్పకుండా వెళ్ళిపోయినట్లు ప్రచారంలో ఉన్నది. కాని అంబేద్కర్ వాదన ప్రకారం మహా పరిషత్తులో జరిగిన విషయమంతా తండ్రితో భార్యతో నచ్చజెప్పి ఇచ్చిన మాట నిలబె ట్టుకొంటానికి ఇంటినుండి వెళ్ళిపోయి పరివ్రాజకుడౌతాడు. భార్య అంగీకా రంతో వెళ్ళతాడు. ఇలా ఎన్నో క్రొత్త విషయాలు అంబేద్కర్ శాస్త్రీయ దృక్పథంతో వివరించాడు ఈ గ్రంథంలో. ఇతర మతాల్లో స్వర్గం-న రకం-పునర్జన్మ-కర్మ సిద్ధాంతం-ఆత్మ-పరమాత్మల ప్రస్తావన అధికం. కాని బౌద్ధమతంలో యివి లేవని అంటాడు. హిందూమతంలో శ్రీ కృష్ణుడు తాను అవతారపురుషుడనని చెప్పుకుంటాడు. ఏసుక్రీస్తు-మహమ్మదు తాము "మోక్షదాత" లమని ప్రకటించుకున్నారు. కాని బుద్ధుడు మోక్ష మార్గ దర్శిగా కనిపిస్తాడని అంటాడు. బౌద్ధమతంలో సమత-కరుణ- హేతువాదం- మానవతావాదం ప్రాధాన్యం వహిస్తాయని అంబేద్కర్ చెబుతాడు. పంచశీల సూత్రాలు-అష్టాంగమార్గాలు మనిషిని నియంత్రించి "దుఃఖానికి" దూరం చేస్తాయంటాడు. ఇంతటి ఉత్తమ ధర్మాలున్న బౌద్ధమతం మొదట మన దేశంలో మూడు పూవులారుకాయలుగా విరాజిల్లిందని అంటాడు. అయితే వైదిక మతానికి బౌద్ధమతానికి ఘర్షణలు వచ్చి మనదేశంలో వైదిక మతా నిది పైచేయి అయిందని-బౌద్ధమతం క్షీణించిందని వివరిస్తాడు. బౌద్ధమతం మరలా మనదేశంలో పునరుజ్జీవనం చెందాలంటే-బుద్ధుని పంచశీల-అష్టాంగ మార్గాలకు ఆయన సరికొత్త పంచశీలను ప్రవేశపెట్టాడు. సంఘంలో విద్య-ఉద్యమం-ఐకమత్యం-అహింస-సమత- యీకొత్త పంచశీలను పాటిస్తే బౌద్ధమతం మరలా మనదేశంలో బతికి బట్టకట్టకలదన్న విశ్వాసాన్ని ఆయన యీ గ్రంథంలో వెలిబుచ్చాడు.

బుద్ధుని మీద అంబేద్కర్ వ్రాసిన యీ గ్రంథంలోని చాల విషయా

లతో బౌద్ధమతస్థులే అంగీకరించడంలేదు. ముఖ్యంగా సనాతన హీనయాన బౌద్ధశాఖవారు అంబేద్కర్ చెప్పిన విషయాల్ని అంగీకరించడం లేదు. శ్రీలంక బౌద్ధులు, బర్మా బౌద్ధులు, అంబేద్కర్ భావాలతో ఏకీభవించ లేదు. ఏది ఏమైనా అంబేద్కర్ వ్రాసిన ఈ గ్రంధం బుద్ధుని జీవితం మీద ఆయన ప్రవచనాల మీద కొత్త వెలుగుల్ని ప్రసరింపచేసింది. ఈ గ్రంథం ముమ్మాటికీ చాలా గొప్పది.

పాఠకులారా! అంబేద్కర్ దృష్టిలో బుద్ధుడు దేవుడు కాదు. మోక్ష దాత కాదు. ఆయన గొప్ప మతకర్త. మోక్షమార్గదర్శి. అంబేద్కర్ వాదన ప్రకారం బౌద్ధమతం కేవలం మతంకాదు. అదొక సాంఘిక ధర్మం. బుద్ధుడు "మహాపరినిర్యాణం" చెందాక బౌద్ధమతం హీనయానమని-మహా యానమని రెండు శాఖలుగా చీలిపోయింది. ఈ రెండు శాఖలలో ఎన్నో లోపాలున్నాయి. బుద్ధుణ్ణి అవతారపురుషుణ్ణి చేసారు. బౌద్ధ జాతక కధలొ చ్చాయి. తర్వాత తర్వాత బౌద్ధ విహారాలు, కామకేళి విహారాలయ్యాయి.

బుద్ధుడు నొక్కిచెప్పిన 'పంచశీల' సూత్రాలకు అష్టాంగ విధానాలకు పెద్ద విఘాతం కలిగింది. మౌలికమైన బుద్ధుని ధర్మాలకే ఎసరు వచ్చింది. అంబేద్కర్‌కి ఇవన్నీ తెలుసు. కనుక హీనయానకు-మహాయానకు అతీత మైన 'కొత్త బౌద్ధమత ధర్మాన్ని' (నవబౌద్ధం) ఆయన ఆలోచించాడు. అంటే బుద్ధుడు స్వయంగా ఏ ధర్మాన్ని అయితే ప్రచారం చేసాడో ఏది ఆయన ఆచరించాడో అదే ధర్మాన్ని మరలా పునరుద్ధరించా లని అంబేద్కర్ ఆకాంక్ష. బౌద్ధం ఒకప్పుడు మనదేశంలో గొప్ప మతంగా విరాజిల్లింది. అశోకుని కాలంలో, హర్షుని కాలంలో బౌద్ధమతం మూడుపూవులారుకాయలుగా ఉచ్ఛదశలో విరాజిల్లింది. ఆది శంకరాచా ర్యుల వారు వచ్చి ఆశేతు హిమాచల పర్యంతం పర్యటించినాడు. సనాతన వైదిక మతాన్ని పునరుద్ధరించాడు. బౌద్ధమతం పతనమైనది. భారతదేశపు గడ్డమీద దాదాపు రూపురేఖలు లేకుండా పోయింది. శ్రీలంక-నేపాల్-చైనా-జపాన్‌వంటి దేశాల్లో బౌద్ధమతం జీవిస్తోంది. మనదేశంలో గూడా మరలా బౌద్ధమతాన్ని పునరుజ్జీవింపచేయాలని అంబేద్కర్ కలలు కన్నాడు. ఆయన యింకా కొంతకాలం జీవించివుంటే - బౌద్ధమత వ్యాప్తి కొరకు

శ్రమపడేవాడేమో!

## రిడిల్స్ ఇన్ హిందూయిజం

దీనిని మనం "హిందూమతంలో చిక్కు ప్రశ్నలు లేక కుహనా పన్నాగాలు" అని చెప్పుకోవచ్చు. అంబేద్కర్ చనిపోయేముందు దీనిని పూర్తిచేసాడు. ఆయన చనిపోయిన తర్వాత యిది ప్రచురించబడ్డది. ఇందులో మొత్తం రిడిల్సు 24 ఉన్నాయి.

ఇందులో వేదాలు, ఉపనిషత్తు పుట్టుపూర్వోత్తరాల్ని గురించి చర్చించాడు. త్రిమూర్తుల అవతారాల గురించి వేదవేదాంగాల గురించి స్మార్త-తాంత్రిక ధర్మాలను గురించి చర్చించాడు. వర్ణాశ్రమ ధర్మాల పుట్టు పూర్వోత్తరాల గురించి మను ధర్మశాస్త్ర కుటిల సాంఘిక నీతి గురించి చర్చించాడు. హిందూ సమాజం మాతృస్వామ్యంనుండి పితృస్వామ్యంనకు మార్పు చెందిన పరిస్థితుల్ని వివరించాడు. మన్వంతర సిద్ధాంతం గురించి బ్రహ్మతత్వం గురించి కలియుగ సమాప్తి సమస్య గురించి చర్చించాడు. రామావతారం కృష్ణావతారం గుట్టు రట్టు చేసాడు. ఈ హిందూశాస్త్రాల రచనలో బ్రాహ్మణ కుటిల నీతి సంకుచిత స్వార్థపరత్వం కనబడుతుందని అంబేద్కర్ అభిప్రాయపడ్డాడు. మొత్తం మీద బ్రాహ్మణ ఆధిక్యత మీద ఆయన దాడిచేసాడని చెప్పవచ్చు.

పాఠకులారా! ఈ రిడిల్స్ చదివితే యెవరికైనా అంబేద్కర్ చెప్పేది అంతా నిజమా అనిపిస్తుంది. ఒకవేళ హిందూమతం మీద బ్రాహ్మణ వర్గంమీద ద్వేషంతో చెప్పాడా అనిపిస్తుంది. ఎన్నో గ్రంధాలు, శాస్త్రాలు, వేదాలు బాగా పరిశోధించి వ్రాసాడు గదా మరి ఆయన చెప్పిందంతా అబద్ధమా అనిపిస్తుంది. హిందువులు వేదాల్ని ఉపనిషత్తుల్ని పరమ పవిత్రంగా భావిస్తారు. ప్రామాణికంగా చూస్తారు. మరి అంబేద్కర్ "రిడిల్స్" చదివాక వీటిల్లో యింత "కుళ్ళు" వుందా? అనిపిస్తుంది. బ్రాహ్మణులు యింత స్వార్థంగా యివి రాసారా అనిపిస్తుంది. ఏది ఏమైనా వీటిలోని నిజాన్ని నిగ్గుతేల్చాల్సిన అవసరం మాత్రం ఎంతైనా వుంది. ఆసక్తి కలవారు వీటిని పరిశీలనగా చదివితే వాటిలోని నిజానిజాలు తెలుసుకొనగలరు.

ఇప్పుడు సంగ్రహంగా చెప్పుకొన్న గ్రంధాలు - అంతకుముందు యీ గ్రంధంలో చెప్పుకొన్న రచనలు కాక - అంబేద్కర్ యీ క్రింది రచనలు గూడా చేసాడు.

(1) Small Holdings in India and Their Remedies (1917) భారత దేశంలో చిన్న కమతాలు వాటి నివారణోపాయాలు.

(2) Mr. Russel and The Reconstitution of Society (1918) రసెల్ - సమాజ పునర్నిర్మాణం

(3) Federation Versus Freedom (1939) సమాఖ్య - స్వాతంత్ర్యం.

(4) Indian Agricultural Labour and their Revolution (1942) భారతీయ వ్యవసాయ కూలీలు - వారి తిరుగుబాటు.

(5) Labour and Parliamentary Democracy (1942) శ్రామికవర్గం - పార్లమెంటరీ ప్రజాస్వామ్యం.

(6) Indian Currency and Bankin History (1947) భారతీయ కరెన్సీ - బాంకింగ్ చరిత్ర.

(7) Philosophy of Hinduism (1954) హిందూతత్వం.

(8) On Parliamentary Democracy పార్లమెంటరీ ప్రజాస్వామ్యం (ప్రసంగం)

(9) Rise and Fall of Hindu Women (1952) భారతీయ మహిళ - ఉచ్ఛస్థితి - అధోగతి.

(10) India and Communism భారతదేశం - కమ్యూనిజం.

(11) Gandhi and Gaandhism (1970) గాంధీ - గాంధీయిజం.

(12) Revolution and Counter Revolution in India భారతదేశంలో విప్లవం - ప్రతివిప్లవం

(13) The Conditions Precedent for the sccessful Working of

Democracy (1952) ప్రజాస్వామ్యం విజయవంతం కావాలంటే? (ప్రసంగం)

(14) Communal Dealock and A way to solve it కుల ప్రతిష్టంభన పరిష్కారమార్గం.

N.B : ఇవికాక సౌత్ బరో కమిటీ ముందు - సైమన్ కమీషన్ ముందు ఆయన దాఖలు చేసిన రిపోర్టులు - బొంబాయి అసెంబ్లీలో రాజ్యాంగ పరిషత్తులో (రాజ్యాంగంపై) పార్లమెంటులో ఆయన చేసిన ఉపన్యాసాలు - ఎన్నో - మరెన్నో అవన్నీ విలువైనవి!

* * *

ఆరోగ్యమ్మును లెక్క చేయక - మరో
వ్యాసక్తికిన్ పోక - నీ
ధీరోదాత్తత సర్వమున్ దళితజా
తీయమ్ము గావించి నా
ఔరా! కారణజన్ముడీవు! యుగక
ర్తా! ఇంకనీ దారిలో
జోరా జోరి పురోగమింతుము - నమ
స్సుల్ - డాక్టరంబేద్కరా!

— మహాకవి బోయి భీమన్న

# అనుబంధం - II

## అంబేద్కర్ అమృత సూక్తులు

[తన ఉపన్యాసాలలో, వ్యాసాలలో గ్రంధాలలో ఆయా విషయాలపై అంబేద్కర్ చెప్పిన కొన్ని వాక్యాలు ప్రవక్తల ప్రబోధాలవలె మానవాళికి అన్వయించి ఉపయోగపడే నిత్య సత్య ధర్మ ప్రవచనాలుగా వుంటాయి. మచ్చుకు కొన్ని.]

* * * *

వ్యక్తి భవిష్యత్తు కంటే జాతి భవిష్యత్తు ముఖ్యం. జాతికంటే సంఘం అన్నిటికంటే దేశం ముఖ్యం.

* * * *

ఒక మనిషిని దేవుడిగా పూజించడం మంచిదికాదు. వ్యక్తి పూజ వినాశనానికి దారి తీస్తుంది. దానిని మొగ్గలోనే త్రుంచివేయాలి.

వ్యక్తి పూజా విధానం దేశాన్ని ప్రజానీకాన్ని అత్యంత హీన దశకు దిగజారుస్తుంది. వ్యక్తి పూజ దేశాన్ని క్రుంగదీసి నియంతృత్వానికి దారి తీస్తుంది. అందువలన రాజకీయాలలో భక్తి భావనకి వ్యక్తి పూజకు ఏమాత్రం తావు ఇయ్యరాదు.

* * * *

మనిషికి మతం చాలా అవసరం. కాని మతం పేరుతో మూఢ నమ్మకాలను పెంచుకోవడం (ఆచరించడం) చాలా ప్రమాదం. మతమన్నది మనిషిని సహృదయునిగా శీలవంతునిగా తీర్చి దిద్దాలి. ఏ మతమైతే మనిషి వ్యక్తిత్వానికి అభ్యున్నతికి ఆటంకంగా తయారౌతుందో ఆ మతాన్ని మానవుడు విడిచిపెట్టాలి. మనిషికోసం మతం ఏర్పడింది కాని మతం కోసం మనిషికాదు.

...... మతమనేది శాస్త్రీయ దృక్పథంతో హేతుబద్ధంగా ఉండాలి.

ఒక దేశానికి గాని జాతికి గాని సంఖ్యా బలమొక్కటే చాలదు. ప్రజలు జాగరూకులై, విద్యావంతులై, ఆత్మగౌరవంతో, ఆత్మ విశ్వాసంతో ఉన్నప్పుడే ఆ దేశమూ, ఆ జాతీ బాగుపడతాయి.

* * * *

నా అభిప్రాయంలో ప్రజాస్వామిక ప్రభుత్వమంటే రక్తపాతంలేని విప్లవంతో (శాంతియుత మార్గం ద్వారా) ప్రజల సాంఘిక, ఆర్థిక జీవితంలో మార్పు తీసుకొచ్చే ఒక (రాజకీయ) పద్ధతి.

* * * *

ప్రజాస్వామిక వ్యవస్థ విజయవంతం కావాలంటే సమాజంలో అస్వతంత్రత-అసమానత తొలగిపోవాలి.

* * * *

ప్రతి మనిషికి సాంఘిక, ఆర్థిక, రాజకీయ పౌర రంగాలలో సమాన అవకాశాలుండాలి. కార్మికులు, కర్షకులు ప్రజాస్వామ్యంలో పాలు పంచుకోవాలి.

* * * *

స్వయం కృషి, ఆత్మ విశ్వాసం మానవుడి మనుగడకు ఎంతో ముఖ్యం.

* * * *

మనిషికి ఆత్మగౌరవం కంటె విలువైనది మరొకటిలేదు. అదిలేని మనిషి జీవచ్ఛవం.

* * * *

మనిషికి సత్ప్రవర్తన చాలా ముఖ్యం. శీల సంపన్నుడు కానివాడు ఎంతటి విద్యావంతుడైనా ప్రయోజనంలేదు.

* * * *

ఈ వర్ణాశ్రమ వ్యవస్థ స్వార్థపరులైన కొందరు సృష్టించినది మాత్రమే. కుల వ్యవస్థ హిందూసమాజానికి శాపం వంటిది. కులం పునాదుల మీద మీరు దేనిని నిర్మించలేరు. ఒక జాతిని నిర్మించలేరు. ఒక నీతిని నిర్మించలేరు...

జ్ఞానమే మానవ జీవితానికి పునాది. అదే పరమావధి గూడా. విద్యార్థులు నిత్యమూ విజ్ఞానాన్ని పెంపొందించుకోవడానికి (జీవితంలో) ముందడుగు వేయటానికి కృషిచేస్తూ వుండాలి. తమ జ్ఞానశక్తిని సద్వినియోగ పరచాలి.

* * * *

స్త్రీలు విద్యావంతులై సామాజికంగా, రాజకీయంగా ముందుకు రావాలి. వారి తోడ్పాటుతోనే సమాజం అభివృద్ధి చెందుతుంది.

* * * *

మనమిప్పుడు సాధించుకొన్నది రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే. ఆర్థికపరమైన, సామాజికపరమైన, స్వేచ్ఛ, సమానత్వం, న్యాయం సాధించకపోతే మనం సాధించుకున్న రాజకీయ స్వాతంత్ర్యానికి అర్థం వుండదు. ఉపయోగముండదు.

* * * *

అస్పృశ్యత నిర్మూలించడమే నా జన్మహక్కు. ప్రతి సామ్యవాది ఈ శపథం చేయాలి..... నా జీవితాశయం నిమ్నజాతుల విముక్తి.

* * * *

ఎందరో మహాత్ములు పుట్టారు గిట్టారు. కాని అస్పృశ్యులు ఆనాడూ యీనాడూ అస్పృశ్యులుగానే వున్నారు.

* * * *

మానవుని జీవితంలో రెండు దశలుంటాయి. భౌతికపరమైన కోరికలతో బ్రతకడం మొదటిది. జ్ఞాన సముపార్జన రెండవ దశ. మనిషి

జీవితం రెండవ దశలోనే పరిపూర్ణత చెందుతుంది.

* * * *

ప్రజ్ఞాపాటవాలుండాలి. నిజాయితీ వుండాలి. ప్రజాహితం ధ్యేయంగా పెట్టుకొని పాటుపడాలి. అటువంటివాడే గొప్పవాడు అనిపించుకుంటాడు.

* * * *

మన విజయం మన సంఘటిత శక్తిపై ఆధారపడి వున్నది.

* * * *

కర్మ సిద్ధాంతం వ్యక్తిని అశక్తుని చేస్తుంది. హేతవాదం వ్యక్తి ప్రగతికి బాటలు వేస్తుంది.

* * * *

అధికారం వేరు. విజ్ఞతవేరు. అధికారంలో ఉన్నవారు విజ్ఞతతో మెలగాలి. అప్పుడే అభ్యున్నతి సాధ్యపడుతుంది.

* * * *

ఆర్థిక సాంఘిక ప్రజాస్వామ్యం లేనిచోట రాజకీయ ప్రజాస్వామ్యం విఫలమౌతుంది.

* * * *

బ్రాహ్మణ్యం అంటే బ్రాహ్మణులు ఒక జాతిగా అనికాదు. బ్రాహ్మణ్యం అంటే స్వాతంత్ర్యం - సమానత్వం - సౌభ్రాతృత్వాలకు వ్యతిరేకమైన సిద్ధాంతం అని నా అర్థం.

* * * *

ఒకేదేశం అనే భావన జన బాహుళ్యంలో కలుగజేయడం ముఖ్యం. తాము మొదట భారతీయులం. చివరదాకా గూడా భారతీయులమే అన్న భావన వారిలో కలిగేటట్లు చేయాలి.

* * * *

స్వరాజ్య సాధనకంటే కుల నిర్మూలన ముఖ్యం.

* * * *

మనలోని చివరి రక్తపు బొట్టు అయినా చిందించి మనదేశ స్వాతంత్ర్యాన్ని రక్షించుకోగలమన్న కృత నిశ్చయం ప్రతివారిలో కావాలి.

* * * *

రాజకీయ రంగంలో తమ చుట్టూ తాము గిరిగీసుకొని దూరంగా వుండే మనస్తత్వాన్ని నిమ్నజాతీయులు విడనాడాలి. నూతనంగా పొందిన స్వాతంత్ర్యాన్ని సుస్థిరం చేసే కార్యక్రమాలలో యితర కులాల వారితో వీళ్ళు సహకరించాలి.

* * * *

ఆత్మగౌరవాన్ని కోల్పోయి యితరులపై ఆధారపడి జీవించే నీచమైన మనస్తత్వానికి నిమ్నజాతీయులు స్వస్తి చెప్పాలి. తమ బానిస బంధాల్ని త్రెంచుకొనేందుకు వారే స్వశక్తితో కృషిచేయాలి.

* * * *

ఏ మతమైతే నిన్ను మనిషిగా గౌరవించదో ఏ మతమైతే నీకు త్రాగటానికి గూడా నీళ్ళివ్వదో ఏ మతమైతే నిన్ను తన (హిందూ) దేవాలయాలలోనికి రానివ్వదో ఆ మతం 'నాదని' చెప్పుకోవాల్సిన అవసరం నీకెంత మాత్రం లేదు.

* * * *

ఏ దేశంలోని మతమైతే నిన్ను కుక్కలకంటె పిల్లుల కంటె నీచంగా చూస్తున్నదో-ఏదేశంలోనైతే నాకు త్రాగేటందుకు పచ్చిమంచి నీళ్ళు అయినా లభించటంలేదో ఆ దేశం నా మాతృదేశమని చెప్పుకోవటానికి నాకు మనస్కరించడంలేదు.

* * * *

రాజకీయపరమైన అధికారాలు మాకు లభించనిదే మా సాంఘిక

సమస్యలుగాని-ఆర్థిక సమస్యలు గాని పరిష్కారం కాజాలవు.

* * * *

కుల వ్యవస్థ నిర్మూలనమై అస్పృశ్యులు సర్వతోముఖాభివృద్ధి చెందే టంతవరకు మన పోరాటం కొనసాగుతూ వుండవలసిందే.

* * * *

ఈనాడు మనం చేస్తున్న పోరాటమంతా ఆత్మ గౌరవం కోసం-సమాజంలో నలుగురితోపాటు సమాన గౌరవంతో బ్రతకడం కోసం.

* * * *

స్వతంత్ర భారతదేశంలో నిమ్న జాతీయులు స్వతంత్ర పౌరులుగా పాలకులుగా వుండగోర్తారు కాని పాలితులుగా-రెండవ తరగతి పౌరులుగా జీవించేటందుకు మాత్రం సుతరామూ అంగీకరించరు.

* * * *

హిందూ సమాజం ఒక కులాల సమాఖ్య.... కుల వ్యవస్థ ప్రకృతి విరుద్ధమైన ఒక కృత్రిమ వ్యవస్థ..... కుల వ్యవస్థ శ్రమ విభజనమే కాదు. అది శ్రామికుల విభజనగూడా.....

* * * *

ఎవరైతే తాడిత పీడిత ప్రజల హక్కుల పరిరక్షణకోసం-ఎన్ని కష్టనష్టాలనైన-నిందలు నిష్ఠూరాలనైన-సహించి-స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకై నిరంతరం పోరాటం సాగిస్తారో వారు ధన్యులు.

* * * *

బలహీన వర్గాల వారికి రాజ్యాంగపరంగా నిర్దేశింపబడిన సౌకర్యాలను అందించేందుకు అంకిత భావం గల సమర్థనంతులైన అధికారులు..... జాగరూకతగల బలమైన ఎగ్జిక్యూటివ్-అవసరం కాని- న్యాయవాదులు కాని నిపుణులు కాని కాదు కావలసినది.

* * * *

ప్రజాస్వామ్యం విజయవంతమవ్వాలంటే రాజ్యాంగం-న్యాయశాఖ-పార్లమెంటు-ప్రభుత్వ యంత్రాంగం- సక్రమంగా-సమన్వయంగా పనిచేయవలసి వుంది.

* * * *

పవిత్రమైన ఆశయంకోసం సాగించే పోరాటం గొప్పది... పవిత్రమైన లక్ష్యసాధనపట్ల అచంచల విశ్వాసముండాలి!

* * * *

స్వతంత్ర భారతరాజ్యాంగమొక్కటే పీడిత జాతులకు న్యాయం చేకూర్చగలదని (మా) విశ్వాసం.... భారత దేశంలో ప్రస్తుతం నెలకొనియున్న సామ్రాజ్య వ్యవస్థ స్థానంలో ప్రజాస్వామ్య వ్యవస్థ ఏర్పడాలని (మేము) నేను వాంఛిస్తున్నా!

* * * *

నా వ్యక్తిగతమైన సమస్యలకు - దేశానికి సంబంధించిన సమస్యలకు సంఘర్షణ వస్తే నేతప్పక దేశానికే ప్రాముఖ్యతనిస్తాను. కాని నా దేశ సమస్యలకు నా జాతి సమస్యలకు మధ్య సంఘర్షణ వస్తే మాత్రం-ముందు నా జాతి సమస్యలకే ప్రాధాన్యతనిస్తాను... నేను ఏ నిమ్నజాతుల్లో పుట్టి పెరిగానో ఆ జాతుల అభ్యున్నతి బాధ్యత నాపైనున్నది! నాకు జాతి తర్వాతనే దేశం!

* * * *

అగ్ర వర్ణాల వారికి నాకూ కొన్ని విషయాలలో భేదాభిప్రాయాలున్నయ్. అయితే మాతృదేశ సంరక్షణ విషయంలో నా ప్రాణాన్ని సైతం ఒడ్డేందుకు నేను సంసిద్ధంగా వున్నానని మీముందు శపధం చేస్తున్నాను.

* * * *

నామట్టుకు నేను నా అధికారాన్ని హోదాను నా సమస్త శక్తి సామర్థ్యాలను నా జాతీయుల శ్రేయస్సుకోసమే ధారబోసాను. దారుణమైన

పరిస్థితుల్లో కొట్టుమిట్టాడుతున్న నా ప్రజల శ్రేయస్సును నేనెన్నటికినీ విడిచిపెట్టను.

* * * *

నా జాతీయులెల్లకాలము అగ్రవర్ణాల వారి అజమాయిషీకి అణిగిమణిగి వుండాలన్న విధానాన్ని మాత్రం నేనెలాంటి పరిస్థితుల్లోను అంగీకరించను.

* * * *

హిందువులకు వేదాలు కావలసి వస్తే వేదవ్యాసుని తెచ్చుకున్నారు. వ్యాసుడు అగ్రకులస్థుడు కాదు. హిందువులకు ఒక పురాణం కావలసివస్తే అస్పృశ్యుడైన వాల్మీకిని ఆశ్రయించారు. హిందువులకు యిప్పుడు ఒక రాజ్యాంగం అవసరం అయింది. (అస్పృశ్యుడైన) నన్ను ఎన్నుకున్నారు.

* * * *

ఎన్నో కష్టనష్టాలకు గురియైనా నా ప్రత్యర్థులు ఎన్ని అడ్డంకులు పెట్టినా నిర్విరామంగా పోరాడి విజయాన్ని సాధించాను. నాయీ మార్గంలో ఎన్ని కష్టనిష్ఠూరాలొచ్చినా-ఎన్ని ఆటంకాలొచ్చినా-యీ నిమ్న జాతుల అభ్యుదయ ఉద్యమ రథాన్ని నేడు మీరు చూస్తున్న చోటికి-స్థితికి తీసుకొని రాగలిగాను. నా అనుచరులు యీ రథాన్ని ముందుకు లాక్కొని పొమ్మనండి. చేతకాకపోతే దాన్ని అక్కడనే వుంచమని చెప్పండి. దయ వుంచి దాన్ని యెట్టి పరిస్థితులలోను వెనక్కు నెట్టవద్దని చెప్పండి. ఇదే నా సందేశం.

* * * *

నవభారత సంవిధాన
ధర్మ పథక నిర్మాతా!
భువి సమస్త పీడిత జన
దుఃఖశాంతి తథాగదా!

— మహాకవి బోయి భీమన్న

## అనుబంధం - III

## అంబేద్కర్ జీవితంలో ముఖ్యమైన ఘట్టాలు

1891 (ఏప్రిల్ 14) - భీమాబాయి-రాంజీ సక్పాల్‌లకు జననం (14వ సంతానంగా)

1897 - తల్లి మరణం.

1905 - రమాబాయితో వివాహం.

1912 - బొంబాయిలోని ఎల్ఫిన్‌స్టన్ కాలేజినుండి బి.ఎ. డిగ్రీ పొందుట.

1913 (ఫిబ్రవరి 2) తండ్రి మరణం.

1913-16 - అమెరికాలో విద్యాభ్యాసం

1915 (i) - అమెరికా కొలంబియా విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎ. డిగ్రీ పొందుట.

1916 (ii) - పి.హెచ్.డి. డాక్టరేట్ పొందుట.

1917 - బరోడా సంస్థానంలో రక్షణ శాఖ కార్యదర్శిగా పనిచేయుట.

1918-20 - బొంబాయిలోని సైడెన్‌హామ్ కాలేజీలో ప్రొఫెసర్‌గా పనిచేయుట.

1920 (జనవరి) "మూక్‌నాయక్" పత్రిక స్థాపించుట.

1920-22 - ఇంగ్లండు-జర్మనీలలో విద్యాభ్యాసం.

1921 (i) లండన్ విశ్వవిద్యాలయం నుండి ఎం.ఎస్.సి డిగ్రీపొందుట.

1922 (ii) బార్-ఎట్-లా-పట్టా పొందుట.

1923 (iii) లండన్ విశ్వవిద్యాలయం నుండి డి.ఎస్.సి. డిగ్రీ పొందుట (స్వదేశం తిరిగివచ్చాక)

1923 (జూన్) బొంబాయిలో న్యాయవాద వృత్తి చేపట్టుట.

1924 (మార్చి) బహిష్కృత హితకారిణి సభను స్థాపించుట.

1926-34 - బొంబాయి లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడిగా నియమింపబడుట.

1927 (మార్చి) చెరువునీటి హక్కుకై-మహద్ పోరాటం ప్రారంభించుట.

1927 (డిశంబరు 25) మనుస్మృతి గ్రంధ ప్రతిని బహిరంగంగా దహనం చేయుట.

1928 - బొంబాయిలోని ప్రభుత్వ "లా" కాలేజీలో ప్రొఫెసర్‌గా చేరుట.

1930 (మార్చి) నాసిక్‌లోని కాలారామ్ దేవాలయ ప్రవేశ ఉద్యమం చేపట్టుట.

1930 (నవంబర్) లండన్‌లో మొదటి రౌండుటేబుల్ సమావేశాల్లో పాల్గొనుట.

1931 నవంబర్-డిశంబర్ రెండవ రౌండ్ టేబుల్ సమావేశాల్లో పాల్గొనుట.

1932 (సెప్టెంబర్) మూడవ రౌండ్‌టేబుల్ సమావేశాల్లో పాల్గొనుట.

1934 - రాజగృహ (స్వంతగృహం) నిర్మాణం.

1935 (మే 27) భార్య రమాబాయి మరణం.

1935 (అక్టోబర్) యవ్‌లా మహాసభలో హిందూమతాన్ని వదలిపెడుతున్నట్లు బహిరంగ శపధం చేయుట.

1935-38 బొంబాయిలో "న్యాయకళాశాల" ప్రిన్సిపాల్‌గా పనిచేయుట.

1936 - "ఏనిహిలేషన్ ఆఫ్ కాస్ట్స్" (కుల నిర్మూలన) రచన.

1936 (ఆగష్టు) ఇండిపెండెంట్ లేబర్ పార్టీ (రాజకీయపార్టీ) స్థాపన.

1937-41 బొంబాయి శాసన సభ్యుడిగా.

1940 - "థాట్స్ ఆన్ పాకిస్థాన్" గ్రంథ ప్రచురణ.

1942 (ఏప్రిల్) - అఖిలభారత షెడ్యూల్డు కులాల సమాఖ్య అనే రాజకీయ పార్టీని స్థాపించుట.

1942-46 వైస్రాయ్ కౌన్సిల్‌లో కార్మిక సభ్యుడుగా (మంత్రిగా).

1943 జనవరి - రెనడే-గాంధీ-జిన్నా రచన.

1944 - దక్షిణ భారతదేశ పర్యటన.

1945 - "వాట్ కాంగ్రెస్ అండ్ గాంధి హేవ్ డన్ టు ది అన్ టచ్ బుల్స్" గ్రంథప్రచురణ.

1946 - పార్లమెంట్ ఎన్నికలలో ఓటమి.

1946 (i) పీపుల ఎడ్యుకేషన్ సొసైటీని స్థాపించుట.

(ii) బొంబాయిలో సిద్దార్థ కళాశాల స్థాపించుట.

1946 - (i) రాజ్యాంగ పరిషత్తులో సభ్యుడిగా.

(ii) "శూద్రులెవరు" గ్రంథ ప్రచురణ.

1947 ఆగష్ట్ (i) కేంద్రంలో నెహ్రూ మంత్రి వర్గంలో న్యాయశాఖా మంత్రిగా తీసుకొనబడుట.

(ii) రాజ్యాంగ చట్టరచనా సంఘం అధ్యక్షుడిగా ఎన్నుకొనబడుట.

1947-48 సెప్టెంబర్-జనవరి - రాజ్యాంగ చట్ట రచన (ముసాయిదా)

1948 -ఏప్రిల్ 15 (i) - డాక్టర్ సవితాదేవితో రెండవ వివాహం.

(ii) "ది అన్ టచ్ బుల్స్" - గ్రంథ ప్రచురణ.

1951 ఫిబ్రవరి - హిందూ కోడ్ బిల్ పార్లమెంటులో ప్రవేశపెట్టుట.

1951 సెప్టెంబర్ - మంత్రి పదవికి రాజీనామా.

1952 - పార్లమెంటు ఎన్నికలలో ఓటమి.

1952 మార్చి - రాజ్యసభకు ఎన్నుకొనబడుట (బొంబాయి శాసనసభ ద్వారా)

1952 (జూన్) అమెరికాలోని కొలంబియా విశ్వ విద్యాలయం నుండి "డాక్టర్ ఆఫ్ లాస్" (ఎల్.ఎల్. డి) గౌరవ పురస్కారం.

1953 (జనవరి) ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి డాక్టర్ ఆఫ్ లిటరేచర్ (డి.లి.ట్) గౌరవపురస్కారం.

1953 - ఔరంగాబాదులో మిళింద మహా విద్యాలయ కాలేజీని స్థాపించుట.

1956 - బుద్ధా అండ్ హిజ్ దమ్మా గ్రంథ రచన (మరణానంతరం 1957లో ప్రచురణ).

1956 - రిడిల్స్ ఇన్ హిందూయిజం గ్రంథ రచన (మరణానంతరం ప్రచురణ).

1956 అక్టోబర్ 14 బౌద్ధమత స్వీకారం.

1956 డిశంబరు 6 - నిర్యాణం.

1990 - "భారతరత్న" గౌరవ పురస్కారం (మరణానంతరం)

* * *

మాకావ్యర్షులలో మతం గుడును - ధ
ర్మ వ్యాధుడున్ - వ్యాస వా
ల్మీకుల్ పుట్టిరి మున్ను భారత మహా
మీ మాంసనుల్ నీవదే
సాకన్ నేడు రచించినావు - నవ రా
జ్యాంగమ్ము - ఇవే నీకు తత్
శ్లోకాద్ధారక - లోక రక్షక! నమ
స్సుల్ - డాక్టరంబేద్కరా

పద్మశ్రీ బోయిన భీమన్న



# గ్రంథకర్త

"అమూల్యశ్రీ"గా తెలుగు సాహితీ రంగానికి - పాఠకలోకానికి సుపరిచితుడైనకవి విమర్శ
శ్రీ కె. అమ్ములయ్య జన్మస్థలం-జూపూడిగ్రామం (పొన్నూరు మండలం - గుంటూరు జిల్లా). ని
నది గుంటూరులో

తల్లిదండ్రులు - అమ్మక్కమాంబ పెదవీరయ్యలు - ఆంధ్రవిశ్వవిద్యాలయం నుండి ఆర్థిక శాస్త్ర
బి.ఏ. (ఆనర్సు) డిగ్రీ పుచ్చుకొని రాష్ట్రప్రభుత్వ వాణిజ్యపన్నుల శాఖలో ఉద్యోగ, ప్రవేశం
వివిధ పదవుల నలంకరించి - డిప్యూటీ కమీషనరుగా పదవీవిరమణ చేశాడు. ప్రస్తుతం రాష్ట్ర అ
భాషాసంఘ సభ్యులు

పండిత వంశంలో పుట్టకపోయినా - పూర్వజన్మ సుకృతంవల్ల సాహిత్యవ్యాసంగ అబ్బింది.
ష్టవశాత్తు పద్మశ్రీ బోయి భీమన్న - తెనుగులెంక తుమ్మలసీతారామమూర్తి [illegible] వంటి ప్ర
సాహితీ వేత్తల సాహచర్యంవల్ల వారి ప్రోత్సాహం వల్ల కవిగా రచయితగా తెలుగు సాహితీరంగంలో
"స్థానం" సంపాదించుకొనగలిగాడు. పద్యం చెప్పినా గేయం వ్రాసినా విమర్శచేసినా నిశిత పరి
దృష్టితో - అభ్యుదయ దృక్పథంతో తేట తెలుగులో బాలలకు పామరజనానికి సహితం అర్థమయ్యే
చెప్పడంలో - తనదైన ఒక ప్రత్యేక బాణీలో చెయ్యితిరిగిన రచయిత-కవి.

అతని కలం నుండి జాలువారిన శ్రీ వేంకటేశ్వర శతకం గాంధీశతకం - [illegible]
(పద్య- గేయ-వచన కవితా సంపుటి) కృష్ణవేణి (వచన కవిత) - జానపకవితా వైభవం - విమ
రచన) మొదలగు రచనలు వెలుగు చూసాయి.

రేడియోలో ప్రసారం అయిన "హంపీవిజయ నగరం"- సుభాస్‌చంద్రబోస్ - ఎంట రూ
చెప్పుకోదగ్గవి.

వివిధ పత్రికల్లో వచ్చిన - వ్యాసాలు - గేయాలు ఎన్నో! వెలుగు చూడవలసిన రచనలు మ